శ్రీః.

# శ్రీ భగవద్గీత

శ్రీరామచంద్రానంద సరస్వతీకృత
ఆంధ్రటీకాతాత్పర్య
భాష్యత్రయ వివరణసహితము.





చెన్నపురి :
వావిళ్ల - రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
వారిచే ప్రకటితము.

కాపీ - 1000 1915 స రూ. 2. 0.

ఈయుత్తమగ్రంథము షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు శ్రీకృష్ణభగవానునిచేత సమరవిముఖుఁడైనయర్జునునకు దేశింపఁబడి మహాజనులందరిచేతను గానము చేయఁబడినదిగాన భగవద్గీత యనియు అకృతబుద్ధుల నందఱను శాసించునది యగుటచేత గీతాశాస్త్రమనియు వాడఁబడియున్నది. ఇయ్యది వ్యాసమహర్షిచే నేడునూరులశ్లోకములుగా గ్రథితమై పదునెనిమిది యధ్యాయములుగా విభక్తమై యున్నది. వీనిలో మొదటి యాఱధ్యాయములలో కర్మయోగజ్ఞానయోగములును రెండవయాఱింటను భక్తియోగమును మిగిలిన యాఱింటను తత్త్వవిచారోపాసనాయోగములును విశదీకరింపఁబడి యున్నవి.

ఇంతయేల. ఇప్పుడు మనచేత కనఁబడియు వినఁబడఁగలిగినంతవఱకుఁగల యశేషభూభాగములయందు నుత్పన్నులైన వివిధాగమవేత్తలగుమహాపురుషులవలనఁ దమతమమతసంప్రదాయములకు ననుగుణమగురీతిని చిరకాలానుభవముచేత గనిపెట్టి నిర్ణయింపఁబడి యింతవఱకుఁగల యాధ్యాత్మికసిద్ధాంతము

నాంతరంగికార్థముల నెఱింగినయాస్తికపండితవర్యులెల్లరును [illegible] నిర్వివాదముగా నీవిషయము నొప్పుకొనియే యుండిరి. ఇటీవలి మహాముని బాదరాయణుఁడు లోకభారతమును రచియించినట్లును శ్రీకృష్ణుఁడు సమరాంగణమున నిరుత్సాహి యగునర్జునునకు యుపదేశము చేసినట్లును మహా[illegible]వృతమును తత్సారభూతము నగుపరమార్థ మీప్రకృతగ్రంథమున నున్నట్లును ఇది లోకోత్తరగ్రంథమనియు నందఱు నొప్పుకొనినవిషయమే గాన సద్గురుసంప్రదాయానుగృహీతపరతత్త్వవిచారమాత్రమునఁ జరితార్థులు కాఁదలఁచి ముముక్షుజనముల కీచర్చ లనాకాంక్షితములు.

లన్నియు నాయాభావనలతోఁ జూచినయెడల నతిపురాతన మగునీయుపదేశరత్నమున గానంబడియెడి నని సర్వలోకవిదితమే.

“బహుధాప్యాగమైర్భిన్నాః పంథానస్సిద్ధిహేతవః, త్వయ్యేవ నిపతంత్యోఘాజాహ్నవీయా ఇవార్ణవే” (వేదత్రయము సాంఖ్యాదిదర్శనములు మొదలగువానిచేఁ బలువిధములుగా వేఱు చేయఁబడినవైనను నిర్వాణసుఖసాధనములైన మతమార్గము లన్నియుఁ బలువిధములుగా చీలి ప్రవహించిన గంగాప్రవాహములన్నియు సముద్రమునందువలెనే కేవలుఁడ వగునీయందే చేరుచున్నవి) యని మహాకవి కాళిదాసవిద్వదవతంసుఁడు చెప్పినట్లు ప్రపంచమున మతమార్గము లెన్ని త్రోవలనున్నను వాని కన్నింటికిని గమ్యస్థాన మొక్కటేయనియు నిఖిలశ్రీమాగతమై గురూపదేశచోదిత మగునీయోగమమార్గమైనను ముక్తిసాధనమే యనియు తెలుపఁబడి స్వధర్మాభిరతు లగు పండితోత్తముల కెల్లఱకును నీగ్రంథ ముపాస్యమని తెలియఁ దగినది.

ఇఁక నీగ్రంథరాజమున కిప్పు డన్ని దేశములయందును భాషలయందును దత్తన్మతానురూపముగ వ్యాఖ్యానములు చేయఁబడి యుండుటగాక, ఈమనభరతఖండమున గలమతశాఖ లన్నింటికిని ముఖ్యాశయము లగుత్రిమతములయు నాచార్యులచేతఁ బ్రస్థానత్రయమున నొకటిగాఁ జేకొని యాదరింపఁబడి యున్నది. ప్రకృతగ్రంథమును జదువుప్రతివారికిని ఈమతత్రయ స్వరూపజ్ఞాన మావశ్యక మగుటవలన నీవిభాగ మాక్రిందివిధమున సంగ్రహముగా వివరింపఁబడును.

## 1. అద్వైతము.

అనఁగా జీవబ్రహ్మల కభేదమును జెప్పెడిమతము. నిఖిల నిగమాగమపురాణేతిహాసచోదిత మగునది జగద్గురు శ్రీశంకరాచార్యస్వాములచే శైవవైష్ణవాది షణ్మతాంగీకారాద్వైత దూరీకరణపూర్వకముగా స్థాపింపఁబడినది. ఇందు సత్ - అసత్ - సత్ అని త్రివిధముగా వాడఁబడుబ్రహ్మ మొకటి గలదు. అది యొక్కటియే సత్యమును భూతభవిష్యద్వర్తమానకాలముల యందు బాధితముకానిదియు జ్ఞానస్వరూపమును ఆనందస్వరూపమునై యున్నది. ఈబ్రహ్మమే ముత్యపుచిప్ప [illegible] వెండిగా నగపడినట్లు మాయ యనుదానిచేత [illegible] సర్వప్రపంచరూపముగాఁ గనఁబడుచున్నది. ఇందు జీవుఁడు తనను బ్రహ్మముకంటె వేఱుగా దలంచును. ఇట్లు దలంచుటయే సంసార మనఁబడును. సద్గురూపదిష్ట తత్త్వమస్యాది వాక్య జనితజ్ఞానమువలన నామాయ నతిక్రమించి యథార్థస్వకీయ సచ్చిదానందాత్మ స్వరూపసాక్షాత్కారము నొందుటయే మోక్ష మనఁబడు ననియుం జెప్పఁబడియున్నది.

## 2. విశిష్టాద్వైతము.

ఇది యంతకుఁ బూర్వమున్నను శ్రీమద్రామానుజాచార్యస్వాములచే సంస్కరింపఁబడి స్థాపింపఁబడెను. ఇందు బ్రహ్మము మొదట నామరూపవిభాగము చేయ వలవికానిసూక్ష్మము లగుచిదచిత్తులతోఁ గూడియుండి తరువాత నామరూపవిభాగ ముగల వైనస్థూలచిత్తులతోఁగూడినదగును. ఇట్లు విశిష్టము లగుబ్రహ్మలకు రెంటికిని నైక్యము గలది గనుక నిది విశిష్టాద్వైత మనఁబడును.

కాకమానదు. భాష్యపద్ధతి ననుసరించిన యీవ్యాఖ్యానము బహుపురాతన మగుటయకాక మూలమునవలెనే సర్వమతములవారికి ననుకూల మగురీతిని మిగుల మృదుమధురపదలలితముగా వ్రాయఁబడియున్నది. ఇది యన్వయక్రమముగా వ్రాయఁబడినది. మూలమున లేనివియు ననపేక్షితములు నగు చాటుభారతపుగొడవలు దీనియందు లేవు. ఈగ్రంథము నిట్టి వ్యాఖ్యానముతోఁ జేర్చి ముద్రించినయెడల నాంధ్రలోకోపకారక మగు నని తలఁచి పండితసహాయమువలన పరిశీలించి సాధ్యమైనంతవఱకు నిర్దుష్టముగా నుండునటుల ముద్రింపఁబడినది. గుణగ్రహణైక పారీణులగుపండితు లిందుగలతప్పులను క్షమించెదరు గాక!

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీః.

# విషయసూచిక.

---



—



ఓం

శ్రీకృష్ణాయ నమః.

# శ్రీ భగవద్గీతా మాహాత్మ్య ప్రారంభః.



ధరోవాచ:—

శ్లో. భగవన్ పరమేశాన భక్తి రవ్యభిచారిణీ,
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో. 1

తా. పరమేశ్వరుఁడవును నిగ్రహానుగ్రహసమర్థుఁడవును నగు ఓభగవంతుఁడా! ప్రారబ్ధకర్మమును అనుభవించుచున్నవానికి చలనములేనిభక్తి యెట్లు గలుగును?

విష్ణురువాచ:—

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా,
స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే. 2

ప్రారబ్ధకర్మమును అనుభవించుచున్నవాఁడైనను ఎల్లప్పుడును భగవద్గీతలను పారాయణ చేయుటయందు ఆసక్తి గలవాఁడు లోకములో ముక్తుఁడును సుఖముగలవాఁడును అగును. వానికి కర్మములతో సంబంధము లేదు.

మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతిచేత్,
క్వచిత్ స్పర్శం న కుర్వంతి నళినీదళమంబువత్. 3

భగవద్గీతలను ధ్యానము చేసినచో తామరాకును నీరు అంటనట్లు మహాపాపము మొదలగు పాపములు ఎన్నటికిని అంటవు.

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే,
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై. 4

శ్రీభగవద్గీతలపుస్తకము ఉండుచోటునను పారాయణము చేయుచోటునను ప్రయాగ మొదలగుతీర్థము లన్నియు [illegible] ఉండును.

సర్వేదేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చయే,
గోపాలగోపికా వాపి నారదోద్ధవపార్షదైః,
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే. 5

భగవద్గీతలు ఉండుచోటున దేవతలు, ఋషులు, యోగులు, పన్నగులు, గోపాలురు, గోపికలు, నారదుడు, ఉద్ధవుడు, విష్ణుద్వారపాలకులును శీఘ్రముగ సాయపడుదురు.

యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్,
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి. 6

ఓభూదేవి! భగవద్గీతలయొక్క అర్థమును విచారించుచోటునను వానిని చదువుచోటునను చదివించుచోటునను వినుచోటునను నేను ఎల్లప్పుడును ఉండును. ఇది నిశ్చయము.

గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్,
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకా న్పాలయా మ్యహమ్.   7

నేను గీతల నాశ్రయించి ఉందును. గీతలే నాకు ఇల్లు. గీతలలో చెప్పఁబడిన జ్ఞానమును అవలంబించియే నేను మూఁడు లోకములను పాలించుచున్నాను.

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః,
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా.   8

అర్ధమాత్రారూపము, అక్షరము, బ్రహ్మస్వరూపము, నిత్యమును అగు గీతాశాస్త్రము ఉత్తమ మయినబ్రహ్మవిద్య అనుటకు సందేహము లేదు.

చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్,
వేదత్రయీ పరానంద తత్త్వార్థజ్ఞాన మంజసా.   9

ఇట్టి గీతాశాస్త్రమును సచ్చిదానందస్వరూపుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు అర్జునునకు ఉపదేశించెను. ఇది వేదత్రయస్వరూపము, పరమానందస్వరూపము, వేగముగా తత్త్వార్థజ్ఞానమును బోధించునదియు నై యున్నది.

యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చలమానసః,
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్.   10

నిశ్చలచిత్తముతో నిత్యమును పదునెనిమిదధ్యాయములును పారాయణము చేయునతఁడు బ్రహ్మజ్ఞానసంపన్నుఁడై పిమ్మట పునరావృత్తిలేనిస్థానమునకుఁ బోవును.

పాఠేఽసమర్థ స్సంపూర్ణే తదర్థం పాఠ మాచరేత్,
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః. 11

గీత లన్నియు పారాయణచేయలేనివాఁడు సగముచదువవచ్చును. అట్లు చేసినను గోదాన మిచ్చినపుణ్యమును తప్పక పొందును.

త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్,
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్. 12

మూఁడవభాగము చదువువాఁడు గంగాస్నానఫలమును, ఆఱవభాగము చదువువాఁడు సోమయాగఫలమును పొందును.

ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః,
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసేచ్చిరమ్. 13

నిత్యమును ఒక్కఅధ్యాయమైనను భక్తితో చదువువాఁడు రుద్రలోకమునకు పోయి చిరకాలము ప్రమథగణములతో కూడియుండును.

అధ్యాయశ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః,
స యాతి నరతాం యావన్మనుకాలం వసుంధరే. 14

ఓభూమీ! నిత్యమును అధ్యాయములో నాల్గవభాగమును పారాయణచేయువాఁడు మన్వంతరమువఱకును మనుష్యుఁడై పుట్టును.

గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్,
ద్వి త్రి ఏకం తదర్థం వా శ్లోకానాం యః పఠేన్నరః. 15
చంద్రలోక మవాప్నోతి వర్షాణామయుతం ధ్రువమ్,
గీతాపాఠసమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్. 16

పదిశ్లోకములు గాని యేడుశ్లోకములుగాని అయిదు శ్లోకములుగాని నాలుగుశ్లోకములుగాని మూఁడుశ్లోకములుగాని రెండుగాని ఒక్కటిగాని సగముశ్లోకముగాని నిత్యమును పారాయణముచేయువాఁడు చంద్రలోకమునకుపోయి పదివేలయేండ్లు ఉండును. పారాయణచేయు దినములలో మృతిపొందినవాఁడు దేవత్వమును పొందును.

గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్,
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్. 17

గీతాశాస్త్రమును పారాయణముచేయువాఁడు మోక్షము నొందును. ఇంతేల? మరణకాలమునందు గీతల స్మరించినవాఁడు ఉత్తమగతిని పొందును.

గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపివా,
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే. 18

మహాపాపాత్ముఁడైనను గీతలయొక్క అర్థమును వినుటయందాసక్తిగలవాఁడు వైకుంఠమునకు పోయి విష్ణునితో ఆనందించుచుండును.

గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః,
జీవన్ముక్త స్స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్. 19

నిత్యమును నిత్యనైమిత్తికకర్మములు చేసికొని గీతల యర్థమును ధ్యానించినవాఁడు జీవన్ముక్తుఁడు. దేహము పోయిన వెనుక పునరావృత్తి లేనిపదమును గూర్చి పోవును.

గీతా మాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః,
నిర్ధూతకల్మషా లోకే గీతా యాతాః పరం పదమ్. 20

జనకుఁడు మొదలగు రాజులు పెక్కండ్రు గీతలను ఆశ్రయించియే లోకములో నిర్ధూతకల్మషు లని పేరువడి తుదకు మోక్షమును పొందిరి.

గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్,
వృథాపాఠో భవేత్తస్య శ్రమ ఏవ ఉదాహృతః. 21

గీతలను పారాయణచేసి మాహాత్మ్యమును చదువని వానికి పారాయణ వ్యర్థమై శ్రమయే మిగులును.

ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః,
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతిమాప్నుయాత్. 22

ఈమాహాత్మ్యముతో కూడ గీతలను చదివినవాఁడా ఫలమును బొందుటయేకాక మోక్షమును గూడ పొందును.

సూత ఉవాచ:—

మాహాత్మ్య మేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్,
గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్.

ప్రాచీనమగు ఈగీతామాహాత్మ్యమును నేను చెప్పితిని. గీతల పారాయణచేసి పిమ్మట చదివినచో చెప్పినఫలమును తప్పక పొందుదురు.

ఇతి శ్రీ వరాహపురాణే శ్రీగీతామాహాత్మ్యమ్
సంపూర్ణమ్.

ఇట్లు వరాహపురాణమునందుఁ జెప్పఁబడిన
శ్రీ గీతామాహాత్మ్యము సంపూర్ణము.

శ్రీ కృష్ణపరబ్రహ్మార్పణమస్తు.

---

ఓం.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

---

## శ్రీ గురు ధ్యా న ప్ర కా రః.

---

శ్లో. వన్దే గురూణాం చరణారవిందే
సందర్శితస్వాత్మసుఖావబోధే
జనస్య యే జాంగలికాయమానే
సంసారహాలాహలమోహశాంత్యై. ౧

వందే గురుపరద్వంద్వ మవాఙ్మానసగోచరమ్,
రక్తశుక్లప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం మహః. ౨

శ్రీభగవద్గీతాపూర్వసేవకా.

శ్లో. లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్. 3
అస్మద్గురుసమారంభాం నాథయామునమధ్యమామ్
లక్ష్మీవల్లభపర్యంతాం వందే గురుపరంపరామ్. ౪

ఇత్యాది తత్తత్సంప్రదాయానుగుణం గురుపరంపరానుసంధా
నానంతరమ్,

అనుసంధేయాః స్తోత్రశ్లోకాః.

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే. ౫

శ్లో. యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్
విఘ్నం నిఘ్నన్తి సతతం విష్వక్సేనం తమాశ్రయే. ౬

సమ్యఙ్న్యాయకలాపేన మహతా భారతేన చ
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే. ౭

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్. ౮

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః. ౯

మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషమ్
వేదవ్యాసం సరస్వత్యా వాసం వ్యాసం నమామ్యహమ్.

అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరో హరిః
అఫాలలోచనః శంభు ర్భగవాన్ బాదరాయణః. ౧౧

కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్. ౧౨

కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే. ౧౩

ప్రపన్నపారిజాతాయ తోత్త్రైకపాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః. ౧౪

సారథ్య మర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః. ౧౫

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

౧. పార్థాయ ప్రతిపాదితాం భగవతా నారాయణేన స్వయమ్
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతమ్
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అంబ! త్వా మనుసందధామి భగవద్గీతే! భవద్వేషిణీమ్.

గీతాశాస్త్ర మిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్
విష్ణోః పద మవాప్నోతి భయశోకాదివర్జితః. ౧౮

భారతామృతసర్వస్వం విష్ణో. ర్వక్త్రా ద్వినిఃసృతమ్
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే. ౧౯

గీతాః సుగీతాః కర్తవ్యాః కిమన్యైః శాస్త్రసంగ్రహైః
యాః స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిఃసృతాః. ౨౦

గీతాధ్యయనశీలస్య ప్రాణాయామపరస్య చ
నైవ సంతి హి పాపాని పూర్వజన్మకృతా న్యపి. ౨౧

అకృత్య మపి కుర్వాణో భుంజానో వా యతస్తతః
ఘోరం నరకస్థానం గీతాధ్యాయీ న పశ్యతి. ౨౨

మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే
సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనమ్. ౨౩

శ్లోక మేకం తదర్థం వా పాదం పాదార్థ మేవ వా
నిత్యం పఠతి యో భక్త్యా స మోక్ష మధిగచ్ఛతి. ౨౪

సర్వశాస్త్రమయీ గీతా సర్వవేదమయో హరిః
సర్వతీర్థమయీ గంగా సర్వధర్మమయో మనుః. ౨౫

ఏకం శాస్త్రం దేవకీపుత్రగీత మేకో దేవో దేవకీపుత్ర ఏవ
ఏకో మంత్రో దేవకీపుత్రనామా కర్మాప్యేకం దేవకీపుత్రసేవా.

అథ న్యాసః.

ఓమ్. అస్య శ్రీభగవద్గీతాశాస్త్రమహామంత్రస్య - వేదవ్యాసో భగవాన్ ఋషిః, ప్రాయేణానుష్టుప్ ఛందః, క్వచిన్నానాఛందాంసి, శ్రీకృష్ణః పరమాత్మా దేవతా, అశోచ్యానన్వశోచస్త్వ మితి బీజమ్.

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజేతి శక్తిః.

అహంత్వాసర్వపాపేభ్యోమోక్షయిష్యామిమాశుచ ఇతి కీలకమ్.

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసీతి కవచమ్.

కిరీటినం గదినం చక్రహస్త మిత్యస్త్రమ్.

అనాదిమధ్యాంత మనంతవీర్య మితి ధ్యానమ్.

జ్ఞానయజ్ఞేన భగవదారాధనార్థే గీతాపారాయణే జపే వా వినియోగః.

ఓం జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ అంగుష్ఠాభ్యాం నమః.
ఓం ఐశ్వర్యాత్మనే గోవిందాయ తర్జనీభ్యాం స్వాహా.
ఓం శక్త్యాత్మనే వేదవ్యాసాయ మధ్యమాభ్యాం వషట్
ఓం బలాత్మనే బలభద్రాయ అనామికాభ్యాం హుమ్.
ఓం తైజసాత్మనే వాసుదేవాయ కనిష్ఠికాభ్యాం వౌషట్.
ఓం వీర్యాత్మనే గాండీవధన్వనే అర్జునాయ కరతలకరపృష్ఠాభ్యాం ఫట్.
ఓం జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ హృదయాయ నమః.
ఓం ఐశ్వర్యాత్మనే గోవిందాయ శిరసే స్వాహా.
ఓం శక్త్యాత్మనే వేదవ్యాసాయ శిఖాయై వషట్.
ఓం బలాత్మనే బలభద్రాయ కవచాయ హుమ్.

ఓం తేజసాత్మనే వాసుదేవాయ నేత్రత్రయాయ వౌషట్.
ఓం వీర్యాత్మనే గాండీవధన్వనే అర్జునాయ అస్త్రాయ ఫట్.

భూర్భువ స్సువరో మితి దిగ్బంధః.

అథ ధ్యానమ్.

శ్లో. కరకమలనిదర్శితాత్మముద్రః
పరికలితోన్నతబర్హిబర్హచూడః,
ఇతరకరగృహీతవేత్రతోత్రో
మమ హృది సన్నిధి మాతనోతు కృష్ణః. ౧

ఆతామ్రపాణికమలప్రణయప్రతోద
మాలోలహారమణికుండలహేమసూత్రమ్,
ఆవిశ్శ్రమాంబుకణ మంబుదనీల మవ్యా
దాద్యం ధనంజయరథాభరణం మహో నః. ౨

అగ్రే కృత్వా కమపి చరణం జాను నైకేన తిష్ఠ
న్పశ్చాత్పార్థం ప్రణయసజుషా చక్షుషా వీక్షమాణః
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివసన్ పాతు నః సూతవేషః. ౩

వందే కృష్ణార్జునౌ వీరౌ నరనారాయణౌ ప్రభూ,
ధృతరాష్ట్రసుతానీకవ్యూహగజారోహణవల్లభౌ. ౪

యద్వా.

ఓమ్. అస్య శ్రీభగవద్గీతాశాస్త్రమహామంత్రస్య—భగవాన్ వేదవ్యాస ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీకృష్ణః పరమాత్మా దేవతా.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ఇతి బీజమ్.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి శక్తిః.

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ ఇతి కీలకమ్.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ఇత్యంగుష్ఠాభ్యాం నమః.

న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః ఇతి తర్జనీభ్యాం నమః.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ ఇతి మధ్యమాభ్యాం నమః.

నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః ఇత్యనామికాభ్యాం నమః.

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ఇతి కనిష్ఠికాభ్యాం నమః.

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ఇతి కరతలకరపృష్ఠాభ్యాం నమః.

ఇతి కరన్యాసః.

అథ హృదయాదిన్యాసః.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ఇతి హృదయాయనమః.

న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః ఇతి శిరసే స్వాహా.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ,
ఇతి శిఖాయై వషట్.

నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః ఇతి కవచాయ హుమ్.

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ఇతి నేత్రత్రయాయ వౌషట్.

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ఇతి అస్త్రాయఫట్.

భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

ఓం శ్రీకృష్ణప్రీత్యర్థే గీతాపారాయణే జపే వా వినియోగః.

## ధ్యానమ్.

ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతమ్,
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీమ్
అంబ! త్వా మనుసందధామి భగవద్గీతే! భవద్వేషిణీమ్.
నమోఽస్తు తే వ్యాస! విశాలబుద్ధే!
ఫుల్లారవిందాయతపత్రనేత్ర,
యేన త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః.
ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే,
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః.
వాచకః ప్రణవో యస్య క్రీడా వస్త్వఖిలం జగత్,
శ్రుతి రాజ్ఞః వపుర్జ్ఞానం తం వందే దేవకీసుతమ్.

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్,
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్.

భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా,
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః.

పారాశర్యవచస్సరోజ మమలం గీతార్థగంధోత్కటం
నానాఖ్యానకకేసరం హరికథాసద్భానునా బోధితమ్,
లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయమానం ముదా
భూయా ద్భారతపంకజం కలిమలప్రధ్వంసి నః శ్రేయసే.

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్,
యత్ కృపా తమహం వందే పరమానందమాధవమ్.

యం బ్రహ్మా వరుణేంద్రరుద్రమరుతః స్తున్వంతి దివ్యైః స్తవై
ర్వేదైః సాంగపదక్రమోపనిషదై ర్గాయంతి యం సామగాః,
ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం న విదుః సురాసురగణా దేవాయ తస్మై నమః.

అతఃపరం యథార్హం సంపూజ్య పారాయణాదికం కార్యమ్.




శ్రీకృష్ణాయనమః.

# శ్రీభగవద్గీతాప్రారంభః.

## అర్జునవిషాదయోగః.



ధృతరాష్ట్ర ఉవాచ.—

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ. 1

ధృతరాష్ట్రుఁడు పలుకుచున్నాఁడు.—

టీక. హేసఞ్జయ=ఓయి సంజయుఁడా, ధర్మక్షేత్రే=పుణ్యభూమియైన, కురుక్షేత్రే=కురుక్షేత్రమునందు, యుయుత్సవః=యుద్ధముఁ జేయఁగోరుచున్నవారై, సమవేతాః=కూడిన, మామకాః=నాకుమారులయినదుర్యోధనాదులు, పాండవాశ్చైవ=పాండురాజుకుమారులయిన ధర్మరాజాదులును, కిం=ఏమి, అకుర్వత=చేసిరి.

---

☞ శంకరభాష్యానుసారముగా వ్రాయఁబడిన తాత్పర్యమునకు 'శం' అనియు, రామానుజభాష్య తాత్పర్యమునకు 'రా' అనియు, మధ్వభాష్య తాత్పర్యమునకు 'మ' అనియు మొదట చేర్పఁబడును.

తాత్పర్యము. ఓయిసంజయుఁడా! పుణ్యభూమియైన కురుక్షేత్రమునందు * యుద్ధముచేయుటకై చేరినవారై నాకుమారులయిన దుర్యోధనాదులును పాండవులును ఏమి చేసిరి ?

సఞ్జయ ఉవాచ:—

శ్లో. దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:—

టీ. రాజా=రాజైన, దుర్యోధనః=దుర్యోధనుఁడు, వ్యూఢం=వ్యూహాకారముగా రచియింపఁబడిన, పాండవానీకం=పాండవసైన్యమును, దృష్ట్వా తు=చూచి, తదా=అప్పుడు, ఆచార్యం=ఆచార్యులను, ఉపసంగమ్య=సమీపించి, వచనం=చెప్పఁబోవువాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అప్పుడు దుర్యోధనుఁడు వ్యూహములుగాఁ బన్ని నిలిపినపాండవులసేనను జూచి ద్రోణాచార్యులయొద్దకుఁ బోయి యీమాటను చెప్పెను.

అవ. ఆద్రోణాచార్యులతో దుర్యోధనుఁడు చెప్పిన వాక్యములను తొమ్మిదిశ్లోకములచేత సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—

శ్లో. పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా.

టీ. హే ఆచార్య=ఓగురువర్యా, తవ=మీకు, శిష్యేణ=శిష్యుఁడును, ధీమతా=బుద్ధిమంతుఁడునైన, ద్రుపదపుత్రేణ=

* ఇది పంజాబ్ దేశములోని పానిపట్ (Panipat) అను దానికి సమీపముగా నుండును.

ద్రుపదరాజకుమారుఁడైన ధృష్టద్యుమ్నునిచేత, వ్యూఢాం=వ్యూహాకారముగా రచియింపఁబడిన, మహతీం=అధికమైన, పాండుపుత్రాణాం=పాండవులయొక్క, ఏతాం=ఈ, చమూం=సేనను, పశ్య=చూడుమా.

శం. ఆచార్యా! ఇదిగో పాండవులదైన గొప్పసేన నీశిష్యుఁడును బుద్ధిమంతుఁడు నగు ధృష్టద్యుమ్నునిచేత వ్యూహములుగా తీర్పఁబడియున్నది, చూడుము. (ధృష్టద్యుమ్నునకును, ద్రోణునకును విరోధము. ధృష్టద్యుమ్నుఁడు సేనాపతియై ద్రోణునకు ప్రతికక్షియై ధైర్యముతో వ్యూహమును పన్ని సేనను చేర్చియున్నాఁ డని యాచార్యునితోఁ జెప్పి, యాచార్యునకతనిపై కోపమును వృద్ధిచేసి, అందుమూలముగా పాండవసేనయందును కోపముఁ గల్పింప వలయు నని దుర్యోధనుని భావము.)

శ్లో. అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః. 4

టీ. అత్ర=ఈ పాండవసేనయందు, మహేష్వాసాః=గొప్పవిండ్లుగలవారలును, యుధి=యుద్ధమునందు, భీమార్జునసమాః=భీమార్జునులతో సమానులైన, శూరాః=వీరులు, సంతి=కలరు. (వారలెవ్వరనిన,) యుయుధానః = సాత్యకియు, విరాటశ్చ=విరాటుఁడును, *మహారథః = మహారథికుఁడైన, ద్రుపదశ్చ=ద్రుపదరాజును,

* మహారథిలక్షణము.—"శ్లో. ఏకాదశసహస్రాణి యోధయేద్యస్తు ధన్వినాం, శస్త్రశాస్త్రప్రవీణస్తు మహారథ ఇతి స్మృతః. అమితాన్ యోధ

శం. ఈ పాండవసేనలో గొప్పవిలుకాండ్రును యుద్ధమున భీమార్జునులతో సమానులైన శూరు లున్నారు. వా రెవ్వ రనిన సాత్యకియును, విరాటుఁడును, మహారథుఁడైన ద్రుపదుఁడును.

శ్లో. ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్,
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. 5

టీ. ధృష్టకేతుః = ధృష్టకేతువనెడు రాజును, చేకితానః = చేకితానుఁడును, వీర్యవాన్ = పరాక్రమశాలియైన, కాశిరాజశ్చ = కాశీరాజును, పురుజిత్ = పురుజిత్తనెడి రాజును, కుంతిభోజశ్చ = కుంతిభోజుఁడును, నరపుంగవః = నరశ్రేష్ఠుఁడైన, శైబ్యశ్చ = శైబ్యుఁడును.

శం. ధృష్టకేతువును, చేకితానుఁడును, పరాక్రమశాలియైన కాశీరాజును, పురుజిత్తుఁడును, కుంతిభోజుఁడును, మనుష్యశ్రేష్ఠుఁడగు శైబ్యుఁడును.

శ్లో. యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః. 6

టీ. విక్రాంతః = శూరుఁడైన, యుధామన్యుశ్చ = యుధామన్యువును, వీర్యవాన్ = పరాక్రమవంతుఁడయిన, ఉత్తమౌజాశ్చ =

యోద్యస్తు సంప్రోక్తోఽతిరథస్తు సః, రథస్త్వేకేన యోద్ధా తన్న్యూనోఽర్ధరథో మత ఇతి." పదునొకండువేల విలుకాండ్రతో యుద్ధముచేయు సామర్థ్యముగల శస్త్రశాస్త్రప్రవీణుఁడయినవాఁడు మహారథుఁడనంబడును. అపరిమితరథికులతో యుద్ధముచేయువాఁడు అతిరథుఁడనంబడును. ఒకరథికునితో యుద్ధముచేయువాఁడు సమరథుఁడనఁబడును. అసమరథునికంటెఁ దక్కువయైనవాఁడు అర్ధరథుఁడనంబడును. ఈవిషయము శ్రీభాగవతమందుఁ జెప్పఁ

ఉత్తమౌజుఁడును, సౌభద్రః = అభిమన్యువును, ద్రౌపదేయాశ్చ = ధర్మజభీమార్జుననకులసహదేవులకు ద్రౌపదియందు వేర్వేఱుగఁబుట్టిన ప్రతివింధ్యాదులును, సర్వే=పూర్వమందు చెప్పఁబడినవార లందఱును, మహారథాః=మహారథికులు.

తం. పరాక్రమముగల యుధామన్యుఁడును, బలవంతుఁడయిన ఉత్తమౌజుఁడును, అభిమన్యువును, ద్రౌపదికొడుకులును వీరలందఱు మహారథులు.

శ్లో. అస్మాకం తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తా న్బ్రవీమి తే. 7

టీ. హేద్విజోత్తమ=ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడయిన ద్రోణాచార్యుఁడా! యే=ఎవరు, అస్మాకం=మనసంబంధులైన, విశిష్టాః=ముఖ్యులో, మమ=నాయొక్క, సైన్యస్య = సేనకు, నాయకాః=రక్షకులో, తాన్ =వారలను, తే=నీకు, సంజ్ఞార్థం=(జ్ఞాపకనిమిత్తము) తెలియుటకొఱకు, బ్రవీమి=చెప్పుచున్నాను. తాన్=వారిని, నిబోధ=తెలిసికొనుము.

తం. బ్రాహ్మణోత్తముఁడా! మనసేనకు రక్షకులును మనలో

బడియున్నది. ఎట్లనగా:— "శ్లో. ద్రౌపద్యాం పంచపంచభ్యః పుత్రాస్తే పఞ్చజజ్ఞిరే, ధర్మజా త్ప్రతివింధ్యస్తు సుతసోమో వృకోదరాత్, అర్జునా చ్ఛ్రుతకీర్తిస్తు శతానీకస్తు నాకులిః, సహదేవసుతో రాజన్ శ్రుతసేన స్తథాపర ఇతి" ధర్మరాజునివలనఁ బ్రతివింధ్యుఁడును, భీమునివలన సుతసోముఁడును, అర్జునునివలన శ్రుతకీర్తియు, నకులునివలన శతానీకుఁడును, సహదేవునివలన శ్రుతసేనుఁడును, ద్రౌపదిగర్భమునఁ బుట్టిరని చెప్పఁబడియున్నది.

ఉత్తములైనవారిని స్పష్టముగా జ్ఞాపకనిమిత్తమునకై తెలియుటకొఱకు నీకుఁ జెప్పెద వినుము.

అవ. అట్టివారిని రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో. భవాన్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి ర్జయద్రథః.

టీ. భవాన్=నీవును, భీష్మః=భీష్ముఁడును, కర్ణశ్చ=కర్ణుఁడును, సమితింజయః=యుద్ధమందు జయశీలుఁడయిన, కృపశ్చ=కృపాచార్యుఁడును, అశ్వత్థామా=అశ్వత్థామయు, వికర్ణశ్చ=వికర్ణుఁడును, సౌమదత్తిః=సోమదత్తుని కుమారుఁడయిన భూరిశ్రవుఁడును, జయద్రథః=(సింధురాజునకొమరుఁడైన) జయద్రథుఁ డనువాఁడును, వీఁడే సైంధవుఁడు.

తం. నీవు, భీష్ముఁడు, కర్ణుఁడు, కృపాచార్యుఁడు, అశ్వత్థామ, వికర్ణుఁడును, భూరిశ్రవుఁడును, జయద్రథుఁడును వీరలు మనసేనలో నుత్తములు.

శ్లో. అన్యే చ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః. 9

టీ. మదర్థే=నాప్రయోజననిమిత్తమై, త్యక్తజీవితాః - త్యక్త=విడువఁబడుచున్న, జీవితాః=ప్రాణములుగలవారును, బహవః=అనేకులయిన, అన్యేచ=ఈచెప్పఁబడినవారికంటె మిగిలిన, సర్వే=వీరలందఱును, శూరాః=శూరులును, నానాశస్త్రప్రహరణాః - నానా=అనేకప్రకారములైన, శస్త్ర=ఆయుధవిశేషములును, ప్రహరణాః = సాధనములును గలవారలును,

యుద్ధవిశారదాః - యుద్ధ = యుద్ధమునందు, విశారదాః= నేర్పుగలవారును.

శం. ఇంక పెక్కండ్రు నానావిధాయుధములచే యుద్ధము సేయుటయందు సమర్థులైనశూరులు నానిమిత్తమై ప్రాణముల నైనను విడువ నిశ్చయించియున్నారు.

శ్లో. అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం,
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితం. 10

టీ. తదపి=అట్టిపరాక్రమవంతులు మనసైనికులయ్యును, భీష్మాభిరక్షితం-భీష్మ = భీష్మాచార్యులచేత, అభిరక్షితం=అంతట రక్షింపఁబడుచున్న, అస్మాకం=మనయొక్క, బలం=సైన్యము, అపర్యాప్తం=సంపూర్ణముగాకయున్నది. (కావునఁ బాండవుల జయింపఁజాలదని ''చుచున్నది.) ఏతేషామ్=ఈపాండవులయొక్క, బలంతు=సైన్యమైతే, భీమాభిరక్షితం సత్-భీమ=భీముని చేత, అభిరక్షితంసత్=అంతట రక్షింపఁబడుచున్నదై, పర్యాప్తం=సంపూర్ణముగా నున్నది.

శం. ఇట్లు అనేకులు శూరు లున్నను భీష్మునిచే రక్షింపఁబడ్డ మనసేన సంపూర్ణముకాకయున్నది. పాండవులసైన్యమో భీముని చేత రక్షింపఁబడినట్లు సంపూర్ణమైయున్నది. ''ఇది దుర్యోధనుని వాస్తవాభిప్రాయము. అయినను తాను పాండవులకు వెఱచినట్లు వినువారలకు తెలియనీయక గూఢార్థము ధ్వనించునట్లు చెప్పినాఁడు. రెండవయర్థమున కన్వయము. తదపి=అట్టిపరాక్రమవంతులు పాండవసేనయం దున్నను, భీష్మాభిరక్షితం బల మస్మాక మపర్యాప్తం=భీష్మునిచేఁ గొట్టఁబడకుండ భీమునిచే

రక్షింపఁబడుచున్నను, పాండవసేన మనకు చాలదు. భీమా భిరక్షితమే తేషా (మస్మాకం) మిదం బలం తు పర్యాప్తం = భీమునిచే గొట్టఁబడినను (మనచే) రక్షింపఁబడుచున్న యీ మన సేనైతేనో పాండవుల నోర్చుటకు చాలియున్నది?" అని మధుసూదన భాష్యకారులభావము. వీరు అపర్యాప్తం అనగా నపరిమితమనిన్ని, పర్యాప్తం అనగా పరిమితమనిన్ని అర్థము వ్రాసియున్నారుకావున పైయభిప్రాయముప్రకారము అన్వయము.

శ్లో. అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మ మేవాభిరక్షంతు భవంత స్సర్వఏవహి. 11

టీ. సర్వేభవంతః = మీరందఱును, సర్వేషు=సమస్తము లైన, అయనేషుచ = (వ్యూహప్రదేశ) మార్గముల యందు, (అయనేషు-ఈపదమునకు, మధుసూదనభాష్యకారులు మార్గము లని యర్థమును వ్రాయక "సేనాపతి సేనామధ్యమున నుండి, యోధు లుండుటకు వారివారి పరువునకు తగినట్లు నియోగించిన యుద్ధభూమిలోని స్థానములని వ్రాసియున్నారు. యథాభాగం=తమకునిర్ణయింపఁబడియున్న యుద్ధభూమి నతిక్రమించక, అవస్థితాస్సంతః = ఉన్నవారగుచు, భీష్మమేవ=భీష్మాచార్యులనే, అభిరక్షంతు హి=అంతట రక్షింతురుగాక. (ఓయీ? మేముభీష్మునిరక్షించునంతటివారమా అని యడిగితి రేని వెనుకకుఁ దిరుగక యెదుటనుండెడి యోధులతో యుద్ధము చేయుచుండఁగా వారలెదుట నిలువఁజాలక వంచనచేసి వెనుక పార్శ్వమునకువచ్చి నొప్పింతురు. కావున నట్లు గాకయుండు నటులు రక్షింపవలయుననుట, భీష్ముని రక్షింపం బనియేమి-

యనిన భీష్ముఁడు సేనాపతి. అతనిబుద్ధిబలముచేత సేనయంతయు నడువవలసియున్నది. మఱియును అతను అమానుషమైన సత్త్వసంపదగలవాఁడు. స్వచ్ఛందమరణత్వవరమును బడసినవాఁడు. శత్రువులు అతనిపరాక్రమమున కాగలేక పోరాడఁగల సామర్థ్యము గలవాఁడు. అట్టివానిని యోధులు కంటికి ఱెప్పవలె కాపాడినఁ దక్కిన సేననంతయు ఆయన సంరక్షించి, మనకు జయమును గలుగఁజేయఁ దగినవాఁడు. కాఁబట్టి యోధులైన మీరతని నేమఱక కాపాడుఁడు: వారిబలముచేతనే మనము జీవవంతులమై యున్నామని భావము.)

తా. మీరలందఱు వ్యూహమునందు ఆయాప్రదేశములందంతటను మీమీస్థానములయందుఁ దప్పక కాచియున్నవారలై భీష్మునిమాత్రము అన్నిపార్శ్వములందును రక్షింపవలెను.

అవ. ఇట్లు సన్మానపురస్సరమైన దుర్యోధనునివాక్యము నాకర్ణించి భీష్ముఁ డేమి చేసె నని ప్రశ్న గలుగఁగా సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—

శ్లో. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్.

టీ. ప్రతాపవాన్=(ఇంతలో)పరాక్రమశాలియును, కురువృద్ధః=కౌరవులలో పెద్దయైన, పితామహః = భీష్మాచార్యుఁడు, తస్య = పూర్వోక్తప్రకారముగా స్తోత్రము చేయుచున్న దుర్యోధనునకు, హర్షం=సంతోషమును, జనయన్ = పుట్టించుచు, ఉచ్చైః=గట్టిగా, సింహనాదం=సింహనాదమును, వినద్య=ధ్వనింపఁజేసి, శఙ్ఖం=శంఖమును, దధ్మౌ=పూరించెను.

శం. అట్లు చెప్పుచున్న దుర్యోధనునకు సంతోషము గలి గించువాఁడై కురువృద్ధుఁ డగుభీష్ముఁడు గట్టిగా సింహనాదము చేసి శంఖము పూరించెను.

గట్టిగా సింహమువలె ధ్వనించె నని నుధుసూదనతా త్పర్యము.

శ్లో. తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః,
సహసై వాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్. 13

టీ. తతః=పిమ్మట, శంఖాశ్చ = శంఖములును, భేర్యశ్చ= భేరులును, పణవానకగోముఖాః-పణవ = పణవములనెడి సూక్ష్మమృదంగవిశేషములును, ఆనక = ఢక్కానామకవిశేషములును, గోముఖాః=సంగీతానుసారములయిన వాద్యవిశేషములును, సహసైవ=శీఘ్రముగానే, అభ్యహన్యంత=వాయింపఁబడి నవి. స శబ్దః = ఆవాద్యములవలనఁ బుట్టినశబ్దము, తుములః = అంతటను దట్టముగా నిండినది. అభవత్ = అయెను.

శం. అటుపిమ్మట కౌరవసైనికులు శంఖములను భేరులను తప్పెట మొదలగువానిని శీఘ్రముగా వాయించిరి. దానిచే గొప్పధ్వని కలిగెను.

శ్లో. తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. 14

టీ. తతః=పిమ్మట, శ్వేతైః=తెల్లనైన, హయైః=గుఱ్ఱముల తోడ, యుక్తే=కూడిన, మహతి=గొప్పదియు నగు, స్యందనే= రథమునందు, స్థితౌ=ఉన్నట్టి, మాధవశ్చ = (మధువిద్యయను

వేదభాగముచేఁ బొగడఁబడువాఁడు గనుక మాధవుఁడు శ్రీక
మౌనము, ధ్యానము, యోగము గలవాఁడు గనుక మాధవుఁ
డనియుఁ జెప్పనచ్చును.) కృష్ణుఁడును, పాండవః=అర్జునుఁడు
ను, దివ్యౌ=శ్రేష్ఠము లగు, శంఖౌ = శంఖములను, ప్రదధ్మ
తుః=లెస్సగా పూరించిరి.

తా. అంతఁ గృష్ణుఁడును అర్జునుఁడును తెల్లగుఱ్ఱములను బూన్చిన గొప్పరథమునం దున్నవారలై దివ్యము లగు తమ శంఖములను పూరించిరి.

అవ. ఆ పూరించిన క్రమము విభజించి చెప్పుచున్నాఁడు.—

శ్లో. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. 15

టీ. హృషీకేశః-హృషీక=ఇంద్రియములకు, ఈశః=నియామకుఁడయిన శ్రీకృష్ణుఁడు, పాంచజన్యం=పాంచజన్యమనుశంఖమును(పంచజనుఁడను రాక్షసునివలనఁబుట్టినది.), దధ్మౌ=పూరించెను. ధనంజయః=అర్జునుఁడు, దేవదత్తం=దేవదత్తమను శంఖమును, దధ్మౌ=పూరించెను. భీమకర్మా-భీమ=భయంకరమయిన, కర్మా= కార్యముగలిగిన (అనగా భయంకరమైనకార్యములఁ జేయు), వృకోదరః=భీముఁడు (వృకమనెడి అగ్నిని కడుపులోఁగలవాఁడు.), పౌండ్రం=పౌండ్రమనెడి, మహాశంఖం=గొప్పశంఖమును, దధ్మౌ=పూరించెను—అనగా ఊఁదెను.

తా. కృష్ణుఁడు పాంచజన్యమను శంఖమును అర్జునుఁడు దేవదత్తమను శంఖమును బూరించిరి. భయంకరమైన పరాక్రి

మముగలభీముఁడు పౌండ్రమను గొప్పశంఖమును బూరించెను.

హృషీకేశ—విషయేంద్రియాదులకు ప్రేరకుఁడైనందునను లేక, సుఖమయములగు తలవెండ్రుకలుగలవాఁడైనందున హృషీకేశుఁడు; హృషీక, ఈ, ఇ, ఈశ=సంతోషింపఁజేసిన బ్రహ్మ, లక్ష్మీ, కాముఁడు, రుద్రుఁడును కలవాఁడనియు మాధ్వభాష్యము.

శ్లో. అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకుల స్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. 16

టీ. కుంతీపుత్రః=కుంతీ దేవికి పుత్రుఁడైనట్టి, యుధిష్ఠిరః= యుధిష్ఠిరుఁడను పేరుగల, యుద్ధమునందు స్థిరుఁడైనవాఁడు. రాజా=ధర్మరాజు, అనంతవిజయమ్ = అనంతవిజయమను పేరిటి శంఖమును, దధ్మౌ=పూరించెను. నకులః=నకులుఁడును, సహదేవశ్చ=సహదేవుఁడును, సుఘోషమణిపుష్పకౌ = సుఘోష మణిపుష్పకము లను శంఖములను, ప్రదధ్మతుః=క్రమముగాఁ బూరించిరి. ఇదియునుం గాక.

తా. అంతట రాజైన కుంతీపుత్రుఁడు ధర్మరాజు అనంత విజయమను పేరుగల శంఖమును పూరించెను. నకులుఁడు సుఘోషమను శంఖమును పూరించెను. సహదేవుఁడు మణి పుష్పకమను శంఖమును పూరించెను.

శ్లో. కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. 17

టీ. పరమేష్వాసః - పరమ=శ్రేష్ఠమైన, ఇష్వాసః = విల్లుగల, కాశ్యశ్చ=కాశీరాజును, మహారథః = మహారథికుఁడైన,

శిఖండీచ=శిఖండియు, ధృష్టద్యుమ్నశ్చ=ధృష్టద్యుమ్నుఁడును, విరాటశ్చ=విరాటుఁడును, అపరాజితః = యుద్ధమునందు జయింపఁబడని, సాత్యకిశ్చ = సాత్యకియును (వీరలు వేఱ్ఱేఱుగ శంఖములను పూరించిరని ఉత్తరశ్లోకముతో నన్వయము).

తా. గొప్పధనుస్సు ధరించిన కాశీరాజును మహారథుఁడైన శిఖండియును ధృష్టద్యుమ్నుఁడును విరాటరాజును పరాజయములేని సాత్యకియును దమతమశంఖములను బూరించిరి.

శ్లో. ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహుః శ్శంఖాన్ దధ్ముః పృథక్పృథక్.

టీ. హేపృథివీపతే=ఓధృతరాష్ట్రుఁడా! ద్రుపదశ్చ=ద్రుపదరాజును, ద్రౌపదేయాశ్చ=ద్రౌపదీపుత్రులైన ప్రతివింధ్యాదులును, మహాబాహుః=మిక్కిలి బలముగల భుజములు గలిగిన, సౌభద్రశ్చ=అభిమన్యుఁడును, సర్వశః=సేనయందంతట, పృథక్పృథక్=వేఱ్ఱేఱుగా, శంఖాన్ = శంఖములను, దధ్ముః = పూరించిరి.

శం. ఓయి ధృతరాష్ట్రుఁడా! ద్రుపదరాజును, ద్రౌపది కొడుకులును, మహాభుజబలపరాక్రమము గలిగిన అభిమన్యుఁడును వీరలందఱు వేఱ్ఱేఱుగా తమతమశంఖములను అంతటను పూరించిరి.

శ్లో. స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీంచైన తుములో వ్యనునాదయన్.　19

టీ. తుములః=సంకులమైన, స ఘోషః=ఆకృష్ణార్జునాది శంఖారవము, నభశ్చ=ఆకాశమును, పృథివీంచైవ=భూమిని, వ్య

నునాదయన్=ప్రతిధ్వనులచేత నింపుచున్నవాడై, ధార్త రాష్ట్రాణాం=నీసంబంధులైన దుర్యోధనాదులయొక్క, హృదయాని=మనస్సులను (గుండెలను), వ్యదారయత్=బ్రద్దలుగా జేసెను-భేదించెను.

తా. సంకులమైన ఆ మహాధ్వని ఆకాశమును భూమిని ప్రతిధ్వనింపఁజేయుచు దుర్యోధనుఁడు మొదలగువారి గుండెలను బద్దలు చేసెను.

శ్లో. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః. 20
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే,

టీ. హేమహీపతే=ఓయిధృతరాష్ట్రరాజా! అథ=అటుపిమ్మట యు సైనికులు శంఖారవము చేసినపిమ్మట, శస్త్రసంపాతే-శస్త్ర= బాణములయొక్క, సంపాతే = లెస్సఁగాఁబడుట, ప్రవృత్తే (సతి)=ఆరంభము కాఁబోవునపుడు, కపిధ్వజః=కోతి (హనుమంతుని) ధ్వజముగాఁగల, పాండవః=అర్జునుఁడు, వ్యవస్థితాన్ = యుద్ధముచేయ నుద్యోగించియున్న, ధార్తరాష్ట్రాన్ = (నీ కుమారులైనదుర్యోధనాదులను, దృష్ట్వా=చూచి, ధనుః= విల్లును, ఉద్యమ్య=ఎక్కుపెట్టి, తదా = ఆసమయమునందు, హృషీకేశం=శ్రీకృష్ణస్వామినిగూర్చి, ఇదం=ఈ, వాక్యం=వాక్యమును, ఆహ=పలికెను.

తా. అటుపిమ్మట ఓయిరాజా! ఒకరిమీఁదనొకరు బాణములు ప్రయోగించుట ఆరంభము కాఁబోవునపుడు హనుమద్ధ్వజము

గల అర్జునుఁడు యుద్ధమునకు సన్నద్ధులై నిలిచియున్న దుర్యో ధనాదులనుజూచి విల్లెక్కుపెట్టి అప్పుడు కృష్ణునితో నీవాక్య ము చెప్పెను.

మధ్వటీకయందు వేఱుగా నన్వయించినదానికి తాత్పర్య ము. అటుపిమ్మట ఓయిరాజా! యుద్ధమునందు విల్లెత్తి తాను బాణములను ప్రయోగించవలసిన ప్రసక్తిగలుచుండఁగా హను మద్ధ్వజముగల అర్జునుఁడు, దుర్యోధనాదులనుజూచి అప్పుడు శ్రీకృష్ణునితో నీవాక్యము చెప్పెను.

అవ. అర్జునుఁడు పలికినపలుకులనుఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో. సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత.
యావ దేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్,
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. 22
యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః. 23

టీ. హే అచ్యుత=ఓకృష్ణస్వామీ! (దేశకాలవస్తువులయం దు, చ్యుతి=జారుట లేనివాఁడు అనఁగా నిర్వికారుఁడు అని మధు సూదనులు. విష్ణువునుండి ఈలోకములో నవతరించుటచేత ను అచ్యుతుఁడు అని మధ్వటీక). దుర్బుద్ధేః = దుష్టబుద్ధిఁగలిగిన, ధార్తరాష్ట్రస్య=దుర్యోధనునకు, యుద్ధే = యుద్ధమందు, ప్రి యచికీర్షవః-ప్రియ=ఇష్టమును, చికీర్షవః = చేయనిశ్చయించిన, య ఏతే=ఏవీరలు, అత్ర=ఈయుద్ధరంగమునకు, సమాగతాః= వచ్చిరో, అహం=నేను, యోత్స్యమానాన్=యుద్ధముఁజేయఁ

సంజయ ఉవాచ.—

శ్లో. ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత,
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. 24

శ్లో. భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాంచ మహీక్షితామ్,
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి. 25

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హేభారత=ఓధృతరాష్ట్రుఁడా! గుడాకేశేన-గుడాక=నిద్రకు, ఈశేన=నియామకుఁడైన యర్జునునిచేత, ఏవం = ఈ పూర్వోక్తప్రకారముగా, ఉక్తస్సన్=పలుకఁబడినవాఁడై, హృషీకేశః=శ్రీకృష్ణస్వామి, ఉభయోః=రెండైన, సేనయోః=సేనలయొక్కయొక్క, మధ్యే=మధ్యమందు, భీష్మద్రోణప్రముఖతః-భీష్మ=భీష్మనియొక్కయు, ద్రోణ=ద్రోణాచార్యునియొక్కయు, ప్రముఖతః=ఎదుటనున్న, సర్వేషాం=ఎల్ల, మహీక్షితాంచ=రాజులయొక్క, ఎదుటను, రథోత్తమం = రథశ్రేష్ఠమును, స్థాపయిత్వా=నిలిపి, హేపార్థ = ఓయి అర్జునుఁడా! సమవేతాన్ కూడియున్న, ఏతాన్ = ఈ, కురూన్ = కౌరవ సైనికులను, పశ్యేతి=చూడుమని ఉవాచ=అర్జునునిఁగూర్చి పలికెను.

శం. ఓధృతరాష్ట్రా! కృష్ణుఁడు ఈప్రకారము అర్జునునిమాట విని ఆ యుత్తమమైనరథమును రెండుసైన్యముల నడుమ భీష్మద్రోణులకు నమస్తరాజులకు ఎదురుగానిలిపి అర్జునా! యుద్ధమునకు సిద్ధమై చేరియున్న ఈకౌరవులను జూడుము. అని యర్జునునితోఁ బలికెను.

శ్లో. తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్,
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా.
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి,

టీ. అథ=శ్రీకృష్ణవాక్యశ్రవణానంతరమందు, పార్థః=అర్జునుఁడును, తత్ర=అచ్చట, ఉభయోః, సేనయోః, అపి=రెండు సేనలయందును, స్థితాన్=ఉన్నట్టి, పితౄన్=పినతండ్రులు పెదతండ్రులైన భూరిశ్రవః ప్రభృతులను, పితామహాన్=తాతలైన భీష్మాదులను, ఆచార్యాన్=గురువులైన ద్రోణాదులను, మాతులాన్=మేనమామలైన శల్యాదులను, భ్రాతౄన్=అన్నదమ్ములైన దుర్యోధనాదులను, పుత్రాన్=వారికుమారులైన లక్ష్మణాదులను, పౌత్రాన్=వారికొడుకులయిన మనుమలను, సఖీన్=మిత్రులైన కృతవర్మాదులను, శ్వశురాన్=బిడ్డలనిచ్చిన మామలను, సుహృదః=(శ్రీకృష్ణునివలె ప్రీతిపూర్వకముగ నిర్హేతుకముగ) ఉపకారముచేయువారలను, అపశ్యత్=చూచెను.

శం. అర్జునుఁడు రెండు సేనలయందును ఉన్న తండ్రులను తాతలను ఆచార్యులను మేనమామలను సహోదరులను కొడుకులను మనుమలను మిత్రులను మామలను ఉపకారము చేయువారలను జూచెను.

శ్లో. తాన్ సమీక్ష్య సకౌంతేయ స్సర్వాన్ బంధూనవస్థితాన్.
కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్,

టీ. సకౌంతేయః=ఆయర్జునుఁడు, అవస్థితాన్=యుద్ధరంగమునందున్న, తాన్=పూర్వోక్తులైన, సర్వాన్=సమస్తమైన,

బంధూన్=చుట్టములను, సమీక్ష్య=చూచి, పరయా=ఉత్కృష్టమైన, కృపయా = దయతో, ఆవిష్టః = కూడినవాఁడై, విషీదన్=(ఇందఱొక్కమారు యుద్ధమునందు మృతిఁ బొందెదరు గదా యని) దుఃఖించుచు, ఇదం=ఈవక్ష్యమాణవాక్యమును, అబ్రవీత్=(శ్రీకృష్ణమూర్తితోఁ) బలికెను.

తా. ఆ అర్జునుఁడు ఆ రెండుసేనలయందున్న బంధువుల నందఱినిజూచి అధికమయిన దయతోఁ గూడినవాఁడై దుఃఖితుఁడై ఈవాక్యమును బలికెను.

అర్జున ఉవాచ:—

శ్లో. దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్,
సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి,
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే.　　29

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు:—

టీ. హేకృష్ణ=ఓకృష్ణ, యుయుత్సుమ్ = యుద్ధముచేయ నిచ్ఛించినదై, సముపస్థితం=సమకూడియుండునట్టి, ఇమం స్వజనం=ఈబంధుజనమును, దృష్ట్వా=చూచి, మమ=నాయొక్క, గాత్రాణి=అవయవములు, సీదంతి = శిథిలములగుచున్నవి. మే=నాయొక్క, ముఖం=నోరు, పరిశుష్యతి=ఎండుచున్నది. మే=నాయొక్క,శరీరే= దేహమందు, వేపథుశ్చ=వణఁకును,రోమహర్షశ్చ-రోమ=వెంట్రుకలయొక్క, హర్షశ్చ=గగుర్పాటును, జాయతే=పుట్టుచున్నది.

తా. ఓ కృష్ణా! యుద్ధముచేయఁగోరి కూడియుండు ఈబంధువులను జూడఁగా నా అవయవములన్నియు నిస్సత్తువలగుచు

న్నవి. నోరు ఎండుచున్నది. దేహము వణఁకుచున్నది. రోమములకు గగుర్పాటు కలుగుచున్నది.

మధ్వ. కృష్ణ=పూర్ణమైనసుఖముగలవాఁడు, దైత్యులను తపస్సునుగూర్చి ఆకర్షించువాఁడు, ఛేదింపఁబడిన దైత్యుల ప్రాణంబును బలంబును గలవాఁడు, దేవతలకిఁబడిన ప్రాణంబును బలంబును కలవాఁడు.

శ్లో. గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే,
నచ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. 30

టీ. మే=నాయొక్క, గాండీవం=గాండీవ మనెడి విల్లు, హస్తాత్=హస్తమునుండి, స్రంసతే=జారుచున్నది. త్వక్చైవ=చర్మమును, పరిదహ్యతే=అంతట దహింపఁబడుచున్నది. మనశ్చ=మనస్సును, భ్రమతీవ = చంచలమైనదానివలెనున్నది. (అతః=కావున), అవస్థాతుం = రథముమీఁద నుంచుటకు, న శక్నోమి=సమర్థుఁడనుగాను.

శం. గాండీవము చేతినుండి జారిపడుచున్నది. నాయొడలి చర్మమంతయు మిక్కిలి తపించుచున్నది. నేను నిలువఁజాలకయున్నాను. నామనస్సు తిరుగుడుపడుచున్నది.

శ్లో. నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ,
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. 31

టీ. కేశవ=ఓకృష్ణా! విపరీతాని= అనర్థసూచకములైన, నిమిత్తానిచ=శకునములను, పశ్యామి=చూచుచున్నాను. ఆహవే=ఆయుద్ధమందు, స్వజనం=బంధుజనమును, హత్వా=చంపి, అను=ఆపిమ్మట, శ్రేయశ్చ=శుభమును, న పశ్యామి=చూడను.

శం. కృష్ణా! ఇదిగాక అశుభసూచకములైన శకునములు కనుపడుచున్నవి. యుద్ధమునందు బంధుజనమును జంపినను, అందువల్ల శుభమేమియు కానరాదు.

మధ్వ. బ్రహ్మరుద్రులను ప్రవర్తింపఁ జేయువాఁడు, క+ఈ+ఇ+ఈశ+వ=బ్రహ్మను, లక్ష్మిని, కాముని, రుద్రునిం బ్రవర్తింపఁజేయువాఁడు, లేక వహించువాఁడు, కేశ+వ = సుఖశ్రేష్ఠమును వహించువాఁడు. ప్రళయసముద్రమునఁగాని, క్షీరసంద్రమునఁగానియుండువాఁడు. మంచితలవెండ్రుకలుగాని కేశనామములు గల అవతారములు గాని కలవాఁడు.

మధు. కేశవ = క + ఈశ +వ = బ్రహ్మను రుద్రుని రక్షించువాఁడు, లేక, కేశ+ వ= కేశయనురాక్షసుని చంపినవాఁడు.

శ్లో. న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ,
కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవితేన వా. 32

టీ. హేకృష్ణ=ఓకృష్ణ! అహం=నేను, విజయం=గెలుపును, న కాంక్షే=కోరను. రాజ్యం చ = రాజ్యమును, సుఖాని చ=సుఖములను, న కాంక్షే=కోరను. హే గోవింద=ఓకృష్ణస్వామీ! రాజ్యేన=(బంధువులందఱు మృతిఁబొందినపిమ్మట) రాజ్యముచేత,నః=మనకు, కిం=ఏమి (ప్రయోజనము)? భోగైః=సుఖములచేత, కిం=ఏమి (ప్రయోజనము)? జీవితేన వా=బ్రతుకుటచేతనైన, కిం=ఏమి (ప్రయోజనము) ?

శం. కృష్ణా! నాకు జయము వలదు. రాజ్యము వలదు. సుఖము వలదు. గోవిందా! మనబంధువు లందఱు మృతిఁబొందిన పిమ్మట, మనకు ఈ రాజ్యమేల? భోగములేల? ఈ బ్రతుకేల?

మధ్వ. గో = 1. గంధర్వవిద్యలు, 2. ధేనుభూమిస్వర్గము లును, రూపావతారములును, జ్ఞానకిరణములును, వీనిని - విం దతి=పొందించువాఁడని యర్థము. లేక వేదములచేత తెలియఁ బడువాఁడు, వాక్కులకు విష్ణుజ్ఞానము నిచ్చువాఁడు, వాక్కుల యజ్ఞానమును బోఁగొట్టువాఁడు.

మధు. గోవింద=ఇంద్రియములను పొందువాఁడు - ఇంద్రి యము లధిష్ఠానముగాఁ గలవాఁడు.

శ్లో. యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖానిచ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ.

టీ. యేషాం=ఏ ద్రోణాచార్యులు మొదలైనవారియొక్క, అర్థే=ప్రయోజనమందు, నః=మనయొక్క, రాజ్యం = రాజ్య ము, కాంక్షితం=కోరఁబడెనో, భోగాశ్చ=స్రక్చందనవనితాది భోగములును, సుఖాని చ = సుఖములును (కాంక్షితాని= కోరఁబడినవో), తే=ఆ, ఇమే=ఈ ద్రోణాచార్యులు మొదలై నవారు, ప్రాణాంశ్చ=ప్రాణములను, ధనాని చ=ధనములను, త్యక్త్వా=విడిచి, యుద్ధే = యుద్ధమందు, అవస్థితాః = నిలిచి యున్నవారు.

శం. ఎట్టి బంధువులు జీవించియుండిన, రాజ్యభోగములు సుఖప్రదములగునో, అట్టి బంధువులు ప్రాణములమీఁదను, ధన ములమీఁదను ఆశ వదలి యుద్ధరంగమందు వచ్చి నిలిచి యున్నారు.

శ్లో. ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః,
మాతులాశ్శ్వశురాః పౌత్రా స్స్యాలాస్సంబంధినస్తథా.

టీ. ఆచార్యాః = ఆచార్యులును, పితరః=తండ్రులును, పుత్రాః=కొమాళ్లును, తథైవచ= ఆప్రకారమే, పితామహాః= తాతలును, మాతులాః=మేనమామలును, శ్వశురాః=బిడ్డనిచ్చినమామలును, పౌత్రాః = మనుమలును, స్యాలాః=పెండ్లముతోడఁబుట్టినవారును, సంబంధినః=సంబంధులును.

శం. వారెవ్వరనఁగా—ఆచార్యులు, తండ్రులు, కొమరులు, తాతలు, మేనమామలు, మామలు, బావలు, మఱఁదులు, సంబంధులు అగు బంధువులు.

శ్లో. ఏతాన్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన.
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే. 35

టీ. హే మధుసూదన = ఓ కృష్ణస్వామీ! ఘ్నతోఽపి= మమ్ముసంహారించుచున్నవారలనైనను, ఏతాన్= ఈదుర్యోధనాదులను, త్రైలోక్యరాజ్యస్య = ముల్లోకపు రాజ్యముయొక్క, హేతోరపి = కారణమువలననైనను, హంతుం = సంహారించుటకు, న ఇచ్ఛామి=కోరను, మహీకృతే= భూమియొక్క, ప్రాప్తికొఱకు, కిం ను = ఏమి ? (అనఁగా దుర్యోధనాదుల సంహారించుటవలనఁ ద్రైలోక్యప్రాప్తి గలిగినను సమ[illegible]ముగా వారు మమ్ముఁ జంపవచ్చినను వారల నేను జంపఁగోరననుట.) ఇదియునుంగాక.

శం. ఓ కృష్ణా! వీరలు నన్ను హింసించుచున్నను, త్రైలోక్యరాజ్యము రానున్నను వీరల హింసింప నొల్లను. ఇఁక నీభూరాజ్యముకొఱకు హింసింప నొల్లనని చెప్పవలయునా ?

మధ్వ. మధుసూదన=తేనెపూసిన యస్త్రమునలె సుఖలేశము కల సంసారమును పోఁగొట్టువాఁడు; లేక మధురముగా వండువాఁడైన భీముని నియమించువాఁడు.

మధు. మధుసూదన = మధువనెడి దైత్యునిచంపినవాఁడు.

శ్లో. నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన,
పాప మే వాశ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః. 36

టీ. హేజనార్దన= ఓ కృష్ణా! ధార్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను, నిహత్య=చంపి, నః=మనకు, కా ప్రీతిః=ఏమిసంతోషము, స్యాత్=కలుగును. *ఆతతాయినః=మనలను జంపుట కుద్యుక్తులయిన, ఏతాన్ = ఈదుర్యోధనాదులను, హత్వా=చంపి, అస్మాన్=మనలను, పాపమేవ=దోషమే, ఆశ్రయేత్= పొందును.

శం. కృష్ణా! దుర్యోధనాదులను చంపుటచే మనకు ఏమి సంతోషము కలుగును? వీరలు మనలఁ జంపుట కుద్యుక్తులయి వచ్చియున్నను వీరలను చంపుటచే మనకు పాపమే కలుగును.

మధ్వ. జన=పుట్టినివాఁడును, అర్దన=సంహరించువాఁడును-లేక పుట్టుకను పోఁగొట్టువాఁడు; మంచిజనులను మంచిగతిని పొందించువాఁడు; చెడుజనులను చెడుగతిని పొందించువాఁడు; సజ్జనులను యాచించువాఁడు; దుర్జనులను హింసించువాఁడు.

---

* శ్లో. "అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః, క్షేత్రదారాపహర్తాచ షడేతే హ్యాతతాయినః" తా. చిచ్చుపెట్టినవాఁడును, విషముపెట్టినవాఁడును, భూమి నపహరించినవాఁడును, భార్య నపహరించినవాఁడును, ఆయుధహస్తుఁడై నఱుకవచ్చినవాఁడును, ద్రవ్యము నపహరించినవాఁడును వీరలాఱుగురును ఆతతాయు లని యాపస్తంబులు చెప్పియున్నారు.

మధు. జనార్దన=జనులనుచంపువాఁడు ; అనగా సంహారకర్త. కృష్ణా! దుర్యోధనాదులను చంపుటచే మనకునేమి సంతోషము కలుగును? పోనిమ్ము. అట్లు చంపక మనమూరకుండఁగా అనగా యుద్ధముచేయక యూరకుండఁగా మనలను చంపయత్నించు నీయాతతాయు లగుదుర్యోధ నాదులను పాపమే యాశ్రయించును.

శ్లో. తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్,
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ. 37

టీ. హేమాధవ=ఓశ్రీకృష్ణ ! తస్మాత్=ఆకారణమువలన, వయం=మనము, సబాంధవాన్ = బంధుసహితులైన, ధార్తరాష్ట్రాన్=దుర్యోధనాదులను, హన్తుం=చంపుటకు, నార్హాః=తగినవారముకాము. స్వజనం=బంధుజనమును, హత్వా=చంపి, కథం=ఏప్రకారము, సుఖినః=సుఖము గలవారము, స్యామ=అగుదుము ?

శం. కాఁబట్టి దుర్యోధనాదులను వారిబంధువులను వధించుట మన కుచితము కాదు. కృష్ణా! మనబంధువులను మనమే వధించి యెట్లు సుఖము పొందుదుము ?

మధ్వ. మాధవ=జ్ఞానమున కధిపతి, జ్ఞానమును ధర్మమును ప్రవర్తింపఁజేయువాఁడు, మధు వనుదైత్యునిసంబంధముఁ గలవాఁడు. అనగా వానికి శత్రు వనుట.

మధు. మాధవ=లక్ష్మికి పెనిమిటి.

శ్లో. యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః,
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్. 38

శ్లో. కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మా న్నివ ర్తితుమ్,
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన. 39

టీ. హే జనార్దన=శ్రీకృష్ణా! లోభోపహతచేతసః - లోభ=రాజ్యలోభముచేత, ఉపహత=కొట్టఁబడిన, చేతసః=మనస్సుగల, ఏతే=ఈదుర్యోధనాదులు, కులక్షయకృతం—కులక్షయ=వంశక్షయముచేత, కృతం=కలుగు, దోషం చ=దోషమును, అథ=మఱియు, మిత్రద్రోహే=మిత్రద్రోహమందలి, పాతకం చ=పాతకమును, యద్యపి నపశ్య న్తి=తెలిసికొనఁజాలకున్నను, కులక్షయకృతం=కులనాశముచే చేయఁబడిన, దోషం=దోషమును, ప్రపశ్యద్భిః=చూచుచున్న, అస్మాభిః=మనచేత, అస్మాత్ పాపాత్=ఈపాపమునుండి, నివ ర్తితుం=నివ ర్తించుటకొఱకు, కథం=ఎట్లు, న జ్ఞేయం=తెలియఁదగినదికాదు ?

తం. ఓ జనార్దనా ! మనరాజ్యమునుగూడ నాక్రమించుకొను లోభముతో నొకవేళ దుర్యోధనాదులు వంశనాశముచేఁ గలుగుదోషమును, మిత్రద్రోహముచేఁ గలుగుపాపమును తెలిసికొనఁజాలకున్నను వంశనాశముచేఁ గలుగుదోషమును జూచుచున్న మనము ఈపాపకార్యమును విడువవలె ననుటను ఎట్లు తెలియకయుండవచ్చును ?

శ్లో. కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత. 40

టీ. కులక్షయే(సతి)=వంశనాశము కలుగఁగా,సనాతనాః=(పరంపరగా వచ్చు) శాశ్వతములైన, కులధర్మాః=వంశాచా

రములు, ప్రణశ్యంతి=నశించుచున్నవి. ధర్మే=ఆచారము, నష్టే (సతి)=నశింపుచుండఁగా, కృత్స్నం=సమస్తమైన, కులం=వంశమును, అధర్మః=అనాచారము, అభిభవత్యుత=దృఢముగాఁ బొందుచున్నది.

శం. వంశనాశము కలుగఁగానే పరంపరగా శాశ్వతములై యుండు వంశాచారములన్నియు నశించును. ఆచారములు నశించుటచే వంశమంతయు నధర్మముపా లగును.

శ్లో. అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. 41

టీ. హేకృష్ణ=ఓకృష్ణస్వామీ! అధర్మాభిభవాత్=అనాచారము కలుగుటవలన, కులస్త్రియః=కులస్త్రీలు, ప్రదుష్యంతి=చెడిపోవుచున్నారు. హేవార్ష్ణేయ=ఓ శ్రీకృష్ణస్వామీ! స్త్రీషు=స్త్రీలు, దుష్టాసుసత్సు = చెడినవారలగుచుండఁగా, వర్ణసంకరః-వర్ణ=బ్రాహ్మణాదిజాతులయొక్క-, సంకరః=చెడుట, జాయతే=కలుగుచున్నది.

శం. కృష్ణా! వంశము అధర్మముపాలగుటచే కులస్త్రీలు చెడుదురు. స్త్రీలు చెడుటచే వర్ణసంకర మగును.

శ్లో. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. 42

టీ. సంకరః=వర్ణసంకరము, కులఘ్నానాం=వంశముఁ జెఱచినవారలకును, కులస్య=నాశముచెందిన కులమునకును, నరకా

యైవ=నరకముకొఱకే, (భవతి=అగుచున్నది). (అతః=ఈకారణమువలన), ఏషాం=ఈసాంకర్యముగలవారియొక్క, పితరః = పితృదేవతలు, లుప్తపిండోదకక్రియాః (స్సన్తః)—లుప్త=లోపించిన, పిండోదకక్రియాః (స్సన్తః)=పిండోదకకార్యములు గలవారగుచు, పతంతి=అధోలోకమునఁ బడుచున్నారు.

శం. వర్ణసంకరము వంశము నశింపఁజేసినవారికిని ఆవంశమునకును నరకమునే కలిగించును. ఏలయనఁగా వీరిపితృదేవతలు పిండోదకకార్యములు లేనివారలై, అధోలోకమునఁ బడుదురు.

శ్లో. దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. 43

టీ. కులఘ్నానాం=కులమును చెడఁగొట్టువారియొక్క, వర్ణసంకరకారకైః - వర్ణ=జాతియొక్క, సంకర=కలియుటను, కారకైః=చేయుచున్నట్టి, ఏతైః=ఈ, దోషైః = దోషములచేత, శాశ్వతాః = పరంపరాప్రాప్తములయిన, జాతిధర్మాశ్చ=వర్ణాచారములును, కులధర్మాశ్చ=కులాచారములును, ఉత్సాద్యన్తే=పోఁగొట్టఁబడుచున్నవి.

శం. కులధ్వంసకులయొక్క యీవర్ణసాంకర్యముకలిగించు దోషములచేత శాశ్వతములైన వర్ణాచారములును, కులాచారములును నశింపఁజేయఁబడుచున్నవి.

మధ్వ. 'ధర్మాశ్చ' అనుటచే ఆశ్రమధర్మములు గూడ నశింపఁ జేయఁబడుచున్నవి.

శ్లో. ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. 44

టీ. హేజనార్దన=ఓ కృష్ణస్వామీ! ఉత్సన్నకులధర్మాణాం-ఉత్సన్న = చెడిన, కులధర్మాణాం=వంశాచారములుగల, మనుష్యాణాం=మనుష్యులకు, నరకే=నరకమందు, నియతం=శాశ్వతముగా, వాసః=నివాసము, భవతి = కలుగుచున్నది. ఇతి=ఇట్లని, అనుశుశ్రుమ=(పెద్దలవలన) వింటిమి.

శం. కృష్ణా! ఇట్లు వంశాచారములను నశింపఁజేసిన మనుష్యులకు నియతముగా నరకమునందు వాసము కలుగునని పెద్దలవలన వినియున్నాము.

శ్లో. అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః. 45

టీ. యత్=ఏకారణమువలన, వయం=మనము, రాజ్యసుఖలోభేన-రాజ్య=రాజ్యమందును, సుఖ=సుఖమందును, లోభేన=లోభముచేత, స్వజనం=బంధుజనమును, హంతుం=సంహరించుటకొఱకు, ఉద్యతాః=యత్నముచేసితిమో, (తత్=ఆకారణమువలన), మహత్=అధికమైన, పాపం=పాపమును, కర్తుం=చేయుటకొఱకు, వ్యవసితాః=ఉద్యుక్తులమైతిమి. అహోబత=అక్కటకటా!

శం. మన మిప్పు డెంత మహాపాపము సేయఁబూనితిమి. అక్కటకటా! రాజ్యసుఖములందలి యాశచే మనబంధువులనే చంపుకొనుటకు ఉద్యమించితిమిగదా!

శ్లో. యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే *క్షేమతరం భవేత్. 46

* 'క్షేమతరం' దీనికి మాఱుగా 'ప్రియతరం' అని యొకానొకపాఠము.

టీ. అశస్త్రం = శస్త్రవర్జితుఁడను, అప్రతీకారం=బదులు చేయనివాఁడను అగు, మాం=నన్ను, రణే=యుద్ధమందు, శస్త్రపాణయః = ఆయుధహస్తులగు, ధార్తరాష్ట్రాః = దుర్యోధనాదులు, హన్యుర్యది=సంహరించిరేని, తత్=అట్లు చంపుట, మే=నాకు, క్షేమతరం=మిక్కిలి మేలు, భవేత్=అగును.

శం. ఆయుధములేనివాఁడను, బదులుకొట్టనివాఁడను అగు నన్ను దుర్యోధనాదులు ఆయుధహస్తులై వచ్చి యుద్ధమునందు వధింతురేని నాకది మిక్కిలి క్షేమముగా నుండును. అప్పుడు నాకు మిగుల ఇష్ట మని యర్థము.

సఞ్జయ ఉవాచ.—

శ్లో. ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. 47

సంజయుఁడు చెప్పుచున్నాఁడు:—

టీ. అర్జునః=అర్జునుఁడు, ఏవం=ఈ పూర్వోక్తప్రకారముగా, ఉక్త్వా=పలికి, శోకసంవిగ్నమానసః-శోక=దుఃఖముచేత, సంవిగ్న=చలించిన, మానసః = మనస్సుగలవాఁడగుచు, సశరం=బాణముతోఁగూడిన, చాపం=వింటిని, విసృజ్య=విడిచి, సంఖ్యే=యుద్ధమందు - యుద్ధసన్నద్ధులగు ఉభయ సేనలమధ్యమునందు, రథోపస్థే=రథముమీఁద, ఉపావిశత్ = కూర్చుండెను- (దిగులుపడి చతికిలఁబడెను).

శం. ఇట్లు చెప్పి అర్జునుఁడు దుఃఖముచే చలించిన మనస్సుగలవాఁడై బాణముతోఁగూడిన ధనుస్సును విడిచి రణరం

గమున ఉభయసేనామధ్యమున రథముమీఁద చతికిలఁబడి కూర్చుండెను.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాద
యోగోనామ ప్రథమోఽధ్యాయః.

ఓం తత్సత్.

ఇతి శ్రీపరమహంసపరివ్రాజకాచార్య బ్రహ్మానందసరస్వతీశిష్య
రామచంద్రానందసరస్వతీవిరచితాయాం భగవద్గీతాంధ్ర
వ్యాఖ్యాయాం పదయోజనీసమాఖ్యాయాం
అర్జునవిషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, కృష్ణార్జునులసంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయం దర్జునవిషాదయోగమనెడి
ప్రథమాధ్యాయము.

—

శ్రీః

# శ్రీ భ గ వ ద్గీ తా,

## సా ఙ్ఖ్య యో గః.



సఞ్జయ ఉవాచ:—

శ్లో. తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. 1

సంజయుఁడు పలికెను.—

టీ. తథా=అట్లు, కృపయా=జాలితో, ఆవిష్టం=కూడు కొనియున్నవాఁడును, అశ్రుపూర్ణాకులేక్షణం-అశ్రు=కన్నీటితో, పూర్ణ=నిండిన, ఆకుల=వ్యాకులమైన, ఈక్షణం=కన్నులుగలవాఁడును, విషీదంతం=దుఃఖించుచున్న, తం=ఆయర్జునునిఁగూర్చి, మధుసూదనః=శ్రీకృష్ణస్వామి, ఇదం=ఈచెప్పఁబోయెడి, వాక్యం=వచనమును, ఉవాచ=పలికెను.

తం. అట్లు కరుణ యావహిల్లినవాఁడై బంధువులను మిత్రులను చంపవలసివచ్చెను గదాయని కన్నీరు కార్చుచు దుఃఖించుచున్న యాయర్జునునిఁ జూచి శ్రీకృష్ణుఁ డీవాక్యముఁ బలికెను.

శ్రీభగవా నువాచ:—

శ్లో. "ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః,
వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీరణా"=భగమనగా నైశ్వర్య, ధర్మ, కీర్తి, శ్రీ, జ్ఞాన, వైరాగ్య, మోక్షములు. ఇవి

కలవాఁడు భగవంతుఁడు. శ్లో. "ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానా మాగతిం గతిం, వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవానితి." భూతములపుట్టుకను, నాశమును, రాఁబోయెడిసంపత్తును, రాఁబోయెడి ఆపత్తును, అజ్ఞానమును, జ్ఞానమును, ఎవ్వఁడెఱుఁగునో, వాఁడు భగవంతుఁ డనఁబడఁదగినవాఁడు.

శ్లో. కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. 2

భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు పలుకుచున్నాఁడు:—

టీ. హే అర్జున=ఓ యర్జునుఁడా, అనార్యజుష్టం-అనార్య=పామరులచేత, జుష్టం=సేవింపఁ బడఁదగినదియు, అస్వర్గ్యం=స్వర్గమున కనర్హమైనదియు, అకీర్తికరంచ=అపకీర్తికరమునైన, ఇదం=ఈ, కశ్మలం=మోహము, కుతః=ఏహేతువువలన, విషమే=అకాలమునందు (ఒడుదుడుకుసమయమున), త్వా=నిన్ను, సముపస్థితం=పొందెను ?

శం. అర్జునా! పామరు లవలంబింపఁదగినదియు, నరకము గలిగించునదియు, అపకీర్తినిచ్చునదియు నగు మోహము యుద్ధముచేయక తీరని యీ సంకటకాలమునం దెట్లు కలిగెను?

మధ్వ. కశ్మలమ్=దుఃఖము, మోహమనియు రెండర్థములు.

మధు. కశ్మలము = స్వధర్మనైముఖ్యము.

శ్లో. క్లైబ్యం మాస్మ గమః పార్థ నైత త్త్వ య్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. 3

టీ. హేపార్థ=ఓయికుంతీపుత్త్రుండవైన అర్జునుఁడా! క్లైబ్యం=భయమును, మాస్మగమః=పొందకుము. త్వయి = నీయందు, ఏతత్=ఈమనోవ్యాకులత, నోపపద్యతే = తగినది కాదు. హేపరంతప=ఓయి (శత్రువులఁదపింపఁజేయు) నర్జునుఁడా! క్షుద్రం=తుచ్ఛమైన, హృదయదౌర్బల్యం - హృదయ= మనస్సునందలి, దౌర్బల్యం=అధైర్యమును, త్యక్త్వా=విడిచి, ఉత్తిష్ఠ=యుద్ధమునకు లెమ్ము.

శం. పార్థా! భయపడకుము. నీ కిది యుచితము కా, శత్రువులను దపింపఁజేయువాఁడా! ఈతుచ్ఛమైన యధైర్యమును విడిచి యుద్ధమునకు లెమ్ము. పిఱికితనమును వదలుము.

మధ్వ. క్లైబ్యం=క్లీబత్వమనియు,భయమనియు ప్రత్యేకముగా రెండర్థములు.

అర్జున ఉవాచ.—

శ్లో. కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన.

అర్జునుఁడు చెప్పెను.—

టీ. అరిసూదన = శత్రుసంహారకుఁడవైన, మధుసూదన = కృష్ణస్వామీ! పూజార్హౌ = పూజకుఁదగిన, భీష్మం = భీష్మాచార్యునితోడను, ద్రోణంచ=ద్రోణాచార్యునితోడను సంఖ్యే=యుద్ధమునందు, అహం=నేను, ఇషుభిః = బాణములచేత, కథం=ఎట్లు, ప్రతియోత్స్యామి = ఎదిరించియుద్ధము చేయుదును.

శం. శత్రువులను వధించునట్టి యో కృష్ణా! పూజింపఁ దగినట్టి భీష్మునిమీఁదను, ద్రోణునిమీఁదను నే నెట్లు యుద్ధమునం దెదిరించి బాణములను ప్రయోగింతును?

మధ్వ. 'అరిసూదన' అనఁగా శత్రువులను చక్రముచేత చంపువాఁడా యని యర్థము వ్రాసి, 'ప్రతియోత్స్యామి' అను పదములోని ప్రతి యనుపదమును ప్రత్యేకించి విభజించి 'భీష్మం ప్రతి', 'ద్రోణం ప్రతి' అని యన్వయించి, భీష్మునిం గూర్చి, ద్రోణునింగూర్చి అనఁగా ఎదిరించి యని వ్రాయఁబడి యున్నది.

శ్లో. గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే,
హత్వాఽర్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. 5

టీ. మహానుభావాన్=మహాత్ములైన, గురూన్ = ద్రోణాదిగురువులను, అహత్వా=సంహరించక, ఇహ లోకే=ఈలోకమందు, భైక్ష్యమపి=భిక్షాన్నమైనను, భోక్తుం = భుజించుటకు, శ్రేయః=మేలు; అర్థకామాన్=ద్రవ్యకాములయిన, గురూన్=ద్రోణాదులను, హత్వా తు=సంహరించియో, ఇహైవ=ఈ లోకమునందే, రుధిరప్రదిగ్ధాన్-రుధిర=నెత్తుటిచే, ప్రదిగ్ధాన్ = పూయఁబడిన, భోగాన్=భోగములను, భుంజీయ=(ఎట్లు) అనుభవింతును?

శం. మహానుభావులైన గురువులను వధింపక యీలోకమునందు బిచ్చమెత్తి జీవించుటయే మేలు కదా? అర్థకా

ము లైనగురువులను వధించినయెడ నీ లోకమునందే నేను వారినెత్తుటిచే తడిసిన భోగములనేగదా యనుభవింపవలెను. (ఇఁక పరలోకమునందుఁ జెప్పనేల) ?

మధు, మధ్వ. 'హిమహానుభావాన్' అనుదాని నేక పదముగా భావించి, హిమ=చలువను, హా=పోగొట్టెడి (అగ్ని యొక్కయో లేక సూర్యునియొక్కయో), అనుభవాన్ = ప్రభావముగల యని వ్రాసి,-ఉత్తరార్ధమునందు, అర్థకామాన్ భోగాన్ = అర్థకామస్వరూపములగు భోగములను అని యర్థము వ్యక్తపఱచియున్నారు.

శ్లో. న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః,
యా నేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. 6

టీ. కించ=ఇంతియకాదు, వయం=మనము, జయేమ యద్వా=దుర్యోధనాదుల జయింపఁగలమో లేమో, ధార్తరాష్ట్రాః=దుర్యోధనాదులు (ధృతరాష్ట్రసంబంధులగు భీష్మద్రోణాదులగు కౌరవులని మధుసూదనటీక.), నః=మనలను, జయేయుర్యది=జయింతురో ఏమో, ఏతయోః=ఈరెంటిలోపల, నః=మనకు, కతరత్=ఎద్ది, గరీయః=గురుతరమైనది, ఏతత్= ఈ జయాపజయరూపకార్యమును, న విద్మః = ఎఱుఁగము. యాన్=ఏధార్తరాష్ట్రాదులను, హత్వా=సంహరించి, న జిజీవిషామః=జీవించ నిచ్ఛింపమో, తే=వారలు, ప్రముఖే=ఎదుట, అవస్థితాః=ఉన్నారు.

శం. ఇదిగాక మనమే వారిని జయింపవలెనో లేక వారే మనలను జయింపవలెనో ఈరెంటిలో మనకు నేది గొప్పదో నాకుఁ దెలియుటలేదు. ఏలయనఁగా ఎవరిని వధించినయెడ మనము వెనుక బ్రతుకఁగోరమో అట్టి ప్రియబంధువులైన దుర్యోధనాదులు మనయెదుట నిలిచి యున్నారు.

మధు. యుద్ధము చేసి ధార్తరాష్ట్రులను జయించుట, లేక యుద్ధమును మాని భిక్షాచరణముచేయుట, వీనిరెంటిలో నేది శ్రేష్ఠమో తెలియఁజాలకయున్నాను.

మధ్వ. యుద్ధము చేయుట, లేక మానుట వీనిరెంటిలో నేది శ్రేష్ఠమో తెలియఁ జాలకయున్నాను.

శ్లో. కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. 7

టీ. కార్పణ్యదోషోపహతస్వభావః - కార్పణ్య=కృపణత్వమనెడి, దోష = పాపముచేత, ఉపహత = చెడఁగొట్టఁబడిన, స్వభావః=శౌర్యలక్షణముగలిగిన, (అహం = నేను), ధర్మసమ్మూఢచేతాస్సన్ - ధర్మ=న్యాయమునందు, సమ్మూఢ=జ్ఞానములేనట్టి, చేతాస్సన్ = మనస్సు గలిగినవాఁడ నగుచు, త్వాం=నిన్ను, పృచ్ఛామి=అడుగుచున్నాను. మే = నాకు, యత్=ఏది, నిశ్చితం=నిశ్చయముగా, శ్రేయః=మేలు, స్యాత్=అగునో, తత్=దానిని, బ్రూహి=చెప్పుము. తే = నీకు,

అహం=నేను, శిష్యః=శిష్యుఁడను. త్వాం=నిన్ను, ప్రపన్నం=శరణుఁబొందిన, మాం=నన్ను, శాధి=శిక్షింపుము.

శం. ఈ కార్పణ్యదోషముచేత నా శౌర్యస్వభావము మాఱినది. ధర్మమేదో నా మనస్సునకుఁ దెలియకున్నది. కావున నిన్నడుగుచున్నాను. ఏది మేలో దానిని నాకు నిశ్చయించి చెప్పుము. నేను నీశిష్యుఁడను; నిన్ను శరణుబొందితిని; నన్ను శిక్షింపుము.

మధు. కార్పణ్యము నీ క్రిందివిధముగా వివరించినారు. స్వల్పమైనను ధనక్షయము నెవ్వఁడు సహింపఁడో వాఁడు కృపణుఁడు. అట్టివాఁడు ఆత్మజ్ఞానము లేనివాఁ డనఁబడును. కృపణత్వమువలననే 'వీరే నావారు, వీరు చచ్చినచో నాబ్రదు కేల?' అని కలిగెడుమమకారమే దోషము. ఆదోషముచేత నాశౌర్యస్వభావము మాఱినది. (శేషము శంకరతాత్పర్యమున చూచుకొనునది. మార్పు లేదు.)

రామా. కార్పణ్య మనగా స్వజనమును చంపెద నను మనోదీనత్వము. అందుచేతను గులక్షయమువలనఁ గలిగెడి దోషముచేతను నాశౌర్యస్వభావము మాఱినది. శేషము శంకరతాత్పర్యమే. స్వభావమనఁగా ధైర్యము మొదలయినదని యర్థము.

మధ్వ. రామానుజటీకతో నేకీభవించి, స్వభావశబ్దమునకు పౌరుష మని యొక అర్థము వ్రాసియున్నారు.

శ్లో. నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్య చ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్,

అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. 8

టీ. యత్=ఏకార్యము, ఇంద్రియాణాం=ఇంద్రియములకు, ఉచ్ఛోషణం=అత్యంతసంతాపకరమయిన, మమ=నాయొక్క, శోకం=దుఃఖమును, అపనుద్యాత్=పోఁగొట్టునో, తత్=ఆకార్యమును, అహం=నేను, భూమౌ=భూమియందు, అసపత్నం=నిష్కంటకమైన, ఋద్ధం=సమృద్ధమైన, రాజ్యం=రాజ్యమును, సురాణాం=దేవతలయొక్క, ఆధిపత్యం=ఇంద్రత్వమును, అవాప్యాపి=పొందియును, నప్రపశ్యామి హి=కాననుగదా!

శం. ఈ భూమియందు నిష్కంటకమై సర్వసంపదలతోఁ గూడిన రాజ్యమును బొందినను లేక దేవేంద్రత్వమును బొందినను నా యింద్రియముల నన్నిటిని నశింపఁజేయుచున్న భీష్మాదులనుఁ జేతులారఁ జంపితిమిగదా యను ఈ నాదుఃఖము నేది పోఁగొట్టునో అది సిద్ధించు నని నాకు తోఁచ లేదు.

సఞ్జయ ఉవాచ :—

శ్లో. ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః,
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీంబభూవ హ. 9

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. పరంతపః=శత్రుసంహారకుఁడైన, గుడాకేశః=అర్జునుఁడు, హృషీకేశం=శ్రీకృష్ణస్వామినిగూర్చి, ఏవం=పూర్వోక్తప్రకారముగా, ఉక్త్వా=పలికి (మఱల), గోవిందంప్రతి=శ్రీకృష్ణస్వామినిగూర్చి, న యోత్స్యే=యుద్ధముచేయను. ఇతి=ఇట్లని, ఉక్త్వా=పలికి, తూష్ణీం బభూవ=ఊరకుండెను. హ=ఆశ్చర్యము.

శం. ఇట్లు శత్రువులఁ దపింపఁజేయునట్టి యర్జునుఁడు కృష్ణుని తోఁ జెప్పి యుద్ధము చేయనని యూరకుండెను.

శ్లో. త మువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత,
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదం వచః. 10

టీ. హేభారత=ఓధృతరాష్ట్రుఁడా! ఉభయోః=రెండైన, సేనయోః=సేనలయొక్క, మధ్యే=మధ్యమందు, విషీదన్తం=దుఃఖించుచున్న, తం=అర్జునునిఁగూర్చి, హృషీకేశః=శ్రీకృష్ణస్వామి, ప్రహసన్నివ=హాస్యముచేయువానివలె, ఇదం=ఈ చెప్పఁబోయెడి, వచః=వాక్యమును, ఉవాచ=పలికెను.

శం. అంత శ్రీకృష్ణుఁడు అట్లు రెండుసేనలనడుమ దుఃఖించుచున్న అర్జునుని జూచి కొంచెము నవ్వుచు ఈవాక్యము పలికెను.

మధ్వ. జ్ఞానవంతుఁడైన నీకిట్టి దుర్బుద్ధి ఎట్లు కలిగె నని పరిహాసముచేయుచు అర్జునునిజూచి ఈవాక్యమును పలికెను.

శ్రీభగవా నువాచ :—

శ్లో. అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. 11

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. త్వం=నీవు, అశోచ్యాన్=దుఃఖింపఁదగని భీష్మాదులఁ గూర్చి, అన్వశోచః=దుఃఖించితివి, ప్రజ్ఞావాదాంశ్చ=పండితవచనములను, భాషసే=పలుకుచున్నావు. పణ్డితాః=ఆత్మానాత్మ వివేకజ్ఞులు, గతాసూన్=చచ్చినవారలనుగూర్చియు, అగ

తాసూన్ = బ్రతికినవారలను గూర్చియు, నానుశోచంతి=దుః ఖింపరు.

శం. నీ వెవరినిగుఱించి దుఃఖింపరాదో అట్టి భీష్మాదుల నుగుఱించి దుఃఖించుచున్నావు. ఇదిగాక పండితులు చెప్పు మాటలను జెప్పుచున్నావు. ఇది పరస్పరము విరుద్ధముగా నున్నది. ఏలయనఁగా పండితులు ప్రాణములతో నున్నవారిని గూర్చి దుఃఖింపరు సరియే కదా, ప్రాణములు పోయినవారిని గూర్చికూడ దుఃఖింపరు. ప్రాణులసంసారదుఃఖమునకు శోక మోహంబులు బీజములు. అర్జునునకుఁగలిగినశోకమోహంబులు రాజ్యకాంక్ష, అందుకై పూజ్యులగు భీష్మాదులను వధించవల యుననుట. వారిని వధించిన యెడల శోకప్రాప్తి. వీరు నావారు, నేను వీరివాఁడ నను భ్రాంతివలన అర్జునునకు కలిగిన స్నేహమునకు భంగము వచ్చినది. ఈశోకమోహములచేత వివేకజ్ఞానశూన్యుఁ డై యర్జునుఁడు స్వయముగాఁ బ్రవర్తించిన యుద్ధమునకుఁ విముఖుఁ డయ్యెను. క్షత్రియునకు తగని భైక్షము నవలంబింప నియ్యకొనెను. ఇట్లే ప్రాణులందఱును శోకమోహయుతులై స్వధర్మములను త్యజించి నిషిద్ధముల సేవింతురు. ఒకవేళ స్వధ ర్మము నాచరించిరేని, అవి ఫలోద్దేశపూర్వకమై యహంకార సమన్వితమై యుండును. అందువలన పుణ్యాపాపములు స్పర్ధఁ బొంది జననమరణాదులను బొందుచు సుఖదుఃఖప్రాప్తిస్వరూ పంబగు సంసారము ఎడతెగకుండును. కాఁబట్టి సంసారబీజము లగు శోకమోహములు సర్వకర్మసన్యాస (అన్నికర్మములను విడుచుట) పూర్వకంబుగా నాత్మజ్ఞానమునసే కాని, మఱియొం డుదానివలన నివర్తింపవనియును, సర్వలోకానుగ్రహముకొఱకు

అర్జును నిమిత్తముగాఁ జేసి భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తి పైనఁ జెప్పఁబోవు అధ్యాత్మవిషయము నుపదేశించెను.

రామా. ప్రసక్తిలేనిచోట బంధువులందు స్నేహమును, గురువులయందు కరుణయును వీనిచేత వ్యాకులుఁడై క్షత్రియులకు ధర్మమైనయుద్ధమును అధర్మముగాఁ దలంచుచు, ధర్మమేదో దానిని తెలియఁగోరి తన్నుశరణుజెందిన యర్జునునకు ఆత్మతత్త్వజ్ఞానంబును, ఫలోద్దేశము లేని యుద్ధకర్మ క్షత్రియుఁడగు అర్జునునకు ఆత్మప్రాప్తికి సాధనమనెడి జ్ఞానంబును కలుగక వానియజ్ఞానము శమింపదని తలంచి భగవంతుఁ డగు కృష్ణమూర్తి అధ్యాత్మశాస్త్రారంభము చేయుచున్నాఁడు.

మధ్వ. ధర్మంబును, జ్ఞానంబును లోకంబున నశించెను. కరుణామయులగు బ్రహ్మరుద్రాదులు దాని నెఱింగి లోకమున జ్ఞానమును వెల్లడిచేయుటకై భగవంతుని ప్రార్థించిరి. వారిప్రార్థన నంగీకరించి భగవంతుఁడు వ్యాసుఁడై యవతరించెను. స్త్రీశూద్రాదులు వేదార్థజ్ఞానము లేక సంసారక్లేశముఁ జెందుచుండిరి. వారికిఁగూడ ధర్మజ్ఞానద్వారంబున మోక్షము కలుగవలయునని వ్యాసుఁడు మహాభారతమును రచియించెను. వాసుదేవార్జునసంవాదరూపమై భారతమనెడి కల్పవృక్షమునకు మకరందమువంటిదైన గీతను సర్వభారతార్థసంగ్రహముగా రచియించెను. ఉభయసేనమధ్యను బాంధవాదిమోహమనెడి వలలోఁ జిక్కుకొని విషాదమును బొందుచున్న యర్జునునకు ఈ యధ్యాత్మవిద్యను భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.

అవ. ఆత్మస్వభావమును జెప్పుచున్నాఁడు.—

శ్లో. నత్వే వాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః,
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మితఃపరమ్. 12

టీ. అహం=నేను, జాతు=ఒకప్పుడును, నాసమితి తు నైవ=లేకపోయినవాఁడను గాను, త్వం(చ) = నీవును, (నాసీరితి) న=లేకపోయినవాఁడవుకావు. ఇమే జనాధిపాః=ఈరాజులును, (నాసన్నితి)న=లేకపోయినవారుకారు. వయంసర్వే=మనమందఱమును, ఇతః=ఈదేహనాశముకంటె, పరం=పిమ్మట, న భవిష్యామ ఇతి న=ఉండకపోవువారము కాము. (ఈదేహము నశించినను ఆత్మస్వరూపముచేత నిత్యులమై యుందుమని భావము).

శం. ఏల యనఁగా—నేనుఇదివఱ కెప్పుడును లేనివాఁడను కాను. నీవును నిదివఱకెప్పుడును లేనివాఁడవు కావు. ఈరాజులును నిదివఱ కెప్పుడును లేనివారలు కారు. అట్లు మనమందఱము నిఁకమీఁదను గూడ లేకపోవువారము కాము. నేను, నీవు, ఈరాజులు అందఱును శాశ్వతముగా నుండువారమే కావున చావే లేనివారిని గూర్చి దుఃఖించుట యనుచితము. సర్వేశ్వరుఁడ నగు నేనెట్లు నిత్యుఁడనో అట్లు జీవులును నిత్యులే. ఆత్మయొక్కటియే యైనను శరీరభేదములచేత బహుత్వము.

శ్లో. దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి. 13

టీ. దేహినః=ఆత్మకు, అస్మిన్ దేహే=ఈస్థూలదేహమునందు, కౌమారం = చిఱుతతనమును, యౌవనం = పడుచుదన

మును, జరా = ముసలితనమును, యథా = ఏప్రకారమో, దేహాంతరప్రాప్తిః = మఱియొక దేహమును పొందుటయు, తథా=ఆప్రకారమే, (దేహమున కవస్థాభేదములును నాశము లును గలుగునుగాని ఆత్మకుఁగలుగవు.) ధీరః=ప్రాజ్ఞుఁడు,తత్ర= ఆ దేహనాశోత్పత్తి విషయమై, న ముహ్యతి=మోహమునొం దఁడు.

శం. జీవునకు ఈ దేహమునందు బాల్యమును, యౌవన మును, ముసలితనమును ఎట్లో మఱియొక దేహమును బొం దుటయు నట్లే. కాఁబట్టి యావిషయమునందు పండితుఁడు మో హమునొందఁడు.

రామా. ఒక్క యవస్థపోయి మఱియొక యవస్థ కలుగు నప్పుడు ఆత్మ స్థిరుఁడను జ్ఞానముండుటచేత ఆత్మ నశించెనని శోకమును ఎట్లు చెందుట లేదో, అట్లే ఒకదేహమునుండి మఱి యొక దేహమును జెందునప్పుడును ఆత్మ స్థిరుఁడనుజ్ఞానము కల వాఁడు దుఃఖింపఁడు.

మధ్వ. ఈ శ్లోకము దేహమున జీవుఁడున్నాఁడను నంశము సాధించుచున్నది. ఈ జన్మంబున బాల్యాదిశరీరం బులు వేఱువేఱైనను, "ఏ నేను కుమారశరీరంబు కలవాఁడ నైతినో, ఆ నేను యౌవనశరీరంబు కలవాఁడ నగుచున్నాను" అను అనుభవమువలన జీవుఁడొక్కఁడెట్లు సిద్ధుఁడయ్యెనో, శరీ రాంతరమును బొందునప్పుడును ఇట్లె చచ్చినశరీరమునకు బా ల్యాద్యవస్థానుభవము లేదుగదా. ఇంతియకాక యపౌరుషేయం బగుటచేత ప్రమాణతమంబైన వేదంబు నిందు ప్రమాణంబు.

కావున కుయుక్తులచేత ధీరుఁడగువాఁడు మోహముం జెందఁడు. జీవనాశమునకుఁగాని శరీరనాశమునకుఁగాని శోకముఁ జెందవలసినది. 12 వ శ్లోకతాత్పర్యముచొప్పున జీవులు నిత్యులగుటవలన జీవనాశమగునని శోకించ నక్కఱలేదు. ఇఁక శరీరనాశమునకును దుఃఖించనక్కఱలేదు. బాల్యాదిశరీరములు పోయియౌవనాదిశరీరములు వచ్చినప్పుడెట్లు శోకములేదో అట్లే యీశరీరముపోయి మఱియొకశరీరమువచ్చునప్పుడును శోకముకూడదనుట.

శ్లో. మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినో నిత్యా స్తాం స్తితిక్షస్వ భారత. 14

టీ. హేకౌంతేయ=ఓయి అర్జునుఁడా! మాత్రాస్పర్శాస్తు-మాత్రా=పంచతన్మాత్రలవలనఁ బుట్టిన శ్రోత్రాదీంద్రియముల యొక్క, స్పర్శాస్తు=శబ్దాదివిషయసంయోగము లన్ననో, శీతోష్ణసుఖదుఃఖదాః = శీతోష్ణములు మొదలైన సుఖదుఃఖములు గలుగఁ జేయునట్టి, ఆగమాపాయినః=సంయోగవియోగములు గలిగినవియు, అనిత్యాః=అస్థిరములైనవియుఁ గావున, హేభారత=ఓయి అర్జునుఁడా! తాన్=ఆశీతోష్ణాదులను, తితిక్షస్వ=ఓర్చుకొనుము. (సుఖము గలిగినప్పుడు సంతోషమును, దుఃఖము గలిగినప్పుడు విషాదమును బొందకుమని భావము.)

శం. అర్జునా! శ్రోత్రాదీంద్రియములతో సంబంధముగల శబ్దాదివిషయములు శీతోష్ణములు మొదలగుసుఖదుఃఖములను దెచ్చునవిగా నున్నవి. అవి రాకపోకలుగలవిగావున అనిత్యములు. నీవు వానిని సహింపుము. తన్మాత్ర లనఁగా భూత.

ములయొక్క సూక్ష్మావస్థలు. శీతము కాలభేదముచేత సుఖదుఃఖముల రెంటిని కలిగించును. వేఁడియునట్లే. మాత్ర లనగా నింద్రియములు; వానికి విషయములతోడి సంబంధములుగాని, వానివిషయములుగాని మాత్రాస్పర్శము లనఁబడును.

రామా. శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములును, వానికి ఆశ్రయములైన పంచభూతములును తన్మాత్రలచేఁ గలిగినవిగాన మాత్ర లనఁబడును. వానికి శ్రోత్రాదీంద్రియములతోడి సంబంధములు మాత్రాస్పర్శములు.

మధ్వ. మాత్రలనగా విషయములు; వానితోడి సంబంధములు మాత్రాస్పర్శములు.

అన. ఇట్లు సహించుకొనుటకుఁ గారణము చెప్పుచున్నాఁడు.—

శ్లో. యం హి న వ్యథయం త్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 15

టీ. హేపురుషర్షభ=ఓయి అర్జునుఁడా! ఏతే=ఈ మాత్రాస్పర్శములు, సమదుఃఖసుఖం-సమ = సమానములయిన, దుఃఖసుఖం=దుఃఖసుఖములుగలిగిన, ధీరం=వివేకియైన, యం పురుషం=ఏపురుషుని, నవ్యథయంతి=బాధింపవో, సః హి=ఆ పురుషుఁడుగదా! అమృతత్వాయ = మోక్షముకొఱకు, కల్పతే=సమర్థుఁ డగుచున్నాఁడు.

శం. ఓ పురుషశ్రేష్ఠుఁడా! సుఖదుఃఖములను సమానముగా నెంచుచు వివేకియై యెవఁడు వీనిచే బాధింపఁబడఁడో, అతఁడు గదా మోక్షము నొందును.

మధ్వ. పురుషశబ్దమునకు శరీరమునఁ బరుండువాఁడని విగ్రహార్థముచేసి శరీరముతో నుండఁగానే యెవ్వని మాత్రాస్పర్శలు బాధింపవో వాఁడే మోక్షార్హుఁడు. అట్లు బాధింపఁబడకుండుటకు సమసుఖదుఃఖత్వము హేతువు. దానికి స్థైర్యము హేతువు.

శ్లో. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః. 16

టీ. అసతః=నశించెడి దేహమునకు, భావః=ఉండుట, న విద్యతే=లేదు. సతః=నిత్యుఁడైనయాత్మకు, అభావః=లేకపోవుట, న విద్యతే=లేదు. తత్త్వదర్శిభిః=పరబ్రహ్మమనెడి వస్తువును దెలిసినవారలచేత, ఉభయోః=రెండైన, అనయోః=ఈసదసత్తులయిన యాత్మదేహములయొక్క, అన్తః=నిర్ణయము, దృష్టః=చూడఁబడెను.

శం. అసత్తైన (లేని) యీదేహమునకు సత్త (ఉండుట) లేదు. సత్తైన (ఉన్న) యాత్మకు అభావము (లేకపోవుట) లేదు. తత్త్వము తెలిసిన పండితులు ఈ రెంటియొక్క నిశ్చయమును దెలిసియుందురు.

మధు. దేహ మసత్తనఁబడును. ఆత్మ సత్తనఁబడును. ఈసదసత్తులగు ఆత్మదేహముల యాథార్థ్యము అనగా భావాభావములు తత్త్వదర్శకులకే అనగా పరబ్రహ్మమును తెలిసిన వారలకే తెలియును.

రామా. నశించెడిస్వభావము కలది శరీరము. జీవుఁడట్టి వాఁడుకాఁడు. అసత్తగు దేహము సత్తు కానేరదు. నశింపని

జీవునకు అసత్త అనగా అభావము లేదు. ఇట్లు శరీరాత్మ వివేకము తత్త్వజ్ఞులకే తెలియును.

మధ్వ. 'విద్యతేభావః' అను పదమును 'విద్యతే+అభావః' అని పదవిభాగ మొసర్చి, అసతః, అభావః, న విద్యతే= కారణంబునకును లేమి లేదు. సత్తునకు అనగా బ్రహ్మమునకును లేమి లేదు. ప్రకృతియును ఆత్మవలెనే నశింపనిది యని భావపడియున్నారు.

శ్లో. అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతం,
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. 17

టీ. యేన=ఏవిష్ణ్వాఖ్యబ్రహ్మముచేత, సర్వం=సమస్తమైన, ఇదం=ఈజగత్తు, తతం=వ్యాప్తమయ్యెనో, తత్తు=ఆవిష్ణ్వాఖ్యబ్రహ్మమునుమాత్రము, అవినాశి=నాశములేనిదానిగా, విద్ధి= తెలియుము. కశ్చిత్=ఒకానొకఁడు, అవ్యయస్య=శాశ్వతమైన, అస్య=ఈయాత్మకు, వినాశం=నాశమును, కర్తుం=చేయుటకొఱకు, నార్హతి=తగఁడు.

శం. దేనిచేత ఈసమస్తప్రపంచమును వ్యాపింపఁబడినదో అట్టి ఆత్మ నాశములేనిదని తెలియుము. నాశములేని ఈయాత్మకు నాశము గలిగించుట ఎవనికిని శక్యము గాదు. (ఈశ్లోకము బ్రహ్మతత్త్వమును గూర్చినదని శంకరభాష్యము.)

రామా. ఈశ్లోకము ఆత్మతత్త్వమును గూర్చినదనియును, అచేతనములయందంతటను చేతనులు వ్యాపించియుండుటచేత వీనికి నాశము కలిగించుట ఎవనికిని శక్యము కాదనియు.

మధ్వ. ఈశ్లోకము వేదాదినిత్యత్వమును తెలుపుచున్నది. ఉత్తరార్థముచే శాపాదులచేఁ గూడ నాత్మకు నాశరాహిత్యమేర్పడుచున్నదని భావము.

శ్లో. అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. 18

టీ. నిత్యస్య = ఎల్లప్పుడు నేకరూపమైనదియు, అనాశినః = నాశములేనిదియును, అప్రమేయస్య = ప్రత్యక్షాదిప్రమాణములకగోచరమునైన, శరీరిణః = ఆత్మయొక్క, ఇమే దేహాః = ఈ శరీరములు, అంతవంతః = నాశముకలిగినవని, ఉక్తాః = తత్త్వజ్ఞులచేతఁ జెప్పఁబడినవి. తస్మాత్ = ఆ కారణమువలన, హే భారత = ఓయర్జునుఁడా! యుధ్యస్వ = యుద్ధముచేయుము.

శం. ఆత్మ నాశములేనివాఁ డనియుఁ, బ్రత్యక్షాదిప్రమాణములచేఁ దెలియఁదగనివాఁ డనియు, నిత్యుఁడనియు, సతఁడు ధరించిన యీ దేహములు మాత్రము నాశము గలవనియు చెప్పఁబడినది. కాఁబట్టి ఓ యర్జునుఁడా! నీవు యుద్ధముచేయుము.

మధు. ఈశ్వరునిప్రతిబింబము జీవుఁడగుటకు అద్దము వంటి ఉపాధిజీవస్వరూపమే. లోకములో బింబము దగ్గరలేకపోవుటవల్ల అద్దములోని ప్రతిబింబము నశించుచున్నది. అద్దములో బింబము లేనందుచేత అసలు బింబము నశించిన దనుటకు వీలులేదుగదా. అట్టి నాశరహితమును నీవెట్లు నశింపఁజేయఁగలవు. కాఁబట్టి ఓ అర్జునా! యుద్ధమునకు వగవకలెమ్ము.

రామా. మనకు గోచరించు ఘటపటాదులవలె జీవుఁడు ఎప్పుడును మనకు గోచరింపఁడు. తెలిసికొనువాఁడుగా మాత్రము తెలియఁబడుచున్నాఁడు. అట్టి నాశరహితుని ఓ, అర్జునా! నీ వెట్లు నశింపఁజేయఁగలవు.

మధ్వ. ఎండమావులను చూచినపుడుండు జలభ్రాంతి తగిన ప్రమాణములవలన నివర్తించునట్లును, స్వప్నమందు గోచరించు మాయాశరీరములు జాగ్రదవస్థయందు లేనియట్లును యీ దేహములు నశించునవి.

శ్లో. య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. 19

టీ. యః=ఏపురుషుఁడు, ఏనం=ఈయాత్మను, హంతారం=చంపెడివానిఁగా, వేత్తి=ఎఱుఁగుచున్నాఁడో, యశ్చ=ఎవ్వఁడు, ఏనం=ఈ యాత్మను, హతం=చచ్చినదానిఁగా, మన్యతే=తెలియుచున్నాఁడో, ఉభౌ=ఇద్దఱైన, తౌ=ఆపురుషులు, న విజానీతః=తెలిసినవారలు కారు. అయం=ఈయాత్మ, న హంతి=చంపదు, న హన్యతే=చంపఁబడదు.

శం. ఎవఁ డీయాత్మను వధించువానిఁగాఁ దలఁచుచున్నాఁడో, ఎవఁడు ఈ ఆత్మను వధింపఁబడుదానిఁగాఁ దెలియుచున్నాఁడో, వారిద్దఱును దెలియనివారలు. ఎందువల్లననఁగా నీయాత్మ వధించునదియును గాదు వధింపఁబడునదియుఁ గాదు. కర్తృత్వ, కర్మత్వములు రెండును ఆత్మకు లేవు. అవి వికారములుగాన బ్రహ్మకవి లేవు.

రామా. ఈ జీవునింగూర్చి చెడగొట్టెడిదానిఁగా నెవ్వఁడు తలఁచునో, జీవుఁడు చెడగొట్టఁబడినవాఁడని యెవ్వఁడు తలఁచునో వారిద్దఱును తెలియనివారు. అగ్ని మొదలగు రూపభేదములను కలిగించు వస్తువులు చెడఁగొట్టుచున్నవి కావు. వీఁడు చెడఁగొట్టఁబడువాఁడు కాఁడు.

మధ్వ. ఈజీవుని స్వతంత్రముగాఁ గొట్టువానినిగాను, కొట్టఁబడెడువానినిగాను, తలంచువాఁ డెఱుంగనివాఁడు, ప్రతిబింబమునకు బింబమునుబట్టియేకదా వ్యాపారము. జీవుఁడు ఈశ్వరప్రతిబింబముకదా !

అవ. ఆత్మ నిత్యమగుటచే జననమరణాదులు దానికి లేవని చెప్పుచున్నాఁడు.—

శ్లో. న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః,
అజో నిత్య శ్శాశ్వతో ఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 20

టీ. అయం=ఈయాత్మ,అజః=పుట్టుకలేనిది, నిత్యః=ఎప్పుడు నుండెడిది, శాశ్వతః=స్థిరరూపము, పురాణః=అనాదియైనది. అయం=ఈయాత్మ, కదాచిదపి=ఒకప్పుడును, నజాయతే=పుట్టనిది. నమ్రియతేవా=మృతియుఁబొందదు. అయం=ఈయాత్మ, భూత్వా=పుట్టి, భూయః=మరల, నభవితా=కాఁగలదియును గాదు. అతః=ఈకారణమువలన, శరీరే=దేహము, హన్యమానే సతి=సంహరింపఁబడుచుండఁగా, న హన్యతే=చంపఁబడదు. (కావున, 'జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అప

క్షీయతే, నశ్యతి' అనెడి షడ్వికారములు పరమాత్మకు లేవని సిద్ధము.)

శం. ఈయాత్మ ఒకప్పుడును పుట్టదు. ఒకప్పుడును చావదు. ఒకప్పుడుండి మరల మఱియొకప్పుడు ఉండనిదియును గాదు. మునుపు లేక వెనుకవచ్చినదియును గాదు. ఎందువల్ల ననఁగా నిది పుట్టుకలేనిది, మరణము లేనిది, ఎల్లప్పుడును ఉండునది, అనాదియైనది. శరీరము హతమైనను ఈ ఆత్మ హతముకాదు.

రా. ఈయాత్మకు మన దేహములకువలె పుట్టుచుండుటయు, నశించుచుండుటయు లేదు. కల్పాదియందు పుట్టి కల్పాంతము నందు నశించునట్టి ప్రజాపత్యాదిశరీరములవలె ఒకప్పుడు పుట్టి బహుకాలముండి నశించువాఁడును కాఁడు. ఎల్లప్పుడును అపూర్వముగానే అనుభవింపఁదగినవాఁడనుట.

మధ్వ. జీవుఁ డీశ్వరజ్ఞానమువలె, కలిగియుండియె మరల కలుగుచుండువాఁడు కాఁడు. పుట్టుకలేనివాఁడు. ఈశ్వరునిం బోలినవాఁడు. ఎల్లప్పు డొక్కవిధముగా నుండువాఁడు. శరీరమును పొందియున్నవాఁడైనను శరీరము నశించిన దగుచుండఁగా జీవుఁడు నశించఁడు. ఇ ట్లెఱింగినవాఁ డెట్లు కొట్టించును? ఎట్లు కొట్టును?

శ్లో. వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్. 21

టీ. హే పార్థ=ఓయి అర్జునుఁడా! యః=ఏపురుషుఁడు, ఏనం=ఈఆత్మను, నిత్యం=ఏకరూపిగాను, అవినాశినం=నాశములేనిదానిఁగాను, అజం=పుట్టుకలేనిదానిఁగాను, అవ్యయం=క్షయ

రహితముగాను, వేద=ఎఱుఁగుచున్నాఁడో, సః పురుషః=ఆపురుషుఁడు, కం=ఎవ్వని, కథం=ఎట్లు, ఘాతయతి=చంపించుచున్నాఁడు. కం=ఎవనిని, హన్తి=చంపుచున్నాఁడు.

శం. ఓ అర్జునా! ఎవఁ డీయాత్మ నాశములేదనియు,నిత్యమనియు, పుట్టుక లేనిదనియు, క్షయములేనిదనియుఁ దెలిసికొనుచున్నాఁడో, అట్టి పురుషుఁడు ఎట్లు ఎవనిచేత వధింపఁబడును? ఎట్లు ఎవని వధించును? అట్టివాఁడు తాను వధింపఁబడుటయుఁ, దా నితరుల వధించుటయు నసంభవము.

రా. నిత్యమైన యాత్మస్వరూపము నెఱింగినవాఁడు, శరీరమును చెడఁగొట్టుచు, ఆత్మను చెడఁగొట్టుచున్నానని యెట్లు తలఁచును ? ఇది యసంభవము.

మధ్వ. అవినాశి యనగా నైమిత్తిక (కారణాంతరము వలన గలిగిన) వినాశము లేనివాఁడు, లేక దోషములతోఁ గూడనివాఁడు. నిత్యుఁ డనఁగా స్వాభావిక(స్వతస్సిద్ధమైన) నాశము లేనివాఁడు. ఎల్లప్పుడు నుండువాఁడనియుం జెప్పవచ్చును. అట్టి పురుషుఁ డెట్లు ఎవనిచే వధింపఁబడును ? ఎట్లు ఎవని వధించును? అట్టివాఁడు తాను వధింపఁబడుటయుఁ, దా నితరులను వధించుటయు నసంభవము.

శ్లో. వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. 22

టీ. నరః=మనుష్యుఁడు, యథా=ఏప్రకారముగా, జీర్ణాని=శిథిలములైన, వాసాంసి=వస్త్రములను, విహాయ=విడిచి, నవాని=క్రొత్తలయిన, అపరాణి=ఇతరములయిన, వస్త్రాణి=వస్త్రములను, గృహ్ణాతి=ధరించుచున్నాఁడో, తథా=ఆప్రకారముగా, దేహీ=ఆత్మ, జీర్ణాని=శిథిలములైన, శరీరాణి=దేహములను, విహాయ=విడిచి, నవాని=క్రొత్తలైన, అన్యాని=ఇతరములైన, శరీరాణి=దేహములను, సంయాతి=పొందుచున్నాఁడు.

శం. మనుష్యుఁడు ఎట్లు చినిఁగినవస్త్రములను వదలి క్రొత్త వస్త్రములను గ్రహించునో, అట్లే యాత్మ జీర్ణములయిన దేహములను వదలి క్రొత్త దేహములను గ్రహించుచున్నది. దేహముతో నున్నను ఆత్మకు వికారములు లేవు.

రా. ధర్మయుద్ధమున శరీరములను విడిచినవారికి విడువఁబడినవానికంటె మేలగుస్వర్గశరీరములు కలుగును. వీరిని యుద్ధములో చంపుటకు సంతోషించవలయునుగాని దుఃఖింపనక్కఱలేదు.

మధ్వ. ఈశ్లోకము దేహాత్మవివేకానుభవదృష్టాంతమును తెలుపునది.(యుద్ధమున మరణమొందువారికి శ్రేష్ఠమైన దేహములు లభించును కావున దుఃఖమునకుఁ గారణము లేదు).

శ్లో. నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః. 23

టీ. ఏనం=ఈ యాత్మను, శస్త్రాణి=ఆయుధములు, న ఛిన్దన్తి=ఛేదింపవు. పావకః=అగ్ని, ఏనం=ఈయాత్మను, న దహతి=

దహింపఁడు. ఆపః=ఉదకములు, ఏనం=ఈయాత్మను, న క్లేదయంతి=తడపవు. మారుతః=వాయువు, ఏనం=ఈ యాత్మను, న శోషయతి=శోషింపఁజేయదు.

శం. ఈ యాత్మను ఆయుధములు నఱుకఁజాలవు. అగ్ని దహింపఁజాలదు. నీళ్లు తడుపఁజాలవు. వాయువు ఎండింపఁజాలదు.

మధ్వ. తఱుచుగా నన్నిటిచేత నశింపనిదానికింగూడ కారణవిశేషమున నాశము కలుగుట గలదు. ఈయాత్మ కట్టి కారణవిశేషంబును లేదు గనుక ఎట్టివిధమైన నాశకరపదార్థము ఆత్మను నశింపఁజేయలేదనుట.

శ్లో. అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ,
నిత్య స్సర్వగత స్స్థాణు రచలోఽయం సనాతనః. 24

టీ. అయం=ఈయాత్మ, అచ్ఛేద్యః=ఛేదింపఁదగినదికాదు. అయం=ఈ యాత్మ, అదాహ్యః = దహింపఁదగినదికాదు. అయం=ఈయాత్మ, అక్లేద్యః=తడుపఁదగనిది. అశోష్యః=ఎండింపఁదగనిది (కావున), అయం=ఈయాత్మ, నిత్యః=నాశరహితమును, సర్వగతః=సర్వవ్యాపకమును, స్థాణుః=స్థిరస్వభావమును, అచలః=చలించనిదియును, సనాతనః=అనాదియైనదియును.

శం. ఈయాత్మ ఛేదింప నలవిగానిది, దహింప నలవిగానిది, తడుప నలవిగానిది, ఎండింపను నలవిగానిది, నాశములేనిది, అంతటను వ్యాపించియుండునది, స్థిరరూపముగునది, చలింపనిది, అనాదియైనది. నీవు దీనింగూర్చి దుఃఖింపఁ బనిలేదు.

మధ్వ. వర్తమానమున నాశములేని చెట్లయ్యెనో అట్లే ముందును నాశములేదు. ఈటీకయందు "నిత్యసర్వగత స్థాణుః" అని పాఠాన్తర మొకటి చెప్పియున్నది. జీవుఁ డీశ్వరునితో సన్వరూపుఁడుగాన అతఁడును ఛేదింపఁదగినవాఁడుకాఁడు. దహింపఁదగినవాఁడు కాఁడు. తడుపఁదగినవాఁడు కాఁడు. ఎండింపఁదగినవాఁడుకాఁడు. ఎల్లప్పు డేకరూపుఁడుగా నుండు వాఁడని చెప్పఁబడినది. స్థాణుశబ్దముచేత నైమిత్తికముగానైన రూపాంతరము లేదనియు, నిత్యముగా సర్వగతుఁడైనవాఁడనియు, విరోధములేనిచో బింబధర్మము లన్నియు ప్రతిబింబమున సంభవించు ననియు తా.

శ్లో. అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే,
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. 25

టీ. అయం = ఈ యాత్మ, అవ్యక్తః = ("నచక్షుషా పశ్యతి కశ్చనైనం" అనుశ్రుతివలన) చక్షురాదుల కగోచరము. అయం=ఈ యాత్మ,అచింత్యః=('యన్మనసా న మనుతే' అనెడి శ్రుతివలన) మనస్సున కగోచరము. అయం = ఈయాత్మ, అవికార్యః = కర్మేంద్రియములకు విషయముకానిది. ఇతి=ఇట్లని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. తస్మాత్ = ఆకారణమువలన, ఏవం = ఈ చెప్పఁబడిన ప్రకారముగా, ఏనం=ఈయాత్మను, విదిత్వా=ఎఱిఁగి, అనుశోచితుం=దుఃఖించుటకొఱకు, నార్హసి= తగవు.

శం. ఈయాత్మ చక్షురాదీంద్రియములకు గోచరము గాదు. మనస్సునకును గోచరము గాదు. కర్మేంద్రియములకును నేమి

సేయను శక్యముగాదు అని శ్రుతులందుఁ జెప్పఁబడుచున్నది. కాఁబట్టి, నీ వీప్రకారము తెలిసి దుఃఖింపకుము.

రామా. ఛేదింపఁబడుట మొదలగువానికి నర్హములైన వస్తువులవలె కనఁబడుటయు, తలంపఁబడుటయు లేదు గాన నీ యాత్మ అవ్యక్తుఁడనియు, అచింత్యుఁ డనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. కాఁబట్టి నీవీ ప్రకారము తెలిసి యట్టివారికై దుఃఖింపకుము.

అవ. దేహమునే యాత్మగా భావించినను శోకింపఁ బనిలేదు.—

శ్లో. అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్,
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి. 26

టీ. హేమహాబాహో=ఓ అర్జునుఁడా! త్వం=నీవు, ఏనం=ఈ యాత్మను, నిత్యజాతం - నిత్య=నిత్యమును, జాతం=పుట్టుచున్నదానిగను, నిత్యం=నిత్యమును, మృతం=నశించుచున్నదానిఁగను,మన్యసేఅథ చ=తలంచెదవేని, తథాపి=అట్లయ్యును, ఏవం=ఈ ప్రకారముగా, శోచితుం = దుఃఖించుటకొఱకు, నార్హసి=తగవు.

శం. అట్లుగాక ఈ యాత్మ నిత్యముగాఁ బుట్టునదనియు, నిత్యముగా నశించునదనియు, నీవు తలంచినను ఆపక్షమునందుఁ గూడ నోయర్జునా ! ఈ యాత్మనుగుఱించి నీవు దుఃఖింపవలసినది లేదు.

రామా. ఆత్మను పుట్టుచు నశించుచునుండు శరీరమునుగా తలంచినను ఆపక్షమునందుఁ గూడ నీ యాత్మను గుఱించి నీవు దుఃఖింపవలసినది లేదు.

మధ్వ. ఆత్మ నిత్యుఁడైనను, దేహసంయోగవియోగరూప ములగు జననమరణములు ఆత్మకు మోక్షమువరకును నియత ములుగా తలంచితివేని ఆపక్షమునందుఁ గూడ నీయాత్మను గుఱించి నీవు దుఃఖింపవలసినది లేదు.

శ్లో. జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. 27

టీ. జాతస్య = పుట్టినవానికి, మృత్యుః=నాశము, ధ్రువో హి=నిశ్చయముగదా? మృతస్య=చచ్చినవానికి, జన్మ చ=పుట్టుకయును, ధ్రువం=నిశ్చయము. తస్మాత్ =అందువలన, అపరిహార్యే=తప్పించఁగూడని, అర్థే= విషయమున, త్వం=పండితుఁడవైన నీవు, శోచితుం=దుఃఖించుటకు, నార్హసి=తగవు.

శం. ఎందువల్లననఁగాఁ బుట్టినవానికి మరణము తప్పదు. చచ్చినవానికి జన్మమును తప్పదు. కాఁబట్టి అనివార్యమయిన యీవిషయమునందు నీవు దుఃఖించుటచే నుపయోగము లేదు. (ఉత్పత్తి వినాశములు అవశ్యము సంభవించును కావున శోకింపఁ బనిలేదని భావము.)

రామా. నశించినవి తిరిగియుం బుట్టు టెట్లనగా.—పుట్టుక నాశము అనునవి ఉన్నద్రవ్యమునకె అవస్థావిశేషములు కాని క్రొత్తగా ఒక్కవస్తువైనను లేనిది పుట్టుట లేదు. ఇందుకు భాష్యకారులదృష్టాంతము—దూది యొడికినచో నూలగుచున్నది. నూలు నేసినచో వస్త్రమగుచున్నది. వస్త్రమునకు జీర్ణస్థితి కలిగిన దూదైన నగును నూలైన నగును. తుదకు మసకంటికి కనబడని దూదియొక్క యవయవములైన నగుంగాని శుద్ధము

గా లేకపోదు. కాబట్టి నశించినవస్తు వెల్ల మఱియొక్క వస్తు వగుట కలదు గాన 'ధ్రువం జన్మ మృతస్య చ' అనుటకు కొంతంత లేదు. కావున అట్టివానికై నీవు శోకింపం జని లేదు.

మధ్వ. జన్మమరణములు ఆత్మకు నియతములు గాన శోకింప వలసినదే లేదు.

శ్లో. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా. 28

టీ. హేభారత=ఓయి అర్జునా! భూతాని=శరీరములు, అవ్యక్తాదీని = మొదలు తెలియఁబడనివి, వ్యక్తమధ్యాని = కనిపించుచున్న మధ్యము గలవియు, అవ్యక్తనిధనాని= తెలియఁబడ నియంతముగలవియునై యున్నవి. తత్ర=అట్టి శరీరవిషయమై, పరిదేవనా =విలాపము, కా = ఏమి?

శం. ఓ అర్జునుఁడా! ఈభూతములు పుట్టుటకుమును ఎట్టివో తెలియదు. నడుమమాత్రము తెలియఁబడుచున్నవి. మఱల నశించినపిమ్మట నేమగునో తెలియదుకదా? కాఁబట్టి నీ కీవిషయమున విలాప మేల?

శ్లో. ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్. 29

టీ. కశ్చిత్ =ఒకానొకఁడు, ఏనం= ఈ యాత్మను, ఆశ్చర్యవత్ =ఒకప్పుడును జూడని అద్భుతవస్తువు నాకస్మికము

గాఁ జూచినట్లు, పశ్యతి = చూచుచున్నాఁడు. తథైవ=అలాగే, అన్యశ్చ=మఱియొకఁడును, ఏనం=ఈ యాత్మను, ఆశ్చర్యవత్=ఆశ్చర్యమువలె, వదతి=మఱియొకనితోఁజెప్పుచున్నాఁడు. అన్యః=ఇతరుఁడు, ఏనం=ఈ యాత్మను, ఆశ్చర్యవత్=ఆశ్చర్యమువలె, శృణోతి=వినుచున్నాఁడు. కశ్చిత్ = మఱియొకఁడు, ఏనం=ఈ యాత్మను, శ్రుత్వాపి=వినియును, దృష్ట్వాచ=చూచియును, ఉక్త్వాపి = పలికియును, నవేదైవ = ఎఱుంగనేలేఁడు. *

శం. ఒకానొకఁడు ఈ యాత్మను ఆశ్చర్యవస్తువువల్లెఁ జూచును. మఱియొకఁడు ఈ యాత్మను ఆశ్చర్యమువలెనే చెప్పును. మఱియొకఁడు ఆశ్చర్యముగా వినును. వినియును ఈ యాత్మను నెవ్వఁడును నెఱుంగఁడు.

రా. అద్భుతవస్తువువలె నున్న యీజీవుని ఒకానొకండు చూచుచున్నాఁడు. యీజీవుని గుఱించి యొకండు చెప్పుచున్నాఁడు. మరియొకండు వినుచున్నాఁడు. తత్త్వస్థితితో నెవఁడును నెఱుంగఁడు.

మధ్వ. ఆశ్చర్యవత్ = దుర్లభముగా, ఎవ్వని ప్రతిబింబమైన యీయాత్మను లెస్సగాఁ దెలిసికొనుట దుర్లభమో ఆయీ

* అది ఎట్లనిన-జ్ఞానవాసిష్ఠమందుఁ జెప్పఁబడి యున్నది-శ్లో. "అహోను చిత్రం మాయేయం యద్వా విశ్వవిమోహినీ, సర్వాంగ ప్రోత మప్యేనం యయ్యాత్మానం న బుధ్యతే." మాయచేత లోకులు సకలావయవముల యందును నిండియున్నప్పటికిని ఆత్మను దెలియలేక యున్నారు. ఈ మాయ ప్రపంచమును మిక్కిలి మోహింపఁజేయుచున్నది. ఇది మిక్కిలి యాశ్చర్యము.

శ్వరుని సామర్థ్యముంగూర్చి చెప్పవలసినదేమి? అని ఈశ్వర సామర్థ్యము నిందు ప్రతిపాదించెను.

శ్లో. దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత,
　　తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి.　　30

టీ. హే భారత=ఓయి అర్జునా! సర్వస్య = సమస్తమయిన సురాసుర మనుష్యాదిప్రాణిసమూహముయొక్క, దేహే=శరీరము (వధ్యమానేపి=సంహరింపఁబడుచున్నను), అయం=ఈ, దేహీ=ఆత్మ, నిత్యం=ఎల్లప్పుడును, అవధ్యః=చంపఁదగనిది. తస్మాత్=ఆకారణమువలన, త్వం=నీవు, సర్వాణి=సమస్తమయిన, భూతాని=భీష్మాదిశరీరములనుగూర్చి, శోచితుం=దుఃఖించుటకొఱకు, నార్హసి=తగవు.

శం. ఓ అర్జునా! ఈదేహము హతమైనను ఈ దేహముసందుండు ఆత్మ యెప్పుడును హతముకాదు. అందువలన నీ భీష్మాది శరీరోపాధులు గల స్వయంప్రకాశాత్మనుగూర్చి నీవు దుఃఖింపవలసినది లేదు.

శ్లో. స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి,
　　ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే.

టీ. అపిచ = ఇంతేకాదు, స్వధర్మం=క్షత్రియధర్మమును, అవేక్ష్య=విచారించి, వికంపితుం=చలించుటకొఱకు, నార్హసి=తగవు. తథాహి=అదియుక్తమేకదా! క్షత్రియస్య=రాజునకు, ధర్మ్యాత్=ధర్మముతోఁగూడిన, యుద్ధాత్=యుద్ధముకంటె, అన్యత్=ఇతరమయిన, శ్రేయః=శ్రేయస్సు, నవిద్యతే=లేదు.

శం. ఇంతియకాదు. నీవు స్వధర్మమును విచారించినను ఈ యుద్ధము విడువరాదని యేర్పడును. ఏలయనఁగా ఈ ధర్మయుద్ధముకంటె మఱియొకటి మేలు గలిగించు కార్యము క్షత్రియునకు లేదు.

రా. యుద్ధము ప్రాణిహింసారూపంబైనను ఆప్రాణులకు మేలైన దేహాదులం గలుగఁ జేయుఁగాన అగ్నీషోమీయపశుహింసవలె ధర్మ్యమే యగును. వైద్యుఁడు చేయు శస్త్రకర్మము రోగి కెట్లు రక్షణమో, అట్లే అగ్నీషోమీయ పశుహింస పశువునకు రక్షణంబగును. కాఁబట్టి స్వధర్మముచేత సోమయాజియును, వైద్యుఁడును హింసచేయువారయ్యును మేలు నెట్లు కలిగించుకొనుచున్నారో, అట్లే నీవును నీస్వధర్మమగు యుద్ధ మొనరించి మేలును పొందుము. అని తా.

అవ. 'స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ.' అనెడి ప్రశ్నమున కుత్తరము చెప్పుచున్నాఁడు.—

శ్లో. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధ మీదృశమ్. 32

టీ. హే పార్థ=ఓయిఅర్జునుఁడా! యేక్షత్రియాః=ఏ రాజులు, అపావృతం=తెఱవఁబడిన, స్వర్గద్వారం=స్వర్గద్వారభూతమైనట్టి, యదృచ్ఛయా=అప్రయత్నమున, ఉపపన్నంచ=ప్రాప్తమైనట్టి, ఈదృశం=ఇట్టి, యుద్ధం=యుద్ధమును, లభంతే=పొందుచున్నారో, తే=వారలు, సుఖినః=భాగ్యవంతులు.

శం. అర్జునా! ప్రార్థింపకయే సిద్ధమై తెఱవఁబడిన స్వర్గ

మువాఁకిలి యయిన ఈయుద్ధమును పొందుక్షత్రియులు మిక్కిలి సుఖవంతులని చెప్పవలెను.

శ్లో. అథ చేత్త్వం ధర్మ్య మిమం సంగ్రామం నకరిష్యసి,
    తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి. 33

టీ. అథ=ఇఁక, త్వం=నీవు, ధర్మ్యం=స్వధర్మయుక్తమైన, ఇమం సంగ్రామం = ఈయుద్ధమును, న కరిష్యసి చేత్ =చేయ వేని, తతః=అందువలన, స్వధర్మం=స్వధర్మఫలమును (అనగా నిరతిశయసుఖమును), కీర్తిం చ=(మహాదేవాది సమాగమ నిమిత్తమైన అని శం. జయమువలన కలుగునది యని రామా.) యశస్సును, హిత్వా=విడిచి, పాపం=పాపమును, అవాప్స్యసి =పొందఁగలవు.

శం. అట్లైనను, నీవు ఈ ధర్మ్యమైన యుద్ధమును జేయక పోదువేని, అందువలన స్వధర్మమును మహాదేవునితో సమాగమనిమిత్తమైన నీయశస్సును గోలుపోవుటయే కాక పాపమును పొందుదువు.

శ్లో. అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్,
    సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 34

టీ. అపిచ=ఇంతియకాదు. భూతాని = ప్రాణులు, అవ్యయాం=శాశ్వతమగు, తే=నీయొక్క, అకీర్తిం=అపకీర్తిని, కథయిష్యంతి=చెప్పుకొనఁగలరు. సంభావితస్య=శౌర్యస్థైర్యాది గుణములచే గౌరవింపఁబడినవానికి, అకీర్తిః=అపకీర్తి, మరణా చ్చ=చావుకంటె, అతిరిచ్యతే హి=అధికమగుచున్నదికదా!

శం. ఇదిగాక, సమస్తభూతములు నీక బహుకాలమువఱకు నీ యపకీర్తిని జెప్పుకొనుచుండును. గౌరవముగలవానికి నపకీర్తి మరణము కన్న నెక్కువది. (ఈ అపకీర్తికన్న మరణము మేలు).

శ్లో. భయా ద్రణా దుపరతం
మన్యంతే త్వాం మహారథాః,
యేషాం చ త్వం బహుమతో
భూత్వా యాస్యసి లాఘవమ్. 35

టీ. యేషాం=ఏదుర్యోధనాదులకు, త్వం=నీవు, బహుమతః=శౌర్యధైర్యాదిగుణములచే బహుమానితుఁడవైతివో, మహారథాః=మహారథికులయిన, తే=ఆదుర్యోధనాదులు, త్వాం=నిన్ను, భయాత్=భయమువలన, రణాత్=యుద్ధమునుండి, ఉపరతం=నివృత్తిబొందినవానిఁగా, మన్యంతే = తలఁపఁగలరు. బహుమతః=పూర్వమందు బహుమానము చేయఁబడినవాఁడవు, భూత్వా చ=అయియును, లాఘవం=పిమ్మట చులుకదనమును, యాస్యసి=పొందఁగలవు.

శం. శూరులగు కర్ణదుర్యోధనప్రభృతులును నిన్ను భయముచే యుద్ధమునుండి తొలఁగినవానిఁగాఁ దలఁతురు. నిన్నిదివఱ కెవరు మిక్కిలి గౌరవించిరో వారే యిఁకఁ జుల్కనగాఁ జూతురు.

శ్లో. అవాచ్యవాదాం శ్చ బహూ న్వదిష్యంతి తవాహితాః,
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్. 36

టీ. తవ=నీయొక్క, సామర్థ్యం=సామర్థ్యమును, నిన్దన్తః=దూషించుచు, తవ = నీయొక్క, అహితాః = శత్రువులయిన

ధార్తరాష్ట్రులు, బహూన్ = అనేకములయిన, అవాచ్యవాదాన్=పలుకఁదగనిపలుకులను, వదిష్యంతి=చెప్పుకొనఁగలరు. తతః = అంతకంటె, దుఃఖతరం=మిక్కిలి దుఃఖము, కిన్ను= ఏమియున్నది.

శం. నీశత్రువులు నీ విదివఱకు నచ్చటచ్చట చూపిన సామర్థ్యముల నిందించుచు నీవిషయమై యనరానిమాటల నందురు. అంతకన్న నధికదుఃఖ మేమి కలదు?

అవ. అట్లుకాక ఒకవేళ కర్ణాదులగు శూరులతో రణ మొనర్చితి వేని—

శ్లో. హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్,
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. 37

టీ. హేకౌంతేయ=ఓయి అర్జునుఁడా! హతో వా=యుద్ధమందు శత్రువులచేతఁ జంపఁబడినవాఁడవైతి వేని, స్వర్గం=స్వర్గమును, ప్రాప్స్యసి=పొందఁగలవు. జిత్వా వా=వారలనుజయించినవాఁడవయితి వేని, మహీం=భూజాతభోగములను, భోక్ష్యసే=అనుభవింపఁగలవు. తస్మాత్=ఆకారణమువలన, యుద్ధాయ=యుద్ధముకొఱకు, కృతనిశ్చయస్సన్-కృత=చేయఁబడిన, నిశ్చయస్సన్ = శత్రువుల జయింతు నను నిశ్చయముగలవాఁడవై, ఉత్తిష్ఠ=లెమ్ము.

శం. ఇఁక యుద్ధము చేసినచో హతుఁడ వగుదు వేని స్వర్గము పొందుదువు. జయింతు వేని రాజ్య మనుభవింతువు. అందువల్ల నో యర్జునా! యుద్ధముచేయ నిశ్చయించినవాఁడవై లెమ్ము.

అవ. యుద్ధమును స్వధర్మముగా పాటించి యొనర్తువేని నా యుపదేశమును వినుము. మోక్షార్థివై యొనర్పుము. ఆయవలంబింప వలసిన విధము.—

శ్లో. సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి.38

టీ. సుఖదుఃఖే = సుఖదుఃఖములను, సమే = సమానములుగా, కృత్వా = చేసి, లాభాలాభౌ = సుఖదుఃఖములవలనఁ గలిగెడి లాభాలాభములను, జయాజయౌ = జయాపజయములను, సమౌ=సమములుగా, కృత్వా=తలఁచి, తతః=అపిమ్మట, యుద్ధాయ=యుద్ధముకొఱకు, యుజ్యస్వ=ఆయత్తుఁడవగుము. ఏవం (చేత్)=ఇట్లు యుద్ధముచేసితివేని, పాపం= పాపమును, నఅవాప్స్యసి=పొందవు.

శం. సుఖదుఃఖములను లాభనష్టములను జయపరాజయములను సమముగా నెంచి యటుపిమ్మట యుద్ధము చేయఁబూనుము. అట్లు చేయుదువేని పాపమును బొందవు.

రా. ఇట్లు శరీరమునకంటె విలక్షణుఁడగు నాత్మను తెలిసికొని యుద్ధములోని యాయుధపుదెబ్బలు మొదలగువానిచే సుఖదుఃఖాదులు కలిగినను బుద్ధివికారము లేనివాఁడవై స్వర్గాదిఫలోద్దేశము లేక యుద్ధమును చేయుము. ఇట్లు చేసినచో పాపమును అనఁగా దుఃఖరూపమగు సంసారమును బొందవు.

అవ. అందుకు సాధనభూతమైన కర్మయోగమును చెప్పు చున్నాఁడు.—

శ్లో.ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి. 39

టీ. హేపార్థ=ఓయి అర్జునుఁడా! సాంఖ్యే=ఆత్మతత్త్వమందలి, ఏషా=ఈప్రతిపాదింపఁబడిన, బుద్ధిః=బుద్ధి, తే=నీకు,అభిహితా=చెప్పఁబడెను, యోగేతు=యోగమందైతే, ఇమాం=ఈబుద్ధిని, శృణు=వినుము. యయా బుద్ధ్యా=ఏబుద్ధితో, యుక్తస్సన్=కూడినవాఁడవై, కర్మబంధం = కర్మబాధమును, ప్రహాస్యసి=విడువఁగలవో.

శం. ఓ అర్జునుఁడా, ఇప్పు డీచెప్పఁబడినది యాత్మతత్త్వజ్ఞానము. ఇఁక కర్మయోగజ్ఞానమును నీకుఁ జెప్పెదను వినుము. ఈకర్మయోగవిషయమైన జ్ఞానముతోఁ గూడినవాఁడు సంసారబంధమును వదలును. సాంఖ్యబుద్ధియనఁగా నాత్మతత్త్వజ్ఞానము. దానినే పరమార్థజ్ఞానమందురు. అదియే సంసారహేతువులగు దుఃఖమును, అజ్ఞానమును ప్రత్యక్షముగా నివర్తింపఁజేయును. యోగమనగా జ్ఞానమును కలుగఁజేసెడి కర్మయోగము. అది ద్వంద్వపరిత్యాగపూర్వకంబై ఈశ్వరారాధనముకొఱకు సత్కర్మాచరణ కావించుటయును, సమాధియోగంబు నగు. ఇందువలన సిద్ధిఁజెంది జ్ఞానము కలుగఁగా పుణ్యపాపబంధము విడివడును.

రా. సాంఖ్యమనఁగా బుద్ధిచే తెలిసికొనఁదగిన యాత్మతత్త్వము. సాంఖ్యజ్ఞానమనగా నట్టినిత్యమైన యాత్మతత్త్వమును తెలిసికొనుట. ఇది ౨. అ. శ్లో ౧౨మొదలు ౨. అ.

శ్లో. 39 వఱకుఁజెప్పఁబడినది. యోగమనఁగా ఆత్మజ్ఞాన పూర్వకంబగు మోక్షసాధనములగు కర్మల నాచరించుట యందలి తెలివికలుగుట. అవి ఇఁక చెప్పఁబడును.

మధ్వ. సాంఖ్యమనగా పరిశుద్ధాత్మతత్త్వజ్ఞానము. బుద్ధియనఁగావాక్కు. ఆత్మజ్ఞానముంగూర్చి ఇదివరలోఁ జెప్పఁబడినది. ఇఁక యోగమనఁగా ఉపాయముం గూర్చి చెప్పఁబడు ననుట.

శ్లో. నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే,
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.

టీ. ఇహ=ఈకర్మయోగమునందు, అభిక్రమనాశః =వ్యర్థ ప్రారంభము, నాస్తి=కానేరదు. ప్రత్యవాయః= దోషమును, నవిద్యతే=లేదు. అస్యధర్మస్య=ఈ యోగముయొక్క, స్వల్పమపి=కొంచెమైనను, మహతః=అధికమయిన, భయాత్=సంసారభయమునుండి, త్రాయతే=రక్షించుచున్నది.

శం. ఫలాపేక్షలేక ఈశ్వరార్పణగాఁ జేయఁబడు నీకర్మయోగమును ఆరంభించుట వ్యర్థముకానేరదు. ఒకవ్యాధికిచికిత్సచేయునప్పుడు వ్యాధియెక్కువయై మరణాదులు సిద్ధించును. అట్లుచికిత్సలోవలె చిక్కులు కలుగవు. ప్రత్యవాయమును లేదు. ఈధర్మము కొంచె మనుష్ఠించినను గొప్పదియైన సంసారభయమునుండి తొలఁగించును.

రా. ప్రత్యవాయమనఁగా నారంభించినదానిని మధ్యలో విడుచుటవలని దోషము.

శ్లో. వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన,
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్.

టీ. హేకురునందన=ఓయి అర్జునుఁడా! ఇహ = ఈవిధాన మంతయు, వ్యవసాయాత్మికా=నిశ్చయాత్మకమయిన, బుద్ధిః= బుద్ధి, ఏకా=ఒకటియును (ముఖ్యమైనదియును), అవ్యవసాయి నాం=నిశ్చయరహితులయొక్క, బుద్ధయః=బుద్ధులు, అనంతా శ్చ=సంఖ్యలేనివియును, బహుశాఖాః=బహుశాఖలుగలదాని వలె ఫలాసక్తము లైనవియును.

శం. అర్జునా! సాంఖ్యయోగజ్ఞానముగాని కర్మయోగజ్ఞా నముగాని నిశ్చయరూపమైనజ్ఞానము ఒకటియే అగుచున్నది. ఇఁక నిశ్చయములేనివారికి కలుగుజ్ఞానములుమాత్రమే నానా విధములై యనంతములుగా నుండును. వ్యవసాయాత్మిక బుద్ధి యనఁగా మంచిప్రమాణములవలనఁబుట్టిన నిశ్చయస్వభావము గలిగి శ్రేయోదాయకమైన సాంఖ్యబుద్ధి యోగబుద్ధి. ఇట్టివి కాని విపరీతబుద్ధులు అవ్యవసాయాత్మకబుద్ధులు. ఇట్టివి కలవారు అవ్యవసాయులు అనగా ప్రమాణమువలనఁ బుట్టిన వివేకజ్ఞాన ము లేనివారు.

రా. నిత్యనైమిత్తికకర్మములు, ప్రధానావాంతరఫలముల నన్నిటిని విడిచి మోక్షమొక్కదానికొఱకె యాచరింపఁబడ వలసినది. తమతమవర్ణాశ్రమములకు తగిన కామ్యకర్మములను వానివానిఫలములను విడిచి మోక్షసాధనములుగాను నిత్యనై మిత్తికములతోఁజేర్చి యథాశక్తిగ నాచరింపఁ బడవలసినది.

అవ. ఇఁక కామ్యకర్మాధికారులదూషణము.—

శ్లో. యా మిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః.　　42

కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్,
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి. 43
భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే. 44

టీ. హేపార్థ=ఓయి అర్జునుఁడా! వేదవాదరతాః=వేదములందు ఫలమును దెలిపెడి భాగములైన యర్థవాదములందుఁ బ్రీతికలవారును, అన్యత్ = స్వర్గఫలమునకంటె వేఱొకఁది, నాస్తి = లేదు, ఇతి = ఇట్లని, వాదినః = వాదించువారును, కామాత్మనః = ఈషణత్రియములచేతఁ గోరికలచే నిండిన మనస్సు గలవారును, స్వర్గపరాః = స్వర్గమే యుత్తమపురుషార్థముగాఁ గలిగినవారును, అవిపశ్చితః = అపండితులును, జన్మకర్మఫలప్రదాం-జన్మ = స్వర్గఫలానంతరజన్మమును, కర్మ=కర్మమును, ఫల = కర్మఫలములను, ప్రదాం=ఇచ్చునట్టిదియు, భోగైశ్వర్యగతింప్రతి= సుఖప్రభుత్వముల ప్రాప్తినిగూర్చి, క్రియావిశేషబహుళాం = అనేకకర్మభేదములు గలదియు, పుష్పితాం = పుష్పమేఫలముగాఁగలిగి ఫలప్రదముకానిబంతిచెట్టు మొదలగువానివలె పైకి శృంగారముగనుండి స్వర్గాదులనెడు అల్పసుఖముల నిచ్చునదియగు, యాం=ఏ, ఇమాం=ఈ, వాచం=స్వర్గఫలప్రతిపాదకవాక్యమును, వదంతి=చెప్పుచున్నారో, తయా= అటువంటివాక్యముచేత, అపహృతచేతసాం = అపహరింపఁబడినచిత్తముగలవారును, భోగైశ్వర్యప్రసక్తానాం=సుఖప్రభుత్వములయందు దాసక్తులగువారలకు, వ్యవసాయాత్మికా బుద్ధిః= నిశ్చయమైన బుద్ధి, సమాధౌ= చిత్తైకాగ్రమందు, న విధీయతే=కలుగనేరదు.

శం. అర్జునా! వేదములయందు ఫలములను తెలిపెడి అర్థవాదప్రియులును, స్వర్గమే యుత్తమపురుషార్థమని నమ్మి దానికంటె నన్యము విశేషఫలదము లేదనువారును, ఈషణాత్రయములగు పుత్త్ర మిత్ర కళత్రాదులయం దాశగలవారును నగు నవివేకులు భోగైశ్వర్యప్రాప్తికై అనేక కర్మభేదములను చెప్పునవియు, పుష్పములను మాత్రముపూచి కంటి కింపు కలిగించు చెట్టువలె, చెవులనానందింపఁ జేయు మోసపుమాటలను చెప్పుచున్నారో, అట్టిమాటలచే మోసపోయినవారై భోగైశ్వర్యములందాసక్తిఁ గలిగినవారికి నిశ్చయరూపమైన బుద్ధి కలుగనేరదు. అనగా సాంఖ్యయోగ ప్రతిపాదకంబును, కర్మయోగ ప్రతిపాదకంబునగు ఆత్మస్వరూపజ్ఞానమందు ప్రవృత్తియే కలుగదనుట.

రామా. మోక్షేచ్ఛ కలవాఁడు కామ్యకర్మములయందు సంగమును చేయఁగూడదు.

మధ్వ. వేదములు పరోక్షముగా భగవంతుని చెప్పుచున్నవి. భోగైశ్వర్యప్రాప్తియే వేదమునకు ఫలమనియెదరు. వారికి ఈశ్వరునియందలి మనస్సమాధానముకొఱకైన యుక్తినిశ్చయస్వరూపమగు బుద్ధి కలుగదు. ఆసమాధానమేకదా మోక్షసాధనమనుట.

అవ. "వేదములు జన్మమును గలుగఁజేసెడి కర్మములను ఏల చెప్పుచున్నవి?" అనుప్రశ్నకు సమాధానము.—

శ్లో. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45

టీ. హేఅర్జున=ఓయర్జునుఁడా! వేదాః=వేదములు, త్రైగుణ్యవిషయాః=సత్త్వరజస్తమోగుణములవలనఁ గలిగినసంసారస్వరూపమును తెలియఁజేయునవిగా నున్నవి (కావున నీవు), నిర్ద్వంద్వః=శీతోష్ణాదిసుఖదుఃఖరహితుఁడవును, నిత్యసత్త్వస్థః=శాశ్వతసత్త్వగుణవిశిష్టుఁడవును, నిర్యోగక్షేమః=యోగక్షేమరహితుఁడవును, ఆత్మవాన్=ఆత్మజ్ఞానము గలవాఁడవును, నిస్త్రైగుణ్యః = త్రిగుణాతీతుఁడవును (కోర్కెలేనివాఁడవును), భవ=అగుము.

శం. ఓయర్జునుఁడా! వేదములు ఈసంసారమే విషయము గాఁగలవి. నీవు నిష్కాముఁడవును, ద్వంద్వములను వదలినవాఁడవును, ఎల్లప్పుడును సత్త్వగుణము గలవాఁడవును, యోగక్షేమముల విడిచినవాఁడవును, ఆత్మజ్ఞానము కలవాఁడవును, కోరిక లేనివాఁడవును నగుము. (త్రైగుణ్యమనఁగా—సంసారము. నిస్త్రైగుణ్యమనఁగా=కోరికలేక యుండుట.)

రా. త్రైగుణ్యశబ్దముచే సత్త్వ రజస్తమో గుణములు మిక్కిలిగాఁగల పురుషులు చెప్పఁబడుదురు. వారివారికి తగిన హితములను వేదములు చెప్పును. నీవన్యోన్య సంబంధములగు త్రిగుణములను వృద్ధిపొందించికొనక వృద్ధిపొందిన సత్త్వగుణప్రధానుఁడవు కమ్ము. ఆత్మస్వరూపంబును అది కలుగుటకు సాధనమును తప్ప మిగిలిన యోగక్షేమములు లేనివాఁడనై ఆత్మస్వరూపమును వెదకువాఁడవు కమ్ము. అనుట.

మధ్వ. త్రైగుణ్యమనఁగా సత్త్వరజస్తమోగుణసంబంధియగు స్వర్గాదికము. అది వేదమునకు పైకి తోఁచెడియర్థము. వేదములు స్వస్వరూపమున విష్ణువును తెలియఁజేయును.

శ్లో. యావా నర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. 46

టీ. ఉదపానే= తటాకమునందు, యావానర్థః = ఎంత ప్రయోజనము, (భవతి = అగుచున్నదో,) తావానర్థః=అంత ప్రయోజనమే, సర్వతః=అంతటను, సంప్లుతోదకే=నిండినయుదకముగల మడుగునందు, (భవతి=అగుచున్నది). సర్వేషు వేదేషు = సమస్తవేదములయందు, యావానర్థః = ఎంతప్రయోజనము, భవతి=అగుచున్నదో, తావానర్థః = అంతప్రయోజనము, విజానతః= జ్ఞానియైన, బ్రాహ్మణస్య=బ్రహ్మజ్ఞాననిష్ఠునకు, (భవతి=అగుచున్నది).

శం. కొద్దినీళ్లుగల బావులు మొదలగువానియందు స్నానపానాదిప్రయోజన మెంతమాత్రము గలుగునో, అది యంతటను బ్రవహించుచున్న మహాప్రవాహముగల నదులు మొదలగువానియందుఁ గలుగు ననంతప్రయోజనములలో నంతర్భావము నొందునట్లే సమస్తవేదములయందు చెప్పఁబడిన కర్మ లనుష్ఠించుటవల్లఁ గలుగుఫలము అంతకన్నను మిక్కిలి గొప్పదైన జ్ఞానముగల బ్రహ్మజ్ఞానికిఁ గలుగు మోక్షరూప మహాఫలములో నంతర్భావము నొందును.

రామా. అంతట నిండియున్న బావి మొదలగు దానియందు పురుషునికి ఎంతప్రయోజనమో జ్ఞానముగల ముముక్షువునకు అన్ని వేదములయందు అంతియ ప్రయోజనము. బావిలో నెవ్వని కెంతనీరు కావలయునో అంతనీరే పరిగ్రహింపఁ బడునట్లు

ముముక్షువుచే వేదమున మోక్షసాధనము మాత్రమే పరి
గ్రహింపఁబడును.

మధ్వ. బావిమొదలగువానివలనంగలుగుప్రయోజనము మహాజలమువలనం గలుగుదానిలో నంతర్భవించునట్లే వేదములలోనిఫలము బ్రాహ్మణునిలో నంతర్భవించును. బ్రహ్మమును పొందువాఁడు బ్రాహ్మణుఁడు. బ్రహ్మపరోక్షజ్ఞానముగలవాఁడు బ్రాహ్మణుఁడు. అది జ్ఞానమువలన కలుగును.

శ్లో. కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగోఽ స్త్వకర్మణి.47

టీ. తే = నీకు, కర్మణ్యేవ = నిత్యనైమిత్తికాదికర్మమునందే, అధికారః = అధికారము, ఫలేషు = కర్మఫలములయందు, అధికారః=కోరిక, కదాచన = ఒకప్పుడును, మాస్తు = లేకుండుఁగాక. త్వం = నీవు, కర్మఫలహేతుః = కర్మఫలమునకు కారణమయినవాఁడవు, మాభూః = కాకయుండుము. (ఇందుకు శ్రీవిష్ణుపురాణమందుఁ జెప్పియున్నవిధం బెట్టిదనిన, శ్లో. 'తత్కర్మ య న్నబంధాయ సా విద్యా యా విము క్తయే, ఆయాసాయాపరం కర్మ విద్యాన్యా శిల్పనైపుణ మితి' ఏకర్మము బంధకరము కాకయున్నదో, ఆకర్మమును, ఏవిద్య ముక్తికారణమగుచున్నదో ఆవిద్యయును శ్రేష్ఠములు. తక్కినకర్మములును, విద్యలును నాయాసమునకును నేర్పునకును గారణభూతములుగాని వానివలన నింకఁ బ్రయోజనము లేదు.) తే=నీకు, అకర్మణి=కర్మము ననుష్ఠింపకుండుటయందు, సంగః=ఆసక్తి, మాస్తు = లేకయుండుఁగాక.

శం. నీకుఁ గర్మము లనుష్ఠించుటయందే యధికారముగాని జ్ఞాననిష్ఠయం దధికారము లేదు. ఆకర్మానుష్ఠానమునందును నీ వొకప్పుడును దత్ఫలములు కోరరాదు. నీవు కర్మఫలములకును గారణము గావలదు. కర్మముల ననుష్ఠింపకుండుటయందును తగిలియుండవలదు. కర్మఫలములయం దాశగలవాఁడవైతివేని తిరిగియు జన్మమును పొందుదువు.

రా. ఫలమునుం గోరక భగవదారాధనరూపముగాఁ జేయఁబడెడికర్మము మోక్షసాధనమగుంగాని, నిత్యసత్త్వస్థుఁడవగుటచే మోక్షముం గోరెడి నీకు కర్మములయందు మాత్రమె కాని, వానిఫలములయఁదధికారము లేదు. కర్మమునకును ఫలమునకును నీవు హేతువు కాకూడదు. కర్మమునకు నీవు కర్త కావనియు ఫలమునకు హేతువు కావనియుఁ గూడ తలంచికొనవలయును.

మధ్వ. జ్ఞానివైననీకే ఫలపుకోరిక కూడదు. ఇఁక నజ్ఞానులకు కూడదని చెప్పనేల? వేదములో రుచి పుట్టుటకై కర్మలకు ఫలము చెప్పఁబడియున్నది. కర్మఫలము కర్మము నాచరించుటకు ఎవ్వనికి హేతువగునో అట్టివాఁడవు కాకుండుము. మిగిలినఫలములు లేక పోయినను నాయనుగ్రహము నెడిఫలము కలదుగాన కర్మములను చేయుటను విడువకూడదు. లోకములో నీకేమికావలయునని యడుగంబడియు తనుసేవయె కావలయునని కోరువానియందు కలిగెడిప్రీతి, స్వార్థమై సేవచేయువానియందుకలుగదుగాన భక్తిజ్ఞానాదిప్రార్థన చేయఁదగినదియె.

శ్లో. యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే.

టీ. హే ధనఞ్జయ=ఓ యర్జునుఁడా, సంగం త్యక్త్వా=అభిమానమును వదలి, సిద్ధ్యసిద్ధ్యోః=బ్రహ్మజ్ఞానరూపమగు ఫలప్రాప్తియందును అప్రాప్తియందును, సమః = మనస్సు సమముగానుండువాఁడవు, భూత్వా=అయి, యోగస్థస్సన్=యోగమందున్నవాఁడవై, కర్మాణి=కర్మములను, కురు=చేయుము. త్వం = నీవు, సమః = జయాపజయములయందు సముఁడవై యుండుటయే, యోగః = యోగము (అని), ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

శం. అర్జునా! నీవు యోగము నవలంబించినవాఁడవై ఈశ్వరారాధనార్థమై సిద్ధి కల్గినను సిద్ధిలేకున్నను సముఁడవై కర్మములఁ జేయుము. సత్త్వశుద్ధిద్వారకమైనజ్ఞానప్రాప్తియందును, అప్రాప్తియందును సమత్వము యోగమనఁబడును.

రా. రాజ్యము, బంధువులు మొదలగువారియందు సంగము విడిచి జయము కలిగినను కలుగకున్నను ఒకేరీతిగా నుండి యుద్ధాదికర్మములం జేయుము.

మధ్వ. యోగస్థుఁడనఁగా ఉపాయమందున్నవాఁడు; సంగమనగా ఫలస్నేహమని తెలియనగు.

శ్లో. దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనఞ్జయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. 49

టీ. హే ధనఞ్జయ=ఓయి అర్జునుఁడా! బుద్ధియోగాత్ = నిష్కామమనోబుద్ధియుక్తకర్మమునకంటె, కర్మ=కామ్యకర్మము, దూరేణ=దూరమగుటచేత, అవరంహి=నికృష్టమయినది కదా, ఫలహేతవః=ఫలములఁగోరి కర్మలఁ జేయువారు, కృప

ణాః=దీనులు. (ఇందుకు శ్రుతి-'యోవా ఏత దక్షర మవిదిత్వా ఽస్మాల్లోకాత్ ప్రైతి స కృపణః'=ఎవఁడు నాశరహితమైన పర మాత్మకుఁ దెలియఁడో వాఁడు పరలోకమునకుఁ బోయినను కృపణుఁడని చెప్పుచున్నది.) (కావున), బుద్ధౌ = జ్ఞానవిష యమై, శరణం = ఆశ్రయమును, అన్విచ్ఛ = కోరుము.

శం. అర్జునా! ఈ సమత్వబుద్ధితోఁగూడి చేసిన కర్మము కన్నను ఫలాపేక్షలతోఁ జేసినకర్మము మిక్కిలి నికృష్టము. కావున నీ వీ సమత్వబుద్ధి నాశ్రయింపుము. పరమార్థజ్ఞానశర ణమునుఁ జెందుము. ఫలాపేక్షతోఁ గర్మములు చేసి తత్ఫలము నకుఁ గారణములై జన్మాదుల నొందువారు దీనులై చెడుదురు.

రా. ఫలత్యాగవిషయంబును, అప్రాప్తప్రాప్త సమత్వ విషయంబునగు బుద్ధితోఁగూడిన కర్మము సాంసారికదుఃఖ ముల నన్నిటిని నివర్తింపఁ జేసి మోక్షమును చెందించును— మిగిలిన కర్మము సంసారమును పొందించును. శరణమనఁగా నివాసస్థానము. ఆబుద్ధియందె నిలుపు మనుట. కృపణులనగా సంసారులు.

మధ్వ. బుద్ధియోగమనగా జ్ఞానస్వరూపమైన యుపాయ ము. శరణమనగా ఉనికి—కర్మమును చేయుటకు ఫలమే హేతువుగాఁ గలవారు ఫలహేతువులు.

శ్లో. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. 50

టీ. బుద్ధియుక్తః = ప్రాప్త్యప్రాప్తులయందు సమత్వబుద్ధి తోఁ గూడినవాఁడు, ఇహ = ఈలోకమందు, ఉభే = రెండైన,

సుకృతదుష్కృతే = పుణ్యపాపములను, జహాతి = త్యజించుచున్నాఁడు. తస్మాత్=ఆకారణమువలన, యోగాయ=బుద్ధి యోగముకొఱకు, యుజ్యస్వ=సిద్ధుఁడవగుము. యోగః=ప్రాప్త్యప్రాప్తులయందు సమత్వబుద్ధియే,కర్మసు=కర్మములయందు, కౌశలం=కుశలత్వము (కలది).

శం. సమత్వబుద్ధితోఁ గూడినవానిని పుణ్యపాపములు రెండును పొందవు. కాఁబట్టి నీవు యోగము నవలంబింపుము. కర్మములు చేయుటయందు యోగము నేర్పరితనముగలదిగా నున్నది.

రా. ప్రాప్త్యప్రాప్తులయందు సమబుద్ధియగు యోగము నేర్పుచేత సాధింపఁదగినది యనుట.

మధ్వ. జ్ఞాని అనిష్టమై మనుష్యాదిఫలమగు సుకృతమును విడిచిపెట్టునుగాని మహాఫలంబై ఉపాసనాదిఫలం బగు సుకృతమును విడువఁడు. కర్మక్షయము శ్రుతిలో నెచ్చట చెప్పియున్నను అజ్ఞానులం గూర్చినదియె. మోక్షములోఁగూడ కోరఁబడిన యన్నిరూపములు కలవాఁడునై జీవి సంచరించుననిశ్రుతిలో పుణ్యానుభవము చెప్పఁబడుచున్నది—దుష్కృతము సంపూర్ణముగా వదలును. యోగ మనగా జ్ఞానోపాయము. అదియె కర్మములలో నేర్పు.

శ్లో. కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్. 51

టీ. బుద్ధియుక్తాః=మోక్షవిషయబుద్ధితోఁ గూడిన, మనీషిణః=ఆత్మానాత్మవివేకజ్ఞులు, కర్మజం = కర్మమువలనఁబుట్టిన,

ఫలం=ఫలమును, త్యక్త్వా=విడిచి, జన్మబంధవినిర్ముక్తాస్సంతః= జన్మమనెడి బంధమువలన విడువఁబడినవారై, అనామయం= సర్వోపద్రవరహితమైన, పదం=స్థానమును, గచ్ఛంతిహి=పొం దుచున్నారు గదా.

శం. ఏల యనఁగా సమత్వబుద్ధితోఁ గూడిన పండితులు కర్మవలనఁ బుట్టినఫలమును విడిచి జన్మబంధమునకు లోఁబడనివా రలై సర్వోపద్రవరహితమైన మోక్షమును బొందుదురు.

రా. బుద్ధియోగముతోఁ గూడినవారై ఫలము విడిచి కర్మ ములఁ జేయువారు సర్వోపద్రవరహితమగు మోక్షమును బొం దుదురు.

మధ్వ. కర్మములను వానిఫలములను గోరక యీశ్వరునకు సమర్పించి, మంచిజ్ఞానముకలవారై మోక్షమును పొందుదురు. యోగముతోఁ గూడినకర్మము జ్ఞానసాధనము. జ్ఞానము మో క్షసాధనము.

శ్లో. యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి,
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. 52

టీ. యదా=ఎప్పుడు, తే=నీయొక్క, బుద్ధిః=బుద్ధి, మోహ కలిలం = దేహాభిమానరూపకలుషమును, వ్యతితరిష్యతి=దాఁ టఁగలదో, తదా=అప్పుడు, శ్రోతవ్యస్య = వినఁదగినయర్థము నకును, శ్రుతస్యచ=వినినయర్థమునకును, నిర్వేదం=వైరా గ్యమును, గంతాసి = పొందఁగలవు. (నిర్వేదమనఁగా తన్ను తానే నిరసించుట).

శం. ఎప్పుడు ఈబుద్ధి యీమోహమును విడిచి విషయము లనుఁగూర్చి అంతఃకరణమును ప్రవర్తింపఁజేసెడి మోహము పోయి, నీబుద్ధి యెప్పుడు పరిశుద్ధమగునో, అప్పుడు నీవు వినవలసినదియు విన్నదియు నిష్ఫలముగాఁ దోఁచును. మనస్సు నిర్విషయమై నిర్మలమై స్వాధీనమైనయెడల ఉపదేశములతో ప్రయోజనము లేదు. జ్ఞానము తనంతటనే కలుగును. అట్టి జ్ఞానమువలన తరింతువు.

రా. చెప్పినచొప్పున కర్మములను చేయుటచే పాపక్షయము కలుగుటకు స్వల్పఫలసంగమునకు హేతువగు మోహమును నీబుద్ధి యెప్పుడు దాఁటునో, అప్పుడు, మాబోటివారిచే నింతకు ముందు త్యాజ్యముగాఁ జెప్పఁబడినదియును, ఇఁకఁ జెప్పఁబడఁబోవునదియు నగు ఫలము మొదలగు దానియందు వైరాగ్యమును పొందును.

మధ్వ. మనస్సునకు మిథ్యాజ్ఞానము పోవుటకు ఈశ్వర సమర్పణముతోఁ కర్మములం జేయవలయును. నిర్వేదమ్ = మిక్కిలి లాభమని యని యర్థము. గొప్పవారిచే వినఁబడఁదగినదియు, వినఁబడినదియు నగు వేదఫలమును పొందుదువు.

శ్లో. శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. 53

టీ. శ్రుతివిప్రతిపన్నా=వేదాంతశ్రవణముచేత ముంచుచలింపఁజేయఁబడిన, తే = నీయొక్క, బుద్ధిః=బుద్ధి, నిశ్చలాసతీ=చలింపనిదై, సమాధౌ=సమాధియందు (శ్లో. 'సమాధిస్సమతావస్థా జీవాత్మపరమాత్మనోః' = జీవాత్మపరమాత్మలయొక్క

సమతావస్థ సమాధి యనంబడును.) యదా=ఎప్పుడు, అచలా=స్థిరమైనదై, స్థాస్యతి = ఉండఁగలదో, తదా=అప్పుడు, యోగం=(కర్మయోగమునకు ఫలమగు తత్త్వజ్ఞాన) యోగరూపమగు జీవన్ముక్తిని, అవాప్స్యసి=పొందఁగలవు.

శం. వేదాంతశ్రవణముచేతఁ జలనమునొందిన నీబుద్ధి యెప్పుడు సమాధియందు నిశ్చలముగా నిలుచునో అప్పుడు జ్ఞానయోగమును, తద్ద్వారా సాయుజ్యమును బొందఁగలవు.

రా. నావలన వినుటవలన విశేషముగాఁ దెలిసికొనినదై నీబుద్ధి ఒకేవిధమునుపొంది మనస్సున ఎప్పుడు నిలుకడగలది యగునో అప్పుడాత్మావలోకనము పొందఁగలవు. శాస్త్రమువలనఁ దెలిసిన ఆత్మజ్ఞానముతోఁ గూడిన కర్మయోగము స్థితప్రజ్ఞతయనెడి జ్ఞాననిష్ఠను కలుగఁజేయును. అది యాత్మావలోకనమును సాధించును.

మధ్వ. నీబుద్ధి మొదట శ్రుతులతో విరుద్ధమైన దయ్యెను, ఎప్పుడు వేదార్థమున కనుకూలమగు తత్త్వనిశ్చయమున విరుద్ధవాక్యములచేఁ గూడ కదల్పఁబడదో అటులైన బ్రహ్మప్రత్యక్షముచేత భేర్యాదులు మ్రోసినను, చలింపనిదియగునో, అప్పుడుపాయసిద్ధి కలవాఁడ వగుదువు.

అర్జున ఉవాచ:—

శ్లో. స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్. 54

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హే కేశవ=ఓకృష్ణా! సమాధిస్థస్య = ఈ చెప్పఁబడిన సమాధియందున్న, స్థితప్రజ్ఞస్య=('బ్రహ్మైవాహమస్మి' అనెడి)

నిశ్చలబుద్ధిగలపురుషునికి, భాషా=వాచకలక్షణము, కా=ఏది? స్థితధీః=బ్రహ్మమునందు నిశ్చలబుద్ధిగల పురుషుఁడు, కిం ప్రభాషేత=ఏమిపలుకును? కిమాసీత=ఎట్లు కూర్చుండును? కిం వ్రజేత=ఎట్లు నడుచును (ప్రవర్తన మెట్టిది.)?

శం. కృష్ణా! సమాధియందున్నవాఁడై నిశ్చలమైన బుద్ధి గలవానికి ఏమి లక్షణము? నిశ్చలబుద్ధిగల పురుషుఁడు ఏమి చేయును? ఎట్లు కూర్చుండును? ఏమి పొందును?

మధ్వ. అర్జునుఁ డెఱిఁగియున్నను లోకోపకారార్థము ప్రశ్న చేయుచున్నాఁడు. స్థితప్రజ్ఞుఁ డనఁగా నిలిచినజ్ఞానముకలవాఁడు. భాషయనగా లక్షణము. సమాధిస్థస్య అనునది లక్షణమైనను, మఱియొకలక్షణమును చెప్పుమని అర్జునుఁడు శ్రీకృష్ణమూర్తి నడుగుచున్నాఁడు.

అవ. ఇట్లర్జునుం డడుగఁగా శ్రీకృష్ణస్వామి యుపదేశించుచున్నాఁడు.—

శ్రీ భగవాన్ ఉవాచ:—

శ్లో. ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్,
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 55

భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హేపార్థ=అర్జునా! యదా=ఎప్పుడు, ఆత్మన్యేవ=ప్రత్యగాత్మస్వరూపమునందే, ఆత్మనా = ఆత్మచే, సంతుష్టస్సన్= ఆనందించుచున్నవాఁడై, మనోగతాన్ = మనస్సును బొందిన, సర్వాన్=సమస్తములైన, కామాన్=తుచ్ఛమనోరథములను,

ప్రజహాతి=విడుచుచున్నాఁడో, తదా=అప్పుడు, స్థితప్రజ్ఞః = నిశ్చలమైన ప్రజ్ఞకలవాఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

శం. అర్జునా! ఆత్మస్వరూపానుభవముచే సంతోషించిన వాఁడై మనస్సునందు కలుగునట్టి సమస్తకామములను ఎప్పుడు విడుచునో అప్పుడు స్థితప్రజ్ఞుఁడని, లేక వెలుపటిలాభములయందపేక్ష లేక తనస్వరూపమునందె తనివిని పొందినవాఁడు స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడును.

రా. ఆత్మైకవిషయం బగు మనస్సుచే సంతోషించినవాఁడై, మిగిలిన యన్నికామములను ఎప్పుడు విడుచునో అప్పుడు స్థితప్రజ్ఞత్వముయొక్క తుదియవస్థ కలుగును. ఈ యవస్థ వశీకార మను పేరుగల నాలుగవయవస్థ.

మధ్వ. పరమాత్మయందె పరమాత్మతో నున్నవాఁడై తఱుచుగా నన్ని కోరికలను విడుచుచున్నాఁడు. పరమాత్మయం దున్నవానికి పరమాత్మప్రసాదంబుననే సంతోషము కలుగును.

శ్లో. దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే. 56

టీ. దుఃఖేషుసత్సు=ఆధ్యాత్మికాదిదుఃఖములు గలుగుచుండఁగా, అనుద్విగ్నమనాః=భయపడనిమనస్సుగలవాఁడును, సుఖేషు=సుఖములందు, విగతస్పృహః=ఆశలేనివాఁడును, వీతరాగభయక్రోధః - వీత=పోఁగొట్టఁబడిన, రాగ = ప్రీతియు, భయ=భయమును, క్రోధః=రోషమునుగలవాఁడునగు, ము

నిః=సన్న్యాసి, స్థితధీః=నిశ్చలబుద్ధిగలవాఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

శం. దుఃఖములు కలిగినప్పుడు కలఁతవడని మనస్సుగలవాఁడును, సుఖములయం దాశలేనివాఁడును, రాగము, భయము, క్రోధము లేనివాఁడు నగుముని స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

రా. ఇది ఏకేంద్రియ మనుపేరుగల మూఁడవ యవస్థను తెలుపునది. ముందు నాల్గవయవస్థను వివరించినాఁడు. ఇందు దుఃఖములనఁగా ఇష్టమైన వస్తువులు లేకపోవుట మొదలగు దుఃఖనిమిత్తములు - సుఖములనఁగా ఇష్టమైనవి. రాగము - తనకు లేనివానియందలి కోరిక; భయము-ఇష్టమైనదిపోవుటయు, అనిష్టమైనది వచ్చుటయు, వానికి కారణంబులగువానిం జూచి దుఃఖించుటయు; క్రోధము అనగా ఇష్టము పోవుటవలనను అనిష్టము కలుగుటవలనను కలిగినదై, దుఃఖకరమై తనలో కలిగెడి మనోవికారము. ముని యనఁగా నాత్మను మననముచేయు స్వభావముకలవాఁడు అని పదార్థములు.

మధ్వ. రాగ మనగా చెడ్డ విషయములను మంచివిషయములనుగా గ్రహించుట.

శ్లో. యస్సర్వ త్రానభిస్నేహ స్తత్తత్ ప్రాప్య శుభాశుభమ్,
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57

టీ. యః = ఏపురుషుడు, సర్వత్ర=దేహము, ప్రాణము మొదలగువానియందంతటను, అనభిస్నేహః=ఉదాసీనునివలె స్నేహములేనివాఁడై, తత్తచ్ఛుభాశుభం=ఆయాశుభాశుభముల

ను, ప్రాప్య=పొంది, నాభినందతి=సంతోషింపఁడో, న ద్వేష్టి=ద్వేషింపఁడో (అనఁగా శుభమును గూర్చి సంతోషమును, అశుభమునుగూర్చి దుఃఖమును బొందఁడో), తస్య=ఆపురుషునియొక్క, ప్రజ్ఞా=బుద్ధి, ప్రతిష్ఠితా=మిక్కిలిస్థిరమైనది.

శం. ఎవఁడు దేహప్రాణములయందంతటను స్నేహము లేనివాఁడై యాయాశుభాశుభములను బొంది శుభముచే సంతోషమును, అశుభముచే దుఃఖమును పొందకయుండునో వాని బుద్ధి నిశ్చలమని చెప్పఁబడును.

రా. ఇది వ్యతిరేకమను పేరుగల రెండవ యవస్థావివరణము. శుభ మనగా ఇష్టమైనది కలుగుట; అదిపోవుట అశుభము.

మధ్వ. అంతట స్నేహము లేక యుండుట శుభాశుభములచే సంతోష ద్వేషములు లేకపోవుటకు హేతువు.

శ్లో. యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః,
ఇంద్రియా ణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58

టీ. యదా=ఎప్పుడు, అయం=ఈయోగి, ఇంద్రియార్థేభ్యః=సర్వవిషయములవలనను, ఇంద్రియాణి=శ్రోత్రాదీంద్రియములను, కూర్మః=తాఁబేలు, సర్వశః=అంతట, అంగానీవ=అవయవములనువలె, సంహరతే = ఇమిడించుచున్నాఁడో, తదా=అప్పుడు, తస్య=ఆయోగియొక్క, ప్రజ్ఞా=బుద్ధి, ప్రతిష్ఠితా=మిక్కిలి స్థిరమైనది.

శం. యోగి ఎప్పుడు తాఁబేలు తనయవయవములను లోపలికి ముడుచుకొనునట్లు తనయింద్రియముల నన్నిఁటిని విష

యములనుండి యుపసంహరించుకొనునో, అప్పుడు వానిబుద్ధి నిశ్చల మని చెప్పఁబడును.

రా. ఇది యతమాన మనెడి ప్రథమదశవివరణము - ఇంద్రియములను విషయములనుండి మఱలించి మనస్సును ఆత్మయం దునుచుయోగియొక్క బుద్ధి నిశ్చలమని చెప్పఁబడును.

శ్లో. విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽ ప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. 59

టీ. నిరాహారస్య దేహినః=ఆహారములేని (అనఁగా ఇంద్రియములచేత నింద్రియార్థగ్రహణముఁ జేయునట్టి) దేహాభిమానము గల అర్జునకు, విషయాః=శబ్దాదివిషయములు, రసవర్జం=అభిలాషతక్క, వినివర్తంతే = నివర్తింపుచున్నవి, పరం=పరమాత్మను, దృష్ట్వా=చూచి, అస్య=ఈ స్థితప్రజ్ఞునికి, రసోఽపి=అభిలాషయును, నివర్తతే=నివర్తించుచున్నది.

శం. అట్లుగాక ఆహారముమాత్రము విడిచిన దేహికి విషయములుమాత్రమే నివర్తిల్లును గాని వానియందలి యభిలాష విడువదు. పరమాత్మను దలఁచినపిమ్మట నాయభిలాషయును నశించును; అనగా - జ్ఞానము పరిపక్వముగాకున్న రాగము నివర్తింపదు కాఁబట్టి సంపూర్ణజ్ఞానముచేత రాగలేశమైనను లేకుండఁబోవునట్లు చేసికొనవలయును.

రా. ఇంద్రియముల కాహారము విషయములు. విషయముల కంటె సుఖకరమైన ఆత్మస్వరూపమును కనఁగానే రాగము తనంతట తానే మఱలుచున్నది అని.

మధ్వ. ఆహారములేనివాని కితరవిషయముల ననుభవించెడి శక్తి లేక పోవును. మిగిలినవిషయములయందలి కోరికయైన లేకపోవును. రసముసు (రుచిని) కోరుట యనునది నివర్తింపదు. అది అపరోక్షజ్ఞానమువలననె మఱలును. రసమనఁగ రుచియే కాక రాగ మనియుం గూడ చెప్పనగు.

శ్లో. యతతో హ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
　ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః.　　60

టీ. హేకౌంతేయ = ఓయర్జునా! ప్రమాథీని=బలవంతములైన, ఇంద్రియాణి=ఇంద్రియములు, యతతః=బ్రహ్మప్రాప్తికొఱకు యత్నముచేయుచున్న, విపశ్చితః=వివేకియైన, పురుషస్య=పురుషునియొక్క, మనః=మనస్సును, ప్రసభం=బలాత్కారముగా, హరంతిహి=ఆకర్షించుచున్నవిగదా.

శం. ఓ యర్జునా! పండితుఁడైనవాఁడెంతప్రయత్నికతోనున్నప్పటికిని బలవంతమైన యింద్రియములు వానిమనస్సును బలాత్కారముగా నాకర్షించును.

రా. ఇంద్రియంబుల జయించుట యాత్మదర్శనంబునంగాని కలుగనేరదు. కాఁబట్టి జ్ఞాననిష్ఠ దుర్లభమైనది.

మధ్వ. అపరోక్షజ్ఞానము లేక వట్టిజ్ఞానము కలవాఁడైనను సాధారణమైన యత్నము కలవాఁడైనను శరీరాభిమాని యగు వానిమనస్సును ఇంద్రియములు లాగుచున్నవి అని.

శ్లో. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
　వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.　　61

టీ. యుక్తః=యోగి, తాని సర్వాణి=ఆసకలేంద్రియముల ను, సంయమ్య=సంగ్రహించి, మత్పరస్సన్=అందఱకు నాత్మ నైననేను పరుఁడుగాఁగలవాఁడై, నాయందాసక్తుఁడైనవాఁడై, ఆసీత=ఉండవలెను; యస్య=ఎవనికి, ఇంద్రియాణి=ఇంద్రియ ములు, వశే=తనవశమందు (వర్తించుచున్నవో), తస్య=ఆపు రుషునియొక్క, ప్రజ్ఞా=బుద్ధి, ప్రతిష్ఠితా = బ్రహ్మమందు స్థిర మైనది.

శం. కాఁబట్టి ఆయింద్రియము లన్నిటిని నిగ్రహించి యో గముపూనినవాఁడై నాయందే మనస్సునుంచి యుండవలెను. ఏలయనఁగా నెవనికి నింద్రియములు స్వాధీనమగునో వానిబు ద్ధి నిశ్చలమగును. ఎవఁడు ఇంద్రియములను స్వాధీనముచేసికొ నునో, వాఁడే స్థితప్రజ్ఞుఁడు.

రా. 'మత్పరః' అనుదానికి నాయందు మనస్సును ఉంచిన వాఁడై అని యర్థము చేసి, భగవంతునియందు ఆరోపింపఁబడి నమనస్సు అన్ని పాపములు నశించుటవలన నిర్మలమై విష యానురాగములేనిదై ఇంద్రియములను స్వాధీనముచేసికొను ను. అట్లు చేసికొనువాఁడే స్థితప్రజ్ఞుఁడు.

మధ్వ. మిక్కిలి ప్రయత్నములుగలవానికి ఇంద్రియము లు స్వాధీనమగును. నాయందు మనస్సుకలవాఁడై సమస్తము కన్నను నన్ను నుత్కృష్టునిగా నెవ్వఁ డెఱుంగునో, అట్టి యో గియే స్థితప్రజ్ఞుఁడు.

శ్లో. ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.

టీ. విషయాన్=విషయములను, ధ్యాయతః=చింతించుచున్న, పుంసః=పురుషునకు, తేషు=ఆవిషయములయందు, సంగః=ఆసక్తి, ఉపజాయతే=పుట్టుచున్నది, సంగాత్ = ఆవిషయాసక్తివలన, కామః = కోరిక, సంజాయతే=పుట్టుచున్నది. కామాత్=కోరికవలన, క్రోధః = క్రోధము, అభిజాయతే= పుట్టుచున్నది.

శం. పురుషుఁడు విషయములను ధ్యానించుటచేత వానియందతనికి నాసక్తికలుగును. ఆయాసక్తివలన కామము కలుగును, కామముచేత క్రోధము కలుగును.

శ్లో. క్రోధాద్భవతి సమ్మోహ స్సమ్మోహాత్ స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి. 63

టీ. క్రోధాత్=క్రోధమువలన, సమ్మోహః=వివేకశూన్యత, (భవతి=కలుగుచున్నది). సమ్మోహాత్=ఆవివేకశూన్యతవలన, స్మృతివిభ్రమః=గురూపదిష్టమార్గభ్రంశము (మఱపు), భవతి=కలుగుచున్నది. స్మృతిభ్రంశాత్ = ఆవిస్మృతివలన,బుద్ధినాశః=బుద్ధిభ్రంశము(అంతఃకరణముచెడుటఇదిచేయఁదగినది ఇదిచేయఁదగనిది అనుజ్ఞానభ్రంశము.) (భవతి=కలుగుచున్నది). బుద్ధినాశాత్=బుద్ధినాశమువలన, ప్రణశ్యతి = మిక్కిలి చెడిపోవుచున్నాఁడు.

శం. క్రోధమువలన మోహము గలుగును, మోహమువలన గురూపదిష్టమైన అర్థమునకు విస్మృతి యగును, ఆవిస్మృతివలన బుద్ధి నశించును, ఆబుద్ధి నశించుటవలనఁ దానే నశించును.

రా. 62 - వ శ్లోకమున - కామము = విషయములను అనుభవింపక నిలువలేకపోవుట. సమ్మోహము = కార్యాకార్యవివేకము లేకపోవుట. స్మృతిభ్రంశము = తాను నడిపించుచున్న ఇంద్రియజయాదుల మఱచుట. బుద్ధినాశము = ఆత్మజ్ఞానమందలి నిశ్చయముపోవుట. దానివలన నశించుట యనగా సంసారములోఁ బడుటయే. సమ్మోహము = అకార్యములయందలి కోరిక. స్మృతివిభ్రమము = శాస్త్రనిషేధములను మఱచుట. బుద్ధి నాశము = అన్నివిధములను దోషమనెడి జ్ఞానమే లేకపోవుట. ప్రణశ్యతి = నరకము మొదలగు అనర్థములను పొందుచున్నాఁడు.

శ్లో. రాగద్వేషవిముక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. 64

టీ. రాగ = అభిలాష, ద్వేష = అప్రియము - ఈ రెంటిచేతను, విముక్తైః = విడువఁబడినవిగనుకనే, ఆత్మవశ్యైః = తన కధీనములైన, ఇంద్రియైః = ఇంద్రియములచేత, విషయాన్ = ఇంద్రియవిషయములను, చరన్నపి = అనుభవించుచున్నవాఁడైనను, విధేయాత్మా = స్వాధీనమయిన మనస్సుగలపురుషుఁడు, ప్రసాదం = నిర్మలత్వమును, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

శం. అందువలన రాగద్వేషములను వదలి స్వాధీనములైన యింద్రియములచేత శరీరము నిలుచుటకై విడువ శక్యము కాని విషయముల ననుభవింపుచు స్వాధీనమైన మనస్సుగల యోగి నిర్మలుఁ డగును - లేక స్వస్థతఁ జెందును.

రా. అందువలన రాగద్వేషములను వదలి స్వాధీనములైన యింద్రియములచేత విషయములను దిరస్కరించినవాఁడై యోగి నిర్మలమైన మనస్సును కలిగియుండును.

మధ్వ. విషయముల ననుభవింపుచున్నను జయింపఁబడిన మనస్సుకలవాఁడు మనోనిర్మలత్వమును పొందుచున్నాఁడు.

శ్లో. ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి. 65

టీ. అస్య=ఈయోగికి, ప్రసాదే సతి=నైర్మల్యము కలుగుచుండఁగా, సర్వదుఃఖానాం=సమస్తదుఃఖములకు, హానిః=నాశము, ఉపజాయతే=పుట్టుచున్నది. ప్రసన్నచేతసః = స్వచ్ఛమైన మనస్సుగలపురుషునకు, ఆశు=శీఘ్రముగా, బుద్ధిః=నిశ్చయాత్మకబుద్ధి, పర్యవతిష్ఠతి=స్థిరముగా నిలుచుచున్నది.

శం. నిర్మలత్వము కలుగుటవలన వీనికి సమస్తదుఃఖములును నశించును. ఎందువల్ల ననఁగా ప్రసన్నమై నిర్మలమైన మనస్సుగలవానికి శీఘ్రముగా బుద్ధి యాకాశమువలె నంతటనుండునదియై స్థిరపడును.

రా. ప్రసన్నచేతసః = ఆత్మావలోకనమునకు విరుద్ధములగు దోషములులేని మనస్సుగలవానికి ప్రత్యేకముగా నాత్మవిషయమైన జ్ఞానము సులభముగా స్థిరపడును.

మధ్వ. తనప్రయత్నము లేకమైనను తఱుచుగా విషయములయందు ఇంద్రియాదులను ప్రవర్తింపక పోవునట్లు చేయుటంజేసి, బ్రహ్మోపరోక్షత్వముచేత లెస్సగా జ్ఞానము స్థిరపడును.

శ్లో. నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా,
న చాభావయతశ్శాంతిరశాంతస్య కుతస్సుఖమ్. 66

టీ. అయుక్తస్య=ఇంద్రియనిగ్రహము లేనివానికి, బుద్ధిః= ఆత్మవిషయబుద్ధి, నాస్తి=లేదు. అయుక్తస్య = ఆయింద్రియనిగ్రహములేనివానికి, భావనాచ = ఆత్మస్వరూపాభినివేశమును, నాస్తి=లేదు. అభావయతః=బ్రహ్మభావనచేయనివానికి, శాంతిః =చిత్తోపరతి, నాస్తి=లేదు. అశాంతస్య=చిత్తోపరతిలేనివానికి, సుఖం=బ్రహ్మానందసుఖము, కుతః=ఎక్కడిది ?

శం. ఇంద్రియనిగ్రహము లేనివానికి నాత్మవిషయబుద్ధి కలుగదు. మఱియును, ఆత్మస్వరూపభావనయుఁ గలుగదు. ఆత్మభావన లేనివానికిఁ జిత్తోపరతి కలుగదు. చిత్తోపరతి లేనివానికి సుఖము లేదు. కాఁబట్టి విషయములను వాసనతోఁ గూడ విసర్జించి మనస్సుతోఁ గూడ నింద్రియములను వశపఱచుకొని నిరంతరబ్రహ్మనిష్ఠుఁడైనవాఁడే జీవన్ముక్తుఁ డనఁబడును.

రా. యోగము = భగవంతునియందు మనస్సు నుంచుట - భావనము = ఆత్మధ్యానము. శాంతి = విషయములయందలి స్పృహ (ఆశ) యుడుగుట - ఇది లేనివానికి, నిత్యమై, ఇంతకంటె నెక్కుడు లేదనఁదగిన సుఖము కలుగదు.

మధ్వ.—అయుక్తుఁడు=మనోనిగ్రహములేనివాఁడు. బుద్ధి = మంచిజ్ఞానము. శాంతి = మోక్షము

అవ. ఇంద్రియముల జయింపనివానికిఁ గలుగు ననర్థమును జెప్పుచున్నాఁడు—

శ్లో. ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి. 67

టీ. ఇంద్రియాణాం=ఇంద్రియములు, చరతాం= (విషయములయందు) సంచరించుచుండఁగా, యన్మనః = ఏమనస్సు, అనువిధీయతే=పురుషునిచేత నియమింపఁబడక యింద్రియములచే వెనువెంటఁ ద్రిప్పఁబడుచున్నదో, తత్=ఆమనస్సు, అస్య=ఈపురుషునియొక్క, ప్రజ్ఞాం = ఆత్మానాత్మవివేకమును, అంభసి=ఉదకమునందు,నావం=ఓడను,వాయురివ=ప్రతికూలవాయువువలెనే, హరతిహి=ఆకర్షించుచున్నది గదా !

శం. యథేచ్ఛగా విషయములయందు తిరుగుచున్న యింద్రియములకు మనస్సు లోఁబడునేని ఆమనస్సు సముద్రమునందు పెనుగాలి ఓడనువలె పురుషునియాత్మ బుద్ధిని హరించును. అనఁగా విషయాసక్తముగఁ జేయుచున్న దనిభావము.

రా. వాయుః=ఎదురుగాలి, ప్రజ్ఞ=ప్రత్యేకముగానాత్మను తెలిసికొనుట యని.

మధ్వ. ఎవనిమనస్సు ఈశ్వరునిచేతఁ జేయఁబడుచున్నదో, యామనస్సు ఇంద్రియములకు లోఁబడునేని వానిశ్రేష్ఠమైన జ్ఞానము విషయాసక్తమై తిరస్కరింపఁబడినదే కాక పుట్టఁబోవుదానిం గూడ నివారింపుచున్నది.

శ్లో. తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 68

టీ. హేమహాబాహో=ఓయి అర్జునుఁడా! తస్మాత్=ఆ కారణమువలన, యస్య=ఎవనియొక్క, ఇంద్రియాణి=ఇంద్రియములు, సర్వశః=అంతటను, ఇంద్రియార్థేభ్యః = విషయముల నుండి, నిగృహీతాని = నిగ్రహింపఁబడుచున్నవో, తస్య=ఆ పురుషునియొక్క, ప్రజ్ఞా=బుద్ధి, ప్రతిష్ఠితా=మిక్కిలి స్థిరమైనది.

శం. ఓ యర్జునా! అందువలన నెవఁడు తనయింద్రియముల నన్నిఁటిని దద్విషయములనుండి నిగ్రహించునో వానిబుద్ధి నిశ్చల మగును.

మధ్వ. కాఁబట్టి సమస్తవిధముల నిగ్రహింపఁ బడిన యింద్రియములు కలవాఁడె జ్ఞాని.

శ్లో. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. 69

టీ. యా=ఏయాత్మవిషయమైనబుద్ధి, సర్వభూతానాం=(బుద్ధిరహితులైన) సర్వప్రాణులకు, నిశా=గోచరము కాకపోవుటవలన రాత్రియగుచున్నదో, తస్యాం = ఆయాత్మవిషయమైన బుద్ధియందు, సంయమీ=ఇంద్రియనిగ్రహముగల పురుషుఁడు, జాగర్తి=మేలుకొనియుండును (అనఁగా నాత్మావలోకనముచేయుచుండు ననుట). యస్యాం=శబ్దాదివిషయమైన ఏబుద్ధియందు, భూతాని=సమస్తప్రాణులు, జాగ్రతి = మేలుకొనుచున్నవో, సా=ఆశబ్దాదివిషయబుద్ధి, పశ్యతః = ఆత్మావలోకనపరుఁడయిన, మునేః=మననశీలునకు, నిశా=అవిద్యాస్వరూపమగుటవలన రాత్రివలె నప్రకాశమగుచున్నది.

శం. సర్వప్రాణులకుఁ దెలియకపోవుటవలన నేది రాత్రివలెఁ దోఁచునో ఆయాత్మను యోగియైనవాఁడు తెలిసినవాఁడై చూచుచుండును. దేనిని సమస్తప్రాణులు జాగరూకములై చూచుచుండునో ఆశబ్దాదివిషయములును జ్ఞాని యగువానికి రాత్రివలెఁ బ్రకాశింపకుండును. సర్వప్రాణులకు రాత్రియగునది పరమార్థతత్త్వము. దానిని యోగి యానందముతోఁ జూచుచుండును. సర్వప్రాణులకు జాగ్రత్కాలమనునది లౌకిక వైదిక వ్యవహారములు. వీనియందు విషయస్ఫూర్తి లేనివాఁడై యోగి ప్రకాశింపకుండును.

రా. సర్వభూతములకు రాత్రియగునది ఆత్మజ్ఞానము. జ్ఞానికి రాత్రి యగునది శబ్దాదివిషయజ్ఞానము.

మధ్వ. సమస్తభూతములకు రాత్రియనునది పరమేశ్వరస్వరూపము. దానియందు జ్ఞాని మేలుకొనుటయనగా లెస్సగా అపరోక్షజ్ఞానము కలవాఁడగుట జ్ఞానికిరాత్రి విషయస్వరూపము. ముని=మననముకలవాఁడు.

శ్లో.ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్,
తద్వ త్కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ. 70

టీ. ఆపూర్యమాణం=(నానానదీజలములచేత)నిండింపఁబడినదియును.అచలప్రతిష్ఠం=మర్యాదనతిక్రమించకయున్న, సముద్రం=సముద్రుని,ఆపః=అన్యప్రవాహజలములు, యద్వత్=ఏప్రకారముగా,ప్రవిశంతి=ప్రవేశించుచున్నవో,తద్వత్=అప్ర

కారముగా,సర్వే=సమస్తములైన, కామాః= శబ్దాదివిషయములు,యం=ఏయింద్రియనిగ్రహముగలపురుషుని,ప్రవిశంతి=ప్రవేశంచుచున్నవో,సః=ఆపురుషుఁడు, శాంతిం= కేవలబ్రహ్మైక్యమును, ఆప్నోతి=పొందుచున్నాఁడు. కామకామీ=విషయములయం దభిలాషగలవాఁడు, న ఆప్నోతి= శాంతినిపొందఁడు.

శం. నదీనదాదిప్రవాహములచే నిండింపఁబడుచున్నను తన హద్దుమీఱనిదియై సముద్రమెట్లు తననోటికివచ్చుజలము లన్నిటిని గ్రహించుచుఁ గొంచెమైనను వికారముపొందకయుండునో, అట్లే శబ్దాదిసమస్తవిషయములను గ్రహించుచున్నను కొంచెమైనను వికారము పొందకయుండుయోగి శాంతిని బొందునుగాని, విషయములను గోరువాఁ డెన్నటికిని శాంతిఁ బొందఁడు-సమస్తమైనకోరికలును ఎవ్వనికి ఆత్మయందె యణఁగుచున్నవో, వాఁడు మోక్షమును పొందు.

రా. శబ్దాదివిషయము లింద్రియగోచరములైనను కాకున్నను, ఎవ్వఁడు తనయాత్మావలోకనతృప్తిచేత వికారము లేనివాఁడై యుండునో, వాఁడె నిస్పృహతను బొందును.

మధ్వ. ఎవ్వఁడు విషయములచే నావరింపఁబడినవాఁడయ్యును, గర్వము లేకుండునో, ప్రయత్నమును చేయఁడో, విషయములు లేనిచో శోషింపఁడో, వాఁడు మోక్షముం జెందును.

శ్లో. విహాయ కామాన్ యస్సర్వాన్
పుమాంశ్చరతి నిస్స్పృహః,

నిర్మమో నిరహంకారః
స శాంతి మధిగచ్ఛతి. 71

టీ. యః పుమాన్=ఏపురుషుఁడు, సర్వాన్=సమస్తములైన, కామాన్=కామములను, విహాయ=విడిచి, నిస్పృహః=కాంక్షావిరహితుఁడును, నిర్మమః=నేను నాది యనుసంకల్పమును వదలినవాఁడును, నిరహంకారః=నేనని యభిమానపడనివాఁడునునై, చరతి= (జీవనమాత్రచేష్టావశిష్టుఁడయి) సంచరించుచున్నాఁడో, సః=ఆపురుషుఁడు, శాంతిం=మోక్షమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

శం. ఏపురుషుఁడు సమస్తకామములను విడిచి దేనియందును నాశలేనివాఁడై అహంకారమును, మమకారమును లేనివాఁడై యుండునో యతఁడు శాంతిఁ బొందును.

రా. కామములు = కోరఁబడు శబ్దాదివిషయములు. నిరహంకారః=దేహమునందాత్మాభిమానము లేనివాఁడు.

మధ్వ. కామములు = విషయములు. చరతి=భక్షించుచున్నాఁడోయని యర్థము. నేను భక్షించుచున్నానను నహంకార మమకారములు లేనివాఁడై ముక్తిని పొందును.

శ్లో. ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72

టీ. హేపార్థ=అర్జునా! ఏషా=ఈ, స్థితిః=నిష్ఠ, బ్రాహ్మీ=బ్రహ్మమందుఁబుట్టినది. ఏనాం=ఈబ్రహ్మనిష్ఠను, ప్రాప్య=పొంది, నవిముహ్యతి=మోహమును చెందఁడు. అస్యాం=ఈబ్రహ్మనిష్ఠయందు, అంతకాలేఽపి=దేహావసానసమయమందైనను, స్థిత్వా

=నిలిచి, బ్రహ్మనిర్వాణం=మోక్షమును, ఋచ్ఛతి=పొంద చున్నాఁడు.

శం. ఓ యర్జునా! ఇది బ్రహ్మనిష్ఠ యనఁబడును. దీనిఁ బొందినవాఁడు మోహము నొందఁడు. మరణకాలమునం దైన నీబ్రహ్మనిష్ఠఁ బొందినవాఁడు మోక్షమునొందును. బ్రహ్మచర్యమునం దుపన్యసించిన జీవనకాలమంతయు బ్రహ్మమునం దె యున్నవానికి మోక్షము కలుగునని చెప్పవలయునే.

రామా. నిత్యాత్మజ్ఞానము కలవాఁడై సంగములేని కర్మముల నాచరించుటయే బ్రహ్మమును పొందించునది కాన 'బ్రాహ్మీస్థితిః' అని చెప్పఁబడినది. ఇట్టి కర్మస్థితినిబొంది తిరిగియుండు సంసారమును జెందఁడు. బ్రహ్మనిర్వాణమును అనఁగా నిర్వాణమయమగు బ్రహ్మను - అనఁగా ఘనైకస్వరూపంబగు నాత్మను పొందుచున్నాఁడు.

మధ్వ. బ్రాహ్మీ=బ్రహ్మవిషయమగు, స్థితిః = లక్షణము-అంతకాలమందైనను ఈస్థితిలో నిలిచియే బ్రహ్మమును జీవి చేరుచున్నాఁడు. లేనియెడ జన్మాంతరమునందైనను పొందుచున్నాఁడు. జ్ఞానులకుఁగూడ ప్రారబ్ధకర్మమున్నయెడ, మఱియొకజన్మమున కలుగును. 'నిర్వాణం బ్రహ్మ=శరీరములేని బ్రహ్మను' శరీరము లేకుండుట. యనఁగా, ప్రకృతివలన కలిగిన శరీరములేకుండుటగాని, ఎల్లప్పుడును ఆనందరూపమై అంతటను పరిపూర్ణమైన అప్రాకృతశరీరము లేకపోవుటకాదు. ఆశరీరమునె తనమాయచేత పరిచ్ఛిన్నముచేసి రామకృష్ణాదిరూపముగాఁ జూపును. ఎల్లప్పుడును అన్నిశరీరములయందున్న

లెక్కలేని యనంతములైన గుణసహితమును, దోషరహితము నగు నారాయణుఁడను పరబ్రహ్మము అపరోక్షజ్ఞానముచే పొందుచున్నాఁడు.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సాఙ్ఖ్య
యోగోనామ ద్వితీయోఽధ్యాయః.

ఉపనిషదర్థ ప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యా ప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, కృష్ణార్జునులసంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయందు సాఙ్ఖ్యయోగ మనెడి
ద్వితీయాధ్యాయము.

---

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## క ర్మ యో గః.

అవ. అర్జునుఁడు పూర్వోక్తములైన భగవద్వాక్యములను విని జ్ఞానకర్మములలో మోక్షసాధనం బిది యని తెలియక మరల భగవంతునిఁ బ్రశ్నచేయుచున్నాఁడు.—

అర్జున ఉవాచ.—

శ్లో. జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన,
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ. 1

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.—

టీ. హేజనార్దన= ఓకృష్ణా! బుద్ధిః=(కర్మమూలమైన)జ్ఞానము, కర్మణః=కర్మమునకంటె, జ్యాయసీ=శ్రేష్ఠమైన దని, తే= నీకు, మతా చేత్ = ఇష్టమైన దాయెనేని, తత్కిం=అప్పు డెందువలన, ఘోరే = భయంకరమైన, కర్మణి = కర్మమందు, మాం=నన్ను, నియోజయసి=ప్రవర్తింపఁజేయుచున్నావు?

శం. ఓకృష్ణా! నీకు కర్మమునకంటె జ్ఞానమే శ్రేష్ఠమని యభిప్రాయమైనయెడల నన్ను భయంకరమైన యీ కర్మము చేయుమని యేల ప్రేరేపించుచున్నావు? ఈయర్జునుని ప్రశ్నచేత జ్ఞానముతో సమానముగా కర్మాచరణ చేయఁగూడదని స్పష్టముగా తెలియుచున్నది.

రా. జ్ఞాననిష్ఠ లేనియెడల ఆత్మావలోకనము కలుగఁజాలదు. కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠకు మూలము. ఇంద్రియవ్యాపారము లుడుగుటచే ఆత్మావలోకనము కలుగును. దానినే సాధింపవలయు నంటివేని సకలకర్మములనుండి నన్ను మరలించి జ్ఞానసాధనకై నన్ను నియోగింపుము. కర్మము సర్వేంద్రియ వ్యాపారరూప మైనది. అట్టి కర్మమున నన్నేల నియోగించెదవు?

మధ్వ. జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠకన్న నుత్తమ మని చెప్పితివి. అది నిశ్చయమే యైనయెడల నివృత్తికర్మములను వదలి ప్రవృత్తికర్మమగు ఘోరరణమను కర్మమునందు నన్నేల నియోగించెదవు ?

శ్లో. వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,
　తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్.

టీ. వ్యామిశ్రేణైవ = మిశ్రితమయినదానివలె నున్న, వాక్యేన = (సంశయప్రద)వాక్యముచేత, మే = నాయొక్క, బుద్ధిం = బుద్ధిని, మోహయసీవ = మోహింపఁజేసెడి వానివలె నున్నావు? అహం = నేను, యేన = దేనిచేత, శ్రేయః = మోక్షమును, ఆప్నుయామ్ = పొందుదునో, ఏకం = ఈ జ్ఞాన కర్మములలో నొకటైన, తత్ = దానిని, నిశ్చిత్య = నిర్ణయించి, వద = చెప్పుము.

శం. నీమాట స్పష్టార్థము కాకయుండుటవల్ల నాబుద్ధికి భ్రమ కలుగుచున్నది. కాఁబట్టి నాకు దేనిచేత శ్రేయస్సు కలుగునో అట్టిది యొకటిగా నిశ్చయించి చెప్పుము.

అవ. ఇట్లర్జునునిచేతఁ బ్రశ్నచేయఁబడినభగవంతుఁ డానతి చ్చుచున్నాఁడు.—

శ్రీ భగవాన్ ఉవాచ.—

శ్లో. లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

శ్రీకృష్ణుఁడు పలుకుచున్నాఁడు.—

టీ. హే అనఘ=పాపరహితుఁడవైన అర్జునా! పురా=ముందు, అనఁగా సృష్ట్యాదియందు—వేదార్థ సంప్రదాయములు వెలిపుచ్చినప్పుడు, అస్మిన్ లోకే=ఈ లోకమునందు, మయా=నాచేత, సాంఖ్యానాం = ఆత్మానాత్మ వస్తువివేకము గలవారలకు, జ్ఞానయోగేన = జ్ఞానయోగముచేతను, యోగినాం = చిత్తశుద్ధిగల యోగులకు, కర్మయోగేన = కర్మయోగముచేతను, ద్వివిధా=రెండుప్రకారములుగల, నిష్ఠా=స్థితి, ప్రోక్తా=చెప్పఁబడెను.

శం. అర్జునా! ఈలోకంబున బ్రహ్మచర్యాశ్రమమునందె సంన్యసించిన పరమహంస పరివ్రాజకులకు జ్ఞానయోగముచేతను, కర్మనిష్ఠులకు కర్మయోగముచేతను ముక్తిగలుగునని రెండువిధములైన నిష్ఠలను మున్ను చెప్పితిని.

రా. సంఖ్య యనగా బుద్ధి, దానితోఁ గూడినవారలు సాంఖ్యులు=ఆత్మమాత్రవిషయమగు జ్ఞానముఁకలవారు. యోగులు ఆత్మమాత్రవిషయమగు జ్ఞానమునకు తగనివారు. విషయాదులయందు చరించెడి బుద్ధికలవారికి కర్మయోగాధికారము; వానియందు వ్యాకులముకాని బుద్ధికలవారికి జ్ఞానయోగాధికా

రము. కాఁబట్టి భగవంతుఁడు వ్యామిశ్రవాక్యమును చెప్పలేదు.

మధ్వ. నైష్ఠికులు రెండుతెఱఁగులుగ నున్నారు. సనకాదులవలె గృహస్థాది కర్మములను వదలిన జ్ఞాననిష్ఠులును, జనకాదులవలె గృహస్థాద్యాశ్రమముల నుండియె జ్ఞాననిష్ఠ కల వారును. ఇందు సనకాదులు సాంఖ్యులు, జనకాదులు యోగులు. నీవు జనకాదులవలెఁ గర్మము నాచరించుచునె జ్ఞానమునకుఁ దగినవాఁడవు.

శ్లో. న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి.

టీ. పురుషః=పురుషుఁడు, కర్మణాం=యజ్ఞాదికర్మములయొక్క, అనారంభాత్ = చేయకపోవుటవలన, నైష్కర్మ్యం= క్రియారహితమైన నిశ్చయమును, నాశ్నుతే=పొందఁడు. (ఇందుకు స్మృతి - శ్లో. 'జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః, యథా దర్శతలప్రఖ్యే పశ్య త్యాత్మాన మాత్మని' పాపకర్మములు నశించుటవలన జ్ఞానము కలుగుచున్నది. పిమ్మట అద్దమువలె నిర్మలమైన తనయందుఁ బరమాత్మను జూచుచున్నాఁడని తాత్పర్యము.) సన్న్యసనా దేవ = జ్ఞానరహితకర్మసన్న్యాసమాత్రమువలననే, సిద్ధిం = నైష్కర్మ్యలక్షణసిద్ధిని, న సమధిగచ్ఛతి=పొందఁడు గదా!

శం. కర్మములను అనుష్ఠింపకపోవుటవల్లనే పురుషునకు కర్మశూన్యత కలుగదు. కర్మములను విడిచినంతమాత్రముననే జ్ఞానయోగనిష్ఠ సిద్ధింపదు. ఏ జన్మమునందుఁగాని చేసినకర్మములు పాపక్షయకారణము లగుటచేత, అంతఃకరణశుద్ధిని గలు

గఁజేసి జ్ఞానోత్పత్తికి హేతువు లగును. అంతఃకరణశుద్ధి లేక వట్టి కర్మపరిత్యాగమాత్రము జ్ఞానసిద్ధిని కలుగఁజేయదు.

రా. ఫలాభిసంధిలేని కర్మములచే భగవంతుని పూజించినఁగాని యనేకకాలమందుండి యావరించియుండు పాపములు పోవు; అవ్యాకులేంద్రియత్వపూర్వకమగు ఆత్మనిష్ఠ కలుగదు.

మధ్వ. యుద్ధము మొదలగువానిని చేయకపోవుటవలన కామ్యకర్మములను విడుచుటచేఁ గలిగెడు మోక్షము సిద్ధింపదు. జ్ఞానము మోక్షసాధనము. అది కర్మములను విడుచుటవలన కలుగదు—ఇందుకు హేతువు పురుషుఁడగుట. పురుషుఁడనగా నెల్లప్పుడు పురము(శరీరము)తో నుండువాఁడు. అది స్థూలమైనను సూక్ష్మమైనను సరె. కర్మముల నాచరించనిపక్షమున ముక్తికలుగు ననుటచేత స్థావరముల కన్నిటికిని ముక్తి కలుగవలయును. కామము లేని కర్మముల నాచరించుటచే నంతఃకరణశుద్ధికలిగి జ్ఞానముచే మోక్షము సిద్ధించును. యత్యాశ్రమము మనస్సమాధానమునకును, భగవంతునకు మనస్సంతోషమునకు నై యున్నది. గృహస్థు లితరకర్మములలో ప్రవర్తించుటవలన మనస్సమాధానము లేనివారై యుందురు. అట్లుండియు మనస్సమాధానపరులై సమర్థు లగుదురు.

శ్లో. న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. 5

టీ. కశ్చిత్=ఎవ్వఁడును, అకర్మకృత్సన్ = కర్మముచేయనివాఁడై, జాతు=ఒకప్పుడును, క్షణమపి= క్షణమాత్రమైనను, న తిష్ఠతి హి = ఉండనేరఁడుగదా. ప్రకృతిజైః = ప్రకృతివలనఁ

బుట్టిన, గుణైః = రాగద్వేషాదిగుణములచేత, సర్వః=సమస్తమైనవాఁడును, అవశః=అస్వాధీనుఁడై, కర్మ = కర్మమును, కార్యతే=చేయింపఁబడుచున్నాఁడు.

శం. ఏలయనఁగా నెవ్వఁడును క్షణకాలమైన నెప్పుడును గర్మముచేయక యుండఁజాలఁడు. ఎందువల్లననఁగా దానిప్రకృతివలనఁ బుట్టిన సత్త్వరజస్తమోగుణములు అతనిచేతఁ గర్మములను జేయింపక విడువవు. జ్ఞాని సత్త్వాదులగు గుణములకు లోఁబడఁడు. కాఁబట్టి యీశ్లోకము అజ్ఞానినిగుఱించి యని గ్రహింపవలయును.

రా. కర్మములను జేసి పూర్వసంచితపాపరహితుఁడై సత్త్వాదిగుణములను స్వాధీనముచేసికొని, నిర్మలాంతఃకరణము గలవాఁడై జ్ఞానయోగమును పొందఁగలఁడు.

మధ్వ. కర్మములను సర్వవిధముల విడుచుట శక్యము కాదు.

అవ. కర్మయోగముచేయక జ్ఞానయోగమును పొంద యత్నించువాఁడు మిథ్యాచారుఁడు అని చెప్పుచున్నాఁడు.—

శ్లో. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్సఉచ్యతే. 6

టీ. యః=ఎవఁడు, కర్మేంద్రియాణి=కర్మేంద్రియములను, సంయమ్య=నిగ్రహించి, మనసా=మనస్సుచేత, ఇంద్రియార్థాన్=శబ్దాదివిషయములను, స్మరన్=చింతించుచున్నవాఁడై, ఆస్తే=ఉన్నాఁడో, సః=వాఁడు, విమూఢాత్మా = వివేకశూన్యమైన మనస్సుగల, మిథ్యాచారః = కపటాచారముకలవాఁడని, ఉచ్యతే=పలుకఁబడుచున్నాఁడు.

శం. ఎవఁడు కర్మేంద్రియములను నిగ్రహించి విషయముల ను మనస్సుచేత స్మరించుచుండునో, అట్టివివేకశూన్యుఁడు మిథ్యాచారుఁడని చెప్పఁబడుచున్నాఁడు. (ఉద్దేశ్యమొకటియు ఆచారము మఱియొకటియునై యున్నది కావున మిథ్యాచారుఁడు). ఆత్మజ్ఞానము లేనివాఁడు కర్మములను విడుచుట యయుక్తము. అట్టివాఁడు పాపాచారుఁడు.

రామా. పాపము నశించకపోవుటవలన అంతఃకరణజయము లేనివాఁడగును. వాఁడు యథేష్టప్రవర్తనము కలవాఁడై విషయాసక్తుఁడై యొకటి యుద్దేశించి మఱియొకవిధముగా నడచువాఁడగును. అట్టివాఁడే మిథ్యాచారుఁ డనఁబడును.

మధ్వ. ఓపినంతవఱకును కర్మములను విడువవలయును.

శ్లో. యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున,
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే. 7

టీ. హే అర్జున=ఓ అర్జునా! యస్తు=ఎవఁడు, ఇంద్రియాణి=జ్ఞానేంద్రియములను, మనసా=మనస్సుచేత, నియమ్య=నిగ్రహించి; కర్మేంద్రియైః=వాగాదికర్మేంద్రియములచేత (కర్మేంద్రియములు (1) వాక్కు, పాణి, పాద, పాయు(గుదము), ఉపస్థలు నాఁబడు.),కర్మయోగం=కర్మయోగమును,అసక్తస్సన్=ఫలకాంక్షారహితుఁడై, ఆరభతే=చేయుచున్నాఁడో, సః=వాఁడు, విశిష్యతే=ఉత్తముఁడగుచున్నాఁడు.

శం. అర్జునా! ఎవఁడు మనస్సుచేత ఇంద్రియముల నిగ్రహించి ఫలాపేక్ష లేనివాఁడై కర్మేంద్రియములచేత కర్మయోగము ననుష్ఠించునో యతఁ డధికుఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు.

ఇట్లు కర్మాచారుఁడు క్రిందిశ్లోకమునందలి మిథ్యాచారునికంటె శ్రేష్ఠుఁడు.

రా. ఆత్మావలోకమునందు మనస్సు నుంచి,తనకు వాడుక పడిన విషయముల వంటివైన శాస్త్రీయకర్మలయం దింద్రియముల నియమించి సంగములేక కర్మములం జేయువాఁడు ప్రమాదమున నూహించుటకైన నవకాశము లేకపోవుటచే, జ్ఞాననిష్ఠుఁడైన పురుషునికంటె ఉత్తముఁడగుచున్నాఁడు.

మధ్వ. క్రిందిశ్లోకమున 'మనసా స్మరన్' అనియు నీ శ్లోకమున 'మనసా నియమ్య' అని చెప్పుటచే మనస్సు ప్రయోజనమని తెలియఁజేయఁ బడినది. వర్ణాశ్రమధర్మములన్నియు కర్మయోగము. ఒక్కగృహస్థధర్మమే కాదు. కాఁబట్టి ఓ అర్జునా! స్వవర్ణాశ్రమోచితకర్మముఁ జేయుము.

శ్లో. నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. 8

టీ. హే అర్జున=ఓయర్జునుఁడా! త్వం=నీవు,నియతం=నిత్యమైన, ఫలాదులచే నస్రుశతమైన, కర్మ=సంధ్యావందనాదికర్మము, కురు=చేయుము. అకర్మణః=కర్మముచేయక పోవుటకంటె, కర్మ=కర్మముచేయుట, జ్యాయః హి=ఎక్కుడైనదిగదా, అకర్మణః=స్వకర్మరహితుఁడవైన, తే=నీకు, శరీరయాత్రాపి=శరీరస్థితియును, న ప్రసిద్ధ్యేత్=చక్కఁగా నడవనేరదు.

శం. అందువలన నీవు నిత్యమైన కర్మమును జేయవలెను. ఏలయనఁగాఁ గర్మము చేయకుండుటకన్నను కర్మముచేయుట మేలు. నీవు కర్మముచేయవేని నీకు శరీరస్థితికూడ సిద్ధింపదు.

రా. నియతం=వ్యాపింపఁబడినది. ప్రకృతి సంబంధముకల వానిచేత కర్మము వ్యాపింపఁబడినది. ప్రకృతిసంపర్కము అనాదివాసనచేఁ గలిగినది. అకర్మమనఁగా జ్ఞానము. సాధనపూర్తి యగువఱకు దేహధారణ మావశ్యకము. న్యాయార్జితమైన ద్రవ్యముచేత పంచమహాయజ్ఞములం జేసి మిగిలిన యన్నముచే శరీరమును నిలువఁబెట్టవలయును. జ్ఞాననిష్ఠునకుఁగూడ శరీరము నిలిచియుండునఱకు. సాధనము పూర్తియగునందాక, మహాయజ్ఞములు మొదలయిన నిత్యనైమిత్తికకర్మములు ముఖ్యముగాఁ జేయవలసినవి. కర్మయోగమునందుఁగూడ నాత్మ కర్తగాదను తలంపుండవలసినది. కాఁబట్టి యాత్మయాథాత్మ్యజ్ఞానము అంతర్భవించియే యున్నది. ప్రకృతిసంసర్గము కలవానికి కర్మయోగంబు సుశక్యంబును ప్రమాదము లేనిదియునగు. కాఁబట్టి జ్ఞాననిష్ఠకు అర్హుఁడైనవాఁడును కూడ జ్ఞానయోగముకంటె కర్మయోగమునే శ్రేష్ఠముగా భావించి కర్మము నాచరించవలయును. ఓ అర్జునా ! నీవు స్వకర్మములను జేయుమనుట.

మధ్వ. నియతం=తనవర్ణమునకు, ఆశ్రమమునకు తగినకర్మను చేయవలయును.

శ్లో. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర. 9

టీ. కౌంతేయ=ఓయర్జునుఁడా! యజ్ఞార్థాత్ = ("యజ్ఞో వై విష్ణుః" అనెడి శ్రుతివలన) భగవద్విషయమైన, కర్మణః=కర్మమునకంటె, అన్యత్ర= మఱియొకకర్మమునందు, అయం లోకః=ఈలోకము, కర్మబంధనః = కర్మమే బంధముగాఁగలది,

(భవతి=అగుచున్నది). తదర్థం=ఆయజ్ఞార్థమైన, కర్మ=కర్మ మునే, ముక్తసంగస్సన్=కర్మఫలాసక్తిలేనివాఁడవై, సమాచర=లెస్సగాఁ జేయుము.

శం. ఈశ్వరార్థముగాఁ జేయఁబడుకర్మముకంటె భిన్నమైన కర్మము లోకమునకు బంధమును గలిగించును. అందువల్ల నర్జునా! నీవు ఈశ్వరార్థమైన కర్మమును ఫలాపేక్ష లేనివాఁడవై చేయుము.

రా. యజ్ఞార్థమనఁగా యజ్ఞము మొదలగు శాస్త్రీయకర్మములకొఱకైన ద్రవ్యార్జనము మొదలగునవి. ఆత్మార్థీయ ప్రయోజనము లగు కర్మములచేత నీలోకము బంధముకలదియగును. తనకొఱకైనదను తలంపుచేతఁగలిగెడి సంగము లేనివాఁడవై ధనసంపాదనము మొదలగుదానింజేసి యజ్ఞాదులం జేసినచో, దానిచే నారాధింపఁబడి భగవంతుఁడు అనాదికాలప్రవృత్తంబగు కర్మవాసననుం దెగఁగొట్టి కలఁతలేని యాత్మావలోకనమును కలుగఁజేయును.

మధ్వ. యజ్ఞమనగా విష్ణువు. యజ్ఞార్థమై సంగము లేని కర్మ బంధకము కాదు.

శ్లో. సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వో ఽ స్త్విష్టకామధుక్. 10

టీ. ప్రజాపతిః=బ్రహ్మదేవుఁడు, పురా=సృష్టికాలమందు, సహయజ్ఞాః=యజ్ఞములతోఁగూడిన, ప్రజాః=ప్రజలను, సృష్ట్వా=సృజించి, ఉవాచ=చెప్పఁబోయెడిప్రకారముగాఁబలికెను. అనేన = యజ్ఞములచేత, ప్రసవిష్యధ్వం = ప్రజలను బుట్టింపుఁడు,

ఏషః=ఈయజ్ఞము, వః=మీకు, ఇష్టకామధుక్=అభీష్టకామము లఁ బితుకునట్టిది, అస్తు=అగుఁగాక.

శం. మున్ను ప్రజాపతి యజ్ఞములతోఁగూడఁ బ్రజలను సృజించి యిట్లు పలికెను—'మీరు ఈయజ్ఞముచేత వృద్ధిచెందుఁడు. ఇది మీకు కోరినకోరికల నిచ్చునది యగుఁగాక.'

రా. ప్రజాపతి యనగా సర్వేశ్వరుఁడు. వాఁడు ఇష్టమైన మోక్షమును అందు కనుగుణములగు కామముల నిచ్చును.

శ్లో. దేవా న్భావయతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ. ॥11

టీ. హే జనాః=ఓ జనులారా! అనేన=ఈయాగముచేత, దేవాన్=ఇంద్రాది దేవతలను, భావయత=వృద్ధిపొందింపుఁడు. తే దేవాః=ఆ దేవతలు, వః=మిమ్ము, భావయంతు=వృష్ట్యాదులచేత వృద్ధిపొందింతురుగాక. పరస్పరం=అన్యోన్యమును, భావయంతః=ప్రేమించుచున్నవారలై, పరం=ఉత్కృష్టమైన, శ్రేయః=ముక్తిని, అవాప్స్యథ=పొందఁగలరు.

శం. మీరు ఈయజ్ఞముచేత దేవతల వృద్ధిపొందింపుఁడు. ఆ దేవతలు మిమ్ము వరాదులచేత వృద్ధిపొందించి సంతోషపఱతురుగాక. ఇట్లు మీ రొండొరులను సంభావించుకొనుచు నుత్తమమైన శ్రేయస్సును బొందుఁడు. జ్ఞానముకలిగి తద్ద్వారమున మోక్షమును పొందుఁడు.

రా. మీరు యజ్ఞము లొనర్చి దేవతలను ఆరాధింపుఁడు. వారు మిమ్మును వర్షాదులచే పోషింతురు. ఇట్లు మీరొండొరుల సహాయములవలన మోక్షమును బడయుదురు.

శ్లో. ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా నప్రదా యైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః.

టీ. యజ్ఞభావితాః=యాగములచేత సంతోషింపఁజేయఁబడిన, దేవాః=దేవతలు, వః=మీకొఱకు, ఇష్టాన్=అభీష్టములైన, భోగాన్=స్త్రీపశుపుత్రాదిభోగములను, దాస్యంతేహి=ఇచ్చుచున్నారుగదా. తైః=ఆ దేవతలచేత, దత్తాన్=ఇయ్యఁబడినమృష్టాన్నాదిభోగములను, ఏభ్యః = ఈ దేవతలకొఱకు, అప్రదాయ=ఇయ్యక, యః=ఎవ్వఁడు, భుఙ్క్తే=భుజించుచున్నాఁడో, సః=వాఁడు, స్తేనఏవ=చోరుఁడే.

శం. ఏలయనఁగా దేవతలు మీచే యజ్ఞములమూలముగ సంతోషింపఁబడినవారై మీకుఁ గోరినభోగముల నిత్తురు. దేవతలచేత నియ్యఁబడినవాని నా దేవతల కియ్యక యెవఁడు తానే తినుచున్నాఁడో, వాఁడు దొంగయేగాని వేఱుగాఁడు.

రా. దేవతలుపైపైని తమ్ముచక్కఁగా నారాధించుటకై తగిన భోగములను భగవంతుఁ డాత్మగాఁ గలవారై యిత్తురు. అట్లితరులచేత తమకార్యములకై సంపాదింపఁబడిన వారిదైయున్నవస్తువును తమ దని తలంచుచు దానిచేఁ దమ్ముఁ బోషించువారు దొంగలే కాని వేఱుగారు.

శ్లో. యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మకారణాత్.

టీ. యజ్ఞశిష్టాశినః=యజ్ఞము (యజ్ఞమనగా పంచమహాయజ్ఞములు. అవి, 1 దేవ యజ్ఞము-అనగా నిత్యము అగ్ని

హోత్రముచేయుట, 2 పితృయజ్ఞము-అనగా నిత్యము పిత్రులను తృప్తిని బొందించుట. 3 మనుష్యయజ్ఞము - అనగా ప్రతిదినము వచ్చు అతిథులకు భోజనమిడుట. 4 బ్రహ్మయజ్ఞము అనగా నిత్యము వేదాధ్యయనము సేయుట, (5) భూతయజ్ఞము - అనగా నిత్యము జంతువులకు బలివేయుచుండుట) వీనివలన మిగిలినయమృతమనెడు నన్నమును భుజించెడి స్వభావముగలిగిన, సంతః=సత్పురుషులు, సర్వకిల్బిషైః=సమస్తములైన పంచసూనాది పాపములచేతను, ముచ్యంతే=విడువఁబడుచున్నారు. (ఆ పంచసూనములు స్మృతియందుఁ జెప్పఁబడియున్నవి. - 'శ్లో. ఖండిసీ పేషణీ చుల్లీ ఉదకుంభీచ మార్జనీ, పంచసూనా గృహస్థస్య తాభిస్స్వర్గం న విందతి' =తఱుగునదియు,నూఱునదియు,విఱుచునదియు, కాల్చునదియు,ఊడ్చునదియునను నీయైదును బంచసూనములు.) యేతు= ఎవ్వరు, ఆత్మకారణాత్ = తన యుదరపూరణనిమిత్తమువలన, పచంతి = పాకముచేయుచున్నారో, పాపాః = పాపాత్ములైన, తే=వారలు, అఘం = పాపమును, భుంజతే = అనుభవించుచున్నారు.

శం. దేవయజ్ఞాదులను చేయఁగా మిగిలిన యన్నమును భుజించునట్టి సత్పురుషులు సర్వపాపములచేతను విడువఁబడుదురు. ఎవరు తమకొఱకే వండుకొందురో యాపాపులు పాపమునే భుజింతురు.

రా. ఇంద్రాదిస్వరూపముగా నున్న పరమపురుషుని నారాధించుటకై ద్రవ్యములను సేకరించి వానిచే నట్టి భగవం

తుని నారాధించి తచ్ఛేషముచే పొట్టపోసికొనెడివారు, చిరకాలార్జితమైన యాత్మయాథాత్మ్యజ్ఞానమునకు విరోధులైనసమస్తపాపరహితు లగుదురు. ఇంద్రాదిస్వరూపుఁడగు పరమపురుషునిచేఁ దన్నారాధించుటకై యొసఁగఁ బడిన ద్రవ్యమును తమకొఱకై వండుకొని తినెడి పాపాత్ములు పాపమునె తినెదరు. పాపముగాఁ బరిణమించునది గాననే పాపమని చెప్పఁ బడుచున్నది. ఆత్మావలోకనమునకు వైముఖ్యముఁ గలవారై నరకమును బ్రాపింతురు.

శ్లో. అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః,
　　యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః.　　14

టీ. అన్నాత్=అన్నమువలన, భూతాని=ప్రాణులు, భవంతి=పుట్టుచున్నవి. పర్జన్యాత్=వరాధిదేవతయైన పర్జన్యునివలన, అన్నసంభవః=అన్నము కలుగుచున్నది. (అగ్నిని, 'శ్లో. అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే, ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః' అను స్మృతి వలన యజ్ఞాదులవలన వృష్ట్యాదులు గలుగుచున్నవి.) యజ్ఞాత్=యజ్ఞమువలన, పర్జన్యః=మేఘము (తద్ద్వారా వర్షము), భవతి=కలుగుచున్నది. యజ్ఞః=యాగము, కర్మసముద్భవః=కర్మముచేఁ గలుగుచున్నది. కర్మమనఁగా ఋత్విక్కులతోఁ గూడి యజమానుఁడు చేయువ్యాపారము.

తం. అన్నమువలన భూతములు పుట్టును. వర్షమువలన నన్నము కలుగును. యజ్ఞమువలన వర్షము కలుగును. ఆయజ్ఞము కర్మమువలనఁ గలుగును.

రా. యజ్ఞమనగా కర్మమనియు, అది ధనముసంపాదించుట మొదలగు యజమానవ్యాపారముచేఁ గలుగునది గాన కర్మోద్భవము అని చెప్పఁబడినది.

శ్లో. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం,
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15

టీ. కర్మ=కర్మమును, బ్రహ్మోద్భవం=వేదమువలనఁ బుట్టినదానిఁగా, విద్ధి=తెలియుము, బ్రహ్మ=ఆవేదమును, అక్షరసముద్భవం=పరమాత్మవలనఁ గలిగినదానిఁగా, విద్ధి = తెలియుము. తస్మాత్=ఆకారణమువలన, బ్రహ్మ=వేదము, సర్వగతం=అంతట వ్యాపించినదై, యజ్ఞే=యజ్ఞమందు, నిత్యం=ఎల్లప్పుడును, ప్రతిష్ఠితం=ఉంచఁబడినది.

శం. కర్మ వేదమువలనఁ గలుగును. ఆవేదము పరమాత్మవలన వెడలును. అందువలన నిత్యమైనవేదము యజ్ఞమునందుఁ బ్రతిష్ఠితముగా నున్నది.

రా. 'బ్రహ్మోద్భవమ్' అనునప్పుడు ప్రకృతిపరిణామరూపమగు శరీరమును బ్రహ్మశబ్దము చెప్పును. ఆవ్యాపారము శరీరమువలనఁ గలుగునది యని యర్థము. అక్షరశబ్దమునకు జీవాత్మ యని యర్థము. అన్నపానాదులచే తృప్తిఁబొందిన జీవునిచే నియమింపఁబడినదై శరీరము వ్యాపారములం జేయుంగాన బ్రహ్మము అక్షరసముద్భవమని చెప్పఁబడినది. సర్వగతమనగా సర్వాధికారులను పొందియున్నది యనుట. యజ్ఞేప్రతిష్ఠితమ్=శరీరము యజ్ఞమునకుమూలమైనది యనుట. అన్నమువలన జీవులతోఁ గూడినశరీరములును, మేఘమువలన అన్నం

బును, యజ్ఞమువలన మేఘమును, యజ్ఞము యజమానుని వ్యాపారమువలనను, ఆవ్యాపారము జీవునితోఁ గూడినశరీరమువల నను, అట్టిశరీరములు తిరిగియు నన్నమువలనను కలుగుచున్నవని 14, 15-వ శ్లోకముల తాత్పర్యము.

మధ్వ. కర్మములను చేయవలయు ననుటకు మఱియొక హేతువు చెప్పఁబడుచున్నది. పర్జన్యుఁడనఁగా నాదిత్యుఁడును, మేఘచక్రాభిమానియగు దేవతయు, యజ్ఞమువలన ఆదిత్యుఁడు బల వృద్ధి పొందును. మేఘచక్రము యజ్ఞమువలనఁ గలుగుం గాన 'యజ్ఞాద్భవతి పర్జన్యః' అని చెప్పఁబడినది. యజ్ఞమనఁగా దేవతలకు హోమాదులం జేయుట. కర్మ మనఁగా క్రియ పని. [illegible] వ్యాపారము లన్నియు పరమాత్మవలననే కలుగుచున్నవి. ప్రతిబింబమైన జీవునికి బింబమైన పరమాత్మనుబట్టియుకదా వ్యాపారము. పరబ్రహ్మము అక్షరములచే స్ఫుటపఱుపఁబడును. ఆయక్షరములు (వేదములు) నిత్యములయినవి. ఇట్లు పరంపరచే యజ్ఞమునకు బ్రహ్మ మభివ్యంగ్యము (స్ఫుటపఱుపఁబడినది) గాన యజ్ఞమునఁ బ్రతిష్ఠిత మని చెప్పఁబడినవి.

శ్లో. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి. 16

టీ. హే పార్థ=ఓయి అర్జునుఁడా! యః=ఎవ్వఁడు, ఏవం=ఈపూర్వోక్తప్రకారముగా, ప్రవర్తితం=ప్రవర్తిలఁజేయఁబడిన, చక్రం=జగచ్చక్రమును, ఇహ=ఈలోకమునందు, నానువర్తయతి=అనువర్తింపఁడో, సః=వాఁడు, అఘాయుః=పాపమే యాయువుగాఁగలవాఁడును, ఇంద్రియారామః=ఇంద్రియములచేత

విషయాసక్తుఁడైనవాఁడును గావున, మోఘం=వ్యర్థమగునట్టు జీవతి=బ్రతుకుచున్నాఁడు.

శం. అర్జునా! ఇట్లు నడుపఁబడుచున్న చక్రము నెవఁడు ప్రవర్తింపఁడో యతఁ డింద్రియలోలుఁడై పాపజీవనుఁ డగును కాఁబట్టి వానిబ్రతుకు వ్యర్థము. లేక కర్మాధికారియైన యెవ్వఁ డీయాజగచ్చక్రము ననువర్తింపఁడో, వాఁడు నిరర్థక జీవనము కలవాఁడు. కాఁబట్టి జ్ఞానికానివాఁడు కర్మలను చేసియే తీరవలయును.

రా. ఇట్లు పరంపరగా నొకదాని కొకటి కారణములై చక్రమువలె తిరుగుచున్న దానిని, కర్మయోగాధికారిగాని, జ్ఞానయోగాధికారిగాని, ప్రవర్తింపఁజేయఁడేని, యజ్ఞశేషముచేత శరీరధారణము లేనివాఁడై అఘాయువు - పాపములనుచేయుటకునైన ఆయుస్సుకలవాఁడుగానీ, పాపరూపముగాపరిణమించిన ఆయుస్సుగలవాఁడు గానీ, రెండువిధముల పరిణమించెడు ఆయుస్సుగలవాఁడుగానీ అగును. వాఁడు ఆత్మారాముఁడుకాఁడు కాన ఇంద్రియారాముఁడనఁబడును. అనఁగా ఇంద్రియములేతోట-అనగా విహారప్రదేశముగఁ గలవాఁ డగును. యజ్ఞశేషముచే దేహపోషణము లేకపోవుటచే అతిశయించిన రజస్తమోగుణములు గలవాఁడై ఆత్మావలోకనవిముఖుఁ డగును. దీనివలన తాను చేయుచుండెడి జ్ఞానయోగాదిప్రవృత్తియు నిష్ఫలంబగును.

మధ్వ. అనిత్యములైన యక్షరములు భూతములచే స్ఫుటపఱుపఁబడునవిగాన నిది చక్రము. ఈజగచ్చక్రము నెవ్వఁ డనుసరింపఁడో, వాఁడు దానిని చెడఁగొట్టువాఁడు. కాఁబట్టి వాఁడు

అఘాయువు-అనఁగా పాపముకొఱకె యయిన యాయుస్సు గలవాఁడు.

శ్లో. య స్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. 17

టీ. యః=ఏ, మానవస్తు=నరుఁడు, ఆత్మరతి రేవ=తనయందే ఆసక్తిగలవాఁడును, ఆత్మతృప్తశ్చ=తనచేతనే తృప్తిఁబొందుచున్నవాఁడును, ఆత్మన్యేవ=తనయందే, సంతుష్టశ్చ=సంతోషపడుచున్నవాఁడును, స్యాత్ = అగునో, తస్య=ఆయాత్మవిదునకు, కార్యం=చేయఁదగినపని, న విద్యతే=లేదు.

శం. ఇఁక నెవఁడు ఆత్మచేతనే సంతోషించువాఁడును, ఆత్మచేతనే తృప్తుఁడై యుండువాఁడును, ఆత్మచేతనే రమించువాఁడును అగునో యట్టివానికి చేయఁదగినకర్మ యేదియు లేదు. మఱియును, ఎవరైతే యాత్మ నెఱిఁగి యజ్ఞానము లేనివారై శరీరము నిలుచుటకు మాత్రము భిక్షాచరణ చేయువారికి ఆత్మజ్ఞానము తప్ప చేయఁదగినకర్మ యేదియు లేదు.

రా. సాధనములతో నక్కఱలేకయే యాత్మదర్శనము కలవాఁడగు ముక్తునికె మహాయజ్ఞములు మొదలగు వర్ణాశ్రమ కర్మము లుపయోగము లేదు. ధారకపోషకభోగ్యములు మూఁడును ఆత్మయె యెవనికగునో, వానికి స్వయముగాను ఆత్మస్వరూప మగపడుటచే ఆత్మస్వరూపముకొఱకు వాఁడేదియు చేయవలసినది లేదు.

మధ్వ. ఆత్మ యనఁగా పరమాత్మ. అపరమాత్మదర్శనము మొదలగువానిచేఁ గలిగినసుఖము రతి. ఇతరసుఖములు వలద

నుట తృప్తి. ఆతృప్తిని గలుగఁజేసెడి సుఖమె సంతోషము. పరమాత్మదర్శనాదిసుఖమును బొంది మిగిలినహానియం దెల్లను తృప్తి కలవాఁడై, మఱియేసంతోషకారణములేనివాఁడైన అసంప్రజ్ఞాతసమాధిలో నున్న వానికి కర్మము లేదు. మిగిలిన జ్ఞానికి కర్మము కలదు. అపరోక్షజ్ఞానము కలవానికె అసంప్రజ్ఞాతసమాధి కలుగును.

శ్లో. నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన,
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః. 18

టీ. తస్య = ఆబ్రహ్మనిష్ఠునకు, ఇహ = ఈలోకమందు, కృతేన=కర్మముచేసినందుచేత, అర్థః=పుణ్యము, నైవ=లేదు. అకృతేన=కర్మముచేయనందుచేత, కశ్చన=ఒకానొకప్రత్యవాయమును, న=లేదు. అస్య = ఈ బ్రహ్మవేత్తకు, సర్వభూతేషు=సమస్తభూతములయందు, అర్థవ్యపాశ్రయః = ప్రయోజననిమిత్తమైనయాశ్రయము, కశ్చిత్=ఒకటియును, న=లేదు.

శం. ఆ జ్ఞానికి నేకర్మము చేసినను ప్రయోజన మేదియు లేదు. చేయకున్నను హాని యేదియు లేదు. మఱియు వానికి సమస్తభూతములందును నేప్రయోజనమును గానరాదు.

రా. ముక్తునికి సదా ఆత్మదర్శనము సిద్ధము. అందుకొఱకై సాధనములు చేసినను చేయకున్నను ప్రయోజనము లేదు. ఆత్మకంటె నితరములగు నచేతనములయందు స్వాయముగానె విముఖత్వముగలవీనికి ఆకాశాదిపంచభూతములయం దొకట్టియు ఆశ్రయింపఁదగినదఁ లేదు. అట్లున్నఁగదా దానియందు వైముఖ్యము కలుగుటకు సాధనమును ఆచరించవలయును.

మధ్వ. అసంప్రజ్ఞాతసమాధిలో నున్నవాఁడు దానిని విడిచి కర్మములను చేసినచో ప్రయోజనము లేదు. సంధ్యావందనాదులను చేయకపోయినను ప్రత్యవాయము లేదు. సమస్తభూతములయందును వీని కాశ్రయనిమిత్తమైనదే లేదు.

శ్లో. తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః. 19

టీ. తస్మాత్=ఆకారణమువలన, త్వం=నీవు, అసక్తస్సన్=ఫలసంగవర్జితుఁడవై, సతతం=నిత్యమును, కార్యం = చేయఁదగిన, కర్మ=కర్మమును, సమాచర = ఆచరింపుము. హి=ఏ కారణమువలన,అసక్తః=ఫలాసక్తిలేనివాఁడై,కర్మ=కర్మమును, ఆచరన్=ఆచరించుచున్న, పూరుషః = పురుషుఁడు, పరం= మోక్షమును, ఆప్నోతి=పొందుచున్నాఁడు.

శం. అట్లజ్ఞానియగువాఁడు కర్మముచేయవలసినదే కావున నీవు ఫలాపేక్ష లేనివాఁడవై విహితమైన కర్మము నెల్లప్పుడును జేయుచుండుము. ఫలాపేక్షలేక కర్మముచేయునట్టి పురుషుఁడు సత్త్వశుద్ధి నొంది క్రమముగా మోక్షము పొందును.

రా. సాధనము లేకయే ఆత్మదర్శన మెవ్వనికి కలుగునో వాని కేయాత్మదర్శనసాధనము లక్కఱలేదు. సాధనములం జేయఁదలంచినవానికిఁగూడ ఆత్మజ్ఞానగర్భమగుటచేతను, జ్ఞానయోగికిం గూడ తగుమాత్రము ఆచరింపవలసి యుండుటచేతను, కర్మయోగమే ఆత్మదర్శనము కలుగుటకు శ్రేష్ఠమైనది. కాఁబట్టి సంగము లేనివాఁడవై ఆత్మప్రాప్తి కలుగువఱకును కర్మమును చేయవలసినదియే యని చేయుచుండుము. అక

_ర్తృత్వజ్ఞానముతోఁ గర్మమును జేయువాఁడు ఆత్మను పొందు చున్నాఁడు.

మధ్వ. అసంప్రజ్ఞాతసమాధిలో నున్నవాని కేకార్యము లేదు గాన, నీవును కర్మము నాచరింపుము.

శ్లో. కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి. 20

టీ. జనకాదయః=జనకుఁడు మొదలుగాఁగల రాజర్షులు, కర్మణైవ=నిష్కామకర్మముచేతనే, సంసిద్ధిం=చిత్తశుద్ధిని, ఆస్థితాహి=పొందిరిగదా. త్వం=నీవు, లోకసంగ్రహమేవ-లోక=జనములయొక్క, సంగ్రహమేవ = ప్రయోజనమునే (జనము నపమార్గమున ప్రవర్తింపకుండునట్లు), సంపశ్యన్ = చూచుచున్నవాఁడవై, కర్మ=కర్మమును, కర్తుం=చేయుటకొఱకు, అర్హసి= తగుదువు.

శం. ఎట్లనఁగా, జనకమహారాజు మొదలగువారు కర్మముచేతనే సత్త్వశుద్ధిద్వారమున మోక్షముఁ బొందిరి. మఱియు నీవు లోకులను సన్మార్గమునందుఁ బ్రవర్తించునట్లు చేయవలసినవాఁడ వగుటవలన నీవును గర్మము చేయవలసినదే. లేక జనకుఁడు మొదలగువారు జ్ఞానులై యుండిరా? లోకసంగ్రహము కొఱకు కర్మల నాచరించుచుండిరి. జ్ఞానులు కాకయుండిరా? సత్త్వశుద్ధికొఱకు కర్మాచరణచేసి క్రమముగా సిద్ధిని పొందిరి. అట్లే అర్జునా! నీవును సేయుము.

రా. జ్ఞానయోగాధికారిహైనను కర్మయోగాచరణము ఆత్మదర్శనవిషయమై శ్రేష్ఠముగాన జ్ఞానులలో నగ్రేసరులగు జన

కుఁడు అశ్వపతి మొదలగువారు గూడ కర్మయోగముననే సిద్ధి పొంది రనుట.

మధ్వ. జనకాదులు కర్మమును చేయుచునే జ్ఞానమును పొంది సిద్ధిని పొందిరి. జ్ఞానులు సహితము కర్మము నాచరించెడి యాచారము కలదు. జనకాదులు జ్ఞానులగుట భారతాదులలో ప్రసిద్ధము. ప్రయాగాదితీర్థములు ముక్తిసాధనములు. పాపవిముక్తికి కారణములు. ఆతీర్థములస్తోత్రమైనను పాపవిముక్తికి కారణములే. కాఁబట్టి అపరోక్షజ్ఞానమువలననే మోక్షము కలుగును. కర్మము ఆమోక్షమునకు సాధన మనుట.

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. 21

టీ. శ్రేష్ఠః=బ్రహ్మవిదుఁడు, యద్యత్ = ఏయేకర్మమును, ఆచరతి=ఆచరించుచున్నాఁడో, ఇతరో జనః=తక్కిన జనమును (అనఁగా పామరులు), తత్తదేవ=ఆయాకర్మమునే, ఆచరతి=ఆచరించుచున్నది. సః=ఆబ్రహ్మనిష్ఠుఁడు, యత్ప్రమాణం = ఏప్రమాణమును, కురుతే=చేయుచున్నాఁడో, లోకః = పామరజనము, తత్=ఆమర్యాదనే, అనువర్తతే=అనుసరించుచున్నది.

శం. ఎందువల్లననఁగా ఉత్తముఁడైనవాఁడు దేని నాచరించునో దానినే యితరజనులును నాచరింతురు. అతఁడు దేనిని ప్రమాణముగా లౌకికవైదికములయం దంగీకరించునో లోకమంతయు దానినే యనువర్తించును.

రా. ఉత్తముఁడైనవాఁడు దేనిని ఏపాటిదానినిగా అనఁగా ఏయంగములతోఁ గూడినదానినిగాఁ జేయునో అట్టిదానినిగా

ననఁగా నాయంగములతోఁ గూడినదానినిగా సంపూర్ణజ్ఞానము లేని జనుఁడును ఆచరింపుచున్నాఁడు. కాఁబట్టి లోకమును కాపాడుటకై శిష్టుఁడుగా ప్రసిద్ధుఁడైనవాఁడు వర్ణాశ్రమ ధర్మముల నాచరించునది. లేనిచో లోకమును చెడఁగొట్టుటచేఁ గలిగిన పాపము వీనిని జ్ఞానయోగమునుండి గూడ తప్పించును.

మధ్వ. ఉత్తముఁడైనవాఁడు ఏవాక్యము మొదలగువానిని ప్రమాణముగాఁ జేయునో పామరజనము దానినే ప్రమాణముగ గ్రహించి యాచరించును.

శ్లో. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి.

టీ. హేపార్థ = ఓయి అర్జునుఁడా! మే=నాకు, త్రిషులోకేషు = మూఁడులోకములందును, కర్తవ్యం = చేయఁదగిన కర్మము, కించన = ఏదియును, నాస్తి = లేదు. అనవాప్తం= పొందఁబడనిదియును, అవాప్తవ్యం = పొందఁదగినదియును, నాస్తి=లేదు. (తథాపి) చ=అయినను, కర్మణ్యేవ=కర్మమందే, వర్త ఏవ హి = ఉన్నానుగదా.

శం. అర్జునా! నాకు మూఁడులోకములయందును జేయవలసిన దేదియు లేదు. ఇదివఱకుఁ బొందఁబడనిదియు, పొందవలసినదియులేదు. అయినను కర్మము చేయుచునే యున్నాను. ఈయర్థమునే యితరభాష్యకారులును అంగీకరించిరి.

శ్లో. యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః. 23.

టీ. హేపార్థ=అర్జునా! అహం=నేను, జాతు = ఒకప్పుడై
ను, అతంద్రితస్సన్=అప్రమత్తుఁడనై, కర్మణి = కర్మమునందు,
న వర్తేయం యది=ఉండకపోతినేని, మనుష్యాః=మనుష్యులు,
సర్వశః=అన్నిప్రకారములుగా, మమ=నాయొక్క, వర్త్మ =
మార్గమును, అనువర్తంతే = అనుసరించుచున్నారు.

శం. ఏల యనఁగా అర్జునా! నేను జాగ్రతతో నొకప్పుడును
కర్మము చేయకయుందునేని మనుష్యు లన్నిప్రకారములుగా
నామార్గమునే యనుసరింతురు.

శ్లో. ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్,
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః. 24

టీ. అహం=నేను, కర్మ=కర్మమును, న కుర్యాం చేత్=చే
యనైతినేని, ఇమేలోకాః=ఈజనులు, ఉత్సీదేయుః=చెడిపోదు
దురు. సంకరస్య చ = వర్ణసంకరమునకును, కర్తా = కర్తను,
స్యాం=అగుదును. (అందువలన,) ఇమాః ప్రజాః=ఈప్రజలను,
ఉపహన్యాం=చెఱిచినవాఁడ నౌదును.

శం. నేను కర్మము చేయనియెడ నీలోకము లన్నియు నా
శము నొందును. సంకరము కూడఁ జేసినవాఁడ నగుదును. ఈ
ప్రజలను చెఱిచినవాఁడ నగుదును.

శ్లో. సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్తశ్చికీర్షు ర్లోకసంగ్రహమ్.

టీ. హేభారత=అర్జునా! అవిద్వాంసః=అనాత్మజ్ఞులు, క
ర్మణి=కర్మమునందె, సక్తాః=ఆసక్తులై, యథా=ఏప్రకారము
గా, కుర్వంతి=(కర్మములను) చేయుచున్నారో, తథా=అప్ర

కారముగా, లోకసంగ్రహం=జనుల దుర్మార్గప్రవర్తనమును నివారించుటను, చికీర్షుః=చేయనిశ్చయించిన, విద్వాన్=ఆత్మజ్ఞుఁడు, అసక్తస్సన్=సంగవర్జితుఁడై, కుర్యాత్=కర్మలను చేయవలెను.

శం. అర్జునా! అజ్ఞానులు ఫలాపేక్షకలవారలై ఎట్లు కర్మము చేయుదురో అట్లు జ్ఞాని ఫలాపేక్ష లేనివాఁడై లోకులకు సన్మార్గము చూపుటకొఱకు కర్మము చేయవలెను.

శ్లో. న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్.

టీ. విద్వాన్=పండితుఁడు, కర్మసంగినాం=కర్మమందాసక్తిగలిగిన, అజ్ఞానాం=అవివేకులయొక్క, బుద్ధిభేదం=కర్మమునందాసక్తిగలబుద్ధికిఁ జలనమును, న జనయేత్ = పుట్టింపఁగూడదు. (మఱియేమనిన,) యుక్తః=పూనికగలవాఁడై, సమాచరన్=ఆచరించుచున్నవాఁడై, సర్వకర్మాణి=సమస్తకర్మములను, జోషయేత్ = ఆచరింపఁజేయవలయును.

శం. కర్మమునందాసక్తులైన యజ్ఞానులకు జ్ఞాని బుద్ధిభేదము గలిగించరాదు. మఱియేమి యనఁగాఁ దాను పూనికతోఁ గర్మములను జేయుచుండి వారివలనఁగూడఁ గర్మములను జేయించవలెను.

రామా. ఆత్మజ్ఞానము సంపూర్ణముగాఁ గలిగి తాను జ్ఞానయోగాధికారియైనను జ్ఞానయోగాపేక్ష లేకయే కర్మయోగము ఆత్మావలోకనసాధనమగు ననుబుద్ధితో కూడుకొనిన

వాఁడై కర్మమునే యాచరించుచు కర్మములనే చేయువాని కన్ని కర్మములయందు ప్రీతిని పుట్టించవలయును.

శ్లో. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే. 27

టీ. అహంకారవిమూఢాత్మా=అహంకారభావముచేత తెలియనిమనస్సుగల పురుషుఁడు, ప్రకృతేః=మాయవలనఁ బుట్టిన, గుణైః=కార్యకారణరూపములైన ఇంద్రియములచేతను తత్తద్వికారములచేతను, సర్వశః = బహుప్రకారములుగా, కర్తా=చేసినవాఁడను, అహమితి = నేనని, మన్యతే=తలఁచుచున్నాఁడు. (ప్రకృతి యనగా సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థారూపమైన ప్రధానతత్త్వము. దానిగుణములనఁగా కార్యకారణరూపములగు వికారములు. కర్మము లనఁగా లౌకికములును, శాస్త్రీయములును. అహంకారమనఁగా కార్యకారణసముదాయమునందు (అహం) నే ననెడుజ్ఞానము.)

శం. ప్రకృతివికారములైన సత్త్వరజస్తమోగుణములచేతఁ జేయఁబడునట్టికర్మము లన్నిఁటిని నహంకారముచే మోహము నొందిన మనస్సుగలవాఁడు తాను జేయునాఁడని యాశపడును.

రామా. ప్రకృతియొక్క గుణము లనఁగా సత్త్వరజస్తమోగుణములు. అహంకారమనఁగా 'అహమ్' శబ్దము చెప్పఁబడని ప్రకృతియందలి అహమ్ (నేను) అనెడి యభిమానము; ఈ యభిమానమే దేహాత్మాభిమానము. దానిచేత నాత్మస్వరూ

పము నెఱుంగనివాఁడై గుణకర్మములవిషయమున నేనే కర్త ననుచున్నాఁడు.

మధ్వ. ప్రకృతినిబట్టి గుణభూతములు ప్రధానములును, ప్రకృతిసంబాధులు నగు ఇంద్రియములు గుణములు - ప్రతిబింబమునకు కర్మ లే దనుట.

శ్లో. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః,
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే. 28

టీ. హే మహాబాహో=ఓయి అర్జునుఁడా! గుణకర్మవిభాగయోః-గుణ=సత్త్వాదిగుణములయొక్కయు, కర్మ=వానికర్మములయొక్కయు, విభాగయోః=ఏర్పఱుచుటయందు, తత్త్వవిత్తు=యథార్థమును దెలిసినవాఁడు, గుణాః=ఇంద్రియములు, గుణేషు=విషయములయందు, ప్రవర్తంతే=ప్రవర్తించుచున్నవి. ఇతి=ఇట్లని, మత్వా=తలఁచి, న సజ్జతే=ఆసక్తుఁడు కాఁడు.

శం. అర్జునా! ఈగుణములను గర్మములను విభజించి తెలిసికొన్నవాఁడుమాత్రము కర్మరూపములైన గుణములు విషయరూపమైన గుణములయందు వర్తించు నని తెలిసి తాను కొంచెమైనను సంబంధింపక యుండును.

రా. గుణములందును, కర్మములయందును నేను కర్త నని తలంపఁడు.

మధ్వ. కర్మభేద, గుణభేదములతత్త్వము నెఱింగినవాఁడు ఇంద్రియాదులు విషయములందు వర్తించు నని తెలిసి తాను సంబంధింపక జాగరూకుఁడై యుండును.

శ్లో. ప్రకృతే ర్గుణసమ్మూఢా స్సజ్జంతే గుణకర్మసు,
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్నవిచాలయేత్.

టీ. ప్రకృతేః=మాయయొక్క, గుణసమ్మూఢాస్సంతః-గుణ=సత్త్వాదిగుణములచేత, సమ్మూఢాస్సంతః = తెలియనివారలై, యే=ఎవరు? గుణకర్మసు=ఇంద్రియములయందును విషయములయందును, సజ్జంతే=ఆసక్తులగుచున్నారో, మందాన్=మందులైన, అకృత్స్నవిదః=సర్వజ్ఞులుకాని, తాన్=వారలను, కృత్స్నవిత్=ఆత్మవేత్త, న విచాలయేత్ = బుద్ధిచలింపఁజేయఁగూడదు.

శం. ఎవరైతే ప్రకృతిగుణముచేత మోహమునొందినవారై ఫలముకొఱకు ఆగుణములయొక్క కర్మములందాసక్తులగుదురో, అట్టి యనాత్మజ్ఞులయిన మందబుద్ధులకు ఆత్మవేత్తయైనవాఁడు బుద్ధిభేదముఁ జేయరాదు.

రా. సంపూర్ణజ్ఞానము లేనివారు ఆత్మానుభవమునకు ప్రవర్తించి ప్రకృతిసంసర్గము కలవారగుటచే ప్రకృతిగుణముల చేత ఆత్మస్వరూపమున భ్రమచెందినవారై కర్మలయందు ఆసక్తులగుదురు. ప్రకృతికంటె విలక్షణమైన ఆత్మస్వరూపమును ఎఱుంగలేరు. ఇందువలన జ్ఞానయోగమునకు సమర్థులు కానట్టి వారికి కర్మయోగమునందె యధికారము. ఇట్టివారిని జ్ఞానయోగాసక్తుఁడు తాను సంపూర్ణజ్ఞానియై తాను తనపద్ధతి నాచరించుచు చెడఁగొట్టఁగూడదు. కర్మయోగమును విడిచిన జ్ఞానిని జూచి యామందులు కూడ తమకర్మయోగమున నిశ్చలమగుమనస్సులేనివారగుదురు. జ్ఞానశ్రేష్ఠుఁడును అందువల్లనే స్వ

యముగా కర్మయోగమునె యాచరింపుచు ఆత్మయాథాత్మ్య జ్ఞానముచే, ఆత్మ కర్తకాఁడని తలచుచున్నవాఁడై ఆత్మావలోకమునకు కర్మయోగమె యితరాపేక్ష లేనిసాధనమని చూపుచు, ఆయజ్ఞానులకు కర్మయోగమున ప్రీతిని పుట్టింపవలయును. అనఁగా జ్ఞానియు లోకసంగ్రహమునకై కర్మము నాచరించవలయుననుట.

శ్లో. మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30

టీ. సర్వాణి=సమస్తములైన, కర్మాణి=కర్మములను, మయి=(పరమేశ్వరుఁడనైన) నాయందు, సన్న్యస్య=ఉంచి, అధ్యాత్మచేతసా=వివేకబుద్ధిచేత, నిరాశీః = ఆశలేనివాఁడవును, నిర్మమః=మమకారము లేనివాఁడవును, భూత్వా=అయి, విగతజ్వరస్సన్ = సంతాపమును వదలినవాఁడవై, యుధ్యస్వ=యుద్ధముసేయుము.

శం. సమస్తకర్మలను నాయందు సమర్పించి జ్ఞానముచే నిష్కాముఁడవై, అహంకారములేనివాఁడవై, సంతాపమును వదలినవాఁడవై యుద్ధము చేయుము.

రా. తాను, శ్రుతులవలనఁ గలిగిన ఆత్మస్వరూపవిషయమైనజ్ఞానము కలవాఁడై తాను భగవంతునకు శరీరమనియు, భగవంతునిచే ప్రవర్తింపఁబడువాఁడనియు తలంచుచు అందఱకును నియమించువాఁడును, ఏలినవాఁడును అగు పరమపురుషుఁడే తనవాఁడగునాత్మచేత, తనయుపకరణముల (సాధనసామగ్రి)చేత తనయారాధనముకొఱకె తనకర్మములను చేయిం

చుకొనుచున్నాఁడని కూడ తలంచుచు, మమకారాదులు లేని వాఁడవై అనాదికాలమునుండి సంపాదింపఁబడిన పాపసమూహముతో నేనెట్లుండఁగలననెడి యంతర్జ్వరము (దుఃఖము) లేనివాఁడవై, పరమపురుషుఁడే కర్మములచే నారాధింపఁబడి సంసారసంబంధమునుండి వదలించు ననితలంచి సుఖముగా కర్మయోగమున చేయుము.

మధ్వ. భ్రాంతిచే జీవునియం దారోపింపఁబడిన కర్మములను భగవదర్పణముచేసి అనఁగా భగవంతుఁడే యన్నికర్మములం జేయుచున్నాఁడని తలంచి, లేక ఈకర్మము లన్నియు భగవంతునిపూజ యని తలంచి, నిష్కాముఁడవై యుద్ధముచేయుము.

శ్లో. యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. 31

టీ. యే మానవాః=ఏమనుష్యులు, శ్రద్ధావంతః=నావాక్యమందు విశ్వాసముగలవారును, అనసూయంతః = నాయందసూయలేనివారునగుచు, మే=నాయొక్క, ఇదం=ఈ, మతం= అభిప్రాయమును, నిత్యం=ఎల్లప్పుడును, అనుతిష్ఠంతి=అనుష్ఠించుచున్నారో, తేఽపి=వారుగూడ, కర్మభిః=పుణ్యపాపకర్మములచేత, ముచ్యంతే=విడువఁబడుచున్నారు.

శం. ఎవ రీ నామతమును శ్రద్ధగలవారలై అసూయలేనివారలై యెల్లప్పుడు ననుష్ఠింతురో వారలనుగూడ కర్మలువిడుచును.

రా. ఇదియే శాస్త్రతాత్పర్యమని తలంచి నామతమును ఆచరించువారును ఆచరింపలేకపోయినను, శ్రద్ధకలవారును

శ్రద్ధలేకపోయినను, ఇది శాస్త్రతాత్పర్యమె కాదని యసూయలేనివారును, వీరందఱును బంధమునకు హేతువులై, పురాతనమునందుండియున్న కర్మమునుండి విడువఁబడుదురు. 'తేఽపి' అనఁగా వారుకూడ ననుటచే ఇప్పుడాచరింపకపోయినను శ్రద్ధకలవారును, అసూయలేనివారును, శ్రద్ధానసూయలచే పాపక్షయమును పొందినవారై శీఘ్రకాలముననె దీని ననుష్ఠించి యుక్తు లగుదురు.

మధ్వ. ఇట్లు నివర్తింపఁబడిన కర్మాచరణము చేయువారుగూడ జ్ఞానద్వారమున ముక్తిని పొందెదరు. ఇఁక అపరోక్షజ్ఞానులం గూర్చి చెప్పవలసిన దేమున్నది?

శ్లో. యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్,
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టా నచేతసః. ౩౨

టీ. యే తు=ఎవరు, మే=నాయొక్క, ఏతత్=ఈ, మతం=అభిప్రాయమును, అభ్యసూయంతః=నిందించువారలై, నానుతిష్ఠంతి=అనువర్తింపరో, అచేతసః=అవివేకులయిన, సర్వజ్ఞానవిమూఢాన్ = ఎల్లజ్ఞానములయందు మిక్కిలి మూఢులైన, తాన్ = వారలను, నష్టాన్ = చెడినవారలనుగా, విద్ధి = తెలియుము.

తా. ఎవరైతే నన్ను నిందించువారలై యీ నామతము ననుష్ఠింపరో వారలు సర్వవిషయములైన జ్ఞానములందును మూఢు లనియు, నవివేకు లనియు, నాశము నొందుదు రనియుఁ దెలియుము.

రామా. ఆత్మలందఱును నాకు శరీర మగుటచేత నే నాధారముగాఁ గలవారు, నావలుబడికి లోనైనవారు, నాచేతనే ప్రవర్తింపువారు అను తలంపుతో అన్ని కర్మముల నెవ్వరు జేయరో, ఎవ్వరు శ్రద్ధతో పూనుకొనరో, ఎవ్వ రసూయ చేతురో, వారిని అన్ని జ్ఞానములయందును విశేషముగా మూఢులయినవారినిగాను, గావుననే చెడినవారినిగాను, మనస్సునకు కార్యమైన వస్తుతత్త్వజ్ఞానము లేకపోవుటచే చేతస్సు లేనివారినిగాను, అనఁగా విపరీతజ్ఞానము కలవారినిగాను తెలియుము.

శ్లో. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి,
పక్రృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

టీ. జ్ఞానవానపి=జ్ఞానముకలవాఁడైనను, స్వస్యాః=స్వకీయమైన, ప్రకృతేః=జన్మాంతరసంస్కారమునకు, సదృశం=సమానమానట్లు, చేష్టతే=ప్రవర్తింపుచున్నాఁడు. భూతాని=సమస్తప్రాణులు, పక్రృతిం=స్వభావమును, యాంతి=అనుభవించుచున్నవి. (అందువలన,) నిగ్రహః = ఇంద్రియనిగ్రహము, కింకరిష్యతి= ఏమిచేయఁగలదు? (ఏమియుఁజేయఁజాలదని యర్థము).

శం. ఎందువలన నామతము ననువర్తింపరనఁగాఁ బండితుఁడుగూడఁ బూర్వజన్మలబ్ధమయిన సంస్కారమున కనుకూలముగానే వర్తించును. సమస్తభూతములును ఆసంస్కారరూపమైన పక్రృతినే యాశ్రయించియుండును. కాఁబట్టి యాప్రకృతిని నిగ్రహించుట యసాధ్యము.

రామా. 'ఆత్మస్వరూపము ప్రకృతికంటె విలక్షణమైనది. అదియ ఎల్లప్పుడు ననుసంధానము చేయఁదగినది అని శాస్త్రములు చెప్పుచున్నవి' అనియెడి జ్ఞానము కలవాఁడుకూడ పూర్వ జన్మవాసన కనుకూలముగానే వర్తించును. ప్రాచీనవాసననేయనుసరించెడి జంతువులను శాస్త్రముచే చేయఁబడిన నిగ్రహము ఏమియు చేయలేదనుట.

మధ్వ. ప్రకృతి యనఁగా పూర్వసంస్కారము అనియర్థము.

శ్లో. ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ. 34

టీ. రాగద్వేషౌ=ఇష్టమందు ప్రీతియు అనిష్టమందు ద్వేషమును, ఇంద్రియస్యేంద్రియస్య = ప్రతీంద్రియముయొక్క, అర్థే=శబ్దాదివిషయములయందు, వ్యవస్థితౌ=ఉన్నవి. (ఆకారణమువలన,) తయోః=ఆరాగద్వేషములకు, వశం=అధీనత్వమును, నాగచ్ఛేత్=పొందఁగూడదు. అస్య=ఈపురుషునికి, తౌ=ఆరాగద్వేషములు, పరిపంథినౌ హి = శ్రేయోమార్గమునకు విఘ్నకర్తలు గదా!

శం. ఇఁకఁ బురుషుఁ డేమిచేయవలె ననఁగా సర్వేంద్రియములయొక్క విషయములందును రాగద్వేషములు సిద్ధముగా నున్నవి. పురుషుని కవియే శత్రువులు గావున నతఁడు వానివశమునఁ బడఁగూడదు. శాస్త్రముచొప్పున ప్రవర్తించువాఁడు మునుపటివలె రాగద్వేషముల యధీనుఁడుకాఁగూడదు. పురుషుని ప్రకృతి రాగద్వేషానుసారమైయుండును. అది పురుషుని ప్రవర్తింపఁ జేయునేని యప్పుడు తనధర్మమునువదలుటయును,

ఇతర ధర్మములను స్వీకరించి యాచరింపఁ జేయుటయును కలుగును. ఎప్పుడైతే పురుషుఁడు రాగద్వేషముల నడచికొనునో అప్పుడు శాస్త్రదృష్టి కలవాఁడగును. ప్రకృతి వశుఁడుకాఁడు. కావున శాస్త్రము నిష్ప్రయోజకము కాఁజాలదు.

రామా. త్వక్కు మొదలగు జ్ఞానేంద్రియములకు విషయంబులగు స్పర్శాదులయందును, వాక్కు మొదలగు కర్మేంద్రియములకు వచనము (మాట) మొదలగు విషయములందును, వానినియనుభవింపవలయు ననురాగము పూర్వవాసనవలనఁ గలిగినదై యుండును. ఆయనుభవము అడ్డగింపఁబడెనేని తప్పక ద్వేషముకలుగును. ఈ రాగద్వేషములు జ్ఞానయోగమునకు ప్రయత్నము చేయుచుండుటను, అన్ని ఇంద్రియములను నియమించుచున్న పురుషుని లోఁగదీసికొని, తమకార్యములయందు చేర్చును. అందువలన వీఁడు ఆత్మ స్వరూపానుభవమునకు విముఖుఁడై చెడును. కాఁబట్టి జ్ఞానయోగారంభుఁడు రాగద్వేషాధీనుఁడై చెడఁగూడదు. రాగద్వేషములు వీనికి జయింపరాని శత్రువులు. అవి జ్ఞానాభ్యాసమును నివారించును.

మధ్వ. సమస్తభూతములును ప్రకృతినే యాశ్రయించి పూర్వజన్మసంస్కారాధీనములై యున్నను తమశక్తి కొలఁది నిగ్రహము చేయనలసినదియే. అందువలన అప్పటికి ప్రయోజనము లేక పోయినను మిక్కిలి ప్రయత్నము చేయుటవలన వెనుక ప్రయోజనము కలుగును.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35

టీ. స్వనుష్ఠితాత్=లెస్సగా నాచరింపఁబడిన, పరధర్మాత్=స్వవ్యతిరిక్త వర్ణాశ్రమాచారధర్మమునకంటె, విగుణః=గుణములేనిదైనను, స్వధర్మః=స్వధర్మమే, శ్రేయాన్=శ్రేష్ఠము, స్వధర్మే=తనధర్మమందు, నిధనం=మరణమైనను, శ్రేయః=శ్రేష్ఠము, పరధర్మః=స్వేతరధర్మము, భయావహః=నరకపతనాది భయమును బొందించునట్టిది.

శం. చక్కఁగా ననుష్ఠింపఁబడిన పరధర్మముకన్నను, గుణములేనిదైనను స్వధర్మమే మేలు. స్వధర్మమునందు మరణము నొందుటయు మేలే. పరధర్మము భయంకరమైనది. రాగద్వేషములచేఁ బ్రవర్తించువాఁడు ఇతర ధర్మముకూడ ధర్మమెకాన యాచరించవలసినదియే యని తలంచును. అది ధర్మముకాదు.

రామా. కర్మయోగమున నున్నవాఁడు ఒక్క జన్మమున ఫలమును పొందక మృతినొందినను మేలే. విఘ్నములచే బాధింపఁబడకపోవుటచేత రెండవజన్మమందు కలతలేని కర్మయోగము సంభవించును. జ్ఞానయోగము వానికి ప్రమాద గర్భమగుటచేత భయావహమే యగుననుట.

మధ్వ. యుద్ధము రాగాదులతోఁగూడియున్నను ఆచరించవలసినదేయనుట.

అర్జున ఉవాచః—

శ్లో. అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః. 36

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.—

టీ. హేవార్ష్ణేయ=ఓవృష్ణివంశమువాఁడగు శ్రీకృష్ణస్వామీ!

అథ=పిమ్మట, అయంపూరుషః=ఈపురుషుఁడు, అనిచ్ఛన్నపి =పాపముచేయనిచ్ఛయించనివాఁడైనను, బలాత్=బలాత్కారమువలన, నియోజితఇవ=భృత్యునివలె, కేన=దేనిచేత, ప్రయుక్తస్సన్=ప్రేరేపింపఁబడిన వాఁడగుచు, పాపం=దుష్కర్మమును, చరతి=ఆచరించుచున్నాఁడు.

శం. ఓకృష్ణా! పురుషుఁడు తనకిష్టములేకపోయినను నిర్బంధముచేఁ బ్రేరేపింపఁబడినట్లు పాపము చేయుచున్నాఁడే యట్లితనిఁ బ్రేరేపించునది ఏది?

రామా. పురుషుఁడనఁగా జ్ఞానయోగమునకై ప్రవర్తించువాఁడు. అట్టిప్రవర్తకుఁడు నిర్బంధముగా విషయానుభవములు (పాపముల)కు లొంగుచున్నాఁడు. అట్లు అతనిని లొంగఁజేయునదేది?

మధ్వ. కర్మమునకు కారణములైనవి కామము, క్రోధము మొదలగు ననేకములుకలవు. వానిలో నేది బలవత్తైనదియని అర్జునప్రశ్న.

శ్రీ భగవాన్ ఉవాచ:—

శ్లో. కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః,
　　మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.　　37

శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. ఏషః=నీచేత నడుగఁబడిన ఈహేతువు, రజోగుణ సముద్భవః=రజోగుణమువలనఁబుట్టిన, కామః=కోరిక, ఏషః= ఈకామమే, క్రోధః=(ఒకానొకనిచేతఁ గొట్టఁబడినదై) క్రోధ రూపముగాఁ బరిణమించుచున్నది.(మఱియు నెట్టిదనిన,) మహా

శనః=అధికమైనభక్షణము గలిగినదియు, మహాపాప్మా=మిక్కిలి పాపస్వరూపమైనదియుఁ గావున, ఏనం=ఈకామమును,ఇహ= ఈమోక్షమార్గమందు,వైరిణం=శత్రువునుగా,విద్ధి=తెలియుము.

శం. ఈరజోగుణముచేఁ బుట్టునట్టి ఈ కామమే మఱియొక్కదానిచే నడ్డగింపఁ బడినదై క్రోధముగాఁ బరిణమించును. ప్రాణులు కామప్రేరితులై పాపములంజేయుదురు. కావున నది 'మహాపాప్మా' యనఁబడును. అట్టికామమే పురుషునకీసంసారమునందు శత్రువని యెఱుఁగుము.

రామా. ప్రకృతి సత్త్వరజస్తమోగుణమయమైనది. అట్టిదానితో కలిసియున్నవాఁడై జ్ఞానయోగమును ప్రారంభించిన వానికి పూర్వజన్మప్రారబ్ధముచేతఁ గలిగిన శబ్దాది విషయముం గూర్చిన కామము యీతనిని విషయాసక్తునిగాఁ జేయుచున్నది. ఎప్పుడిదియడ్డగింపఁబడుచున్నదో అప్పుడడ్డగించిన చేతనులమీఁద క్రోధరూపిగాఁ బరిణమించుచున్నది. వెంటనే హింసాదులకు మనస్సును లాగుచున్నది. రజోగుణ సముద్భవమైన యీకామమును శత్రువుగా నెఱుంగుము.

మధ్వ. కర్మములను బ్రవర్తింపఁ జేయువానిలో బలవత్తరమైనది యీ కామమే. క్రోధమిందువలనఁ బుట్టునది. కాఁబట్టి యీకామమే క్రోధము. గురునింద మొదలగు దాని వలనఁ గలిగిన క్రోధముఁ గూడ, తనకు వారి యెడల భక్తివలన వారిని నిందింపకుండుటను కోరుటచేఁ గలిగినదియే. కామమునకు భోగ్యము మిక్కిలిగాఁ గలదు. కాన 'మహాశన'

మనఁ బడును. బ్రహ్మహత్యాదులను మహాపాపముల కాధార మగునదికాన 'మహాపాప్మా' అనఁబడును. అన్ని పురుషార్థములకు విరోధియగుటచేత వైరి యనఁబడును.

శ్లో. ధూమే నాఽవ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ,
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్.

టీ. యథా=ఏప్రకారముగా, ధూమేన=సహజమైన పొగ చేత, వహ్నిః=అగ్ని, ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో, యథా=ఏరీతిగా, మలేన=మాలిన్యముచేత, ఆదర్శశ్చ = అద్దమును, ఆవ్రియతే = కప్పఁబడుచున్నదో, యథా=ఏరీతిగా, ఉల్బేన=మావిచేత, గర్భః=గర్భస్థపిండము, ఆవృతః=కప్పఁబడునో, తథా=ఆరీతిగా, తేన=ఆ కారణముచే, ఇదం=ఈజ్ఞానము, ఆవృతం=కప్పఁబడెను.

శం. పొగచేత నెట్లగ్ని కప్పఁబడునో, ఎట్లు ముఱికిచేత నద్దము కప్పఁబడునో, ఎట్లు మావిచేత శిశువు కప్పఁబడునో అట్లుకామముచేత జ్ఞానము కప్పఁబడియున్నది.

రామా. పొగచేత నగ్నియును, ముఱికిచేత నద్దమును, మావిచేత శిశువు నెట్లు కప్పఁబడునో అట్లు కామముచేత ప్రాణిసమూహము కప్పఁబడియున్నది.

మధ్వ. ప్రకాశరూపమైనను పొగచేత నగ్ని కప్పఁబడినదై ఇతరులచేత నెట్లు చూడఁబడదో అట్లు పరమాత్మ కామముచే నావరింపఁ బడినవాఁడై చూడఁబడఁడు. మయిల గ్రిమ్మిన అద్దమున ముఖము మొదలగునవి ఎట్లు కానరావో అట్లు కామావృతమైన అంతఃకరణము జీవేశ్వరాదుల యభివ్య

_క్తికి పనికిరాదు. ఉల్బావృతమైన గర్భము తనపని నెట్లు చేయఁ జాలదో అట్లు కామావృతమైన జీవుఁడు ఈశ్వరాదుల దెలిసికొనఁజాలఁడు.

శ్లో. ఆవృతం జ్ఞాన మేతే న జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేన చ. 39

టీ. హే కౌంతేయ=ఓ యర్జునుఁడా! దుష్పూరేణ=నిండింపనశక్యమైనదియును, అనలేన=తృప్తిచెందనిదియును, కామరూపేణ=ఇచ్ఛారూపమైనదియును, జ్ఞానినః=జ్ఞానికి, నిత్యవైరిణా=నియతశత్రువైన, ఏతేన=ఈకామముచేత, జ్ఞానం=జ్ఞానము, ఆవృతం=కప్పఁబడెను.

శం. అర్జునా! జ్ఞానికి నిత్యశత్రువైనదియు, ఎప్పటికిని పూర్ణము సేయరానిదియు, తృప్తిలేనిదియు నగు నీకామముచేత జ్ఞానము కప్పఁబడియుండును. ఇది జ్ఞానముకలవానికే శత్రువు. మూర్ఖునకుగాదు. జ్ఞానముకలవాఁడు ఆశ పుట్టినప్పుడు కామమును ఇష్టమైన దానినిగా నాలోచించినను దానివలన శోకము సంప్రాప్తమైనప్పు డాశచేత నేను శోకమును పొందుచున్నానని తెలిసికొనును. కాన నిదిజ్ఞానికే శత్రువు. మూర్ఖునకుఁగాదు.

రామా. జ్ఞానమే స్వభావముగాఁగలవాఁడైనను ఈజీవుని యొక్క జ్ఞానము దీనిచే నావృతమైనది.

మధ్వ. శాస్త్రజన్యజ్ఞానము కలిగినను కామావృతమైనచో పరమాత్మాపరోక్షత్వమునకై (పరమాత్మ సాక్షాత్కారమునకై) ప్రకాశింపదు. విస్తారజ్ఞానముకలవానికే

ఇట్లుండ అల్పజ్ఞానముకలవాని విషయము చెప్పవని లేదు. కామ రూపమనఁగా నాపేరగలయది. దుఃఖముచేత కామము పూరింపఁబడుచున్నది. కాఁబట్టి యే దుష్పూర మనఁబడినది. ఇంద్రాది పదవి సుఖముచే సిద్ధింపదు. అది సిద్ధించఁగానే బ్రహ్మాదిపదము కోరఁబడునుగాని, అలమ్=చాలును, అనెడు బుద్ధి కలుగదు గాన కామ మనల మని చెప్పఁబడెను.

శ్లో. ఇంద్రియాణి మనో బుద్ధి ర స్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్.40

టీ. ఇంద్రియాణి=ఇంద్రియములును, మనః = మనస్సును, బుద్ధిః=బుద్ధియు, అస్య=ఈకామమునకు, అధిష్ఠానం=ఆశ్రయమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. ఏషః=ఈకామము, ఏతైః=ఈయింద్రియములచేత, జ్ఞానం=జ్ఞానమును, ఆవృత్య=కప్పి, దేహినం=పురుషుని, విమోహయతి=నానాప్రకారములుగా మోహింపఁ జేయుచున్నది.

శం. ఇంద్రియములును, మనస్సును, బుద్ధియు నీ కామమునకు నధిష్ఠానముగాఁ జెప్పఁబడును. ఈకామ మీయింద్రియాదులచే జ్ఞానము నాచ్ఛాదించి పురుషుని మోహపఱచును.

రామా. ఈకామ మింద్రియాదుల నుపకరణములుగా జేసికొని ఆత్మ నాశ్రయించును గాన ఆయింద్రియాదులు ఈ కామమున కధిష్ఠాన మనఁబడును. ఈకామ మింద్రియాదులచే జ్ఞానమును కప్పి పుచ్చి ఆత్మజ్ఞానవైముఖ్యమును విషయానుభవమున నాసక్తిని పుట్టించుననుట.

మధ్వ. మనోబుద్ధులు విషయాదులను పొందినగదా జ్ఞానము ఆవృతమగును. అధిష్ఠానము హరింపఁబడఁగా శత్రువు నశించును అనుట.

శ్లో. తస్మాత్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనం. 41

టీ. హే భరతర్షభ=ఓయి అర్జునుఁడా! తస్మాత్=ఆకారణమువలన, త్వం=నీవు, ఆదౌ=తొలుత, ఇంద్రియాణి=పంచేంద్రియములను, నియమ్య=నిగ్రహించి, జ్ఞాన=ఆత్మజ్ఞానమును, విజ్ఞాన=అనుభవజన్యజ్ఞానమును, నాశనం = నశింపఁజేయునదియును, పాప్మానం=పాపస్వరూపమైన, ఏనం=ఈకామమును, ప్రజహిహి=(లెస్సగా) విడువుము.

శం. అందువలన నోయర్జునా! నీవు మొదట నింద్రియముల నిగ్రహించుకొని పాపిష్ఠమైనదియు జ్ఞానవిజ్ఞానముల నశింపఁజేయునదియు నగు నీకామమును విడువుము.

రామా.—సమస్తేంద్రియవ్యాపారములను స్వేచ్ఛానువర్తనములుగా నుడుగుటను స్వరూపముగాఁగల జ్ఞానికి, ఈకామమనెడుశత్రువు, విషయాభిముఖ్యమును కలుగఁజేసి, ఆత్మయందు వైముఖ్యమును పొందించునుగాన, ప్రకృతిసంపర్కము కలిగి యుండుటచేత ఇంద్రియవ్యాపారములయందే ఆసక్తిఁగలనీవు, మొదటను అనగా మోక్షోపాయమును మొదలు పెట్టిన యప్పుడు ఇంద్రియ వ్యాపారరూపమగు కర్మయోగముననె ఇంద్రియముల నియమించి ఈకామమును నశింపఁజేయుము -

జ్ఞానమనగా నాత్మ స్వరూపమును తెలిసికొనుట, విజ్ఞానమనగా ఆత్మ దేహముకంటె వేఱు అని యెఱుంగుట.

శ్లో. ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః,
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః. 42

టీ. పండితాః=జ్ఞాననిష్ఠులు, ఇంద్రియాణి=శ్రోత్రాదీంద్రియములను, పరాణి=(దేహాదులకంటె) శ్రేష్ఠములైనవని, ఆహుః=చెప్పుదురు, తథా=అప్రకారముగానే, మనః=మనస్సు, ఇంద్రియేభ్యః=ఇంద్రియములకంటె, పరం=ఉత్కృష్టమైనది, బుద్ధిః=నిశ్చలాత్మకబుద్ధి, మనసః=మనస్సుకంటె, పరా=ఉత్కృష్టమైనది, యస్తు=ఏయాత్మ, బుద్ధేః = బుద్ధికంటె, పరతస్తు=వ్యతిరిక్తమైన సాక్షిత్వముచేతనున్నదో, సః = అదే పరమాత్మ.

తా. ఈ స్థూలదేహముకంటెను ఇంద్రియములు శ్రేష్ఠమని చెప్పుదురు. ఇంద్రియములకన్నను మనస్సు గొప్పది. మనస్సుకన్నను బుద్ధి గొప్పది. ఆ బుద్ధికన్నను ఆ బుద్ధిసాక్షియైనఆత్మ గొప్పది.

రామా. ఇంద్రియములు విషయవ్యాపారమునయున్న యెడల, ఆత్మజ్ఞానము ప్రవర్తింపదు - ఇంద్రియము లుడిగినను మనస్సు విషయాసక్తమగునేని ఆత్మజ్ఞానము కలుగదు. మనస్సు మిగిలిన ప్రవృత్తులు లేనిదైనను విరుద్ధమైన నిశ్చయము కలిగెనేని జ్ఞానముకలుగనేరదు. ఇన్నియు నుడిగినను కోరికె యుండెనేని అది ఇంద్రియాదులనన్నిఁటిని తనవిషయమున నడిపించి ఆత్మజ్ఞానమును నిరోధించును. కాఁబట్టి 'యోబుద్ధేః పర

తస్తుసః' అనఁగా బుద్ధికంటెపైని ఏది కలదో అదికామమె యని అర్థము.

మధ్వ. శత్రువును చంపుట కాయుధము వంటిదైన జ్ఞానమును జ్ఞేయము (తెలియవలసినది) ఈ శ్లోకమున చెప్పఁబడుచున్నది. శరీరముకంటె ఇంద్రియములు శ్రేష్ఠములు. బుద్ధికంటె నుత్కృష్టుఁడెవ్వఁడో, వాఁడే తెలియవలసిన వాఁడు. వాఁడే ఈశ్వరుఁడు. వాఁడు బుద్ధికంటెను,అవ్యక్తము (ప్రకృతి) కంటె నుత్కృష్టుఁడుగా తెలియవలసిన వాఁడు.

శ్లో. ఏవం బుద్ధేః పరం బుధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.

టీ. హే మహాబాహో=ఓయి అర్జునుఁడా! ఏవం=ఈప్రకారముగా, బుద్ధేః=బుద్ధికంటె, పరం=వ్యతిరిక్తమయిన, ఆత్మానం=ఆత్మను, జ్ఞాత్వా=ఎఱిఁగి, ఆత్మనా=ఆత్మచేత, ఆత్మానం=మనస్సును, సంస్తభ్య=లెస్సగానిగ్రహించి, దురాసదం=నిగ్రహింపరాని, కామరూపం=కామస్వరూపమైన, శత్రుం=శత్రువును, జహి=చంపుము.

శం. ఓఅర్జునా! ఈవిధమున నీవు బుద్ధికన్నను నగపడనియీయాత్మను తెలిసికొని బుద్ధిచేతనే యాత్మను నిశ్చలము జేసికొని యడపరానియట్టి కామమను శత్రువును సంహరింపుము.

రా. కామమును బుద్ధికంటె నుత్కృష్టమైన జ్ఞానయోగవిరోధినిగాఁ దెలిసికొన్నవాఁడవై (ఆత్మనా= బుద్ధిచేత) బుద్ధిచేత మనస్సును కర్మయోగమున నిలిపి ఈకామమనెడి శత్రువును నశింపఁ జేయుము.

మధ్వ. బుద్ధి మొదలగువానికంటె నుత్కృష్టుండైన హరిని తెలిసికొని; ఆత్మానమ్=మనస్సును, ఆత్మనా=బుద్ధిచేత, కర్మయోగమున నిలిపి కామమనెడి శత్రువును సంహరింపుమనుట.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జునసంవాదే, కర్మ
యోగోనామ తృతీయోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, కృష్ణార్జునుల సంవాదాత్మకంబునైన
శ్రీభగవద్గీతయందు కర్మయోగ మనెడి
తృతీయాధ్యాయము.

---

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## జ్ఞా న యో గః.



శ్రీభగవాన్ ఉవాచ:—

శ్లో. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్. 1

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. అహం=నేను, అవ్యయం=నాశరహితమైన, (ఫలము తప్పనిది. మోక్షమును కలుగఁజేయునది యనుట) ఇమంయోగం = ఈయోగమును, వివస్వతే=సూర్యునికొఱకు, ప్రోక్తవాన్=చెప్పియుంటిని, వివస్వాన్ = ఆసూర్యుఁడు, మనవే= ఆసూర్యునికుమారుఁడయిన వైవస్వతమనువుకొఱకు, ప్రాహ= చెప్పెను. మనుః = ఆమనువు, ఇక్ష్వాకవే=ఇక్ష్వాకునికొఱకు, అబ్రవీత్=చెప్పెను.

శం. నాశములేని యీయోగవిద్యను సూర్యునకు నేనుపదేశించితిని. సూర్యుఁడు తనకుమారుఁడైన వైవస్వతమనువునకు నుపదేశించెను. వైవస్వతమనువు ఇక్ష్వాకుమహారాజున కుపదేశించెను.

రా. సర్వజగదుద్ధరణార్థమై యీమన్వంతరము మొదటను మోక్షసాధనముగా నీయోగము వివస్వంతుఁడు మొదలగు వారి కుపదేశింపఁబడెననుట.

శ్లో. ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప.     2

టీ. హేపరంతప=ఓయి యర్జునుఁడా! రాజర్షయః=నిమిప్రభృతి రాజర్షులు, ఏనం=ఈప్రకారముగా, పరంపరాప్రాప్తం=పారంపర్యముచేతఁ బొందఁబడిన, ఇమం = ఈ యోగమును, విదుః=ఎఱుఁగుదురు. మహతా=అధికమైన, కాలేన=కాలముచేత, ఇహ=ఈలోకమందు, సః యోగః=ఆయోగము, నష్టః=విచ్ఛిన్నసంప్రదాయమై నశించెను.

తా. ఈ తెఱఁగునఁ బరంపరగా నుపదేశింపఁబడిన ఈయోగవిద్యను రాజర్షులు దెలిసికొనిరి. చాలకాల మైనందున నా యోగవిద్య యీలోకమున నాశమునొందెను.

శ్లో. స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖాచేతి రహస్యం హ్యేత దుత్తమమ్.     3

టీ. పురాతనః=పూర్వమందున్న, సఏవాయంయోగః=ఆ ఈయోగమే, మే=నాకు, భక్తః=భక్తుఁడవును, సఖాచ=చెలికాఁడవును, అసి = అయితివి. ఇతి=అని, తే = నీకొఱకు, మయా=నాచేత, అద్య=ఇప్పుడు, ప్రోక్తః = చెప్పఁబడెను. ఉత్తమం=శ్రేష్ఠమైన, ఏతత్=ఈ జ్ఞానము, రహస్యం = గోప్యమైనది.

శం. అర్జునా! నీవు నాభక్తుఁడవు, స్నేహితుఁడవు. కాఁబట్టి, మిగుల రహస్యమైనదియు, నుత్తమమైనదియు నగు నీయోగవిద్యను నీకు విశదముగా నుపదేశించితిని.

అవ. భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తి చెప్పినది పరస్పరవిరుద్ధమైనదని యెవ్వరు తలఁపకుండుటకై యీక్రింది ప్రశ్న అర్జునునిచేత నడుగఁబడినది.

అర్జున ఉవాచ.—

శ్లో. అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి. 4

అర్జునుఁ డడుఁగుచున్నాఁడు.—

టీ. భవతః=నీయొక్క, జన్మ=పుట్టుక, అపరం=వెనుకటిది, వివస్వతః=సూర్యునియొక్క, జన్మ=జన్మము, పరం=మునుపటిది. ఆదౌ=సర్గాదియందు, త్వం=నీవు, ప్రోక్తవానసీతియత్=చెప్పితివనునది యేదికలదో, ఏతత్=దీనిని, కథం=ఎట్లు, విజానీయాం=తెలియుదును.

శం. సూర్యునిపుట్టుక పూర్వము గలిగినది. నీవు వెనుక గలిగినవాఁడవు. అట్లుండఁగా నీ వీ యోగవిద్యను సూర్యునకుపదేశించితివని యే నెట్లెఱుఁగుదును.

రామా. అర్జునుఁడు శ్రీకృష్ణమూర్తిని సర్వేశ్వరునిగా నెఱింగినవాఁడైనను సర్వేశ్వరునకుఁగూడ కర్మపరవశులైన జీవులకువలె కలిగిన జన్మము ఇంద్రజాలాదులవలె యసత్యమా? సత్యమా? సత్యమైనట్లైన ఆజన్మప్రకార మెట్లు? ఈశరీరమేమి స్వరూపమైనది? పుట్టువుల కేమి కారణము? పుట్టుక యెప్పుడు కలుగును? జన్మమునకు ప్రయోజన మేమి? అని సంశయముతో నడుగుచున్నాఁడు.

శ్రీభగవాన్ ఉవాచ.—

శ్లో. బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున,
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప. 5

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హే అర్జున=ఓయి అర్జునుఁడా! మే=నాకును, తవచ=నీకును, బహూని=అనేకములైన, జన్మాని=జన్మములు, వ్యతీతాని=అతిక్రమించినవి, సర్వాణి=సమస్తములైన, తాని=ఆజన్మములను, అహం=నేను, వేద=ఎఱుఁగుదును, హే పరంతప=ఓయి అర్జునుఁడా! త్వం=నీవు, న వేత్థ=ఎఱుఁగవు.

శం. అర్జునా! నాకును, నీకును ఇదివఱకనేకజన్మములయినవి, వాని నన్నిఁటిని నే నెఱుఁగుదును నీ వెఱుఁగవు. ధర్మాధర్మాదులచే ప్రతిబంధింపఁబడిన జ్ఞానశక్తిఁగలవాఁడవగుటచేత నీవెఱుంగవు. నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావుఁడగుటవలన ఆవరణము కప్పులేని జ్ఞానశక్తిఁగలవాఁడను గాన నేను సమస్తజన్మముల నెఱుంగుదును.

రామా. నీజన్మములవలె నాజన్మములును సత్యములే కాని మిథ్యాభూతములు కావు.

శ్లో. అజోఽపిస న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా. 6

టీ. అహం=నేను, అజోఽపిసన్=పుట్టుకలేనివాఁడనైనను, అవ్యయాత్మాపిసన్ = నాశరహితమైన స్వభావముకలవాఁడనగుచును, భూతానాం=బ్రహ్మాదిసమస్త భూతములకు, ఈశ్వరోఽపిసన్=నియామకుఁ డగుచును, స్వాం=స్వకీయమైన, ప్రకృతిం=

(త్రిగుణాత్మకమయిన) మాయను, అధిష్ఠాయ = వశముజేసి కొని, ఆత్మమాయయా = నామాయచేత, సంభవామి = పుట్టుచున్నాను.

శం. నేను పుట్టనివాఁడను, అవికారుఁడను, ప్రాణులకు నియామకుఁడను, అయినను, నాదైన ప్రకృతి నవలంబించి, నా మాయవలనఁ బుట్టుచున్నాను.

రామా. అనఁగా పరమేశ్వరునకు స్వభావాదులగు అపహతపాప్మత్వము (పాపములులేకుండుట) మొదలగువానిని వదలకయే తనశుద్ధసత్త్వమైనరూపమునె (విగ్రహమునె) దేవమనుష్యాదులతో సమానాకారము గలదానినిగాఁ జేసిన తనసంకల్పముచేత దేవాదిరూపము కలవాఁడై పుట్టుచున్నాఁడు. ప్రకృతియనఁగా స్వభావము. మాయ అనఁగా జ్ఞానము. అనగా సంకల్పము.

మధ్వ. ఆత్మ అనాదియగుట అందఱకు తుల్యమే. ప్రకృతి వలనబుట్టినవసుదేవాదులయందు దానితోనె వారికిఁబుట్టినట్లు అగపడుచున్నట్లు కనంబడుచున్నాఁడు. ఆత్మమాయయా అనఁగా ఆత్మజ్ఞానమనియర్థము. సృష్టికారణమైనమాయ (ప్రకృతి) వల్ల వసుదేవాదులశరీరములను సృజించిపుట్టినట్లు, మోహికయను మాయచేఁ బుట్టినవాఁడై తోఁచుచున్నాఁడు.

శ్లో. యదాయదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్.

టీ. హేభారత = ఓ యర్జునుఁడా! యదాయదా = ఎప్పుడెప్పుడు, ధర్మస్య = వర్ణాశ్రమాది ధర్మమునకు, గ్లానిః = నాశన

ము, భవతి=అగుచున్నదో, అధర్మస్య-అధర్మమునకు, అభ్యుత్థానం=అభివృద్ధి, భవతి = అగుచున్నదో, తదాతదా=అప్పుడప్పుడు, అహం= నేను, ఆత్మానం=నన్ను, సృజామిహి=మాయచేతఁ బుట్టించుచున్నాను గదా!

తా. ఓయి భారత! ఏకాలమున ధర్మమునకు హానికలుగునో, అధర్మమునకు వృద్ధికలుగునో యప్పుడెల్ల నేను వచ్చుచున్నాను.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
　　ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. 8

టీ. సాధూనాం=సన్మార్గ ప్రవర్తకులయొక్క, పరిత్రాణాయ=రక్షణముకొఱకును, దుష్కృతాం = పాపాత్ములయొక్క, వినాశాయచ = నాశముకొఱకును, ధర్మసంస్థాపనార్థాయ=ధర్మమును లెస్సగా నిలుపుటకొఱకును, యుగేయుగే=ప్రతియుగమందును, సంభవామి=అవతరించుచున్నాను.

శం. మఱియు శిష్టపరిపాలన, దుష్టనిగ్రహ ధర్మసంరక్షణములకొఱకుఁ బ్రతియుగమున నవతరించుచున్నాను.

మధ్వ. భగవంతుఁ డవతరించియే రక్షణాదికమును చేయునను నియమము లేదు. లీలచేతను స్వభావముచేతను యథేష్టముగా ప్రవర్తించుచుండుననుట.

శ్లో. జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
　　త్యక్త్వా దేహం పున ర్జన్మ నైతి మా మేతి సోఽర్జున. 9

టీ. హే అర్జున=ఓయర్జునుఁడా! యః=ఎవఁడు, దివ్యం=అప్రాకృతమైన, మే = నాయొక్క, జన్మ = మాయరూపమైన

జన్మమును, కర్మచ = సాధురక్షణాది కర్మమును, ఏవం=ఈచె ప్పఁబడిన ప్రకారముగా, తత్త్వతః = యథార్థమువలన, వే త్తి=ఎఱుఁగుచున్నాఁడో, సః=అప్పురుషుఁడు, దేహం=ఈశరీర మును, త్యక్త్వా=విడిచి, పునః=తిరిగి, జన్మ=జన్మమును, నై తి = పొందఁడు, (మఱియు నేమన్నను), మాం=నన్నే, ఏతి= పొందును.

శం. ఓ యర్జునా! ఎవఁడు నా యప్రాకృతజన్మమును కర్మను నిశ్చయముగా నెఱుఁగుచున్నాఁడో, వాఁ డీశరీరమును విడిచినపిదప మరల జన్మమును బొందఁడు. నన్నే పొందు చున్నాఁడు.

రామా. భగవంతుని నాశ్రయించుటకొఱకు విరోధులగు పాపములన్నియును ఈయనతాదృజ్ఞానముచేతపోయి ఆజన్మమున నే భగవంతుని ఆశ్రయించి భగవదేకప్రియుండై భగవంతుని జేరును.

మధ్వ. ఈజ్ఞానముమాత్రముననే ముక్తికలుగదు. వానివా నికితగిన సమస్తగుణముల జ్ఞానంబును కలుఁగవలయును, అని 'తత్త్వతః' అనుపదమువల్ల వెల్లడియగుచున్నది.

శ్లో. వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. 10

టీ. వీతరాగభయక్రోధాః- వీత = పోఁగొట్టఁబడిన, రాగ= అనురాగమును, భయ = భయమును, క్రోధాః = క్రోధము నుగలవారును, మన్మయాః = నాయందే భావన గలవారును, మాం=నన్ను, ఉపాశ్రితాః = ఆశ్రయించినవారు నగు, బహ

వః=అనేకులయిన సత్పురుషులు, జ్ఞానతపసా = జ్ఞానమనెడి తపస్సుచేత, పూతాస్సంతః=పరిశుద్ధులైనవారలై, మద్భావం=నా స్వరూపమును, ఆగతాః=(సాక్షాత్తుగా) పొందిరి.

శం. అనురాగమును, భయమును, క్రోధమును విడిచి నాయందే చింతగలిగి నన్నాశ్రయించినసత్పురుషులు పెక్కురు జ్ఞానయోగముచేత పరిశుద్ధులై నాస్వరూపమును బొందిరి. ఇచ్చట మన్మయ శబ్దముచే నాత్మ పరమాత్మలయొక్క అభేదము సూచింపఁబడెను.

రామా. జ్ఞానతపస్సు అనుటచేత అవతారములయు వ్యాపారములయు తత్త్వజ్ఞానమనెడి తపస్సు. దీనిచేత పవిత్రులైన వారు నన్నాశ్రయించిన వారై రాగాదులు పోయి మన్మయులు అనగా నాయందు చిత్తముకలవారై నాతో సమానమైన ధర్మములు (గుణములు) కలుగుటను పొందిరి.

మధ్వ. మన్మయులనగా మత్ప్రచురులు - అంతట, నన్ను విడిచి మఱియొకదానిం జూడని వారు.

శ్లో. యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. 11

టీ. హే పార్థ=ఓ యర్జునుఁడా! యే=ఎవరు? యథా = ఏ ప్రకారముగా, మాం=నన్ను, ప్రపద్యంతే=తెలియుచున్నారో, అహం=నేను, తాన్=వారలను, తథైవ=ఆలాగుననే, భజామి=అనుగ్రహించుచున్నాను. మనుష్యాః=మనుష్యులు, సర్వశః=సర్వప్రకారములచేత, మమ=నాయొక్క, వర్త్మ=మార్గమును, అనువర్తంతే=అనుసరించుచున్నారు.

శం. ఓయర్జునుఁడా! ఎవరెవ రేయేరీతిగ నన్నుఁ దెలియుచున్నారో, వారివారిని, ఆయాప్రకారములుగ నే ననుగ్రహించుచున్నాను. కాన ఎల్లవారలును నామార్గమునే సర్వప్రకారములచేత ననుసరించుచున్నారు. జ్ఞానవంతులై కర్మసన్యాసము కలిగి మోక్షమును కోరెడి వారికి మోక్షమును ఫలముల కోరక కర్మముంజేయు వారికి జ్ఞానమును, ఆర్తులయినవారి కార్తిని పోఁగొట్టుటను, వారి వారి కోరికెప్రకార మిచ్చెదను కాని నా కొక్కనియందును రాగమైనను ద్వేషమైనను లేదు.

రామా. నన్నాశ్రయించు వారికి దేవమనుష్యాది రూపమున నవతరించియె రక్షణమును చేయుదు ననునియమము లేదు. నన్నాశ్రయింపఁగోరువారు వారివారి యపేక్షానుసారముగా నారూపము నెట్లూహించి కొందురో వారి కట్లే నాస్వరూపమును జూపుదును. యోగుల వాక్కునకును, మనస్సునకునుగూడ నామార్గముఅనగా స్వభావము అగోచరమైనది. అట్టి దానిని తమ తమ చక్షురాది కరణములచేత తమ కపేక్షితము లగు అన్ని ప్రకారములచేతను అనుభవించి యనువర్తింతురు.

మధ్వ. అన్యదేవతాది స్వరూపమున నన్ను భజించినంత మాత్రమున ముక్తిలేదు. అయినను వారి వారికి తగిన ఫలములనిచ్చెదను. నేను సర్వకర్మములకుం గర్తను భోక్తనుంగాన, అన్యదేవతలం గూర్చి యజ్ఞములు చేయు వారైనను నామార్గమునె యనుసరింపుచున్నారు.

శ్లో. కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా. 12

టీ. ఇహ=ఈ లోకమందు, కర్మణాం = కర్మములయొక్క, సిద్ధిం=ఫలసిద్ధిని, కాంక్షన్తః=కోరుచుండెడి జనులు, దేవతాః= ఇంద్రాది దేవతలను, యజంతే=సేవించుచున్నారు, మానుషే=మనుష్యసంబంధమైన, లోకే=లోకమందు, కర్మజా=కర్మమువలనఁబుట్టిన, సిద్ధిః=ప్రాప్తి, క్షిప్రం=శీఘ్రముగా, భవతిహి=కలుగుచున్నది గదా.

తం. ఈ ప్రపంచమునందు మనుష్యులు ఫలాపేక్షతో నింద్రాది దేవతలను గొలుచుచున్నారు. ఈ మానుషలోకమునఁ గర్మఫలము త్వరలో లభించుచున్నది.మరియును యీశ్లోకము వలన యితర లోకములయందుకూడ కర్మఫలములసిద్ధి తెలియఁ జేయఁబడినది. మనుష్య లోకమున వర్ణాశ్రమాది కర్మములు విశేషము.

రామా. మనుష్యలోక శబ్దము స్వర్గాదులం దెలియఁ జేయును. ఈలోకములోనివారంద అవివేకులై శీఘ్రఫలములం గోరి పుత్ర పశ్వన్నాదుల కొఱకును, స్వర్గాదులకొఱకును ఇంద్రాది దేవతల మాత్రము కర్మములచే నారాధించెదరు. ఒక్కఁడైనను సంసారమందు రోతపుట్టి మోక్షమును కోరి ఇంద్రాది దేవతల కాత్మ భూతుఁడనగు నన్ను కర్మములచే నారాధింపకున్నాఁడు.

మధ్వ. అన్య దేవతలం గూర్చి యజ్ఞము చేయువారును, నామార్గము ననుసరించు వారగుటచేత పుత్త్రాది ఫలప్రాప్తి

శీఘ్రముగాఁ బొందు చున్నారు. విష్ణువు యజ్ఞభోక్త కాని యె డను, బ్రహ్మాదులకు స్వాతంత్ర్యము లేక పోవుటచే ఫలము నిచ్చుసామర్థ్యము లేదు కాన ఫలసిద్ధి కలుగక పోవలసినది అనుట.

శ్లో. చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. 13

టీ. మయా=నాచేత, చాతుర్వర్ణ్యం=బ్రహ్మ క్షత్రియాది వర్ణ చతుష్టయము, గుణకర్మవిభాగశః - గుణ=సత్త్వాది గుణ ములయొక్కయు, కర్మ = తపశ్శమాదికర్మములయొక్కయు, విభాగశః=విభజనచొప్పున, సృష్టం=సృజింపఁబడెను, తస్య=ఆ సృష్టికర్మమునకు, కర్తారమపి=కర్తనైనను, మాం=నన్ను, అకర్తారం=కర్తగానివానినిఁగాను, అవ్యయం=నాశరహితునిఁ గాను, విద్ధి=తెలియుము.

'గుణకర్మవిభాగశః' అనుటకుశంకరవివరణము. సత్త్వగుణ ప్రధానుఁడగు బ్రాహ్మణునికి శమము (ఇంద్రియ నిగ్రహము), దమము (అంతఃకరణ నిగ్రహము), తపస్సు మొదలగునవి కర్మములు సత్త్వముతోఁ గూడినరజోగుణ ప్రధానముగాఁగల క్షత్రియునకు శౌర్యము (శూరత్వము), తేజస్సు (ప్రతాపము) మొదలగునవి కర్మములు తమస్సుతోఁ గూడిన రజోగుణ ప్రధానుఁడగు వైశ్యునకు కృషి (వ్యవసాయము) కర్మములు. రజస్సుతోఁ గూడిన తమోగుణప్రధానుఁ డగు శూద్రునకు శుశ్రూష (పరిచర్య) యే కర్మములు.

శం. సత్త్వాది గుణములు, కర్మలు, వీటిభేదములచేత

నాలుగువర్ణములు నాచే సృజింపఁబడినవి, ఆనాల్గువర్ణములకు నేను కర్తనైనను, అవికారుఁడను గనుక నన్నుఁ గర్తనుగా నట్లు తెలియుము.

రా. బ్రహ్మ మొదలు స్తంబము (గడ్డికాడ)వరకుండు జగత్త్రయము నాచే సృజింపఁబడినది, రక్షింపఁబడుచున్నది, సంహరింపఁబడుచున్నది, అని యెఱుంగుము. నన్నుదానికి కర్తనుగాను, అకర్తనుగాను తెలిసికొనుము (ఈయంశ ముత్తరశ్లోకమున వివరింపఁబడి యున్నది).

మధ్వ. చాతుర్వర్ణ్యమనగా నాలుగువర్ణముల సముదాయము. బ్రాహ్మణుఁడు సాత్త్వికుఁడు, క్షత్రియుఁడు సాత్త్వికరాజసుఁడు, వైశ్యుఁడు రాజసతామసుఁడు, శూద్రుఁడు తామసుఁడు. అని గుణవిభాగము. కర్తనైన నన్ను క్రియ (పని) యందు అభిమానము లేకపోవుటవలన అకర్తనుగాఁ దెలిసికొనుము.

శ్లో. న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే. 14

టీ. కర్మాణి=సృష్ట్యాదికర్మములు, మాం=నన్ను, నలింపంతి=అంటవు, మే=నాకు, కర్మఫలే=కర్మఫలమందు, స్పృహా=ఇచ్ఛ, న=లేదు. ఇతి=ఈప్రకారముగా, మాం=నన్ను, యః=ఎవఁడు, అభిజానాతి=ఎఱుఁగుచున్నాఁడో, సః=వాఁడు, కర్మభిః=కర్మములచేత, నబధ్యతే=కట్టుపడఁడు.

శం. కర్మలు నన్నంటవు, కర్మసిద్ధియందు నా కాసక్తిలేదు. ఈ విధముగా నన్నుఁ దెలిసికొన్నజ్ఞానిని కర్మఫలములు కట్టఁజాలవు.

రా. ఈవిచిత్రసృష్టి మొదలగుకర్మములు నన్ను సంబంధిం పవు. అనఁగా దేవమనుష్యాదిసృష్టివైచిత్ర్యములు సృజింపఁ బడువారి పుణ్యపాపకర్మవిశేషములంబట్టి వచ్చినవి. కాఁబట్టి నేను విచిత్రసృష్టి మొదలగుదానికి కర్తనుగాను. కరణ కళేబర ములతో సృజింపఁబడినజీవులు సృష్టివలనఁగలిగిన భోగ్యములను వారివారి కర్మానుగుణముగా ననుభవింతురు. కాఁబట్టి సృష్ట్యాది కర్మఫలమునం గూడ వారివారి కోరికగాని నాకు కోరిక లేదు. ఇట్టిసృష్టికిఁ గర్తనుగాను అకర్తనుగాను, సృష్ట్యాదికర్మ ఫలప్రసంగము లేనివానిగాను నన్నెవ్వఁడెఱుంగునో, వాఁడు కర్మయోగారంభమునకు విరోధులగు ప్రాచీనకర్మములతో సంబంధింపఁడు.

మధ్వ. నాకు కర్మఫలమందు (పరులకొఱకు) ఇచ్ఛామాత్రము కలదుగాని అభినివేశములేదు. కొందఱే ముక్తులగుదురుగాని క్రమముగానైనను సర్వముక్తిలేదు. అందుకు జీవులనంతులగుటయే హేతువు ఫలముకలుగువరకును దేనివలన మనస్సునకు విక్షేపముకలుగునో అది అభినివేశము.

శ్లో. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం. 15

టీ. ఏవం=ఈప్రకారము, జ్ఞాత్వా=ఎఱిఁగి, పూర్వైః= పూర్వికులైన, ముముక్షుభిరపి = మోక్షాపేక్షగలవారలచేత నయితము, కర్మ=కర్మము, కృతం=చేయఁబడెను, తస్మాత్= ఆకారణమువలన, త్వం=నీవు, పూర్వైః=ప్రాచీనులైన జన

కాదులచేత, కృతం=చేయఁబడిన, పూర్వతరం=పురాతనమైన, కర్మైవ=కర్మమునే, కురు=చేయుము.

శం. ఈవిధముగాఁ దెలిసికొని ముముక్షువులైన పూర్వికులచేతఁ గర్మ చేయఁబడినది. కాన నీవును ప్రాచీనులచే ననాదిగఁ జేయఁబడినకర్మను జేయుము. నీవు ఆత్మజ్ఞానము లేనివాఁడవైనచో అంతఃకరణ శుద్ధికొఱకును, ఆత్మజ్ఞానము కలవాఁడవైనయెడల లోకసంగ్రహము కొఱకును జనకాదులచేఁ జేయఁబడిన కర్మనుచేయుము.

రా. ఇట్లు నన్ను తెలిసికొని పాపములనన్నిటిని పోఁగొట్టుకొనిన పూర్వపు ముముక్షువులచే వెనుకఁ జెప్పఁబడిన కర్మము చేయఁబడినది. అందువలన నీవును ఇట్టిజ్ఞానముచే పాపములఁ బోఁగొట్టుకొని పూర్వులగు వివస్వంతుఁడు మనువు మొదలగు వారిచేఁ జేయఁబడిన పురాతనకర్మమును చేయుము.

మధ్వ. జ్ఞానముకలిగినను కర్మమునుచేయుట కాచారము కలదు. జ్ఞానికి మోక్షముకలుగుట నిశ్చితమైనను అంతకంటె ఎక్కుడుమోక్షము కలుగుటకు కర్మముల నాచరించుట యాచారసిద్ధము.

శ్లో. కిం కర్మ కి మకర్మేతి కవయో ప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసే౽శుభాత్. 16

టీ. కర్మ=కర్మము, కిం=ఎట్టిది, అకర్మ=అకర్మము, కిం=ఎట్టిది, ఇతి=ఇట్లని, అత్ర=ఈ కర్మజ్ఞానవిషయమై, కవయోపి=బుద్ధిమంతులును, మోహితాః=మోహమునుబొందిరి,(ఆ కారణమువలన), యత్=దేనిని, జ్ఞాత్వా=తెలిసికొని, అశుభాత్=సం

సారమువలన, మోక్ష్యసే=ముక్తుఁడవు కాఁగలవో, తత్=అట్టి, కర్మ=కర్మమును, అకర్మ=అకర్మమును, తే=నీకొఱకు, ప్రవక్ష్యామి=లెస్సగాఁ జెప్పెదను.

శం. కర్మయెట్టిది, అకర్మ యెట్టిది అను నీయంశమునందు బుద్ధిమంతులుగూడ మోహమును జెందిరి. ఆకర్మాకర్మముల యొక్క విషయమును నీకొఱకు లెస్సగాఁజెప్పుచున్నాను. నీవు దానిని దెలిసికొనినచో క్షేమమును పొందఁగలవు.

రా. అకర్మమనగా కర్తయైన ఆత్మయొక్క తత్త్వజ్ఞానము. చేయవలసిన కర్మమును దానిలోఁజేరినజ్ఞానమును ఎట్టివి, అను నంశమును పండితులుగూడ నెఱుంగకున్నారు. ఇట్లు అంతర్గతమైనజ్ఞానముగల కర్మమునున్ను, దేనివలన సంసారమునుండి నీవు విడువఁబడుదువో దానిని నేను నీకుచెప్పెదననుట.

శ్లో. కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. 17

టీ. కర్మణః=శాస్త్రవిహితమైన కర్మముయొక్క, (తత్త్వం=యథార్థము,) బోద్ధవ్యం=తెలియఁదగినదై, (అస్తి=ఉన్నది,) వికర్మణోపి = నిషిద్ధకర్మముయొక్కయు, (తత్త్వం=యథార్థము,) బోద్ధవ్యం=తెలియఁదగినదై, (అస్తి=ఉన్నది), అకర్మణః=జ్ఞానముయొక్కయు, (తత్త్వం = యథార్థము), బోద్ధవ్యం=తెలియఁదగినదై, (అస్తి=ఉన్నది.) కర్మణః=కర్మాకర్మవికర్మములయొక్క, గతిః=యథార్థగతి, గహనాహి=తెలియనశక్యమైనదిగదా!

శం. శాస్త్రోక్తకర్మ ఇదియనియు, శాస్త్రనిషిద్ధకర్మయిది యనియు, కర్మాభావ మిదియనియు, నీ మూఁడుస్థితులను చక్కఁగాఁ దెలియవలయును, ఈకర్మాకర్మవికర్మల యథార్థస్థితి తెలియుట యశక్యము.

రామా. కర్మమనగా మోక్షసాధన మైనది - వికర్మమనగా నిత్యనైమిత్తిక కామ్యరూపము చేతను, దానికి సాధనములగు ద్రవ్యసంపాదనాదుల రూపములచేతను, అనేకవిధములైనకర్మము. అకర్మమనగా జ్ఞానము. వికర్మమున తెలియ వలసిన దేదియనగా నిత్యనైమిత్తికకామ్య ద్రవ్యార్జనాది కర్మమున ఫలభేదములవలనవచ్చిన నానావిధత్వమును విడిచి మోక్షమే ఫల మగునట్లు ఏకశాస్త్రార్థత్వము ననుసంధానము చేయుట - ఇది 'వ్యవసాయాత్మికాబుద్ధిః' (౨-అ. శ్లో-౪౧.) అను శ్లోకమునందు వివరణము.

మధ్వ. కర్మవికర్మములు విహిత నిషిద్ధకర్మములు - అకర్మమనగాకర్మమును చేయక పోవుట - కొరవతాత్పర్య మంతయు పైభాష్యకారుల ననుసరించియే యున్నది.

శ్లో. కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
　స బుద్ధిమా న్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్. 18

టీ. యః=ఎవఁడు, కర్మణి=వ్యాపారమాత్ర కర్మమందు, అకర్మ=కర్మ లేకపోవుటను, (అనఁగా నింద్రియవ్యాపారసద్భావమందు సాక్షియైన తనకు అకర్తృత్వమును,) పశ్యేత్=చూచునో, యః=ఎవఁడు, అకర్మణిచ=కర్మాభావమునందును, కర్మ=బ్రహ్మము తెలియఁబడుచుండఁగాఁ జేయఁదగినకర్మము చేయఁ

బడెనని, పశ్యేత్=చూచునో, సః=వాఁడు, మనుష్యేషు=మనుష్యులయందు, బుద్ధిమాన్ = నిశ్చయాత్మక బుద్ధిగలవాఁడు, సః=వాఁడే, కృత్స్నకర్మకృత్ = సమస్తకర్మములఁ జేసినవాఁడును, యుక్తః=యోగియు, భవేత్=అగును. (బ్రహ్మవిచారమందు నిశ్చలమనస్సు గలవాఁడు, సకలకర్మముల నాచరించినవాఁడగు నను నీవిషయమై పండితకృతంబగు నొకశ్లోక మిచటఁ జేర్పఁబడియె. శ్లో. "స్నాతం తేన సమస్తతీర్థనిచయే దత్తం మహీమండలం, విప్రేభ్యః పితృదేవతా స్సురగణా స్సర్వేపి సంతర్పితాః, జప్తామంత్రసహస్రకోటి రమునాతప్తంచ తీవ్రం తపో, యస్య బ్రహ్మవిచారణే క్షణమపి ప్రాప్నోతి స్థైర్యం మనః" మఱియు "కర్మణ్యకర్మ" అనెడుశ్లోకమున చెప్పఁబడిన యర్థముగాక మఱియొకయర్థముగలదు. భగవత్ప్రీతిగాఁజేయఁబడిన నిత్యకర్మమునకు బంధహేతుత్వము లేదు గావున నవి యకర్మములని చెప్పఁబడుచున్నవి. ఆ నిత్యకర్మములు చేయక పోవుట యకర్మము, ఆయకర్మమునకుఁ బ్రత్యవాయమే ఫలమగుటవలన నది యాప్రత్యవాయఫలకర్మమని చెప్పఁబడుచున్నది. అనఁగా కర్మాకర్మములలో ఫలములేని నిత్యకర్మమందు కర్మములఁజేయని పక్షమం దాయకర్మమందుఁ గర్మము నరకముఖ్యప్రత్యవాయఫలము నిచ్చునని యెవ్వఁడు చూచునో వాఁడును నని చెప్పినవ్యాఖ్యాన మంగీకృతంబుగాదు గావునఁ దొలుత చెప్పినయర్థమే యుక్తము.)

శం. కర్మయందుకర్త్రాభావము నెవఁడు తెలిసికొనుచున్నాఁడో కర్త్రాభావమునందు కర్మ నెవఁడు తెలిసికొనుచున్నాఁడో

వాఁడు మనుష్యులలోన బుద్ధిమంతుఁడును యోగియు నెల్ల కర్మలచేసిన వాఁడును అగును.

రామా. అకర్మ మనఁగా కర్మ కానిదగు నజ్ఞానము - కర్మ యుండగనె యాత్మస్వరూపజ్ఞానమును, జ్ఞానము ఉండఁగనే కర్మమును ఎవ్వఁ డెఱుంగునో వాఁడు బుద్ధిమంతుఁడు. అనఁగా శాస్త్రార్థము నంతయు నెఱింగినవాఁడు. వాఁడె యుక్తుఁడు. అనగా మోక్షమునకు తగినవాఁడు - వాఁడె యన్ని కర్మములం జేసినవాఁడు; అనఁగా శాస్త్రార్థమంతయు జరిపినవాఁడు- కర్మజ్ఞానములు రెండును ఒక్కదానితో నొక్కటి చేరియుండ వలయుననుట.

మధ్వ. అకర్మఅనునప్పుడు'అ'అనునది విష్ణువు నుచెప్పును - కాన విష్ణువుయొక్క కర్మము-(పని)- అని అర్థము-కర్మము చేయఁబడినదగుచుండగా, అదిభగవంతునికర్మము, 'చిత్ప్రతిబింబమైన నాకు స్వతంత్రముగాఁ గర్తృత్వము లేదు.' అనియెవ్వఁడు తలంచునో వాఁ డెల్లకర్మముల చేసినవాఁడగును. అకర్మణి యను దానికి జీవుని పనులులేని నిద్ర మొదలగుకాలమందు అని అర్థము - జీవుఁడు పనిచేయక పడియుండు నిద్రాదిసమయముల యందును భగవంతునికి సృష్టి మొదలగు కర్మకలదనియు నెవ్వఁడుతలంచునో వాఁడు మనుష్యులలో పామరుఁడు కాని వాఁడు. వాఁడె యోగముతోఁ గూడిన వాఁడు - వాఁడె అన్నికర్మములం జేసినవాఁడు. అన్ని కర్మములం జేయక పోయినను అన్నికర్మములంజేసినదానిపైఁగలిగెడిమోక్షఫలముకలుగును.

శ్లో. యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః. 19

టీ. యస్య=ఏయథోక్తదర్శియైనవానియొక్క, సర్వే=సమస్తములైన, సమారంభాః=కర్మములు, కామసంకల్పవర్జితాః=కోరిక యుద్దేశము లేనివై (భవంతి=అగుచున్నవో,) బుధాః=విద్వాంసులు, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం=జ్ఞానమను అగ్నిచేత దహింపఁబడిన సకలశుభాశుభకర్మములుగలిగినట్టి, తం=ఆపురుషుని, పండితం=పండితునిగా, ఆహుః=చెప్పుదురు.

శం. ఎవనికర్మలు కామసంకల్పములు కావో, యెవనికర్మలు జ్ఞానమను నిప్పుచేఁ గాల్పఁబడినవో, అట్టివానిని పండితుఁడని విద్వాంసులు చెప్పుదురు.

మధు. కామములకు కారణములైనవి సంకల్పములు, ఈ రెండును లేనివాఁడై ప్రవృత్తి మార్గమున నున్నవాఁడు లోకసంగ్రహము కొఱకును, నివృత్తిమార్గమున నున్నవాఁడు తాను బ్రతుకుటకు మాత్రంబును పనులుచేయును. కామమనగా ఫలమును కోరుట. సంకల్పమనఁగా నేను చేయుచున్నానను కర్తృత్వాభిమానము.

రామా. సమారంభములనఁగా ద్రవ్యార్జనము మొదలగు లౌకిక వ్యాపారములతోఁ గూడిన నిత్యనైమిత్తిక కామ్యకర్మముల ఆరంభములు. కామమనఁగా ఫలసంగము. సంకల్పమనఁగా ప్రకృతితోను, దాని గుణములతోను ఆత్మను ఏకీభవింపఁజేసి తలంచుట. జ్ఞానమనఁగా కర్మాంతర్గతమైన యాత్మజ్ఞానము. దీనివలన కర్మమునకు జ్ఞానాకారత్వము సంభవించుచున్నది.

మధ్వ. ఇది నాకు కావలయుననెడు ఫలసంగము కామము. ఇది చేసెదనను కర్మసంగము సంకల్పము.

శ్లో. త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మ ణ్యభిప్రవృత్తోపి నైవ కించి త్కరోతి సః. 20

టీ. కర్మఫలాసంగం = కర్మకర్తృత్వాభిమానమును, త్యక్త్వా=విడిచి, నిత్యతృప్తస్సన్-నిత్య=ఎల్లప్పుడును, తృప్తస్సన్=(విషయములయందును గర్మఫలమునందును కర్తృత్వాభిమానకాంక్షలేక జ్ఞానముచేత) తృప్తుఁడయినవాఁడగుచు, నిరాశ్రయస్సన్=నిరాశ్రయుఁడైనవాఁడగుచు, కర్మణి=కర్మమందు, అభిప్రవృత్తోపి=ప్రవర్తించినవాఁడయ్యును, సః=వాఁడు, కించిదపి=కొంచెమైనను, నకరోత్యేవ=చేయకున్నవాఁడే.

శం. కర్మఫలాపేక్షను విడిచి, నిత్యతృప్తుఁడై విషయప్రవృత్తిలేనివాఁడు కర్మయందుఁ బ్రవర్తించిన వాఁడయినను అట్టి వాఁడు కర్మచేసినవాఁడు కాఁజాలఁడు. వానికర్మముఁగూడ జ్ఞానమను అగ్నిచే దహింపఁబడినదై అకర్మమే యగును.

రామా. నిత్యమైన తనయాత్మయందు తృప్తిని చెందినవాఁడు నిత్యతృప్తుఁడు. అస్థిరమైన ప్రకృతియం దాశ్రయబుద్ధి లేనివాఁడు నిరాశ్రయుఁడు. ఇట్టివాఁడు కర్మప్రవృత్తియైనను కర్మవ్యాజమున జ్ఞానాభ్యాసము చేయుచున్నాఁడు గాన కర్మమును చేయనివాఁడే యనుట.

మధ్వ. నిత్యతృప్తుఁడును నిరాశ్రయుఁడునైన ఈశ్వరునితో సమానమైన రూపము కలవాఁడనైతి ననువాఁడు కర్మప్రవర్తియైనను జ్ఞానాభ్యాసిగాన కర్మమును చేయని వాఁడే యనుట.

శ్లో. నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 21

టీ. నిరాశీః=కోరికలేనివాఁడును, యతచిత్తాత్మా = నిగ్రహింపఁబడినయంతఃకరణమును బాహ్యకార్యగణసంఘాతము గలిగినవాఁడును, త్యక్తసర్వపరిగ్రహః=విడువఁబడిన సమస్తవస్తుసంగ్రహము గలవాఁడునునై, శారీరం = శరీరస్థితిమాత్రోపయోగియైన భిక్షాటనాది, కర్మ కేవలం=కర్మమునే, కుర్వన్=చేయుచున్న జనుఁడు, కిల్బిషం=సంసారబంధరూపమైన పాపమును, నాప్నోతి=పొందఁడు.

శం. కోరికలను విడిచిపెట్టి చిత్తస్వాధీనము గలిగి యెల్ల విషయములయందు నభిమానమువదలి శరీరపోషణమాత్రమున కుపయుక్తమైనకర్మను చేయువానిని పాపము తాఁకదు.

రామా. నిరాశీః = ఫలోద్దేశములేనివాఁడు. పరిగ్రహమనఁగా ప్రకృతియందును ప్రాకృతులయందును మమకారము, కేవలశారీర కర్మమనగా జ్ఞాననిష్ఠ లేని వట్టికర్మయోగము. దీని వలన ఆత్మదర్శనము కలుగును. పాప మేమాత్ర ముంటదు.

మధ్వ. ఈశ్లోకమున కామాదులను విడుచుటకు ఉపాయమును చెప్పుచున్నది. నియమింపఁ బడినబుద్ధియును మనస్సును కలవాఁ డగుటచే ఆశలేనివాఁడై, పరిగ్రహమును విడుచుట యనఁగా అభిమానములేక పోవుట. ఇట్టివాఁడు కర్మమువలనఁ గలిగెడు పాపమును పొందఁడు అనుట.

శ్లో. యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే. 22

టీ. యదృచ్ఛాలాభసంతుష్టః = అప్రార్థితప్రాప్తలాభము చేత సంతుష్టుఁడయి, ద్వంద్వాతీతః=శీతోష్ణాదిద్వంద్వదుఃఖ ముల నతిక్రమించినవాఁడయి, విమత్సరః=విగతమత్సరుఁడయి, సిద్ధౌ=యదృచ్ఛాలాభప్రాప్తియందును, అసిద్ధౌచ = అప్రాప్తియందును, సమః=తుల్యుఁడైనపురుషుఁడు, కృత్వాపి=(కర్మమును) చేసియును, ననిబధ్యతే= సంసారముచేతఁ గట్టు వడఁడు.

శం. అప్రార్థితలాభముచే సంతోషించి ద్వంద్వగుణములకు లోఁబడక, మత్సరములేక, సిద్ధ్యసిద్ధులయందు సముఁడై కర్మ చేసినవాఁడు కర్మబద్ధుఁడు కాఁడు. విమత్సరుఁ డనఁగా వైర బుద్ధిలేనివాఁడు. ఇట్టివాఁడు భిక్షాటనాది కర్మచేసినను కర్తృత్వాభిమాన బుద్ధిలేనివాఁడై యుండుటచే చేయనివాఁడే.

రామా. సిద్ధ్యసిద్ధులయందు సముఁడనఁగా తానుచేయు చుండెడు యుద్ధాది కర్మములలో జయము వచ్చినను అపజ యము వచ్చినను సమానమైన చిత్తముకలవాఁడు. ఇట్టి వాఁడు జ్ఞానము లేక వట్టి కర్మమును చేసినను సంసారమును పొందఁ డనుట.

మధ్వ. ఈశ్లోకమున నియమింపఁ బడినబుద్ధియును మన స్సును కలవారి స్వరూపమును చెప్పెను. సిద్ధ్యసిద్ధులలో సముఁ డగుటను ద్వంద్వాతీతుఁడగును. ఇట్టివాఁడు కర్మను చేసినను సంసారమును పొందఁడు.

అవ. బ్రహ్మజ్ఞానము కలిగినను ఒకానొక నిమిత్తమువలన ఆశ్రమసన్యాసములేకుండెడివాని గుఱించినది.

శ్లో. గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. 23

టీ. గతసంగస్య=ఆసక్తిలేనివాఁడును, ముక్తస్య=(సంసారబంధ) ముక్తుఁడైనవాఁడును, జ్ఞానావస్థితచేతసః = బ్రహ్మజ్ఞానమందున్న చిత్తముగలిగినవాఁడును, యజ్ఞాయ=యజ్ఞముకొఱకు, ఆచరతః=లోకసంగ్రహార్థమైన కర్మమును చేయుచున్నవాఁడునగువానికి, సమగ్రం=ఫలముతోఁగూడ, కర్మ=కర్మము, ప్రవిలీయతే=మిక్కిలి నశించుచున్నది.

శం. ఆసక్తిలేనివాఁడై, ముక్తుఁడై, జ్ఞానమందు నిశ్చయబుద్ధిగలవాఁడై, భగవత్ప్రీత్యర్థమై చేయువానియొక్క కర్మ నిశ్శేషముగా నశించుచున్నది. (బ్రహ్మజ్ఞానియొక్క కర్మము ఫలముతోఁగూడ నశించుననిభావము.)

రా. ఆత్మజ్ఞానము కలవాఁడగుటచే మిగిలినవానియందు సంగములేనివాఁడు, గతసంగుఁడు. అని పరిగ్రహములచేతను విడువఁబడినవాఁడు ముక్తుఁడు, ఇట్టివానికని జ్ఞానావస్థిత చేతసునకును, యజ్ఞముకొఱకు లోకసంగ్రహార్థకమైన కర్మచేయువాఁడును వీనికి బంధకమగు ప్రాచీనకర్మము నిశ్శేషముగా నశించును.

మధ్వ. ఫలస్నేహములేనివాఁడు గతసంగుఁడు; శరీరాద్యభిమానము లేనివాఁడు ముక్తుఁడు; పరమేశ్వరజ్ఞానము కలవాఁడు జ్ఞానావస్థితచేతసుఁడు; యజ్ఞముకొఱకు కర్మచేయువాఁడు; ఇట్టి

వాఁడు కర్మమును చేయుచున్నను వానికర్మ నిశ్శేషమై నశిం చుచున్నది.

శ్లో. బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం,
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా. 24

టీ. అర్పణం=(హోమసాధనములైన) స్రుక్స్రువాదులు, బ్రహ్మ=బ్రహ్మస్వరూపమే, హవిః=ఆజ్యాదిహవిస్సు, బ్రహ్మ= బ్రహ్మమే, బ్రహ్మాగ్నౌ=బ్రహ్మమనునగ్నియందు, బ్రహ్మణా= కర్తృస్వరూపమైన బ్రహ్మముచేత, హుతం=హోమముచేయు ట యను హవనక్రియ, బ్రహ్మైవ=బ్రహ్మమే, తేన=ఆ, బ్రహ్మ కర్మసమాధినా=బ్రహ్మమనెడికర్మమందుఁ జిత్తైకాగ్ర్యముచేత, గంతవ్యం=పొందఁదగినఫలము, బ్రహ్మైవ=బ్రహ్మమే, (అట్లు తెలి సినవానికిఁ గర్మములేదు).

శం. యజ్ఞపాత్ర బ్రహ్మమే, హోమద్రవ్యము బ్రహ్మమే, అగ్ని బ్రహ్మమే, హోమముచేయువాఁడు బ్రహ్మమే, బ్రహ్మ కర్మసమాధిచేతఁ బొందఁదగుఫలము బ్రహ్మమే.

రా. బ్రహ్మమయమగు హోమసాధనములుగల బ్రహ్మమ యమగు హవిస్సు బ్రహ్మమయమైన అగ్నియందు బ్రహ్మమైన కర్తచేత హోమము చేయఁబడినది. అని సమస్త కర్మంబును బ్రహ్మాత్మకం బగుటచేత బ్రహ్మమయమని యెవ్వఁడు తలం చునో, వాఁడు బ్రహ్మకర్మసమాధి. వానిచేత బ్రహ్మాత్మకం బగుటను బ్రహ్మమయమైన తనయాత్మస్వరూపమె పొందఁబడఁ దగినది. మోక్షముం గోరువానిచే చేయఁబడినకర్మము పరబ్ర హ్మాత్మక మనెడి యనుసంధానముతోఁ గూడి యుండుటనె

జ్ఞానాకారమై ఆత్మజ్ఞాన మక్కఱలేకయే ఆత్మావలోకనసాధన మగును. భగవంతునికి మిగిలిన చేతనాచేతనము లన్నియు శరీరములు, వానికి భగవంతుఁడు శరీరి (ఆత్మ) ఇట్టి శరీర శరీరిభావమును పట్టియె మిగిలిన పదార్థములన్నియు బ్రహ్మమనుట.

మధ్వ. హోమసాధనాదు లన్నియు బ్రహ్మమనుట, బ్రహ్మాధీనమైన సత్తకలవి యగుటవలన, సమాధితోఁగూడ బ్రహ్మమే కర్మము. ఇట్లు భగవంతుఁ డొక్కఁడె స్వతంత్రుఁడు. మిగిలినదంతయు వాని యధీనము. అనుజ్ఞానము కలవాఁడే వెనుకటి శ్లోకమందలి జ్ఞానావస్థితచేతస్కుఁ డనుట.

శ్లో. దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి. 25

టీ. అపరే=కొందఱు, యోగినః=యోగులు, (కర్మయోగులనుట). దైవ=దేవతాయజనసాధనమైన, యజ్ఞ మేవ=యజ్ఞమునే, పర్యుపాసతే = (ఫలాసక్తిచేతఁ) జేయుచున్నారు, అపరే=మఱికొందఱు జ్ఞానులు, యజ్ఞేనైవ = హవిస్సువాది యజ్ఞసాధనముచేతనె, యజ్ఞం=పరమార్థముతోఁ గూడినయాత్మను, బ్రహ్మాగ్నౌ=బ్రహ్మమనెడి యజ్ఞవిధానమైన యగ్నియందు, ఉపజుహ్వతి=హోమము చేయుచున్నారు. (వీరు బ్రహ్మైకనిష్ఠులు. ఇది జ్ఞానయజ్ఞము.)

శం. కొందఱుయోగులు ఫలాసక్తిచే దేవతాయజనసాధనమైన యజ్ఞమునే చేయుచున్నారు. వీరు కర్మనిష్ఠులు అనఁబడుదురు. మఱికొందఱు జ్ఞానులు బ్రహ్మమను నగ్నియందు, కర్మమను హవిస్సును హోమము చేయుచున్నారు. ఈ యుపా

ధితోఁగూడిన యాత్మను నిరుపాధిక బ్రహ్మస్వరూపముగాఁ దలంచువారు. బ్రహ్మజ్ఞానము గల సన్యాసులు.

రా. దైవయజ్ఞ మనఁగా దేవార్చన రూపంబగు యజ్ఞము. దీని నాచరించువా రొకవిధమైన కర్మయోగులు. ఉత్తరార్థమందలి యజ్ఞమ్ అనునది హవిస్సు, స్రుక్కు మొదలగు యజ్ఞసాధనములఁ జెప్పును. జ్ఞానాకారమగు కర్మము నాచరించువా రొకవిధమైన కర్మయోగులు.

మధ్వ. భగవంతుని యజ్ఞమగునట్లుగా ఉపాసన చేయుచున్నారు. భగవదుపాసనమే యజ్ఞము. యతుల కింతకంటె వేఱు యజ్ఞములేదు. ప్రసిద్ధమైన యజ్ఞముచేతనే భగవంతుని గూర్చి హోమము చేయుచున్నారు. వీరు వానప్రస్థులు.

శ్లో. శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీ న్విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి. 26

టీ. అన్యే=మఱికొందఱునైష్ఠికులు, శ్రోత్రాదీని=శ్రోత్రము మొదలైన, ఇంద్రియాణి=ఇంద్రియములను, సంయమాగ్నిషు = నిగ్రహమనెడియగ్నులయందు, జుహ్వతి=హోమముజేయుచున్నారు, అన్యే=మఱికొందఱు, శబ్దాదీన్=శబ్దము మొదలయిన, విషయాన్=విషయములను, ఇంద్రియాగ్నిషు=ఇంద్రియము లనెడి యగ్నులయందు, జుహ్వతి=వ్రేల్చుచున్నారు.

శం. మఱికొందఱు జ్ఞానేంద్రియములను నిగ్రహమనునిప్పునందు హోమముచేసి నశింపఁజేయుచున్నారు. మఱికొందఱు విషయములను నింద్రియము లనేనిప్పునందు హోమముచేసి నశింపఁజేయుచున్నారు.

రామా. కొందఱు కర్మనిష్ఠులు శ్రోత్రాదీంద్రియములను నియమించుటయందె ప్రయత్నము చేయుదురు. మఱికొందఱు శబ్దాదివిషయముల ననుభవింపుచును వానిని నివారించుట యం దతిప్రయత్నము సలుపుదురు.

మధ్వ. ఈ శ్లోకపూర్వార్ధము ఇంద్రియనియమనము చేసెడి నైష్ఠిక బ్రహ్మచారినిగూర్చినది. ఉత్తరార్ధము యుక్తవిషయానుభవముచేసెడి గృహస్థుని గూర్చినది.

శ్లో. సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. 27

టీ. అపరే=మఱికొందఱు, సర్వాణి=సమస్తములయిన, ఇంద్రియకర్మాణి=జ్ఞానేంద్రియ కర్మేంద్రియములయొక్క శబ్దాదివచనాదివిషయములను, ప్రాణకర్మాణిచ = ప్రాణాదిదశవాయువులయొక్క బహిర్గమనాదికర్మములను, జ్ఞానదీపితే=జ్ఞానముచేతఁ బ్రకాశింపఁజేయఁబడిన, ఆత్మసంయమయోగాగ్నౌ = తన యింద్రియనిగ్రహ మనెడి యుపాయముగల యగ్నియందు, జుహ్వతి=వ్రేల్చుచున్నారు.

శం. మఱికొంద ఱెల్లజ్ఞానేంద్రియకర్మేంద్రియములయొక్క శబ్దాదివిషయములను ప్రాణాదిదశవాయువుల బహిర్గమనాది కర్మలను జ్ఞానముచే ప్రజ్వలింపఁబడ్డ యింద్రియనిగ్రహ మనెడి నిప్పునందు హోమముచేసి నశింపఁజేయుచున్నారు.

రామా. ఆత్మసంయమమనఁగా మనస్సును నియమించుట. మనస్సునకు ఇంద్రియవ్యాపారములయందును, ప్రాణవ్యాపార

మందు నాసక్తి పుట్టకుండుటకై ప్రయత్నము చేయువారు. ఇట్టివారును కొందఱు జ్ఞానులుగా నున్నారు.

మధ్వ. ఆత్మసంయమయోగాగ్నౌ = ఆత్మసంయమ మనెడి ఉపాయాగ్నియందు.

శ్లో. ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే,
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః. 28

టీ. అపరే=మఱికొందఱు, ద్రవ్యయజ్ఞాః = పుణ్యతీర్థాదుల యందు ద్రవ్యదానమనెడి యజ్ఞముగలవారును, అపరే=మఱికొందఱు, తపోయజ్ఞాః=కృచ్ఛ్రాదితపమనెడి యజ్ఞముగలవారును,అపరే=మఱికొందఱు, యోగయజ్ఞాః=ప్రాణాయామాది యోగములు యజ్ఞముగాఁ గలవారలును, అపరే = మఱికొందఱు, స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః = వేదపారాయణ శాస్త్రార్థ పరిజ్ఞానములు యజ్ఞములుగాఁగలవారలును, అపరే=మఱికొందఱు, యతయః=జయింపఁబడిన యింద్రియములు గలవారలును, అపరే=మఱికొందఱు, సంశితవ్రతాః=తీక్ష్ణముగాఁజేయఁబడిన నీమములు గలవారలును.

శం. మఱికొందఱు పుణ్యతీర్థములయందు ద్రవ్యదాన మను యజ్ఞకర్మఁ జేయుచున్నారు. కొందఱు శరీరములను గృశింపఁజేయుట యను యజ్ఞకర్మ చేయుచున్నారు. ఇంకఁ గొందఱు ప్రాణాయామాదియోగము లను యజ్ఞకర్మఁ జేయుచున్నారు. కొందఱు వేదపారాయణ వేదార్థపరిజ్ఞానము లను యజ్ఞకర్మఁ జేయుచున్నారు. ఇంకనుఁ గొందఱు ఇంద్రియము

లను జయించుట యను యజ్ఞకర్మ చేయుచున్నారు. మఱి యుఁ గొందఱు కఠినమైన నియమము లను యజ్ఞకర్మ చేయు చున్నారు.

రామా. యుక్తముగా ద్రవ్యములనుసంపాదించి, దేవతలం గూర్చిన దానములయందును యాగములయందును హోమ ములయందును ప్రయత్నముచేయువారు ద్రవ్యయజ్ఞులు. కృ ఛ్రచాంద్రాయణా ద్యుపవాసాదులయందు నిష్ఠకలవారు తపో యజ్ఞులు. పుణ్యతీర్థములను పుణ్యస్థానములను పొందుటకు ప్రయత్నముచేయువారు యోగయజ్ఞులు. వేదాధ్యయనాభ్యా సమునందును, తదర్థజ్ఞానాభ్యాసమునందును ఆసక్తికలవారు వరుసగా స్వాధ్యాయయజ్ఞులును జ్ఞానయజ్ఞులును.

మధ్వ. ద్రవ్యమును యజ్ఞముచేయువారు ద్రవ్యయజ్ఞులు, ఈతపస్సనెడి హవిస్సును ఆబ్రహ్మాగ్నియందు ఆబ్రహ్మముయొక్క పూజకొఱకు హోమముచేయుచున్నా ననుకొనువారు తపో యజ్ఞులు.

శ్లో. అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. 29

టీ. అపరే=మఱికొందఱు, అపానే=అపానవ్యాపారమం దు, ప్రాణం=ప్రాణవాయువ్యాపారమును, జుహ్వతి=వ్రేల్చుచు న్నారు, తథా=అలాగుననే, ప్రాణే=ప్రాణవాయువ్యాపారమం దు, అపానం=అపానవ్యాపారమును, జుహ్వతి=వ్రేల్చుచున్నా రు, ప్రాణాయామపరాయణాః=పూరక రేచక కుంభక రూప ప్రాణాయామ మాశ్రయముగాఁగలిగిన, అపరే=మఱికొందఱు,

ప్రాణాపానగతీః=ప్రాణాపానవాయువుల గతులను, రుద్ధ్వా=నిగ్రహించి, జుహ్వతి=వేల్చుచున్నారు.

శం. మఱికొందఱు, అపానమునందు ప్రాణవ్యాపారమును, ప్రాణమునందు నపానవ్యాపారమును, మఱికొందఱు పూరక రేచక కుంభక ప్రాణాయామములయందుఁ బ్రాణాపాన వాయువులగతులను లయింపఁ జేయుచున్నారు.

రామా. ప్రాణాపాగతులను నిలిపి ప్రాణములను ప్రాణములలోనే హోమముచేయుచున్నారు. అనఁగా సర్వప్రాణముల నేకీభవింపఁ జేయుచున్నారు అని కుంభకప్రాణాయామము చెప్పఁబడినదనుట.

మధ్వ. ప్రాణమును అపానములోను అపానమును ప్రాణములోను హోమముచేయుట కుంభకము అని తెలియఁజేయును. నియతాహారుఁ డగుటచేత ప్రాణములను శోషించుట వలన ప్రాణములను ప్రాణములలో హోమముచేసినవాఁ డగుచున్నాఁడు. అనుట యిది 30 వ శ్లోక పూర్వార్ధవిషయము. కొందఱు యీశ్లోకమును 29-వ శ్లోకముతోనే చేర్చి వ్యాఖ్య చేసియున్నారు.

శ్లో. అపరే నియతాహారాః ప్రాణా౯ ప్రాణేషు జుహ్వతి,
సర్వేప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః.  30

టీ. అపరే=మఱికొందఱు, నియతాహారాస్సంతః=పరిమితమైన యాహారము కలవారగుచు, ప్రాణా౯=వాయువిశేషములను, ప్రాణేషు = వశీకృతవాయువులయందు, జుహ్వతి=వ్రేల్చుచున్నారు, ఏతే=ఈచెప్పఁబడిన, సర్వేపి = అందఱును,

యజ్ఞవిదః =యజ్ఞములు తెలిసినవారలు, యజ్ఞక్షపితకల్మషాః= యజ్ఞములచేతఁ బాపముల నశింపఁజేయువారు.

శం. మఱికొందఱు మితాహారము గలవారగుచుఁ బ్రాణవాయువులను వశీకృతవాయువులయందు లయింపఁ జేయుచున్నారు. ఈ పైనచెప్పిన యెల్ల యోగపురుషులు, యజ్ఞకర్మ లెఱిఁగినవారు గనుక, తమపాపములను యజ్ఞకర్మలచే నశింపఁ జేయుచున్నారు.

శ్లో. యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్,
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ.

టీ. యజ్ఞశిష్టామృతభుజః=యజ్ఞములలో మిగిలిన యమృతమును భుజించినవారు, సనాతనం=శాశ్వతమైన, బ్రహ్మ= బ్రహ్మమును, యాంతి=పొందుచున్నారు, హేకురుసత్తమ=ఓయి కురుశ్రేష్ఠుఁడా! అయజ్ఞస్య=ఈచెప్పిన యజ్ఞములలో నొకటిని చేయనివానికి, అయం=ఈసర్వప్రాణిసాధారణమైన, లోకః= లోకము, నాస్తి=లేదు. అన్యః=పరలోకము, కుతః=ఎక్కడిది?

శం. ఓ యర్జునా! యజ్ఞకర్మలలో శేషించినయమృతభాగమును భుజించినవారు శాశ్వతమైన బ్రహ్మమును బొందుచున్నారు. ఈ పైఁజెప్పిన యజ్ఞకర్మలలో నొకదానినైనఁ జేయనివానికి నీలోకమున సౌఖ్యము గలుగదు. అటువంటివానికిఁ బరలోకప్రాప్తి యెక్కడిది?

శ్లో. ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజాన్విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

టీ. ఏవం=ఈ చెప్పఁబడినప్రకారముగా, బహువిధాః=నానాప్రకారములైన, యజ్ఞాః=యజ్ఞములు, బ్రహ్మణః=వేదము యొక్క, ముఖే=ద్వారమందు, వితతాః=విస్తీర్ణములైనవి, సర్వాన్=సమస్తములైన, తాన్=ఆయజ్ఞములను, కర్మజాన్=కర్మములవలనఁ బుట్టినవానినిఁగా, విద్ధి=తెలియుము, ఏవం=ఈప్రకారముగా, జ్ఞాత్వా=తెలిసి, మోక్ష్యసే=(సంసారబంధమువలన) విడువఁబడఁగలవు.

శం. ఈ పైఁజెప్పినవిధమునఁ బలువిధములైన యజ్ఞకర్మలు వేదమువల్లవిధింపఁబడినవి. ఆయజ్ఞములన్నియుఁ గర్మరూపములని యెఱుఁగుము. ఈప్రకారముగఁ దెలిసికొంటివేని నీవు సంసారబంధమునుండి తొలఁగినవాఁడ వగుచున్నావు.

రామా. యజ్ఞము లనగా కర్మయోగములు. బ్రహ్మముఖమున ననగా వేదాంతమున వ్యాపించి యున్నవి అనగా ఆత్మయాథాత్మ్యప్రాప్తి సాధనములుగా చెప్పఁబడి యున్నవి. కర్మజములుగాను అనగా నిత్యము ఆచరింపఁబడుచున్నవి నిత్య నైమిత్తిక కామ్య కర్మములవలన బుట్టినవానిగా ననుట. ఈ వెనుకఁ జెప్పిన ప్రకారముగా నాచరించి మోక్షమును జెందఁగలవు.

మధ్వ. కర్మము లనఁగా మానసవాచిక కాయిక కర్మములవలనం గలిగినవి. ఇట్లు తెలిసికొని యాకర్మాచరణచేసి మోక్షమును చెందఁ గలవు. మోక్షము కొఱకు యుద్ధమును విడిచి మఱియొక దానిని చేసినను అదియు కర్మమొకదాయనిన విహితమైన స్వధర్మమును విడువ రా దనుట.

శ్లో. శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప,
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. 33

టీ. హేపరంతప = ఓ యర్జునుఁడా! ద్రవ్యమయాత్ = ద్రవ్యసాధనమైన, యజ్ఞాత్ = యజ్ఞమునకంటె, జ్ఞానయజ్ఞః = జ్ఞానస్వరూపమైనయజ్ఞము, శ్రేయాన్ = మిక్కిలి శ్రేష్ఠమైనది, హేపార్థ = ఓ యర్జునుఁడా! సర్వం = సమస్తమైన, కర్మ = కర్మము, అఖిలంసత్ = నాశము కానిదగుచు, జ్ఞానే = బ్రహ్మజ్ఞానమందు, పరిసమాప్యతే = అంతర్భూతమగుచున్నది.

శం. ఓయర్జునా! ద్రవ్యసాధనసాధ్యమైన యజ్ఞముకంటె జ్ఞానస్వరూపమైనయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠము. ఎల్లకర్మలు బ్రహ్మజ్ఞానమునందు లయించుచున్నవి.

రామా. కర్మలలో ద్రవ్యమయాంశమును జ్ఞానమయాంశమును అను రెండంశములు కలవు. అందు ద్రవ్యమయాంశముకంటె జ్ఞానమయాంశము శ్రేష్ఠము. సమస్తసాధనములచేఁ బొందఁ దగినజ్ఞానము కర్మాంతర్గత మగునట్లు అభ్యసింపఁ బడుచున్నదై క్రమముగా పొందవలసినదశను పొందును.

మధ్వ.—ఉపాసనతోఁ గూడిన కర్మమంతయు జ్ఞానము ఫలముగాఁ గలదేయనుట.

శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. 34

టీ. తత్త్వదర్శినః = తత్త్వవిదులయిన, జ్ఞానినః = జ్ఞాననిష్ఠులు, తే = నీకొఱకు, యత్ = ఏజ్ఞానమును, ఉపదేక్ష్యంతి = ఉపదేశింపఁ గలరో, తత్ = ఆజ్ఞానమును, ప్రణిపాతేన = సాష్టాంగ

నమస్కారములచేతను, పరిప్రశ్నేన=తెలియని విషయముఁ దడుగుటచేతను, సేవయా=గురుశుశ్రూషచేతను, విద్ధి=తెలియుము.

శం. ఇట్టి బ్రహ్మజ్ఞానమును తత్త్వవిదులైన జ్ఞాననిష్ఠుల నాశ్రయించి వారికి సాష్టాంగ నమస్కార పూర్వకమైన యుపచారములుచేసి ప్రార్థించి తెలిసికొనుము. వారు ఉపదేశముఁ జేయుదురు.

రామా. యుక్తమైన కర్మము నాచరింపుచున్నవాఁడవై ఆత్మస్వరూపసాక్షాత్కారము కలవారికి నమస్కారాదులం జేసి వారివలన ఆత్మజ్ఞానోపదేశము పొందఁగలవు.

శ్లో. యత్ జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాండవ,
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి.

టీ. హేపాండవ=ఓయర్జునుఁడా! యత్ = ఏజ్ఞానమును, జ్ఞాత్వా=తెలిసి, పునః=తిరిగి, ఏవం = ఏతాదృశమైన, మోహం = మోహమును, నయాస్యసి=పొందవో, యేన=ఏజ్ఞానముచేత, భూతాని=ప్రాణులను, అశేషేణ=నిశ్శేషముగా, ఆత్మని=నీయందే, ద్రక్ష్యసి=చూడఁగలవో, అథో=పిమ్మట, మయి = పరబ్రహ్మస్వరూపుఁడయిననాయందు, ద్రక్ష్యసి = చూడఁగలవు.

శం. ఓ యర్జునా! పరబ్రహ్మజ్ఞానమును బొందితివేని మరల నీకు నిట్టిబుద్ధి మోహము గలుగదు. ఈపైఁజెప్పిన బ్రహ్మజ్ఞానమువలన నెల్ల చరాచరభూతములను ఆత్మరూపమైన నాయందుఁ జూడఁగలవు.

రామా. మోహమనఁగా నాత్మలయందు దేహాద్యభిమానము, అదియె మమకారాదుల కాధారము, ప్రకృతి సంబంధములేని యాత్మవస్తువంతయు అన్యోన్యము తుల్యముగానుండును. సర్వేశ్వరునితోను తుల్యముగా నుండును అనుట.

మధ్వ. ఇప్పుడుఁగూడ నర్జునుఁడు జ్ఞానియె. తిరోభావము కలుగుటవలన మోహము కలిగినది. ఏజ్ఞానము చేత నాత్మభూతుండగు నాయందు సమస్త భూతములను చూచుచున్నావో (అనగా అన్నిటికి నే నాధారమని జూచుచున్నావో) మోహనాశము కలిగిన తర్వాతను అట్లే చూడఁ గలవు.

శ్లో. అపిచే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. 36

టీ. సర్వేభ్యః=సమస్తమయిన, పాపేభ్యః =పాపముచేసిన వారికంటె, పాపకృత్తమః = మిక్కిలి పాపముచేసినవాఁడవు, అపిచేదసి=అయితివేని, త్వం=నీవు, జ్ఞానప్లవేనైవ=జ్ఞానమనెడి తెప్పచేతనే, సర్వం=సమస్తమైన, వృజినం=పాపసముద్రమును, సంతరిష్యసి=లెస్సగాఁ దరింపఁగలవు.

శం. పాపాత్ములలో నీవు మహాపాపివైనను పాపము నంతయు నీజ్ఞానమనెడి తెప్పచేత దాఁటఁగలవు.

శ్లో. యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 37

టీ. హే అర్జున=ఓయర్జునుఁడా! సమిద్ధః=లెస్సగాఁ ప్రకాశించుచున్న, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, ఏధాంసి=కట్టెలను, యథా=ఏప్రకారముగా, భస్మసాత్=భస్మముగా, కురుతే =

చేయుచున్నాఁడో, తథా=ఆప్రకారముగా, జ్ఞానాగ్నిః=జ్ఞానమనెడినగ్ని, సర్వకర్మాణి=సమస్తకర్మములను, భస్మసాత్కురుతే=భస్మము చేయుచున్నది.

శం. అర్జునా! చక్కఁగా జ్వలించునిప్పు దారువుల నేవిధముగ భస్మముజేయుచున్నదో యావిధముగనే జ్ఞానమను నగ్ని సమస్తకర్మలను భస్మముచేయుచున్నది. ఏకర్మముచే శరీరమారంభింపఁబడెనో ఆప్రారబ్ధకర్మము అనుభవముచేతనే నశింప వలసినది. కాఁబట్టి ఈజన్మమున జ్ఞానము పుట్టుటకు ముందు చేయఁబడినవియు, జ్ఞానముతో కలిగినవియు, అనేక పూర్వజన్మములందుఁ జేయఁబడినవియు నగు కర్మముల నన్నిటిని మాత్రమె జ్ఞానము నశింపఁజేయును.

శ్లో. నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాఽత్మని విందతి.　38

టీ. ఇహ=ఈలోకమందు, జ్ఞానేన=జ్ఞానముతో, సదృశం=సమానమైనదియు, పవిత్రం=పావనమైనదియు, నవిద్యతేహి=లేదు, స్వయం=తాను, కాలేన=బహుకాలముచేత, యోగసంసిద్ధస్సన్=యోగాభ్యాసముచేత లెస్సగా సిద్ధుఁడైనవాఁడై, ఆత్మని=తనయందు, తత్=ఆజ్ఞానమును, విందతి=పొందుచున్నాఁడు.

తా. ఈలోకమందు జ్ఞానముతో సమానమగు పవిత్రపదార్థము మఱియొకటిలేదు. ఆజ్ఞానమును యోగసిద్ధుఁడు కాలానుగుణ్యముగాఁ దానే తనయందుఁ బొందుచున్నాఁడు.

రామా. గురూపదేశానుసారంబున ప్రతిదినంబును జ్ఞానాకారముగా నాదరింపఁ బడుచున్న కర్మయోగముచే సిద్ధిని

పొందినవాఁడు ఆత్మజ్ఞానమును తనంతటనె పొందుచున్నాఁడు.

శ్లో. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరే ణాధిగచ్ఛతి. 39

టీ. శ్రద్ధావాన్=నమ్మకము గలవాఁడును, తత్పరః=తదాసక్తుఁడైన, (గురువులసేవ మొదలగు వానియందుఁ బ్రవర్తించువాఁడు) సంయతేంద్రియః=ఇంద్రియనిగ్రహముగల పురుషుఁడు, జ్ఞానం=జ్ఞానమును, లభతే=పొందుచున్నాఁడు, జ్ఞానం=జ్ఞానమును, లబ్ధ్వా=పొంది, పరాం=ఉత్కృష్టమైన, శాంతిం=చిత్తోపరతిని, అచిరేణ=శీఘ్రముగా, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

శం. శ్రద్ధయు జ్ఞానాపేక్షయు నింద్రియనిగ్రహముగల పురుషుఁడు జ్ఞానమును బొందును. అట్లు జ్ఞానమునుబొంది యతి శీఘ్రములో నుత్కృష్టమైన చిత్తోపరతిని అనఁగా మోక్షమునుఁ బొందును.

రామా. శ్రద్ధావాన్ = జ్ఞానమును వృద్ధి పొందించు కొనుట యందు శ్రద్ధ కలవాఁడు. తత్పరుఁ డనఁగా జ్ఞానవృద్ధి యందు మనస్సు కలవాఁడు. సంయతేంద్రియుఁ డనఁగా మిగిలిన విషయముల యందుండి మరలింపఁ బడిన ఇంద్రియములు కలవాఁడు.

అవ. జ్ఞానసాధనమును తెలుపుచున్నది.—

శ్లో. అజ్ఞ శ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి నపరో నసుఖం సంశయాత్మనః. 40

టీ. అజ్ఞశ్చ=తెలియనివాఁడును, అశ్రద్ధధానశ్చ=విశ్వాసములేనివాఁడును, సంశయాత్మా=సంశయముతోఁగూడిన మనస్సుగలవాఁడును, వినశ్యతి = చెడిపోవుచున్నాఁడు, సంశయాత్మనః=సంశయముతోఁగూడిన మనస్సుగలవానికి, అయంలోకః=ఈసర్వప్రాణిసాధారణమైన లోకము, పరశ్చ=పరలోకమును, నాస్తి=లేదు. సుఖం=సుఖమును, న=లేదు.

శం. జ్ఞానములేనివాఁడును, శ్రద్ధలేనివాఁడును, సంశయాత్మగలవాఁడును జెడిపోవును. సంశయాత్మకునకు నిహాపర సుఖములు గలుగవు.

రామా. ఉపదేశము వలన కలిగిన జ్ఞానము లేని వాఁడును, ఉపదేశింపఁ బడిన జ్ఞానమును వృద్ధి పొందించు కొనుటయందు త్వర లేని వాఁడును, ఉపదేశింపఁ బడిన జ్ఞానమునందు సంశయ బుద్ధిఁ గల వాఁడును, చెడుదురు. ఈసంశయాత్మకు ఈ లోకము మొదలగునవియె లేని యప్పుడు మోక్ష మెట్లగును? కావున సంశయాత్మ సుఖలేశాదుల నైనఁ బొందుట సంభవింపదు.

శ్లో. యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్,
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ.　　41

టీ. హేధనంజయ=ఓయర్జునుఁడా ! యోగసన్న్యస్తకర్మాణం=యోగముచేత విడువఁబడిన సర్వకర్మములు గలిగినట్టియు, జ్ఞానసంఛిన్నసంశయం=బ్రహ్మజ్ఞానముచేత ఛేదింపఁబడిన సందేహము కలిగినట్టియు, ఆత్మవంతం = దృఢమనస్కుఁడైన పురుషుని, కర్మాణి=పుణ్యాపాపకర్మములు, ననిబధ్నంతి=బంధింపవు.

శం. ఓ ధనంజయ! యోగముచేత కర్మలను విడిచినవాఁడై జ్ఞానముచేత సంశయవిముక్తుఁడై దృఢమైన మనస్సుగలవాఁడైనపురుషుని కర్మలు బంధింపవు. యోగమనఁగా పరమార్థజ్ఞానము. దానిచేత ధర్మాధర్మ రూపములగు కర్మముల విడిచినవాఁడును, ఆత్మయును ఈశ్వరుఁడు నొక్కఁడె యను జ్ఞానముచే పోయిన సంశయముకలవాఁడును, ఆత్మవంతుఁ డనఁగా పొరబాటు లేనివాఁడు నగు వాని, సత్త్వరజస్తమోగుణవ్యాపార రూపములైన కర్మములు బంధింపవు. అనిష్టాది ఫలములం గలుగఁ జేయవనుట.

శ్లో. తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. 42

టీ. హే భారత=అర్జునా! తస్మాత్=ఆ కారణమువలన, జ్ఞానాసినా=జ్ఞానమనెడిఖడ్గముచేత, అజ్ఞానసంభూతం=అవివేకమువలనఁబుట్టిన, హృత్స్థం=బుద్ధియందున్న, ఆత్మనః = నీయొక్క, ఏనం సంశయం = ఈ సందేహమును, ఛిత్త్వా=ఛేదించి, యోగం=ఆత్మజ్ఞాన యోగమును, ఆతిష్ఠ=చేయుము, ఉత్తిష్ఠ=(ప్రకృతమైన యుద్ధమునకు) లెమ్ము.

శం. ఓ భారతా! అజ్ఞానసంభూతమైన నీ బుద్ధిలోని సంశయమును జ్ఞాన మనెడి ఖడ్గముచే ఖండించి పరమార్థజ్ఞానసాధనకర్మాచరణ మనుష్ఠింపుము, యుద్ధమునకు బయలుదేఱుము.

రామా. అజ్ఞాన మనఁగా ననాదిగా నుండెడిదైన నీ బుద్ధిలోని సందేహమును జ్ఞానమనెడి ఖడ్గముచే ఖండించి కర్మయోగానుష్ఠానమును చేయుము. యుద్ధమునకు లెమ్మనుట.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే జ్ఞాన
యోగోనామ చతుర్థో౽ధ్యాయః.

ఉపనిష దర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును
యోగశాస్త్రంబును, కృష్ణార్జునుల సంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయందు జ్ఞానయోగ
మనెడి చతుర్థాధ్యాయము.

---

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## కర్మసన్న్యాసయోగః.

అర్జున ఉవాచ:—

శ్లో. సన్న్యాసం క ర్మణాం కృష్ణ పున ర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.—

టీ. హేకృష్ణ=ఓకృష్ణా! కర్మణాం=(శాస్త్రీయములైన)కర్మ విశేషములయొక్క, సన్న్యాసం=పరిత్యాగము, పునః=మరల, యోగంచ=(శాస్త్రీయమయిన) కర్మయోగమును, శంససి = చెప్పుచున్నావు. ఏతయోః=ఈరెంటిలోపల, యత్=ఏది, శ్రేయః=శ్రేష్ఠమో, మే=నాకు, సునిశ్చితం=లెస్సగా నిశ్చయింపఁబడిన, తత్=ఆ, ఏకం=ఒక్కదానిని, బ్రూహి=చెప్పుము.

శం. ఓ కృష్ణా ! నీ వొకప్పుడు కర్మలను విడువుమనియు, మఱియొకప్పుడు కర్మలను జేయుమనియుఁ జెప్పుచున్నావు. ఈ రెంటిలో నేది శ్రేష్ఠమో ఆలెస్సగా నిశ్చయింపఁబడిన ఒక్క దానిని నాకుఁ జెప్పుము.

రామా. కర్మముల సన్న్యాసమనఁగా జ్ఞానయోగము. రెండవ యధ్యాయములో మొదట కర్మయోగమునె చేయునది, దానిచేత నంతఃకరణ శుద్ధి కలిగిన పిమ్మట, జ్ఞానయోగమును

చేయునది, అని చెప్పఁబడినది. తృతీయ చతుర్థాధ్యాయములలో జ్ఞానయోగాధికారపుదశను పొందినవానికిని కర్మనిష్ఠయె ప్రశస్తమైనది. అది జ్ఞానములేకయె ఆత్మప్రాప్తికి సాధనమగును, అని కర్మయోగము ప్రశంసింపఁబడినది. ఈజ్ఞానయోగ కర్మయోగములలో సులభముగా నాచరింపఁదగినదియు, ఆత్మప్రాప్తిని శీఘ్రముగాఁ గలిగించునదియును యీ రెండుధర్మములలో నేది మేలైన ధర్మమో దానిం జెప్పుము ఓ కృష్ణా! అనుట.

మధ్వ. నియమించుట మొదలగు వానిచే నన్నిలోకముల నాకర్షించువాఁడు కృష్ణుఁ డనఁ బడును. సన్న్యాసమే శ్రేష్ఠమైన యెడల దాని కీయుద్ధ మాచరించుట విరుద్ధము. సన్న్యాసమనఁగా యత్యాశ్రమముకాదు.

శ్రీభగవాన్ ఉవాచ:—

శ్లో. సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే. 2

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. సన్న్యాసః=కర్మపరిత్యాగమును, కర్మయోగశ్చ=కర్మానుష్ఠానమును (అనునట్టి), ఉభౌ=రెండును, నిశ్శ్రేయసకరౌ=మోక్షమును గలుగఁజేయునట్టివి, తయోః = ఆరెంటిలోపల, కర్మసన్న్యాసాత్ =కర్మపరిత్యాగమునకంటె, కర్మయోగస్తు=కర్మయోగము, విశిష్యతే=శ్రేష్ఠమగుచున్నది.

శం. కర్మపరిత్యాగము, కర్మానుష్ఠానము అను ఈరెండుమార్గములును మోక్షసాధకములే, అయినను ఈరెంటిలోను కర్మపరిత్యాగమునకంటెఁ గర్మానుష్ఠానము శ్రేష్ఠముగా నున్నది.

రామా. జ్ఞానయోగ కర్మయోగములు రెండును ఒక్కదాని యపేక్ష మఱియొక్కదానికి లేకయే నిశ్శ్రేయసమును కలుగఁ జేయు ననుట.

శ్లో. జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి,
నిర్ద్వంద్వోహి మహాబాహో సుఖం బంధా త్ప్రముచ్యతే.

టీ. హే మహాబాహో=ఓయి అర్జునుఁడా! యః = ఏకర్మయోగి, న ద్వేష్టి=ద్వేషింపఁడో, న కాంక్షతి=కోరఁడో, సః=వాఁడు, నిత్యసన్న్యాసీ=కర్మానుష్ఠానకాలమునందును సన్న్యాసియని, జ్ఞేయః= తెలియఁదగినవాఁడు, నిర్ద్వంద్వః = రాగద్వేషములు లేనివాఁడు, సుఖం=అనాయాసముగా, బంధాత్=సంసారబంధమువలన, ప్రముచ్యతే=విడువఁబడుచున్నాఁడు గదా.

శం. అర్జునా! ఎవనికి ద్వేషము లేదో, ఎవనికి కోరికల్లు లేవో ఆకర్మయోగి కర్మముల నాచరించుచున్నను, నిత్యసన్న్యాసి, అతఁడు అనాయాసముగాఁ గర్మబంధమునుండి విముక్తుఁ డగుచున్నాఁడు.

రామా. కర్మయోగియై యుండి కర్మయోగములో నంతర్భావముఁగల యాత్మానుభవమందే తృప్తిని పొందినవాఁడై మఱి దేనినైనం గోరుటయు, దేనినైనం ద్వేషించుటయు లేకుండునేని వాఁడే నిత్యసన్న్యాసి అనగా నిత్యజ్ఞాననిష్ఠుఁ డనియును అట్టివాఁ డనాయాసముగాఁ గర్మబంధమునుండి విముక్తుఁ డగును.

మాధ్వ. ఈశ్లోకము సన్న్యాసశబ్దార్థమును తెలియఁజేయును. సన్న్యాసము జ్ఞానమున కంతరంగము.

శ్లో. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః,
ఏకమ ప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్. 4

టీ. బాలాః=మూఢులు, సాంఖ్యయోగౌ=కర్మసన్న్యాస కర్మయోగములను, పృథక్=భిన్నములైన ఫలములనిచ్చున వని, ప్రవదంతి=చెప్పుచున్నారు. పండితాః=జ్ఞాననిష్ఠులు, నప్రవదంతి=చెప్పరు, ఉభయోః=కర్మసన్న్యాస కర్మయోగముల లోపల, ఏకం=ఒకదానిని, సమ్యక్=లెస్సగా, ఆస్థితోపి=ఆశ్రయించినవాఁడైనను, (ఉభయోః=రెంటియొక్క) ఫలం=ఫలమును, విందతే=పొందుచున్నాఁడు.

శం. జ్ఞానముతోఁగూడిన కర్మసన్న్యాసమైన సాంఖ్యమును, జ్ఞానసాధనమై సమబుద్ధితోఁగూడిన కర్మమైన కర్మయోగమును ప్రత్యేక ఫలదము లని తెలియనివారు చెప్పుదురుగాని జ్ఞానులు జెప్పరు. ఈరెంటిలో నొకదానిని జక్కఁగా నభ్యసించినవానికి నారెండిటి ఫలములును గలుగుచున్నవి.

రామా. కర్మయోగము జ్ఞానయోగమును కలుగఁజేయుననియు, జ్ఞానయోగము ఆత్మావలోకనము కలుగఁజేయు ననియు, ఫల భేదములను చెప్పువారు పండితులుకారు. రెంటికిని ఆత్మావలోకనమె ఫలము.

మధ్వ. సాంఖ్యమును, యోగమును రెండును అంతరంగము లగుటచే విరోధము లేనిది అనుట.

శ్లో. యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి. 5

టీ. సాంఖ్యైః=జ్ఞాననిష్ఠులచేత, యత్ స్థానం=ఏస్థానము, ప్రాప్యతే=పొందఁబడుచున్నదో, యోగైరపి=కర్మయోగులచేతను, తత్=ఆస్థానము, గమ్యతే=పొందఁబడుచున్నది, (ఆకారణమువలన), యః=ఎవ్వఁడు, సాంఖ్యంచ=జ్ఞానయోగమును, యోగంచ=కర్మయోగమును, ఏకం=సమఫలప్రదమైనదానినిగా, పశ్యతి=చూచుచున్నాఁడో, సః=వాఁడు, పశ్యతి=లెస్సగాఁ దెలిసినవాఁడు.

శం. జ్ఞాననిష్ఠమైన సన్న్యాసముచేఁ బొందుస్థానమును ఈశ్వరార్పితమై ఫలమును గోరక నాచరింపఁబడెడు కర్మచేతను బొందవచ్చును. ఎవఁడు సన్న్యాసమును గర్మను ఒకటిగాఁ దెలియుచున్నాఁడో వాఁడే జ్ఞాని.

రామా. జ్ఞాననిష్ఠులచేతఁ బొందఁబడెడి యాత్మావలోకనమె కర్మయోగనిష్ఠులచేఁ బొఁదఁబడును. ఇట్లు ఫలమొక్కటియగుటచే జ్ఞానయోగ కర్మయోగములు ఒక్కటియే అనఁగా వైకల్పికములు-వైకల్పికములనఁగా దేని నాచరించినను రెండవదాని నాచరింప నక్కఱలేనిది.

మధ్వ. యోగముచేఁగూడ జ్ఞానద్వారమున జ్ఞానఫలము పొందఁబడుచున్నది. అనుట.

శ్లో. సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః,
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి. 6

టీ. హేమహాబాహో=ఓయిఅర్జునుఁడా! సన్న్యాసస్తు=పారమార్థికముమాత్రము, అయోగతః=కర్మయోగములేనందున, ఆప్తుం=పొందుటకొఱకు, దుఃఖం=దుఃఖహేతువైనది,

యోగయుక్తః=వైదిక కర్మయోగముతోఁగూడిన, మునిః=మననశీలుఁడు, నచిరేణ=శీఘ్రముగా, బ్రహ్మ=బ్రహ్మమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

శం. అర్జునా! కర్మలేని సన్న్యాసమును పొందుటకష్టము. ఈశ్వరసమర్పితంబును ఫలాపేక్ష లేనిదియగుకర్మానుష్ఠానముగల జ్ఞాని త్వరలో బ్రహ్మమును పొందును. అనఁగా పూర్వోక్తమైన పరమార్థ సన్న్యాసమును పొందుచున్నాఁడు. కాఁబట్టియె నాచేత కర్మయోగము శ్రేష్ఠమని చెప్పఁబడినది.

రామా. కర్మయోగముతోఁ గూడినవాఁడు స్వయముగా నాత్మనుమనన చేయుచున్నవాఁడై సుఖముగాఁగర్మయోగమును సాధించుకొనికొంచెము కాలములోనే బ్రహ్మమునుఆత్మస్వరూపమును పొందుచున్నాఁడు. జ్ఞానయోగముకలవాఁడువిస్తారము దుఃఖముతో (శ్రమముతోననుట) జ్ఞానసంపాదకుఁడగుచున్నాఁడు. దుఃఖసాధ్యమగుటను ఆత్మను చిరకాలమునకు పొందుచున్నాఁడు.

మధ్వ. యోగములేనిచో మోక్షాదిఫలముకలుగదు. కాఁబట్టి సన్న్యాసికి కామములనుజయించుట మొదలగు దుఃఖమె కాని మఱియేమియు లేదు. మోక్షముకాక మిగిలిన ఫలములు చిల్లరఫలములుగాన ఫలములేకావు. గొప్పఫలమునకుదగిన దానికి స్వల్పమైనదేఫలముకాదు. రత్నమునిచ్చినవానికిబియ్యపుముష్టి యిడుట స్వల్పమైనఫలము. యోగముతోఁగూడెనేని సన్న్యాసము గొప్పఫలమును కలుగఁజేయును. సన్న్యాసము గలవాఁడు మునియనఁబడును.

శ్లో. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. 7

టీ. యోగయుక్తః=జ్ఞానసాధన మగుటచేత కర్మయోగయుక్తుఁడయినవాఁడును, విశుద్ధాత్మా=పరిశుద్ధమైన చిత్తముకలవాఁడును, విజితాత్మా=జయింపఁబడిన దేహముగలవాఁడును, జితేంద్రియః=గెలువఁబడినయింద్రియములుకలిగినవాఁడును, సర్వభూతాత్మభూతాత్మా=సమస్తమైన బ్రహ్మాదిభూతములయొక్క-స్వరూపమైన ప్రత్యగాత్మస్వరూపముగల పురుషుఁడు, కుర్వన్నపి = (లోకసంగ్రహముకొఱకు కర్మమును) చేయుచున్నవాఁడయినను, నలిప్యతే=అంటఁబడఁడు.

శం. కర్మయోగముచేయువాఁడు చిత్తశుద్ధిగలిగి మనస్సును స్వాధీనములోనుంచుకొని ఇంద్రియములను జయించి సమస్తభూతములు తానుగాను తాను సమస్తభూతములుగాను తలఁచి కర్మలుచేసినను గర్మలచేఁ గట్టువడఁడు.

రామా. కర్మయోగి శాస్త్రీయములై భగవదారాధనరూపములైనకర్మములనాచరింపుచు దానిచే పరిశుద్ధమైనమనస్సు కలవాఁడయి, తాను కర్మములయందు పనిచేయుచుండుటచే సులభముగా మనస్సునుజయించి, తద్ద్వారాఇతరేంద్రియములనుకూడజయించి, తనయాత్మయును, దేవాదిశరీరములలోనుండెడి యాత్మలును ఒక్క-యాకారముకలవారనెడి ఆత్మయాథాత్మ్యజ్ఞానముకలవాఁడగుటచే సర్వభూతముల యాత్మయు తనయాత్మయె అనఁగా తనయాత్మవలె వారును జ్ఞానస్వరూపులనియెడి జ్ఞానముకలవాఁడై, ఆత్మకానిదానియందలి యాత్మాభి

మాన లేపము (ఆత్మయ నెడిజ్ఞానముయొక్క అంటు) కలవాఁడు కాఁడు.

మధ్వ. సర్వభూతములంబొందిన పరమేశ్వరుఁడు సర్వభూతాత్మభూతుఁడు. వాఁడు ఆత్మగాఁగలవాఁడు. (అనఁగా పరమేశ్వరుఁడు నన్ను సమీపమునకు జేర్చుకొనును అనుజ్ఞానము కలవాఁడు)

శ్లో. నైవకించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యఞ్శృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్.
ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి,
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. 9

టీ. తత్త్వవిత్=యథార్థమును దెలిసినవాఁడు, పశ్యన్=చూచుచు, శృణ్వన్ = వినుచు, స్పృశన్ = స్పృశించుచు, జిఘ్రన్=ఆఘ్రాణించుచు, అశ్నన్ = భుజించుచు, గచ్ఛన్=నడచుచు, స్వపన్=నిద్రించుచు, శ్వసన్=నిట్టూర్పు విడుచుచు, ప్రలపన్=పలుకుచు, విసృజన్ = విడుచుచు, గృహ్ణన్=గ్రహించుచు, ఉన్మిషన్=కన్నులు తెఱచుచు, నిమిషన్నపి=కన్నులు మూయుచున్నవాఁడయినను, ఇంద్రియాణి=శ్రోత్రాదీంద్రియములు, ఇంద్రియార్థేషు=విషయములయందు, వర్తంతఇతి=ప్రవర్తించుచున్నవని, ధారయన్=నిశ్చయించినవాఁడగుచు, కించిత్ =ఇంచుకయైనను, నకరోమ్యేవేతి=నేను జేయుట లేదనియే, యుక్తస్సన్=సమాహితచిత్తుఁడగుచు, మన్యేత=తలఁచును.

శం. బ్రహ్మజ్ఞాని కన్నులతోఁ జూచుచుఁ, జెవులతో వినుచు, దేహముతోఁ దాఁకుచు, ముక్కుతో వాసనచూచుచు, జిహ్వతోఁ దినుచు, కాళ్ళతో నడచుచు, నిద్రించుచు, ఉచ్ఛ్వాసనిశ్వాసములు విడుచుచు, మాటలాడుచు, మూత్రపురీషముల ను విడుచుచు, విషయముల నంగీకరించుచు, కన్నులుమూయుచు, తెఱచుచు, (ఎండమావులనుజూచి ఇం దుదకము కలదు, త్రాగెద నని పఱువిడువాఁడు, అం దుదకము లేదని తెలిసిన పిమ్మట నందు దాహమును తీర్చుకొనుటకు ప్రవర్తింపనియట్లు) ఇంద్రియములు ఇంద్రియవిషయములయందు ప్రవర్తించుచున్న వని తెలిసియుఁ బరబ్రహ్మమైన తాను ఏమియుఁ జేయలేదని చిత్తశుద్ధిగలిగి తలఁచును.

రామా. ఆత్మతత్త్వము నెఱింగినవాఁడు, జ్ఞానమె స్వభావముగాఁ గలనాకు కర్మమూలకం బగు నింద్రియ ప్రాణసంబంధమున ఇట్టి కర్తృత్వము కలిగినదిగాని, కర్తృత్వము స్వరూపప్రయుక్తము (స్వాభావసిద్ధము) కాదని తలంచునది.

శ్లో. బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్రమి వాంభసా. 10

టీ. యః=ఎవ్వఁడు, కర్మాణి=సమస్తకర్మములను, బ్రహ్మణి=పరమాత్మయందు, ఆధాయ=ఉంచి, సంగం=ఆసక్తిని, త్యక్త్వా=విడిచి, కరోతి=చేయుచున్నాఁడో, సః = వాఁడు, అంభసా = ఉదకముచేత, పద్మపత్రమివ = తామరాకువలె, పాపేన=పాపముచేత, నలిప్యతే=అంటఁబడఁడు.

శం. ఎవఁడు కర్మలను బ్రహ్మార్పణముచేసి యాసక్తి విడిచి వాని ననుష్ఠించుచున్నాఁడో అట్టిపురుషుఁడు తామరాకున నీళ్లు

అంటనిరీతిగా పాపముచేత స్పృశింపఁబడఁడు. తన స్వామికొఱ
కు పనులం జేసి ఫలమునం దపేక్షలేకయుండు భృత్యునట్లు
పాపముచే స్పృశింపఁబడఁడు.

రామా. బ్రహ్మమనఁగా ప్రకృతి. వెనుకటి శ్లోకమునం జెప్పి
నచొప్పున కర్మముల కర్తృత్వమును ఇంద్రియరూపముగాఁ బరిణ
మించిన ప్రకృతియం దునిచి, ఫలసంగమునువిడిచి, నేనేమియు
చేయుట లేదనుకొని, కర్మములఁ జేయువాఁడు దేహాత్మాభిమాన
రూపమై బంధహేతువగు పాపముచే పూయఁబడఁడు.

మధ్వ. సన్న్యాస యోగముతోఁ గూడినవాఁడె కర్మలే
పముఁ బొందఁడు.

శ్లో. కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి,
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే. 11

టీ. యోగినః=కర్మయోగులు, ఆత్మశుద్ధయే=చిత్తశుద్ధికొ
ఱకు, సంగం=ఫలాసక్తిని, త్యక్త్వా=విడిచి, కాయేన = శరీర
ముచేత స్నానాదికమును, మనసా=మనస్సుచేత ధ్యానాదిక
మును, బుద్ధ్యా=బుద్ధిచేత నిశ్చయాదికమును, కేవలైః=కేవ
లములైన, ఇంద్రియైరపి= ఇంద్రియములచేత శ్రవణాదికమును
(అగు), కర్మ=కర్మమును, కుర్వంతి=చేయుచున్నారు.

శం. కర్మయోగులు చిత్తశుద్ధికొఱకు ఫలాసక్తిలేకయే శరీర
ముచేతను మనస్సుచేతను బుద్ధిచేతను మమత్వశూన్యమైన ఇం
ద్రియములచేతను కర్మలు చేయుచున్నారు.

రామా. శరీరాదులచే సాధింపఁదగిన కర్మమును స్వర్గాది
ఫలసంగమును వదిలి ఆత్మయందుండెడి ప్రాచీన కర్మబంధము
నశించుటకొఱకు చేయుదురు.

మధ్వ. ఈప్రకారము కర్మచేయుట పూర్వుల యాచారము కలదని ఇందువల్ల స్పష్టీకరింపఁబడుచున్నదనుట.

శ్లో. యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. 12

టీ. యుక్తః=సమాహితచిత్తుఁడు,కర్మఫలం=కర్మఫలమును, త్యక్త్వా=విడిచి, నైష్ఠికీం=నిష్ఠయందుఁబుట్టిన, శాంతిం=శాంతిని, ఆప్నోతి=పొందుచున్నాఁడు, అయుక్తః = సమాహితచిత్తుఁడుకానివాఁడు, కామకారేణ=కామప్రేరణచేత, ఫలే=కర్మఫలమందు, సక్తః=ఆసక్తుఁ డయినవాఁడై,నిబధ్యతే=కట్టఁబడుచున్నాఁడు.

శం. ఫలాపేక్షవదలి కర్మలు చేయువాఁడు పారమార్థికమైన చిత్తశాంతిని బొందుచున్నాఁడు. యోగి కానివాఁడు కామప్రేరేపణచేత కర్మలుజేసి బద్ధుఁ డగుచున్నాఁడు. ఈశ్వరునికొఱకు కర్మములం జేయుచున్నాను, నాఫలముకొఱకు కాదు, అను చిత్తసమాధానము కలవాఁడు యుక్తుఁడు. అట్టివాఁడై కర్మములంజేయువాఁడు, దానివలన సత్త్వశుద్ధియనఁగా అంతఃకరణపరిశుద్ధి, జ్ఞానము కలుగుట, అన్నికర్మములను విడుచుట, జ్ఞాననిష్ఠకలుగుట, అనువరుసను శాంతిని అనఁగా మోక్షమును పొందుచున్నాఁడు. కామప్రేరణచే నాఫలముకొఱకు కర్మములం జేయుచున్నాను, అనికర్మములంజేయుచున్న ఫలసంగము కలవాఁడు (అయుక్తుఁడు) బంధమును పొందును. కాఁబట్టి నీవు యుక్తుఁడవు కమ్ము.

రామా. యుక్తుఁడై అనఁగా నాత్మకంటె నితరములగు ఫలములయందు చపలుఁడుకానివాఁడై ఆత్మయందే ప్రావణ్యము

కలవాఁడై, కర్మఫలములనువదలి, ఆత్మశుద్ధికొఱకె కర్మముంజేసి, నైష్ఠికశాంతిని అనఁగా స్థిరమైన ఆత్మానుభవరూపమైన యానందమును పొందుచున్నాఁడు. కాఁబట్టి ఫలసంగము లేనివాఁడవై ఇంద్రియరూపముగాఁ బరిణమించిన ప్రకృతియందు కర్మముల సన్న్యసించి నీ బంధమును విడిపించికొనుటకె కర్మములంజేయుము. అనుట.

మధ్వ. యుక్తుఁడనుటకు యోగముతోఁగూడినవాఁడనుట.

శ్లో. సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవకుర్వన్న కారయన్. 13

టీ. వశీ=ఇంద్రియనిగ్రహముగలవాఁడు, మనసా=మనస్సుచేత, సర్వకర్మాణి=సమస్తకర్మములను, నవద్వారే=తొమ్మిది ద్వారములుగల, పురే=పట్టణమువంటి, దేహే= దేహమందు, సన్న్యస్య=విడిచిపెట్టి, నైవకుర్వన్ = చేయనివాఁడై, నకారయన్ = చేయించనివాఁడై, సుఖం = అనాయాసముగా, ఆస్తే=ఉన్నాఁడు.

శం. ఇంద్రియనిగ్రహము గలవాఁడు మనస్సుచేత సమస్త కర్మలను వదలిపెట్టి నవద్వారములుగల పట్టణ మను దేహమునందుఁ దాను కర్మచేయనివాఁడై మఱియొకరిచేత జేయించనివాఁడై అనాయాసముగా నుండును. పరమార్థజ్ఞానము కలవాఁడు నిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధకర్మములను మనస్సుచేత నసఁగా కర్మములయందు అకర్మదర్శనమనెడి వివేకబుద్ధిచేత వదలి, కాయవాఙ్మనోవ్యాపారములను విడిచి, యతియై ఆయాసములేనివాఁడై, ప్రసన్నచిత్తుఁడై, ఆత్మకంటె మిగిలిన

ప్రయోజనములు లేనివాఁడై, శిరస్సున ఏడురంధ్రములును (అనఁగా శ్రోత్రేంద్రియములు రెండు, ఘ్రాణేంద్రియములు రెండు, నయనేంద్రియములు రెండు, వాగ్రంధ్రమొకటి) మలమూత్రములను విడిచెడి రెండురంధ్రములనెడి తొమ్మిదిరంధ్రములతోఁ గూడిన శరీరమున కర్తృత్వ కారయితృత్వములులేనివాఁడై సుఖముగా నున్నాఁడు. దేహమె యాత్మయనుకొనెడి యజ్ఞుఁడు దేహమునం దాత్మయున్నాఁడని అనుకొనఁడు.

రామా. కర్తృత్వము ఆత్మయొక్క ప్రాచీనకర్మమూలమగు దేహసంబంధమువలన వచ్చినదిగాని స్వరూపముఁ బట్టి వచ్చినది కాదనెడి వివేకముఁగలమనస్సుతో సమస్తకర్మములను నవరంధ్రములుగల శరీరమున సన్న్యసించి అనగా కర్తృత్వమును నిలిపి, తాను దేహమును అధిష్ఠించియుండుట యందలి ప్రయత్నమునుచేయక దేహముచేత చేయింపనివాఁడై సుఖముగా నున్నాఁడనుట.

శ్లో. న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. 14

టీ. ప్రభుః=ఆత్మ, లోకస్య=లోకమునకు, కర్తృత్వం=కర్తృత్వమును, నసృజతి=కలుగఁజేయఁడు. కర్మాణి=కర్మములను, నసృజతి=సృజించఁడు. కర్మఫలసంయోగంచ=కర్మఫలాసక్తిని, నసృజతి=సృజించఁడు. (మఱియేమన్నను,) స్వభావస్తు=మాయయే, ప్రవర్తతే=ప్రవర్తించుచున్నది.

శం. ఈశ్వరుఁడు, కర్తృత్వమును బుట్టించలేదు. కర్మలను బుట్టించలేదు. కర్మఫలసంసిద్ధమును కలుగఁజేయలేదు. అన్ని

యుఁ బ్రకృతివల్ల గలిగినవియే. కర్మము లనఁగా లోకమునకు కావలసిన రథములు కుండలు మేడలు మొదలగునవి. కర్మఫల సంయోగమనఁగా రథాదుల చేసినవానికి వానిఫలములతో సంబంధము. 'స్వభావస్తుప్రవర్తతే' యనఁగా అవిద్యాస్వరూపమగు ప్రకృతియనెడు మాయయె ప్రవర్తింపుచున్నదనుట.

రామా. దేవతలు, తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) స్థావరములు అనెడుస్వరూపముగా ప్రకృతితోఁజేరియున్న యీ లోకముయొక్క వానివాని (దేవాదులు) కర్తృత్వమును, వానివాని కర్మములను, ఆకర్మములవలనఁ గలిగెడి దేవాదిఫల సంబంధములను, ప్రభువు అనఁగా కర్మవశ్యుఁడుకాక స్వాభావికమైన స్వరూపముతోనుండెడి యాత్మసృజింపఁడు. ఈ కర్తృత్వాదికమంతయును అనాదికాలమునుండి కలిగిన పూర్వకర్మములవలననే దేవాదిస్వరూపమైన ప్రకృతి సంసర్గముచేఁ గలుగఁ జేయఁబడిన ఆయా యాత్మాభిమానముచేఁ గలిగినవాసనలచే కలుగఁజేయఁబడినదియే. స్వరూపముచేతఁ గలిగినదికాదు. స్వభావమనఁగా ప్రకృతివాసన.

మధ్వ. వస్తుస్థితినిబట్టి కర్తృత్వములేదు. జడములం బట్టియే జీవుని ప్రభువనుట.

శ్లో. నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః,
అజ్ఞానే నాఽవృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. 15

టీ.విభుః=ఆత్మ,కస్యచిత్=ఒకానొకభక్తునియొక్క,పాపం=పాపమును, సుకృతంచ=పుణ్యమును,నాదత్తఏవ=గ్రహింపదు. అజ్ఞానేన=అజ్ఞానముచేత,జ్ఞానం=వివేకజ్ఞానము,ఆవృతం=కప్పఁ

బడెను. తేన=ఆయజ్ఞానముచేత, జంతవః = అవివేకులైనసం సారులు, ముహ్యంతి=మోహముం జెందుచున్నారు.

శం. ఈశ్వరుఁడు పురుషులయొక్క పాపమునుగాని పుణ్యమునుగాని గ్రహింపఁడు, జ్ఞానమును నజ్ఞానము గప్పియున్నది కావున పురుషులు కర్తృత్వాద్యభిమానముచేత మోహమును బొందుచున్నారు.

రామా. విభువనఁగా నంతటనుండువాఁడు, దేవాదిదేహములయందు కొన్నిటియందె ఆత్మయుండి మనుష్యాదిదేహములలో లేకపోవుట లేదనిభావము. ఈయాత్మ తనసంబంధులుగా తలంపఁబడిన పుత్త్రాదులపాపమును పోఁగొట్టఁడు. ప్రతికూలుఁడుగా తలంపఁబడిన విరోధిపుణ్యమును పోఁగొట్టఁడు. కాఁబట్టి యాత్మ ఒకనికి సంబంధియును, ఒకనికి విరోధియును కాఁడు. అజ్ఞానముచేత నీయాత్మయొక్క జ్ఞానము నిరోధింపఁబడినది. ఈకర్మముచేతనే దేవాదిదేహసంబంధమును, దేవాదిదేహములయందాత్మాభిమానమనెడి మోహంబును కలుగుచున్నది. దానివలన అట్టి యాత్మాభిమానవాసనయు దానికితగిన కర్మవాసనయు కలుగుచున్నవి. వాసనవలన విపరీతాత్మాభిమానంబును కర్మారంభంబును కలుగుచున్నవి.

శ్లో. జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. 16

టీ. ఆత్మనః=పరమాత్మయొక్క, జ్ఞానేన=వివేకజ్ఞానముచేత, యేషాం=ఏజంతువులయొక్క, తదజ్ఞానం=ఆయజ్ఞానము, నాశితం=నశింపఁజేయఁబడెనో, తేషాం=వారియొక్క, జ్ఞానం=

జ్ఞానము, ఆదిత్యవత్=సూర్యునివలె, తత్పరం=ఆయజ్ఞానమునకుఁ బరమైనదియు పరిపూర్ణమును (అయిన) పరమార్థతత్త్వమును, ప్రకాశయతి=ప్రకాశింపఁజేయును.

శం. ఎవ్వరికిఁ దమయజ్ఞానము జ్ఞానముచేత నశింపఁబడునో వారికి జ్ఞానము సూర్యునివలె పరమాత్మను స్పష్టముగా నగపఱచుచున్నది.

రా. "నాశితమాత్మనః" అనుదానికి "నాశితమాత్మనామ్" అని పాఠాన్తరముచేసి, ఏయాత్మలయొక్క ఆత్మజ్ఞానముచేత, కర్మసంచయరూపమైన, అజ్ఞానమునశించఁబడినదో వారియొక్క స్వాభావికమైన, పరమ్=ఉత్కృష్టమైన ఆజ్ఞానము, సంకోచము లేనిదై సమస్తమును ప్రకాశింపఁజేయును.

మధ్వ. ఈశ్వరాపరోక్షజ్ఞానమె అజ్ఞాన నాశకము.

శ్లో. తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః,
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. 17

టీ. జ్ఞాననిర్ధూతకల్మషాః=జ్ఞానముచేతఁ బోఁగొట్టఁబడిన పాపముగలవారలు, తద్బుద్ధయస్సంతః=ఆబ్రహ్మమందే బుద్ధిగలవార లగుచు, తదాత్మానః=ఆపరబ్రహ్మమే యాత్మస్వరూపముగాఁగలవారలై, తన్నిష్ఠాః=ఆబ్రహ్మమందే యభినివేశము కలవారలై, తత్పరాయణాః=ఆబ్రహ్మమే యుత్కృష్టగతిగాఁ గలవారలై, అపునరావృత్తిం = పునరావృత్తిరహితమయిన మోక్షమును, గచ్ఛతి=పొందుచున్నారు.

శం. జ్ఞానముచేఁ బాపమునెల్ల నశింపఁజేసినవా రాబ్రహ్మ మందే బుద్ధిగలిగియు పరబ్రహ్మమే యాత్మస్వరూపముగా నెంచి, దానియందే యభినివేశముగలిగి పునరావృత్తిరహిత మైన మోక్షము నందుచున్నారు. తచ్ఛబ్దముచే బ్రహ్మము చెప్పఁబడును. ఈలక్షణములు కలసన్యాలు వెండియు దేహ సంబధమును పొందరు.

రామా. తచ్ఛబ్దము ఆత్మను చెప్పుచున్నది. ఆయాత్మ విషయమైన మనస్సు కలవారు, దాని యభ్యాస మందాసక్తు లయినవారు, అదియ పరమ ప్రయోజనమని తలంచువారు, ఏయవస్థలోనున్న యాత్మకు పునరావృత్తిలేదో ఆయాత్మ అపు నరావృత్తి—వెనుక చెప్పఁబడిన లక్షణములుకలవారు స్వ స్వరూపముతోనున్నయాత్మను పొందుదురు.

మధ్వ. అపరోక్షజ్ఞానమునకు అవ్యవహితమైన సాధన మును ఈశ్లోకము తెలియఁజేయు చున్నది.

శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని,
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః. 18

టీ. విద్యావినయసంపన్నే = విద్యావినయములతోఁగూడి న, బ్రాహ్మణే=బ్రాహ్మణునియందును, గవి=గోవునందును,హ స్తిని=ఏనుఁగునందును, శునిచైవ=కుక్కయందును, శ్వపాకేచై వ=కుక్కను కోసి వండుకొనునట్టిచండాలునియందును, పండి తాః=జ్ఞానులు, సమదర్శినః=సమానదృష్టిగలవారలు.

శం. జ్ఞానులు విద్యావినయములతోఁగూడిన బ్రాహ్మణుని యందును, గోవులందును, ఏనుఁగునందును, శునకమందును,

దానివండి భక్షించువానియందును నైక్యానుసంధానము జేసి సమానదృష్టిగలవా రగుదురు. బ్రాహ్మణుని చెప్పుటచేత నుత్తమమగు సాత్త్వికగుణప్రధానవస్తువును, గోవును చెప్పుటచేత మధ్యమమగు రాజస ప్రధానవస్తువును, ఏనుగు మొదలగు వానిని చెప్పుటచేత కేవల తామసగుణ ప్రధానవస్తువులను నిర్దేశించి సాత్త్విక సంస్కారాదుల సంపర్కములేనిదియు, వికారము లేనిదియు నగు బ్రహ్మమును చూచువారు సమదృష్టి కలవారు.

రామా. బ్రాహ్మణ, గో, హస్త్యాదివిషమాకారములు ప్రకృతివి కాని, ఆత్మవికావు. ఆత్మ జ్ఞానైకస్వరూపుఁడగుటచేత అంతటను సముఁడె. అని యాత్మజ్ఞులు తలంతురు.

మధ్వ. పరమేశ్వరస్వరూపముల నన్నిటిని అంతట సమముగాఁజూచుట అపరోక్షజ్ఞాన సాధనము.

శ్లో. ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితంమనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః. 19

టీ. యేషాం=ఎవరియొక్క, మనః=అంతఃకరణము, సామ్యే=బ్రహ్మసమభావమందు, స్థితం=నిశ్చలమైయున్నదో, తైః=వారిచేత, ఇహైవ=ఈలోకమందే, సర్గః=జన్మసంస్కారము, జితః=జయింపఁబడెను. హి=ఏకారణమువలన, సమం=ఏకమయిన, బ్రహ్మ=బ్రహ్మము, నిర్దోషం=దోషరహితమయినదో, తస్మాత్=ఆకారణమువలన, తే=ఆసమదర్శనులు, బ్రహ్మణి=బ్రహ్మమందు, స్థితాః=ఉన్నవారలు.

శం. ఎవరియొక్క మనస్సు సమస్తమునందు సమదృష్టిని బొందుచున్నదో వారిచేత నీజన్మమందే మోక్షము జయింపఁబడినది. పరబ్రహ్మము ఏకమై నిర్దోషమైనదగుటవల్ల సమదృష్టి గలవారు పరబ్రహ్మమందున్నవారు, మూఢులగువారు దోషవంతులకు శ్వపాకాదులయందలి దోషసంపర్కమును, బ్రహ్మమున కాలోచింతురు. బ్రహ్మము నిర్దోషమైనది. బ్రహ్మము నిర్గుణమగుటచేత, గుణభేదములం గలిగెడి భేదములును లేనిదికాన ఒక్కటియే. కాఁబట్టి సమబుద్ధికలవారు పరబ్రహ్మమునందె యున్నవారు. వారికి దేహాది సంఘాతములయందు ఆత్మ యనుబుద్ధి లేదుగాన దోషపు గంధమైనను వారిని అంటదు.

రామా. ఇహైవ = సాధనమును ఆచరించెడిదశయందె, సర్గ మనగా సంసారము. ప్రకృతిసంబంధమగు దోషము లేకపోవుటచే సమముగా నుండెడి యాత్మవస్తువే కదా బ్రహ్మము! ఆత్మసామ్యమునం దుండిరేని బ్రహ్మమునం దున్నవారే. బ్రహ్మమునం దుండుటయే కదా సంసారజయము. ఆత్మలయందు జ్ఞానైకస్వరూపులగుట యనెడి సామ్యమునె తలంచుచున్నవారు ముక్తులే యనుట.

మధ్వ. వెనుక చెప్పియున్న సామ్యదర్శనస్తోత్రము వివరితమైనది.

శ్లో. నప్రహృష్యేత్ప్రియంప్రాప్య నోద్విజేత్ప్రాప్యచాప్రియమ్,
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః. 20

టీ. స్థిరబుద్ధిః=నిస్సంశయబుద్ధిగలిగి, అసమ్మూఢః=మోహవర్జితుఁడయిన, బ్రహ్మవిత్=ఆత్మజ్ఞాని, బ్రహ్మణి=బ్రహ్మమందు, స్థితస్సన్=ఉన్నవాఁడగుచు, ప్రియం=ప్రియమును, ప్రాప్య=పొంది, నప్రహృష్యేత్=సంతోషించఁడు. అప్రియంచ=అనిష్టమును, ప్రాప్య=పొంది, నోద్విజేత్=భయపడఁడు.

శం. బ్రహ్మమందున్న బ్రహ్మవిత్తు భ్రమవదలి స్థిరబుద్ధిగలవాఁడై యిష్టమును బొందినపుడు సంతోషింపఁడు. అనిష్టమును బొందినపుడు దుఃఖింపఁడు.

రామా. స్థిరమైన ఆత్మయందు బుద్ధికలవాఁడు స్థిరబుద్ధి. మోహమనగా అస్థిరమైన శరీరముతో స్థిరమైన ఆత్మను ఏకీభవింపఁ జేయుట. అదిలేనివాఁడు అసమ్మూఢుఁడు. బ్రహ్మవిత్తనగా ఆత్మయొక్క యాథార్థ్యమును తెలిసికొనినవాఁడు. బ్రహ్మయం దున్నవాఁ డనఁగా ఆజ్ఞానమునందె అభ్యాసముచేయుచున్నవాఁడు. ఒక్కొక్కశరీరములోనున్నప్పుడు ప్రాచీనకర్మవాసనలంబట్టి కొన్నికొన్ని యిష్టానిష్టము లగును. అస్థిరములైన ఈ యిష్టానిష్టములం బొంది సంతోషభయములం జెందుటఁ గూడదు.

శ్లో. బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్,
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. 21

టీ. బాహ్యస్పర్శేషు = బయటఁబుట్టినశబ్దాదివిషయములయందు, అసక్తాత్మా=అంటని యంతఃకరణముకలవాఁడై, ఆత్మని=చిత్తవృత్తియందు, యత్సుఖం=ఏసుఖమును, విందతి=పొందుచున్నాఁడో, సః=వాఁడు, బ్రహ్మయోగయుక్తాత్మాసన్=

బ్రహ్మమందు నిర్మలమైన యంతఃకరణము గలవాఁ డగుచు, అక్షయం=నాశరహితమైన, సుఖం =సుఖమును, అశ్నుతే= పొందుచున్నాఁడు.

శం. ఆసక్తిలేకనే యింద్రియవిషయములయం దేసుఖమును యోగి యనుభవించుచున్నాఁడో ఆసుఖమునే పరబ్రహ్మమునందును ననుభవించుచున్నాఁడు. ఆత్మయందలి యక్షయసుఖమును కోరువాఁడు క్షణికములగు బాహ్యవిషయములయందలి ప్రీతినుండి ఇంద్రియములను నివర్తింపవలయును.

రామా. ఎవ్వఁడు వెలివిషయానుభవములయందు సంగములేని మనస్సుకలవాఁడై ఆత్మలోనే సుఖమును పొందుచున్నాఁడో వాఁడు ప్రకృత్యభ్యాసమునువిడిచి బ్రహ్మాభ్యాసముతోఁ గూడినమనస్సుఁ గలవాఁడై బ్రహ్మను భావరూపమగు అక్షయసుఖమును పొందుచున్నాఁడు.

మధ్వ. కామములేని యాత్మయందు ఎవ్వఁడుసుఖమును పొందుచున్నాఁడో, వాఁడే బ్రహ్మమును గూర్చిన యోగముతో ననగా ధ్యానము మొదలగువానితోఁ గూడిన ఆత్మకలవాఁడయ్యేనేని ఆయక్షయసుఖమునె పొందుచున్నాఁడు. ధ్యానాదులతోఁ గూడినవానికె అక్షయమైన యాత్మసుఖముకలుగును. మఱియొక్కవిధముగా కలుగదు.

శ్లో. యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః. 22

టీ. హే కౌంతేయ = ఓ యర్జునా ! సంస్పర్శజాః=విషయేంద్రియములవలనఁబుట్టిన, యేభోగాః=ఏసుఖములు, ఆద్యంత

వంతః=విషయేంద్రియ సంయోగ వియోగములు గలిగినవో,. తే=ఆవిషయభోగములు, దుఃఖయోనయఏవ= దుఃఖమునకుఁ గారణములయినవే (ఆకారణమువలన), బుధః=తత్త్వజ్ఞుఁడు, తేషు= ఆవిషయభోగములయందు, నరమతేహి = ఆసక్తుఁడు కాఁడుగదా.

శం. అర్జునా! విషయేంద్రియములవలనఁ బుట్టు సుఖము లాద్యంతములుగలవి గనుక నాసుఖములను దుఃఖకారణము గా నెఱుఁగుము. అందువల్లఁ బెద్ద లావిషయసుఖములం దాసక్తి నుంచరు.

శ్లో. శక్నో తీహైవ య స్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్త స్ససుఖీ నరః. 23

టీ. యః=ఎవఁడు, శరీరవిమోక్షణాత్ = దేహమును విడుచుటకంటె,ప్రాక్=ముందు, ఇహైవ=ఈలోకమునందే, కామక్రోధోద్భవం = కామక్రోధములవలనఁబుట్టిన, ఇంష్టైనవిషయము ఇంద్రియగోచరమైనప్పుడుగాని, వినఁబడినప్పుడుగాని, తలంపఁబడినప్పుడుగాని కలిగెడి యాశ కామమనఁబడును. తనక నిష్టమైన విషయముగోచరమైనప్పుడుగాని, వినఁబడినప్పుడుగాని, తలంపఁబడినప్పుడుగాని కలిగెడి ద్వేషము క్రోధము అనఁబడును. కామవేగము లేవనఁగా, 1 ఒడలుగగుర్పొడుచుట, 2 సంతోషముతోఁగూడిన నేత్రవదనాద్యవయవములు గలిగి యుండుట, 3 అంతఃకరణముక్షోభమును పొందుట. క్రోధవేగము లేవనఁగా, 1 ఒడలువణకుట, 2 చెమటపట్టుట, 3 పెదవికఱచుట, 4 కండ్లెఱ్ఱబాఱుట మొదలగునవి. వేగం=వేగ.

మును, సోఢుం=సహించుటకొఱకు, శక్నోతి=సమర్థుఁ డగుచున్నాడో, సః నరః=ఆమనుష్యుఁడు, యుక్తః=ఇంద్రియనిగ్రహముగలవాఁడును, సుఖీ=సుఖముగలవాఁడును (భవతి=అగుచున్నాఁడు).

శం. ఎవఁ డీ దేహమును వదలుటకు మున్ను కామక్రోధలోభమోహమదమాత్సర్యముల తొందరను జయింప సమర్థుఁ డగునో అట్టివాఁడే యోగి. అతఁడే బ్రహ్మానందసుఖము ననుభవించువాఁడు. మరణమును అవధిగాఁ జెప్పుటచేఁ బ్రతికియున్నవానికి కామక్రోధవేగము తప్పనిది. దానికి నిమిత్తములు అసంఖ్యాకములు. కాఁబట్టి మరణమువఱకును నమ్మఁగూడదు.

మధ్వ. మనుష్య శరీరమున నెట్లు సహింప శక్యమగునో అట్లు మఱియొక్క శరీరమున సహింప శక్యముకాదు. బ్రహ్మలోకము మొదలగు నది కామమును జయించిన వారికె కలుగుననుట.

శ్లో. యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతి రేవయః,
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. 24

టీ. అంతస్సుఖః= అంతరాత్మయందు సుఖము గలవాఁడును, అంతరారామః= ఆత్మారాముఁడును, యః= ఎవఁడో, తథా=ఆలాగుననే, అంతర్జ్యోతిః=అంతఃప్రకాశముగలవాఁడును, యః=ఎవఁడో, సః యోగీ=ఆ యోగి, బ్రహ్మభూతస్సన్= బ్రతికియుండగనె బ్రహ్మస్వరూపుఁడై, బ్రహ్మనిర్వాణం= బ్రహ్మానందమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

శం. ఎవఁడు ఆత్మసుఖియై, యాత్మారాముఁడై, జ్ఞానస్వరూపియై, యంతఃప్రకాశుఁడై యుండునో ఆయోగి బ్రహ్మస్వరూపియై మోక్షమును బొందుచున్నాఁడు.

రామా. ఎవ్వఁడాత్మానుభవమును ఒక్కటే సుఖముగాఁగలవాఁడో, ఎవ్వఁడాత్మయొక్కటియె విహరించను తోటగాఁగలవాఁడో, అనగా ఆత్మయే నొక్కటిగ తనగుణములను వృద్ధిపొందించునది గాఁగలవాఁడో ఆయోగి ఆత్మానుభవసుఖమును ప్రాపించుచున్నాఁడు.

మధ్వ. పరమాత్మ స్వయంజ్యోతిస్సుగాన ఆయనయందున్న జ్ఞాని 'అంతర్జ్యోతిః' అని పిలువఁబడుచున్నాఁడు. అసంప్రజ్ఞాతసమాధికలవానికి బాహ్యవిషయములు కనఁబడక పోవుటవల్లను, కనఁబడినను కార్యకరములు కాకపోవుటవల్లను అని ఏవకారమువల్ల స్పష్టము. బ్రహ్మభూతుఁడనఁగా బ్రహ్మమునందైనవాఁడు.

శ్లో. లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః. 25

టీ. క్షీణకల్మషాః=నశించినపాపములు కలవారును, ఛిన్నద్వైధాః=ఛేదింపఁబడిన సంశయములుగలవారును, యతాత్మానః=నిగ్రహింపఁబడిన చిత్తములుగలిగినవారును, సర్వభూతహితే=సమస్తప్రాణులహితమందు, రతాః=ఆసక్తులైనవారునునైన, ఋషయః=జ్ఞాననిష్ఠులు, బ్రహ్మనిర్వాణం=మోక్షమును, లభంతే=పొందుచున్నారు.

శం. గొప్పఋషులు పాపవర్జితులై, నిస్సంశయాత్ములై, యింద్రియనిగ్రహముగలవారై, సమస్తజీవకోట్లకు సుఖము జేయుట యందాసక్తిఁగలవారై మోక్షమును బొందుచున్నారు.

రామా. ఛిన్నద్వైధు లనఁగా శీతోష్ణాది ద్వంద్వములచే విడువఁ బడినవారు. యతాత్మలనఁగా నాత్మయందె నియమింపఁ బడిన మనస్సుకలవారు. ఋషు లనఁగా నాత్మావలోకనము చేయువారు. కల్మష మనఁగా నాత్మప్రాప్తికి విరోధులగుపాపములు.

మధ్వ. 'ఛిన్న ద్వైధాయతాత్మనః' అని ఏకపదము. సంశయమైనను విపర్యయమైనను ఛేదింపఁబడిన పిమ్మట పౌఢమైన మనస్సు కలవారగుట అనఁగా పదార్థము సర్వజ్ఞులు.

శ్లో. కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. 26

టీ. కామక్రోధవియుక్తానాం=కామక్రోధములచేత విడువఁ బడినట్టియు,యతచేతసాం = నియమింపఁబడిన యంతఃకరణము గలిగినట్టియు,విదితాత్మనాం=తెలియఁబడిన యాత్మస్వరూపము గలిగినట్టియు, యతీనాం=సన్న్యాసులకు, అభితః = ఇహపరములయందంతటను, బ్రహ్మనిర్వాణం=బ్రహ్మానందము, వర్తతే=ఉన్నది.

శం. జితేంద్రియులుగా, సన్న్యాసులుగా, నిశ్చలచిత్తులుగానుండు నాత్మజ్ఞానులకు మోక్షసుఖ మంతట నున్నయది.

రామా. యతులనఁగా ప్రయత్నము చేయుట స్వభావముగాఁ గలవారు. 'విజితాత్మనామ్' అనిపాఠము. అనఁగా జయింపఁ

బడిన మనస్సు కలవారు. ఇందుకు కారణము నియమింపఁబడిన మనస్సు కలవారగుట. 'అభితః వర్తతే' యనఁగా చేతిలోని దే బ్రహ్మానందమనుట.

మధ్వ. కామక్రోధవియుక్తు లగువారును, యతచేతస్సులగు వారును, విదితాత్మలగు యతులకు బ్రహ్మము శ్రమములేకయే పొందఁదగినది.

అవ. ఈరెండుశ్లోకములు ధ్యానయోగమునకు సూత్రప్రాయములు.

శ్లో. స్పర్శాన్కృత్వాబహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరేభ్రువోః,
   ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ. 27
   యతేంద్రియ మనో బుద్ధి ర్ముని ర్మోక్ష పరాయణః,
   విగతేచ్ఛాభయక్రోధో య స్సదా ముక్తఏవ సః.   28

టీ. యః=ఎవ్వఁడు, బాహ్యాన్ = బహిర్భవములై శ్రోత్రాదిద్వారములచేత బుద్ధియందుఁ బ్రవేశింపఁజేయఁబడిన, స్పర్శాన్=శబ్దాదివిషయములను, బహిః=వెలుపటను, కృత్వా=చేసి, చక్షుః=దృష్టిని, భ్రువోః = కనుబొమలయొక్క, అంతరే=మధ్యమందు (కృత్వా=ఉనిచి), ప్రాణాపానౌ=ప్రాణాపానవాయువులను, నాసాభ్యంతరచారిణౌ = నాసికలోపలసంచరించెడివానిఁగా, సమౌ చ=సమానములుగా (కృత్వా=చేసి), యతేంద్రియమనోబుద్ధిః=నియమింపఁబడిన ఇంద్రియములును మనస్సును బుద్ధియుఁగలవాఁడై, విగతేచ్ఛాభయక్రోధః=ఇచ్ఛయును, భయమును, క్రోధమును విడిచినవాఁడై, మోక్షపరాయణః=మోక్షాసక్తుఁడై, మునిః=మననశీలుఁడై, వర్తతే=

ఉన్నాఁడో, సః=ఆపురుషుఁడు, సదా=నిత్యమును, ముక్తయే వ = ముక్తుఁడేను.

శం. ఎవఁడు శబ్దస్పర్శరూపరసగంధవిషయముల నింద్రియవర్తనములకు వెలిఁజేసి దృష్టిని భ్రూమధ్యమునందు నిలిపి, ప్రాణాపానవాయువులను నాసికలద్వారమున సమమైన యుచ్ఛ్వాసనిశ్వాసములుగాఁ జేసి యింద్రియములను మనస్సును బుద్ధిని నధీనము జేసికొని కోరికను భయమును క్రోధమును జయించి మోక్షాసక్తుఁడై యుండునో అట్టివాఁడే ముక్తుఁడని తెలియుము.

రామా. బాహ్యేంద్రియవ్యాపారములు చాలించి నాసాగ్రమందు ప్రాణాపానములను అనఁగా ఉచ్ఛ్వాస నిశ్వాసములను సమానమైన గతిఁ గలవానిగాఁజేసి ఆత్మావలోకనముఁ దప్ప మఱియొక్క దానియందు ప్రవర్తింపనీక ఆత్మావలోకనమును చేయువాఁడు సాధనమును నడపించు నప్పుడుగూడ సాధ్యదశయందువలె ముక్తుఁడే.

శ్లో. భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి.

టీ. యజ్ఞతపసాం=యజ్ఞములకును తపస్సులకును, భోక్తారం=దేవతారూపముచేతభోక్తగాను, సర్వలోకమహేశ్వరం=సమస్తలోకములకు నియామకుఁడుగాను, సర్వభూతానాం=సమస్తప్రాణులకును, సుహృదం=ఉపకారినిగాను, మాం=నన్ను, జ్ఞాత్వా=ఎఱిఁగి, శాంతిం=సంసారోపరతిని, ఋచ్ఛతి=పొందుచున్నాఁడు.

శం. మహనీయుఁడు న న్నెల్ల యజ్ఞతపస్సులను ననుభవిం చువాఁ డనియు నెల్ల ప్రపంచములకు నియామకుఁ డనియు నెల్ల చరాచరభూతములకు నుపకారి యనియుఁ దెలిసి మోక్షము ను బొందుచున్నాఁడు.

రామా. నన్ను తెలిసికొని కర్మయోగము నాచరించినచో నె శాంతిని అనగా సుఖమును పొందుచున్నాఁడు. నన్ను సర్వ లోక మహేశ్వరునిగాను, సర్వసుహృత్తునుగాను తెలిసికొని కర్మయోగము నాయొక్క ఆరాధనముగాన దానిలో సుఖ ముగాఁ బ్రవర్తింపుచున్నాఁ డనుట.

మధ్వ. ధ్యానము తద్రూపమును చెప్పి ఈశ్లోకముచే ధ్యేయ ము (ధ్యానము చేయవలసిన దేదో యాబ్రహ్మము) చెప్పఁబడు చున్నది.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
కర్మసన్న్యాసయోగోనామ
పఞ్చమోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునుల సంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయందు కర్మసన్న్యాసయోగ
మనెడి పఞ్చమాధ్యాయము.



శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## ఆత్మసంయమయోగః.



శ్రీభగవాన్ ఉవాచ.

శ్లో. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
స సన్న్యాసీచ యోగీచ న నిరగ్ని ర్నచాక్రియః. 1

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

టీ. యః=ఎవఁడు, కర్మఫలం=కర్మముయొక్క ఫలమును, అనాశ్రితస్సన్ = అపేక్షించనివాఁ డగుచు, కార్యం=చేయఁదగిన, కర్మ=కర్మమును, కరోతి=చేయుచున్నాఁడో, సః=వాఁడు, సన్న్యాసీచ=కర్మపరిత్యాగముకలవాఁడును, యోగీచ=చిత్తసమాధానము కలవాఁడును, (భవతి=అగుచున్నాఁడు,) నిరగ్నిః=అగ్నులులేనివాఁడును, న=కాఁడు, అక్రియశ్చ=తపోదానాదిక్రియలు లేనివాఁడును, న=కాఁడు.

తం. ఏ మనుజుఁడు కర్మఫలాపేక్షలేక చేయఁదగ్గ కర్మలను చేయుచున్నాఁడో అతఁడు కర్మవదలిన సన్న్యాసియు, చిత్తశుద్ధిగలిగినయోగియు నగుచున్నాఁడు. అతఁడు యోగశాస్త్రసమ్మతముగా నగ్నిహోత్రదానాదికర్మలనువదలిన యోగికంటె నధికుఁడు. ఈశ్లోకముచే ఫలమునుగోరక చేయఁబడెడి కర్మము సన్న్యాసమువంటిది. కాని సన్న్యాసము నిషేధింపఁబడలేదు.

కర్మఫలమును ఆశ్రయింపనివాఁ డనఁగా కర్మఫలాపేక్ష లేని వాఁడు. చేయఁదగిన కర్మమనఁగా నిత్యకర్మము క్రియ లనునవి అగ్న్యపేక్షలేని తపస్సు దానము మొదలగునవి.

రామా. పరమపురుషుని యారాధనారూపము కుటచేత కర్మమే నాకు ప్రయోజనముకాని దానివలన సాధింపవలసినదిలేదు అనితలంచుచు ఎవ్వఁడు కర్మమునుచేయునో, వాఁడు సన్న్యాసియును, జ్ఞానయోగనిష్ఠుఁడును-ఆత్మావలోకమునకు (యోగమునకు) సాధనములైన రెండుకర్మ (జ్ఞానకర్మ)ల యందును నిష్ఠకలవాఁడని యర్థము. వేదమున విధింపఁబడిన యజ్ఞాది కర్మములం బ్రవర్తింపని కేవల జ్ఞాననిష్ఠుఁ డిట్టివాఁడు కాఁడు- వానికి జ్ఞాననిష్ఠమాత్రము కలదు. ఈకర్మయోగికి రెండు నుకలవు.

మధ్వ. సన్న్యాసికిఁగూడ అగ్నియును క్రియయును గలవు- అతనికి అగ్ని బ్రహ్మమే - పరబ్రహ్మపూజయే క్రియ అని.

అవ. కర్మయోగమందు జ్ఞానము గలదు.

శ్లో. యం సన్న్యాస ఇతి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ,
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన. 2

టీ. హే పాండవ=అర్జునా! బుధాః=జ్ఞాననిష్ఠులు, యం= దేనిని, సన్న్యాసఇతి = సర్వకర్మపరిత్యాగలక్షణముగలదాని నఁగా, ప్రాహుః=చెప్పుదురో, తం=దానిని, యోగమితి= కర్మానుష్ఠానలక్షణమని, విద్ధి=తెలియుము. అసన్న్యస్తసంకల్పః=విడువఁబడని ఫలవిషయసంకల్పముగలిగిన, కశ్చన=ఒకానొకఁడును, యోగీ=కర్మయోగి, నభవతిహి=కాఁడుగదా.

శం: అర్జునా! సన్న్యాసమని దేనిని చెప్పుచున్నారో దానినే కర్మయోగమని యెఱుఁగుము. సంకల్పత్యాగము చేయనివాఁడు యోగి కాఁజాలఁడు.

రామా. సన్న్యాసమనగా జ్ఞానయోగము, అది కర్మయోగమే అని తెలిసికొనుము. సంకల్పమనఁగా ఆత్మకాని ప్రకృతియందు ఆత్మయనెడి తలంపు. దానిని ఆత్మయాథాత్మ్యజ్ఞానముచేఁ బోఁగొట్టుకొననివాఁడు కర్మయోగికాఁడు గదా యనుట.

మధ్వ. సన్న్యాసముగూడ యోగములో నంతర్భూతమని చెప్పఁబడుచున్నది. కామసంకల్పాదులను విడువక యుక్తిశాలి యెట్లగును?

శ్లో. ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే. 3

టీ. యోగం = జ్ఞానయోగము, ఆరురుక్షోః = ఎక్కనిశ్చయించిన, మునేః=మునికి, కర్మ=కర్మము, కారణం = సాధనమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. యోగారూఢస్య=జ్ఞానాధిగతుఁడైన, తస్యైవ=ఆమునికే, శమః=సర్వకర్మనివృత్తి, కారణం=సాధనమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

శం. జ్ఞానయోగమును బొందఁగోరిన మునులకు ఫలత్యాగపూర్వకర్మ సాధనముగా నున్నది. జ్ఞానము గలిగిన వెనుకఁ గర్మనివృత్తియే సాధనమని దెలియుము. కర్మములను వదలినకొలఁది ఆయాసము లేకుండుటచే ఇంద్రియ జయముకలవాఁడై చిత్తైకాగ్ర్యము కలవాఁ డగును.

రామా. యోగమనఁగా ఆత్మావలోకనము, కైవల్యమనెడి మోక్షము. శమ మనఁగా కర్మనివృత్తి- మోక్షము కలుగువఱకును కర్మము చేయఁదగినది.

మధ్వ. యోగమనఁగా ఉపాయము; ఆరురుక్షువనఁగా నాయుపాయముయొక్క సంపూర్తికోరువాఁడు; ఆరూఢుఁడనఁగా సంపూర్ణమైన ఉపాయముకలవాఁడు, అనఁగా అపరోక్షజ్ఞానము కలవాఁడు; శమమనఁగా ననుభవించ వలసిన కర్మక్షయము; కారణమనఁగా పరమ సుఖసాధనము; అపరోక్షజ్ఞానము కలవానికి భోక్తవ్యకర్మోపశమము కలిగెనేని అసంప్రజ్ఞాత సమాధికలుగును-కర్మోపశమము కలిగినయెడ భగవంతుని చరిత్రాదులలో కాలము గడుపుననుట.

శ్లో. యదా హి చేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4

టీ. యదా=ఎప్పుడు, ఇంద్రియార్థేషు=శబ్దాదివిషయముల యందు, న అనుషజ్జతే=ఆసక్తుఁడు కాఁడో, కర్మసు చ=కర్మముల యందును, నఅనుషజ్జతే=ఆసక్తుఁడుకాఁడో, తదా = అప్పుడు, సర్వసంకల్పసన్న్యాసీ = సమస్తసంకల్పములఁ బరిత్యజించునట్టి శీలముగలవాఁడు, యోగారూఢః=జ్ఞానమును బొందినవాఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

శం. ఎప్పుడు శబ్దస్పర్శరూపరసగంధవిషయములయందును, నిత్యనైమిత్తికాది కర్మలయందును ఆసక్తుఁడు గాకయుండునో అప్పుడు సమస్తసంకల్పములను అనగా ఐహికాముష్మికకామములకు హేతువు లగువానినన్నిటిని విడిచినవాఁడనియు జ్ఞానము నొందినవాఁ డనియు చెప్పఁబడుచున్నాఁడు.

రామా. ఇంద్రియార్థము లనగా ఆత్మ కాక మిగిలిన ప్రాకృత విషయములు. ఈయోగి ఆత్మైకానుభవస్వభావము కల వాఁడగుటచే, ప్రాకృతవిషయములందును వానితో సంబంధించిన కర్మములయందును, ఎప్పుడు కర్మమును చేయఁదగఁడో అప్పుడు వాఁడు సమస్త సంకల్పములను విడిచిన వాఁడై యోగారూఢుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. కాఁబట్టి ఆరురుక్షు వైన వాఁడు విషయానుభవమునకుఁ దగినవాఁడు కాన విషయాననుషంగాభ్యాసరూప (విషయములయం దాసక్తిలేక పోవుటను అభ్యసించుట స్వరూపముగా గలది) మగు కర్మయోగమె వానికి యోగసిద్ధిని కలుగఁజేయును.

మధ్వ. అపరోక్షజ్ఞానము కలవానికె తనంతటనె దోషములణగిపోవుట తటస్థించును. అదియె లెస్సయైన అననుషంగము.

శ్లో. ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః. 5

టీ. ఆత్మనా=ఆసక్తిలేనిమనస్సుచేత, ఆత్మానం = సంసారసాగరమగ్నుఁడైనతన్ను, ఉద్ధరేత్ =ఉద్ధరింపవలయును, ఆత్మానం=తన్ను, నఅవసాదయేత్ =అధోగతిని బొందించఁగూడదు. ఆత్మనః=తనకు, ఆత్మైవ=వశీకృతమైనమనస్సే, బంధుః=బంధువును, ఆత్మనః=తనకు, ఆత్మైవ=వశీకృతముకానిమనస్సే, రిపుః=శత్రువును గదా.

శం. పురుషుఁడు తనమనస్సుచే నుద్ధరించుకొనవలయును, తాను చెఱుపుకొనరాదు. తనకు మనస్సే బంధువు, మనస్సే శత్రువు.

రామా. విషయాసక్తముకాని మనస్సుచేత నాత్మ నుద్ధరింపవలయునుగాని విషయములయం దాసక్తిగల మనస్సుచేత ఆత్మను బాధింపఁ గూడదు.

మధ్వ. ఆత్మానమ్=జీవుని, ఆత్మనః=జీవునకు, యోగారూఢము ప్రయత్నముచే చేయు తగినదికాదు.

శ్లో. బంధు రాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. 6

టీ. యేన=ఏ, ఆత్మనైవ=మనస్సుచేతనే, ఆత్మా=దేహేంద్రియాదిసంఘాతము, జితః=జయింపఁబడునో, తస్యాత్మనః=ఆ మనస్సున, ఆత్మా = దేహేంద్రియాదిసంఘాతము, బంధుః = బంధువు, అనాత్మనస్తు=జయింపఁబడనిమనస్సు గలవానికైతే, ఆత్మా=మనస్సు, శత్రువత్ =శత్రువువలె, శత్రుత్వే=శత్రుభావమైన అపకారమందు, వర్తేత=ఉండును.

శం. ఎవఁడు తన మనస్సుచేత దేహేంద్రియాది సమూహమును జయించుచున్నాఁడో అట్టివానికిఁ దనమన స్సుపకారి యగును. ఆయింద్రియజయము లేనివానికి మనస్సు శత్రువుగా నుండును.

రామా. ఏపురుషునిచేత తనమనస్సు విషయములను చేరకుండునట్లు జయింపఁబడినదో వానికి ఆమనస్సుబంధువు. జయింపఁబడని మనస్సు కలవానికి తనమనస్సే శత్రువువలె తన కీడునందు ప్రవర్తించును.

మధ్వ. జయింపఁబడని మనస్సుకలపురుషునకు మనస్సు ఉన్నదైనను ఉపకారము చేయునది కాదుగాన లే నట్లే చెప్పఁ

బడినది. జీతకాఁడు కలిగి యున్నను వాఁడు చేయవలసిన పని వాఁడు చేయనిచో అధికారి జీతగాఁడు లేనివాఁడై యనుట.

శ్లో. జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7

టీ. జితాత్మనః=జయింపఁబడినమనస్సుగల, అనఁగా కార్యకరణసంఘాతముకల, ప్రశాంతస్య=ఉపశాంతుఁడయిన పురుషునికి, పరమాత్మా=పరమాత్మ, సమాహితః=ఆత్మభావముచేత నున్నదై, వర్తతే=ప్రవర్తించుచున్నది, శీతోష్ణసుఖదుఃఖేషు=శీతోష్ణాది సుఖదుఃఖములయందును, తథా=ఆలాగుననే, మానావమానయోః=పూజానిందలయందును,పరం=మిక్కిలి, సమాహితః=ఆత్మానుభవమందేయుండును.

శం. జితేంద్రియుఁడై యుపశాంతిని బొందినవాఁడు పరమాత్మస్వరూపుఁడై శీతోష్ణములయందును సుఖదుఃఖములయందును మానావమానములయందును సముఁడై సుఖించుచుండును.

రామా. పరమాత్మ యనఁగా ప్రత్యగాత్మయని యర్థము చేసినారు.

మధ్వ. జితాత్మయొక్క మనస్సు తఱుచుగా విషయములను పొందదుగాన ప్రశాంతుఁడగును. అప్పుడు వాని హృదయమునందు పరమాత్మ (ఈశ్వరుఁడు) సన్నిహితుఁడగును - అపరోక్షజ్ఞానము కలవాఁడగును. అపరోక్షజ్ఞాని ద్వంద్వసముఁడై సుఖించుననుట.

శ్లో. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. 8

టీ. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా=శాస్త్రోక్తజ్ఞానముచేతను ఆత్మానుభవజ్ఞానముచేతఁ దృప్తమైన మనస్సుగలవాఁడును, కూటస్థః=చలింప నశక్యుఁడయిన, విజితేంద్రియః = ఇంద్రియనిగ్రహము గలవాఁడును, సమలోష్టాశ్మకాంచనః = పెంకు ఱాయి బంగారు ఈమూఁడును సమానముగాఁ జూచువాఁడును నైన, యోగీ=జ్ఞాని, యుక్తఇతి=ఆత్మానుభవము కలవాఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

శం. శాస్త్రీయజ్ఞానముచేతను, అనుభవజ్ఞానముచేతను, బరితృప్తమైన మనసుగలిగి సమదర్శియై ఇంద్రియనిగ్రహము గాంచి మట్టి ఱాయి బంగారములయందు సమబుద్ధికలిగినవాఁడు ఆత్మానుభవజ్ఞానముగల యోగి యని చెప్పఁబడును.

రామా. ఆత్మస్వరూపమును తెలియుటచేతను, అది ప్రకృతికంటె విలక్షణమైన దనుట చేతను, ఆత్మయందుండెడి జ్ఞానైకస్వరూపి ఇంద్రియ నిగ్రహముచేసి ప్రాకృతవస్తువులందు భోగ్యతా బుద్ధిలేక ఆత్మావలోకనరూపమగు కర్మయోగియని చెప్పఁబడును.

మధ్వ. శాస్త్రీయజ్ఞానము చేతను, అసాధారణ విజ్ఞానముచేత నపరోక్ష జ్ఞానముఁగలిగి నిర్వికారుఁడై, విజితేంద్రియుఁడై యోగానుష్ఠానము చేయువాఁడు యోగ సంపూర్ణుం డని చెప్పఁబడును.

శ్లో. సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు,
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే. 9

టీ. సుహృత్ = ఉపకారముచేసినవానియందు, మిత్ర=అవ్యాజస్నేహితునియందు, అరి=శత్రువునందు, ఉదాసీన=పక్షపాతము లేనివానియందు, మధ్యస్థ=మాధ్యస్థునియందు, ద్వేష్య=తనతో విరోధించినవానియందు, బంధుషు=బంధువులయందు, సాధుషు = శాస్త్రము ననుసరించు సత్పురుషులయందు, పాపేషు = నిషిద్ధకార్యములంజేయు పాపాత్ములయందు, సమబుద్ధిః=సమమైన బుద్ధిగలవాఁడు, విశిష్యతే= యోగారూఢుఁడగుచున్నాఁడు.

తా. మంచి చేయువారియందును, స్నేహితులయందును, శత్రువులయందును, ఉదాసీనులయందును, మధ్యవర్తులయందును, బంధువులయందును, సత్పురుషులయందును, పాపాత్ములయందును, సమబుద్ధిగలవాఁడు యోగారూఢ శ్రేష్ఠుఁడని (అనఁగా సర్వోత్తముఁడని) చెప్పఁబడును.

రామా. ఆలోచింపక తన హితమును కోరువారియందును, సమానవయస్సుకలవారై తమ హితమును కోరువారియందును, నిమిత్తమునుపట్టి యనర్థమునుకోరువారియందును, హితమును అనర్థమునుగూడ కోరుటకు నిమిత్తములేనివారియందును, పుట్టుక మొదలు ఎవ్వరికిని హితానర్థములు కోరకున్నవారియందును, ఎప్పుడు హితమునె కోరువారియందును, ధర్మస్వభావము కలవారియందును, పాపస్వభావము కలవారియందును, ప్రయోజనమునుగాని విరోధమునుగాని లేక సమాన

బుద్ధిగల వీనికి ఎవరితోను ప్రయోజనములేదు. తన యాత్మ వలననె ప్రయోజనమును పొందుచుండువాఁడు యోగాభ్యాసమునకు తగిన వారలలో శ్రేష్ఠుఁ డగుచున్నాఁడు.

శ్లో. యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. 10

టీ. యోగీ=ఆత్మధ్యానముగలవాఁడు, ఏకాకీ=సహాయము లేనివాఁడయి, యతచిత్తాత్మా=నియమింపఁబడిన మనస్సును దేహమునుగలవాఁడయి, నిరాశీః=ఆశలేనివాఁడై, అపరిగ్రహః = పరిగ్రహములేనివాఁడయి, రహసి = ఏకాంతమందు, స్థితః=ఉన్నవాఁడయి, ఆత్మానం=అంతఃకరణమును, సతతం= ఎల్లప్పుడును, యుంజీత=నిగ్రహించవలయు.

శం. ఆత్మధ్యానముగలయోగి నిశ్చయమనస్సు దేహము గలవాఁడై కోరికలులేనివాఁడై పరిగ్రహశూన్యుఁడై యొంటరిగా రహస్యప్రదేశమునందు నివసించి మనస్సును నిగ్రహింపవలయును.

రామా. కర్మయోగనిష్ఠుఁడు చింతలేనిమనస్సుగలవాఁడై, మమకారమేమాత్రమునులేక జనులులేని నిశ్శబ్దమైన ప్రదేశమున నివసించి ఆత్మావలోకన మాచరింపవలయు ననుట.

మధ్వ. ఇట్టివాఁడె మనస్సును సమాధియోగములో కూడినదై చేయవలయుననుట.

శ్లో. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్. 11

టీ. శుచౌ=పరిశుద్ధమైన, దేశే=స్థానమందు, నాత్యుచ్ఛ్రితం=మిక్కిలిపొడవుగాని, నాతినీచం = మిక్కిలి తక్కువగాని, చేలాజినకుశోత్తరం=వస్త్రచర్మదర్భలు మీఁదుగాఁ గలిగిన, ఆత్మనః=తనకు, ఆసనం=ఆస్తరణమును, స్థిరం=నిశ్చలమగునట్లు, ప్రతిష్ఠాప్య=ఉంచుకొని.

శం. మిక్కిలియెత్తుగానట్టియు, మిగులఁ బల్లముగానట్టియుఁ బరిశుద్ధమైన సమస్థలమున మొదట దర్భాసనము పిదప కృష్ణాజినము వెనుక వస్త్రాసనము ఉంచవలయును.

శ్లో. తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాఽసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే. 12

టీ. తత్ర=ఆ, ఆసనే=స్థిరాసనమందు, ఉపవిశ్య=కూర్చుండి, మనః=మనస్సును, ఏకాగ్రం=నిశ్చలముగా, కృత్వా = చేసి, యతచిత్తేంద్రియక్రియః=నియమింపఁబడిన చిత్తేంద్రియవ్యాపారములుకలిగిన, యోగీ=యోగాభ్యాసకుఁడు, ఆత్మవిశుద్ధయే=అంతఃకరణపరిశుద్ధికొఱకు, యోగం=యోగమును, యుంజ్యాత్=అభ్యసించవలెను.

శం. తర్వాత, ఆయాసనమునందు నిశ్చయబుద్ధితోఁగూడి, చిత్తమును స్థిరముగా నిలిపి యింద్రియవ్యాపారములను నిగ్రహించి యోగాభ్యాసకుఁడు మనశ్శుద్ధికొఱకు యోగము మొదలుపెట్టవలయును.

రామా. మనస్సునకు నైర్మల్యము కలుగఁ జేయునదియు, అపరిశుద్ధవస్తువులు లేనిదగుటచే పవిత్రమైన కుశలు, అజినంబు, వస్త్రము ఒకదానిపై నొక్కటిగల నాయాసనమునం

గూర్చుండి ఆత్మశుద్ధి అనఁగా బంధనివృత్తికొఱకు ఆత్మావలోకనము చేయునదియనుట.

మధ్వా. యోగ మనఁగా సమాధియోగ మనుట.

శ్లో. సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్. 13

టీ. అచలం=నిశ్చలముగా, సమం=సమానముగా, కాయశిరోగ్రీవం=శరీరశిరః కంఠములను, ధారయన్=ధరించుచున్నవాఁడయి, స్థిరః=స్థిరుఁడై, స్వం=తనదైన, నాసికాగ్రం=నాసికాగ్రమును, సంప్రేక్ష్యఇవ=చూచుచుండువానివలె, దిశః=దిక్కులను, అనవలోకయన్=చూడనివాఁడై.

శం. తన దేహమును, మెడను, శిరమును జక్కగా నిలిపి స్థిరచిత్తుఁడై దిశలుచూడక తనకొనముక్కుమీఁదఁ జూపును నిలుపవలయును.

రామా. అచలం స్థిరమ్ అను పాఠముచే, స్థిరముగా ననఁగా చెరుపుకలిగియుండుటచేత స్థిరముగా నిలుపుచునని యర్థము.

శ్లో. ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. 14

టీ. ప్రశాంతాత్మా=మిక్కిలిశాంతమైనమనస్సుగలవాఁడై, విగతభీః=పోఁగొట్టఁబడిన భయముగలవాఁడై, బ్రహ్మచారివ్రతే=బ్రహ్మచర్యవ్రతమందు, అనఁగా స్త్రీసంపర్కాదులులేనివాఁడై, గురుశుశ్రూషచేయుట, భిక్షాన్నముతినుట, వీనియందు, స్థితః=ఉన్నవాఁడై, మనః=మనస్సును, సంయ

మ్య=లెస్సగా నియమించి, మచ్చిత్తః=నాయందుఁ జిత్తముగల వాఁడై, మత్పరః=నన్నే భావించుచు, యుక్తస్సన్=సమాహిత చిత్తుఁడై, ఆసీత=ఉండవలయును.

శం. ఉపరతమైన మనస్సుగలిగి భయహీనుఁడై బ్రహ్మచర్యవ్రతముగలవాఁడై మనస్సును దృఢము జేసికొని నాయందు నిలిపి నన్నే సర్వోత్తమముగాఁ దలఁచి యుండవలయును.

రామా. ప్రశాన్తాత్మా=మిక్కిలి సుఖించుచున్న మనస్సు కలవాఁడు యుక్తుఁ డనగా నవధానము కలవాఁడు.

శ్లో. యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. 15

టీ. నియతమానసః = నియమింపఁబడిన మనస్సుగలిగిన, యోగీ=యోగాభ్యాసకుఁడు, సదా=ఎల్లప్పుడు, ఏవం=ఈచెప్పఁబడినప్రకారముగా, ఆత్మానం=మనస్సును, యుంజన్=సమాధానము చేయుచున్నవాఁడై, నిర్వాణపరమాం=మోక్షమే యుత్కృష్టముగాఁగలిగిన, మత్సంస్థాం=నాయధీనమైన, శాంతిం = సంసారోపరతిని (నెమ్మదిని), అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

శం. ఈప్రకారము నిశ్చయించిన మనస్సుగల యోగి తన మనస్సును సర్వదా స్వాధీనము చేసికొనినవాఁడై సర్వోత్కృష్టమై నాస్వాధీనముగనుండు మోక్షసుఖమును బొందుచున్నాఁడు.

రామా. పరబ్రహ్మంబును పురుషోత్తముఁడ నగు నాయందు మనస్సును చేర్చుచున్నవాఁ డై నా సంపర్కముచే

మనస్సు పవిత్రమగుంగాన నిశ్చలమైన మనస్సుకలవాఁడై ఆత్మ యోగమును చేయువానికి మనోనైర్మల్యమునకై మనస్సును భగవంతునియందుంచిన మోక్షమును బొందుచున్నాఁడనుట.

మధ్వ. నిర్వాణపరమాం = శరీరమును విడిచిన పిమ్మట కలిగెడి నాస్వాధీనముగనుండు మోక్షసుఖమును బొందుచున్నాఁడు.

శ్లో. నా త్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంత మనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున.     16

టీ. హేఅర్జున=ఓ యర్జునుఁడా! యోగః=యోగము, అత్యశ్నతః=అపరిమితముగాభుజించు వానికిని, నాస్తి=లేదు, ఏకాంతం=మిక్కిలి, అనశ్నతశ్చ=భుజింపనివానికిని, నాస్తి=లేదు, అతిస్వప్నశీలస్య=మిక్కిలి నిద్రపోవువానికిని, నాస్తి=లేదు, జాగ్రతః=నిద్ర లేక మేలుకొనియున్నవానికిని, నాస్తి=లేదు.

శం. అర్జునా! ఈయోగము హెచ్చుగాఁ దింజితినువానికిఁ బొత్తిగాఁ దిననివానికి మిగుల నిద్రపోవువానికి బొత్తిగా నిద్రపోనివానికిఁ బ్రాప్తము గా నేరదు. యోగశాస్త్రములోఁ జెప్పినట్లు సగము కడుపు నిండునట్లుగాక అధికముగా తినుట యత్యశనము అనియుం జెప్పవచ్చును - మిగిలిన సగము కడుపులో పాతికెను మాత్రము నీటితో నింపవలసినది - మిగిలిన పాతికెను వెలితిగా నుంచవలసినది అని యోగశాస్త్రము.

మధ్వ. అనశనాదులు శక్తి లేనివానికి కూడదు - శక్తి కలవాఁడు నిద్ర తిండి మొదలగువానిని వదలి కన్నులు మూసు

క్కాని ధ్యానము చేయుచు సిద్ధినిపొందునని నారదీయమునం
దలి వాక్యము ననుసరించినారు.

శ్లో. యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. 17

టీ. యుక్తాహారవిహారస్య - యుక్త=తగిన, ఆహార=అన్న
మును, విహారస్య=సంచారమును గలిగినట్టియు, కర్మసు=కర్మ
ములయందు, యుక్తచేష్టస్య=తగినవ్యాపారము గలిగినట్టియు,
యుక్తస్వప్నావబోధస్య=తగిననిద్రయును మెలఁకువయును గలి
గినట్టియు (పురుషునికి), దుఃఖహా=సాంసారికదుఃఖమును బోఁ
గొట్టునట్టి, యోగః=యోగము, భవతి=అగుచున్నది.

శం. దుఃఖమును పోఁగొట్టునదియైన యీయోగము మి
తాహారము మితసంచారము మితకర్మ మితనిద్ర మితముగా
మేలుకొనుట గల మనుష్యునకే ప్రాప్తమగును.

మధ్వ. యుక్తమనగా ఉపాయముతోఁ గూడినది. ఎంత
మాత్రముచేత శ్రమాదులు లేకపోవునో, అంతమాత్రము ఆ
హారాదులు కలవానికి యీయోగము ప్రాప్తమగు ననుట.

శ్లో. యదా వినియతం చిత్త మాత్మన్యే వావతిష్ఠతే,
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18

టీ. యదా=ఎప్పుడు, చిత్తం=మనస్సు, వినియతంసత్=
లెస్సగానిగ్రహింపఁబడినదై, ఏకాగ్రత్వమును పొందింపఁబడి
నదై, ఆత్మన్యేవ = ఆత్మయందే, అవతిష్ఠతే = ఉన్నదో,
తదా=అప్పుడు, సర్వకామేభ్యః = సమస్తములైన కోరికల

వలనను,నిస్పృహస్సన్=ఆశ లేనివాఁడై, యుక్తఇతి=యోగియ ని, సమాధిని పొందినవాఁడు. ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

శం. ఎప్పుడు మనస్సును స్వాధీనము జేసికొని పరమాత్మా నుసంధానము జేయుచున్నాఁడో అప్పుడు నిష్కాముఁడైన యోగి యని చెప్పఁబడును.

రామా. యుక్తుఁడనఁగా యీయోగమునుపొందినవాఁడు.

మధ్వ. ఆత్మన్యేవ=భగవంతునియందు.

శ్లో. యథాదీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః. 19

టీ. నివాతస్థః=గాలిలేనిస్థలమందున్న, దీపః=దీపము, యథా = ఏప్రకారముగా, నేంగతే=చలించదో, ఆత్మనః = మనస్సుయొక్క, యోగం=సమాధియోగమును, యుంజతః=చేయుచున్న, యతచిత్తస్య = నియమింపఁబడిన యంతఃకరణము కలిగిన,యోగినః=యోగికి, సా=ఆనిష్ఠ, ఉపమా=దృష్టాంతమని, స్మృతా=(యోగశాస్త్రజ్ఞులచేత) చెప్పఁబడెను.

శం. గాలిలేనిచోట నుంచినదీప మెటునటుఁ జలింపక యేకాగ్రముగానుండు విధమే మనోనిగ్రహము కావించి యాత్మయోగము నభ్యసించువానికి దృష్టాంతమైయున్నది.

రామా. ఆత్మయనఁగా నాత్మస్వరూపము, గాలిలేనిస్థలములో నుండుటచేత కదలిక లేక, వెలుగుతోఁగూడిన దీపము వలె, యితరములైన మనోవృత్తు లన్నియు పోవుట చేత యోగి యొక్క ఆత్మ కదలనిదై జ్ఞాన మనెడివెలుఁగుకలదై యుండును.

మధ్వ. భగవంతుని యొక్క (భగవంతునిగూర్చిన) యోగమును చేయుచున్న యోగికి, గాలిలేనిచోట నుంచిన కదలని దీపముసాటి.

శ్లో. యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి. 20

టీ. యత్ర=ఏఅవస్థయందు, చిత్తం=మనస్సు, యోగసేవయా=యోగానుష్ఠానముచేత, నిరుద్ధంసత్=నిగ్రహింపఁబడినదై, ఉపరమతే=ఉపరతినిబొందుచున్నదో, యత్రచ=ఏయవస్థయందు, ఆత్మనా=అంతఃకరణముచేత, ఆత్మానం=పరమాత్మను, పశ్యన్=వీక్షించుచు, ఆత్మన్యేవ=తనయందే, తుష్యతి=ఆనందపడుచున్నాఁడో.

శం. ఏ యవస్థయందు మనస్సు యోగానుష్ఠానముచేత నిగ్రహింపఁబడి యుపరతినిబొందునో యేయవస్థయందు మనస్సుచేతఁ బరమాత్మను దర్శించుచుఁ దనయందే యానందమును బొందునో.

శ్లో. సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్,
వేత్తి యత్ర నచైవాయం స్థిత శ్చలతి తత్త్వతః. 21

టీ. యత్ర=ఏ యవస్థయందు, అతీంద్రియం=ఇంద్రియగోచరముకానట్టి, బుద్ధిగ్రాహ్యం=బుద్ధిచేతగ్రహింపఁదగిన, యత్సుఖం=ఏసుఖము,(కలదో),ఆత్యంతికం=అనంతమైన,తత్=ఆసుఖమును, వేత్తి=తెలియుచున్నాఁడో,యత్ర=ఏయవస్థయందు, స్థితః=ఉన్నట్టి, అయం=ఈయోగి, తత్త్వతః=తత్త్వస్వరూపమునుండి, నచలతి=చలింపఁడో.

శం. ఏయవస్థయందు నింద్రియములకు గోచరముగాక బుద్ధికి గ్రాహ్యమైన బ్రహ్మానందము ననుభవించునో, ఏయవస్థయందు తత్త్వస్వరూపబ్రహ్మానందములో నున్నయోగి చలింపఁడో.

శ్లో. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిౝ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే. 22

టీ. యం=ఏయాత్మలాభమును, లబ్ధ్వా=పొంది, తతః=ఆయాత్మలాభమునకంటె, అపరం=ఇతరమయిన, లాభం=లాభమును, అధికం=అధికముగా, నమన్యతే=తలఁచఁడో, యస్మిౝ=ఏయాత్మతత్త్వమందు, స్థితః=ఉన్నవాఁడు, గురుణా=అధికమైన, దుఃఖేనాపి=దుఃఖముచేతను, నవిచాల్యతే=చలింపఁడో.

శం. ఏలాభమును బొంది యంతకన్ననితరలాభముల నధికముగా నెంచఁడో ఏలాభమును బొందినవెనుక నెంతదుఃఖము వచ్చినను వికారము చెందఁడో.

శ్లో. తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. 23

టీ. తం=ఆపూర్వోక్తమయిన, దుఃఖసంయోగవియోగం=దుఃఖములతోసంబంధము లేకయుండుటను, యోగసంజ్ఞితం=యోగమని సంజ్ఞాతనామధేయము కలదానినిఁగా, విద్యాత్=తెలియవలెను, నిశ్చయేన = నిస్సంశయమైననిర్ణయముచేత, అనిర్విణ్ణచేతసా = దుఃఖపడని చిత్తముచేత, సయోగః=ఆయోగము, యోక్తవ్యః=కూర్పఁదగినది.

శ. ఆలాటి పూర్వోక్తమైన యవస్థ వ్యసనమునకు లోఁబడనిది, దానిని యోగమని యెఱుఁగవలయును. ఆయోగమును నిశ్సంశయమైన మనస్సుచేతను వ్యసనములకు లోఁబడని మనస్సుచేతను నభ్యసించవలయును.

రామా. యోగారంభదశయందుకూడ, యోగము నిట్టిదను నిశ్చయముతోను హర్షముతోఁగూడిన మనస్సుతోను యోగమును నడుపవలయుననుట-యేదైతే సుఖమును కలుగఁజేయునది యని ప్రీతినిచేయుచున్నదో యేదైతే తత్త్వము నుండి చలింపనీయక సుఖాతిశయమును కలిగించునో, దేనిని చాలించుకొనిన యప్పుడును దానిని కోరుచున్నవాఁడై మఱియొకలాభమును తలంపఁడో, దేనిని చేయుచున్నప్పుడు పుత్త్రవియోగాది దుఃఖములుకూడ వానిని చలింపనీయదో దానిని యోగముగాఁ దలంచి అట్టి దానినే యభ్యసింపవలయు ననుట.

మధ్వా. మనస్సుచేత దేహమునందు భగవంతుని చూచుచున్నవాఁడై తత్త్వమునుండి యనగా భగవద్రూపమునుండి దుఃఖసంయోగము దేనిచేత విడుచునో అది పుట్టినదుఃఖమును మాత్రమె నివారించుటకాదు దుఃఖపు పుట్టుకనే నివారించునని సంయోగశబ్దముచే సూచితము.

శ్లో. సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః,
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. 24

టీ. సంకల్పప్రభవాన్=సంకల్పమువలనఁగలిగిన, సర్వాన్=సమస్తములయిన, కామాన్=కోరికలను, అశేషతః=నిశ్శేషముగా, త్యక్త్వా=విడిచి, మనసైవ=మనస్సుచేతనే, ఇంద్రియ

గ్రామం=ఇంద్రియసమూహమును, సమంతతః=అంతటను, వినియమ్య=నిగ్రహించి, యోగః=యోగము, యోక్తవ్యః=కూర్పఁదగినది.

శం. సంకల్పమునలనఁబుట్టిన కోర్కెలను దృఢమైన వివేకముతోఁగూడిన చిత్తముచేత నిశ్శేషముగా అంటులేనిదిగా విడిచి యింద్రియవ్యాపారములను నిగ్రహించి యోగము మొదలుపెట్టవలెను.

మధ్వ. అశేషతః అనుటచే ఒక్కవిషయకామమునుగూడ స్వల్పముగానైనను ఒకానొకప్పుడైనను చేయఁగూడదు.

శ్లో. శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్. 25

టీ. ధృతిగృహీతయా=ధైర్యముచేత గ్రహింపఁబడిన, బుద్ధ్యా=బుద్ధిచేత, మనః=మనస్సును, ఆత్మసంస్థం=ఆత్మయందున్నదానినిఁగా, కృత్వా=చేసి, శనైశ్శనైః=మెల్లమెల్లగా, ఉపరమేత్=ఉపరతినొందించవలెను, కించిదపి=కొంచమైనను, నచింతయేత్=చింతించఁగూడదు.

శం. దృఢమైన బుద్ధిచే మనస్సు నాత్మయందుఁ జొప్పింపఁజేసి మెల్లమెల్లన యుపరతి చెందవలయును. అట్లు చేయుటలో వేఱుచింత కూడదు.

రా. కామములు స్పర్శజము లనియు, సంకల్పజము లనియు ద్వివిధములు. శీతోష్ణాదులు స్పర్శజములు, పుత్త్రుఁడు క్షేత్రము మొదలగునవి సంకల్పజములు. అందు సంకల్పజములతో సంబంధములే దనుకొనుటచేత మనసుచేతనే విడిచియు, తప్పని

వైన స్పర్శజములు తటస్థించినపుడు వానివలన కలుగు సంతోష భయంబుల విడిచియు, సమస్త విషయములనుండి ఇంద్రియములనన్నిటిని మరలించి మెల్లమెల్లగా వివేకవిషయంబగు బుద్ధిచేత ఆత్మకంటె మిగిలినవాని నన్నింటినుండి యుపరతినిపొంది మనస్సును ఆత్మయందే యునిచి దేనిని తలంపకుండునది-అనుట.

మధ్వ. బుద్ధి మనస్సును నిగ్రహించుటయందు ఆత్మరమణము నందును (ఆత్మయందు క్రీడించుటయందు) సాధనము.

శ్లో. యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్,
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. 26

టీ. చంచలం=చంచలమైనది గనుకనే, అస్థిరం=స్థిరముగాని, మనః=మనస్సు, యతఃయతః=ఏయే విషయములయందు, నిశ్చరతి = సంచరించుచున్నదో, తత స్తతః = ఆయావిషయములవలన, ఏతత్=ఈ మనస్సును, నియమ్య=మరల్చి, ఆత్మన్యేవ=తనయందే, వశం=అధీనమును, నయేత్=పొందించవలెను.

శం. చంచలమై అస్థిరమైన మనస్సు ఏయే విషయముల యందుఁ దిరుగుచున్నదో ఆయా విషయములలో నుండి దానిని త్రిప్పించి యాత్మయం దుండునట్లు తన స్వాధీనము చేసికొనవలయును. ఇట్లు యోగాభ్యాసబలమున యోగియొక్క మనస్సు ఆత్మయందె శాంతిని పొందుచున్నది.

రామా. ఆత్మయందు మిక్కుటమైన సుఖమును భావించుటచే మనస్సును వశ్యముగాఁ జేయునది యనుట.

శ్లో. ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్.    27

టీ. ప్రశాంతమనసం=శాంతిబొందిన మనస్సుగలిగిన, శాంతరజసం=క్షీణమైన రజోగుణముగలిగిన (పోయిన మోహాదిక్లేశమును కలవాఁడు), బ్రహ్మభూతం=జీవన్ముక్తుఁడైన (బ్రదుకుచుండియె ముక్తిని చెందినవాఁడు), అకల్మషం=పాపరహితుఁడయిన (ధర్మము (పుణ్యము) మొదలగునవి లేనివాఁడు), ఏనంయోగినం=ఈయోగిని, ఉత్తమం=శ్రేష్ఠమైన, సుఖం=సుఖము, ఉపైతిహి = (తానే) పొందుచున్నదిగదా.

శం. శాంతిఁజెందిన చిత్తము క్షీణించిన రజోగుణము గలిగి జీవన్ముక్తుఁడై పాపరహితుఁడైన యోగిని శ్రేష్ఠమైన బ్రహ్మనందము దనకుదానే బొందుచున్నది.

రామా. ప్రశాన్త మనస్సనగా నాత్మయందు నిశ్చలముగా నునుపఁబడిన మనస్సుఁగలవాఁడును, దానివలననె రజోగుణము లేనివాఁడును, దానివలననె బ్రహ్మభూతుఁడు అనఁగా తన స్వరూపముతో నున్నవాఁడునగు యోగిని ఆత్మానుభవరూపమగు ఉత్తమసుఖము పొందుచున్నది. ఆత్మస్వరూపము ఉత్తమ సుఖరూపమగుట దీనికి హేతువు అనుట.

శ్లో. యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే.    28

టీ. ఏవం=ఈ ప్రకారముగా, సదా=ఎల్లప్పుడు, ఆత్మానం=అంతఃకరణమును, యుంజన్=వశముచేయుచున్న, విగతకల్మషః=పోయిన పాపములుగలిగిన, యోగీ=జ్ఞాని, సుఖేన=అనాయాస

ముచేత, బ్రహ్మ=పరమాత్మను, సంపశ్యన్=లెస్సగాఁజూచుచున్న వాఁడగుచు, అత్యంతం = ఉత్కృష్టమైన, సుఖం=సుఖమును బొందుచున్నాఁడు.

శం. ఈపైఁజెప్పిన తీరున నెల్లకాలములయందు మనస్సును నిలిపి పాపరహితుఁడైన యోగి సులభముగా బ్రహ్మానందమును బొందుచున్నాఁడు.

శ్లో. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాఽఽత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

టీ. సర్వత్ర = సమస్తభూతములయందును, సమదర్శనః= సమదర్శియైనవాఁడు, యోగయుక్తాత్మాసన్ = యోగముతోఁ గూడిన యంతఃకరణముగలవాఁడయి, సర్వభూతస్థం=సమస్త భూతములయందున్న, ఆత్మానం=తన్ను, ఆత్మని=తనయందు, సర్వభూతాని = సమస్తభూతములను, ఈక్షతే = చూచుచున్నాఁడు.

శం. ఎల్లభూతములయందు సమదర్శియైనవాఁడు యోగముతోఁగూడిన మనస్సుగలవాఁడై సమస్తభూతములయందుఁ దన్ను దనయందు సమస్తభూతములను జూచుచుండును.

రామా. యోగముతోఁగూడిన మనస్సుకలవాఁడు, ఆత్మలయందఱియందును జ్ఞానైకాకారులు అనెడి సమబుద్ధికలవాఁడై తనయాత్మను అన్నిభూతములలో నున్నవానిగాను, అన్నిభూతములను తనయాత్మయందున్న వానినిగాను చూచుచున్నాఁడు.

మధ్వ. ఆత్మను పరమేశ్వరుని అన్నిభూతములలో నున్న వానినిగాను, ఆత్మయం దనగా పరమేశ్వరుని యం దన్నిభూతములను, ఆపరమేశ్వరుని, బ్రహ్మ తృణము మొదలగు నన్నిటియందు ఐశ్వర్యము మొదలగు సామాన్యము తోడను చూచుచున్నాఁడనుట.

శ్లో. యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం నప్రణశ్యామి సచ మే నప్రణశ్యతి. 30

టీ. యః=ఎవఁడు, సర్వత్ర = సమస్తభూతములయందు, మాం=నన్ను, పశ్యతి=చూచుచున్నాఁడో, మయి=నాయందు, సర్వంచ=సమస్తమును, పశ్యతి=చూచుచున్నాఁడో, తస్య=వానికి, అహం=నేను, నప్రణశ్యామి = పరోక్షమును బొందను, సచ=వాఁడును, మే=నాకు, నప్రణశ్యతి=పరోక్షమును బొందఁడు.

శం. ఎవఁడైతే సమస్తభూతములయందు నన్నును నాయందు సమస్తభూతములను జూచుచున్నాఁడో వానికి నేను నాకు వాఁడు ప్రత్యక్షస్వరూపులుగా నుందుము. వానికిని నాకును ఆత్మయొక్కటియె. తనయాత్మ తనకుప్రియుఁడేకదా.

రామా. వెనుకటిదశకంటె విపాకదశను పొందినవాఁడు పుణ్యపాపములు వదలి స్వరూపముననున్న ఆత్మవస్తువంతయు నాతో (భగవంతునితో) సమానునిగా చూచుచున్నాఁడు.

మధ్వ. వానికి నేను ఎల్లప్పుడును యోగక్షేమములను వహించిన వాఁడ నగుదును. వాఁడు నాకెల్లప్పుడును భక్తుఁడగును

ఏలికయున్నను వీనిని రక్షింపకున్నచో వీఁడు అనాథుఁడౌ - ఇట్టి భృత్యుఁడు లేనివాఁడౌ అనుట.

శ్లో. సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోపి స యోగీ మయి వర్తతే. 31

టీ. యః=ఏయోగి,ఏకత్వం=అభేదమును,ఆస్థితస్సన్=పొందినవాఁడగుచు, సర్వభూతస్థితం=సమస్తభూతములయందున్న, మాం=నన్ను, భజతే=సేవింపుచున్నాఁడో, సః యోగీ=ఆయోగి, సర్వథా=సర్వప్రకారములచేత, వర్తమానోపి = వర్తించుచున్నవాఁడయ్యును, మయి = నాయందు, వర్తతే=వర్తించుచున్నాఁడు.

శం. ఏ యోగి అద్వైతుఁడై యెల్లభూతములయందు నన్నుఁ బూజించుచున్నాఁడో అట్టివాఁడు అనేక ప్రకారములుగ వర్తించువాఁడైనను నాయందే వర్తించుచున్నాఁడు.

రామా. సంకోచములేని జ్ఞానమె యాకారముగాఁగలవాఁడై, ప్రాకృతభేదములను విడిచినవాఁడై సర్వభూతములయందునున్న,నన్నుయోగదశయందు ఎవ్వఁడుదృఢముగాభజించునో వాఁడు యోగములేని దశయందును, తనయాత్మను సర్వభూతములనును చూచుచున్నవాఁడైనను నాయందె యున్నాఁడు. నన్నెచూచుచున్నాఁడనుట - ఇది వెనుకటిశ్లోకార్థమునకంటె పరిపాకమును పొందినదశ.

మధ్వ. ఏకత్వమును పొందినవాఁడనగా అంతటను ఈశ్వరుఁడు ఒక్కఁడె అని యున్నవాఁడు అన్నిప్రకారముల నున్నవాఁడైనను, నాయందె యున్నాఁడు-అపరోక్షజ్ఞానము కలవా

నికి జ్ఞానఫలము తప్పనిది. అట్లయినను తెలుచుగా నధర్మము చేయఁడు.

శ్లో. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖంవా యదివా దుఃఖం స యోగీ పరమో మతః. 32

టీ. హేఅర్జున=ఓయి అర్జునా! యః=ఎవఁడు, సుఖంవా=సుఖమునైనను, దుఃఖంయదివా=దుఃఖమునైనను,ఆత్మౌపమ్యేన=తన సామ్యముచేత, సర్వత్ర=సమస్తభూతములయందు, సమం=తుల్యమగునట్లుగా,పశ్యతి=చూచుచున్నాఁడో, సఃయోగీ=అజ్ఞాని, పరమః=శ్రేష్ఠుఁడని, మతః=తలఁపఁబడినవాఁడు.

శం. ఓ యర్జునా! ఎవఁడు సర్వభూతసుఖదుఃఖములను తనసుఖదుఃఖములుగాఁ దలఁచునో ఎవ్వనికి ప్రతికూలము చేయక అహింసకుఁడై యుండునట్టి జ్ఞాని నాకు సమ్మతుఁడైనవాఁడనియు అందఱుజ్ఞానులలో నుత్తముఁ డని తెలియుము.

రామా. ఆత్మలందఱును జ్ఞానమే స్వరూపము గాఁగలవారగుటచేత పుత్త్రజన్మాది సుఖంబును, పుత్త్రమరణాదిదుఃఖంబును ఆత్మలకు సంబంధింపవని యెవ్వఁడు తలంచునో,అనఁగా మఱి యొకనికి కలిగిన పై సుఖదుఃఖములట్టివి తనదిగాఁ దలంచునో వాఁడు యోగచరమావధిని పొందినవాఁడు.

అర్జున ఉవాచ.—

శ్లో. యోఽయంయోగస్త్వయాప్రోక్తస్సామ్యేన మధుసూదన,
ఏతస్యాహం నపశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్. 33

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హే మధుసూదన=ఓ శ్రీకృష్ణస్వామీ! త్వయా=నీచే, సామ్యేన = మనస్సమాధానముచేత, యోఽయంయోగః =

ఏయోగము, ప్రోక్తః=చెప్పఁబడెనో, అహం=నేను, చంచలత్వాత్=చంచలమగుటవలన, ఏతస్య=ఈయోగమునకు, స్థిరాం=చలించని, స్థితిం=నిలుకడను, నపశ్యామి=కానను.

శం. ఓ మధుసూదనా! నీవు చెప్పిన సమత్వమనెడి యోగము అసాధ్యముగా నున్నది. మనస్సు నిలుకడలేనిది గావున నీ యోగముయొక్క స్థిరమైనస్థితి నాకుఁ దెలియలేదు.

రామా:— దేవతలు మనుష్యులు అను భేదంబును జీవుఁడు ఈశ్వరుఁడు అనెడు భేదంబును చాలకాలమునుండి అనుభవింపఁబడు చుండుటచే, జ్ఞానైకస్వరూపు లగుటచే జీవులందఱును సములనియు, కర్మవశ్యులు కాకుండుటచే ఈశ్వరునితో సములనితలంచుట యనెడి నీచే చెప్పఁబడిన యోగము స్థిరపడుట సంభవింపదని తోఁచుచున్నది.

శ్లో. చంచలం హి మనః కృష్ణ ప్రమాథిబలవ ద్దృఢమ్,
తస్యాహం నిగ్రహంమన్యే వాయోరివ సుదుష్కరమ్. 34

టీ. హేకృష్ణ=ఓకృష్ణస్వామీ! మనః=మనస్సు, చంచలం=చంచలమైనదియును, ప్రమాథి=క్షోభపెట్టునదియును, బలవత్=నిగ్రహింప శక్యముగానిదియును, దృఢంహి=దృఢమైనదియునుగదా, అహం=నేను, తస్య=ఆమనస్సుయొక్క, నిగ్రహం=నిరోధమును, వాయోః=వాయువుయొక్క, నిగ్రహమివ=నిగ్రహమువలెనే, సుదుష్కరం=మిక్కిలి చేయనశక్యమైనదానినిగా, మన్యే=తలఁచుచున్నాను.

శం. కృష్ణా! మనస్సు మిగులఁ జంచలమైనదియుఁ జిక్కులుపెట్టునదియు స్వాధీనము కానిదియుఁగదా! నే నిట్టిమనస్సును

నిగ్రహించుట గాలిని నిగ్రహించుటవలెఁ జేయ నలవికాని దానిఁగాఁ దలఁచుచున్నాను.

రామా. తనకు అలవాటు పడిన విషయములలోఁ గూడ నిలుకడలేనిదైన మనసును అట్టిదికాని ఆత్మస్వరూపమున నిలుపుటను ఎదురుగాలిని విసనకఱ్ఱ మొదలగుదానితో నిలుపుట కసాధ్యమునుగాఁ దలంచెదను. మనోనిగ్రహోపాయమును ఓకృష్ణా! చెప్పుమనుట.

శ్రీభగవాన్ ఉవాచ.—

శ్లో. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే. 35

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హేమహాబాహో=భుజబలశాలివైన, హేకౌంతేయ= ఓయర్జునుఁడా! మనః=మనస్సు, చలం=చలనమయినదియును, దుర్నిగ్రహం=నిగ్రహింపశక్యముగానిదియును, అసంశయం= (ఈయర్థమందు) సంశయములేదు, (అలాగైన), అభ్యాసేనతు= ఆత్మానుసంధానముచేత, వైరాగ్యేణచ=వైరాగ్యముచేతను, గృహ్యతే=గ్రహింపఁబడుచున్నది.

శం. అర్జునా! మనస్సు చంచలమైనదియు, నిగ్రహింప శక్యముగానిదియు అనుటకు సంశయము లేదు. అట్లుండినను ఆత్మానుసంధానాభ్యాసముచేతను వైరాగ్యముచేతను అనఁగా విషయములందు దోషమును తెలిసికొనుచుండుటచే నట్టివాని యందలి నిరాశచేతను, అట్టి మనస్సును స్వాధీనము చేసికొనవచ్చును.

రామా. ఆత్మ, గుణస్వరూపముగుటను, అభ్యసించుటచే నాత్మయందు గలిగిన యాభిముఖ్యముచేతనును, ఆత్మకంటె మిగిలినవాటియందు దోషాకారత్వమును తెలిసికొనుటచేఁ గలిగిన వైతృష్ణ్యము (నిరాశ)వల్లను ఒకానొక విధమున మనస్సు గ్రహింపఁబడును.

మధ్వ. ఒక్కప్పుడును మనస్సు స్వాయముగా నిగ్రహింపఁబడదు.

శ్లో. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనాతు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 36

టీ. అసంయతాత్మనా=మనోనిగ్రహము చేయనివానిచేత, యోగః=యోగము, దుష్ప్రాపః=పొందశక్యముగానిది, యతతా=యత్నముజేయుచున్న, వశ్యాత్మనా=అభ్యాసవైరాగ్యములచేత, స్వాధీనమనస్సుగలవానిచేత, ఉపాయతః=ఉపాయమువలన, అవాప్తుం=పొందుటకు, శక్యః=శక్యమైనది, ఇతి=అని, మే=నాయొక్క, మతిః=అభిప్రాయము.

శం. చిత్తస్వాధీనము లేనివానికి యోగము అసాధ్యము. చిత్తస్వాధీనము గలవాఁడు తగినయుపాయములచేతఁ బ్రయత్నపడి యోగికావచ్చునని నా అభిప్రాయము.

అర్జున ఉవాచ.—

శ్లో. అయతి శ్శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. 37

అర్జునుఁడు పలుకుచున్నాఁడు.—

టీ. హేకృష్ణ = ఓకృష్ణస్వామీ! శ్రద్ధయా = ఆసక్తితో, ఉపేతః=కూడుకొన్నవాఁడయ్యును, అయతిః=నియమము లేని

వాఁడును, యోగాత్=యోగమువలన, చలితమానసః = చ
లించిన మనస్సుగలవాఁడై, యోగసంసిద్ధిం=యోగఫలమును,
అప్రాప్య=పొందక, కాంగతిం = ఏస్థితిని, గచ్ఛతి = పొందు
చున్నాఁడు?

శం. ఓయి కృష్ణా! యోగమునందు శ్రద్ధయు, ప్రయత్న
ములు గలిగియు, నియమము లేక పోయినందుచేఁ జంచల
మనస్సు గలిగినచో వానికి యోగఫలము లేకపోవుచున్నది
గదా, అట్టివానిగతి యేమి యగుచున్నది. యోగాభ్యాస
మును అంగీకరించుటచేత ఇహలోక పరలోకముల రెంటిని
పొందఁదగిన కర్మములు విడువఁ బడినవి-యోగసిద్ధికి ఫలమై
మోక్షసాధనమైన మంచిజ్ఞానము పొందఁ బడలేదు. ఇట్టి
యోగి, మరణ కాలమున యోగమార్గమునుండి తప్పిన చిత్త
ము కలవాఁడు ఏగతిని పొందును?

రామా. శ్రద్ధచేత యోగమున ప్రవర్తించిన వాఁడు మి
క్కిలి దృఢమైన యభ్యాసమనెడి యత్నములేని వాఁడై యోగ
సిద్ధిని పొందక యోగమునుండి చలించిన మనస్సు కలవాఁడై
యేమగును?

శ్లో. కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి. 38

టీ. హే మహాబాహో=ఓశ్రీకృష్ణస్వామి! బ్రహ్మణః =
పరమాత్మయొక్క, పథి=మార్గమందు, విమూఢః=మూఢుఁడైన
పురుషుఁడు, అప్రతిష్ఠస్సన్ = నిరాశ్రయుఁడైనవాఁ డగు
చు, ఉభయవిభ్రష్టః = కర్మజ్ఞానమార్గములనుండి జారినవాఁ

డై, ఛిన్నాభ్రమివ=చెదరిన మేఘమువలె, న నశ్యతికచ్చిత్ = చెడిపోఁడా యేమి?

శం. ఓయి కృష్ణా! పరమాత్మానుసంధానము జేయలేని మూఢుఁడు నిరాశ్రయుఁడై కర్మ జ్ఞానమార్గముల రెండింటి యందు భ్రష్టుఁడై చెదరిపోయిన మేఘమువలె చెడిపోవక యుండునా యేమి?

రామా. స్వర్గాది సాధనమైన కర్మము, వీనికి ఫలాభిసంధి లేకపోవుట చేత తనఫలములు కలుగఁ జేసి వీనికి ఆధారము కాదుగాన ఈ యోగి అప్రతిష్ఠుఁ డనఁబడుచున్నాఁడు. వీఁడు తనచే నారంభింపఁబడిన బ్రహ్మ మార్గమునుండి తప్పిన వాఁడు గూడఁగాన ఉభయవిభ్రష్టుఁ డనఁ బడుచున్నాఁడు. మేఘపు తునియ ఒక గొప్పమేఘమునందుండి విడివడినదై రెండవ మేఘమునుచేరకయె నడుమ నశించునట్లు ఈయోగి భ్రష్టుఁడు కాఁడా? అనుట.

శ్లో. ఏతం మే సంశయం కృష్ణ చ్ఛేత్తు మర్హస్య శేషతః,
త్వ దన్య స్సంశయ స్యాస్య చ్ఛేత్తా న హ్యుపపద్యతే. 39

టీ. హే కృష్ణ=ఓకృష్ణస్వామీ! త్వం=నీవు, మే=నాయొక్క, ఏతంసంశయం = ఈసందేహమును, అశేషతః=మిగతలేనట్లు, ఛేత్తుం=పోఁగొట్టుటకొఱకు, అర్హసి=తగుదువు. అస్య సంశయస్య = ఈసంశయముయొక్క, ఛేత్తా=పోఁగొట్టెడివాఁడు, త్వదన్యః=నీకంటెనితరుఁడు, న ఉపపద్యతేహి=దొరకఁడుగదా.

శం. ఓయి కృష్ణా ! నాకుఁ గలిగిన యీసంశయమును నిశ్శేషముగా నివర్తింపఁజేయుటకు నీవే తగుదువు. ఈసంశయమును బోఁగొట్టుటకు నీవు దక్క మఱియొకఁడు దొరకఁడు.

రామా. స్వయముగా నన్నిటిని ప్రత్యక్షముగా నొక్కసారెచూచువాఁడవగు నీకంటె నితరుఁడు మఱియొకఁడు దొరకఁడు. కాఁబట్టి ఓయి కృష్ణా! నాకు కలిగినయీసంశయమును నిశ్శేషముగా నివర్తింపఁ జేయుము.

శ్రీభగవాన్ ఉవాచ:—

శ్లో. పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
నహి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి. [ట్టు]
[మైనవి]

కృష్ణస్వామి చెప్పుచున్నాఁడు.—

టీ. హే పార్థ=ఓ యర్జునుఁడా! తస్య=ఆయోగభ్రష్టున్, వినాశః=నాశము, ఇహచ = ఈలోకమందును, నైవ. 43
లేదు, అముత్రచ=పరలోకమందును, న=లేదు. హే
తండ్రీ! కల్యాణకృత్=శుభముచేసినవాఁడు, కశ్చిదపి [లమందు,]
ను, దుర్గతిం=కుత్సితస్థానమును, నగచ్ఛతిహి=పొందఁడుగ [యో]

శం. ఓయి అర్జునా ! అట్టి యోగభ్రష్టునకు నిహపరలోకములయందు నాశములేదు. నాయనా మంచిచేసినవాఁడు ఒకప్పుడును దుర్గతి నొందఁడు.

రామా. శ్రద్ధతో యోగము నారంభించి యోగమునుండి తప్పిన వానికి, వినాశము అనఁగా స్వర్గాదిభోగముల ననుభవించుటలోగానీ బ్రహ్మానుభవంబునగానీ తాను కోరినది దొరకక పోవుటయు, ప్రత్యవాయము కలుగుటయు లేదు.

శిష్యుఁడును పుత్రునివంటి వాఁడు కాఁబట్టి తండ్రీయని యర్జునుని పిలుచు చున్నాఁడు.

శ్లో. ప్రాప్య పుణ్యకృతాఀ లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

టీ. యోగభ్రష్టః=యోగమునుండిజారినవాఁడు, పుణ్యకృతాం=పుణ్యముచేసినవారియొక్క, లోకాఀ=లోకములను, ప్రాప్య=పొంది, శాశ్వతీః=అనేకములైన, సమాః = సంవత్సరములు, ఉషిత్వా=వసించి, శుచీనాం=సదాచారవంతులైన, శ్రీమతాం=శ్రీమంతులయొక్క, గేహే=గృహమునందు, అభిజాయతే=పుట్టుచున్నాఁడు.

తా. యోగభ్రష్టుఁడు పుణ్యముచేసినవారి లోకములను బొంది అనేకవత్సరములు వసించి సదాచారవంతుఁడై శ్రీమంతుల గృహమునందుఁ బుట్టుచున్నాఁడు.

రామా. ఎట్టిభోగమును కోరుటచే యోగమునుండి చెడునో అట్టిభోగములను యోగమహిమచేతనే అనుభవించి భోగములయందలి యాశపోయినతోడనె యోగారంభమును చేయుటకు తగినవారియింట పుట్టుచున్నాఁడనుట.

శ్లో. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్, 42

టీ. అథవా=అట్లుకాదేని, ధీమతాం=నిశ్చయాత్మకబుద్ధిగలిగిన, యోగినాం=యోగులయొక్క, కులే=వంశమందు, భవతి=పుట్టుచున్నాఁడు. ఈదృశం=ఇట్టి, యదేతజ్జన్మ=ఏజన్మము, లోకే=లోకమునందు, దుర్లభతరంహి= మిక్కిలిదుర్లభమైనదిగదా.

శం. అట్లుగాకపోయిన నట్టి యోగభ్రష్టుఁడు నిశ్చయాత్మక బుద్ధిగల యోగులవంశమునందుఁ బుట్టుచున్నాఁడు. ఇట్టిజన్మము కలుగుట లోకమునం దతిదుర్లభమని యెఱుఁగుము. అథవా అనుటచేత దరిద్రులగు యోగులవంశమున.

రామా. పరిపక్వమైనయోగము కలవాఁడై చలించనేని యోగమునుచేయువారును, స్వయముగానె యోగము నుపదేశించువారును అగువారివంశమునఁ బుట్టుచున్నాఁడు, వెనుక శ్లోకమునచెప్పఁబడిన యోగమునకు తగినవారియింటఁ బుట్టుటయు ఈశ్లోకమునఁజెప్పఁబడిన యోగముకలవారియింటఁ బుట్టుటయుఁ గూడ లోకమున ప్రాకృతులకు మిక్కిలిదుర్లభమైనవి అనుట.

శ్లో. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతేచ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన. 43

టీ. హే కురునందన=ఓయర్జునా! తత్ర=ఆయోగికులమందు, పౌర్వదైహికం=పూర్వదేహమందుబుట్టిన,తం=ఆ,బుద్ధిసంయోగం=బుద్ధితోఁగూటమిని, లభతే=పొందుచున్నాఁడు, తతః=ఆ పూర్వసంస్కారమువలన భూయశ్చ=తిరిగియు, సంసిద్ధౌ=జ్ఞానసిద్ధినిమిత్తమై, యతతే=ప్రయత్నముచేయుచున్నాఁడు.

శం. అర్జునా! పైనచెప్పిన ప్రకారము యోగికులమునందుఁ బుట్టి పూర్వజన్మమునందు సంపాదించిన యాత్మానాత్మ వివేకజ్ఞానమును బొందుచున్నాఁడు. పూర్వసంస్కారమువలన జ్ఞానసిద్ధి నిమిత్తమై మరల ప్రయత్నము చేయుచున్నాఁడు. యోగాభ్యాసమువలన కలిగినసంస్కారముకంటె బలవత్తరమైన అథ

ర్మాదికర్మము చేయఁబడకుండెనేని యోగాభ్యాససంస్కారముచే నీయోగభ్రష్టుఁడు హరింపఁబడుచున్నాఁడు. బలవత్తరమైన అధర్మమే చేయఁబడినయెడను అధర్మముచేతనే యోగపుసంస్కారము తిరస్కరింపఁబడుచున్నది. ఆయధర్మము క్షయించిన పిమ్మట ఎంతకాలమయ్యెను తిరిగి యోగసంస్కారము కార్యకరమగును.

రామా. తత్ర=ఆజన్మమున, తతః=అటపైని నిద్రపోయిలేచినట్లు వెండియు సిద్ధివిషయమున విఘ్నములచేనడ్డపడకుండునట్లు ప్రయత్నముచేయుచున్నాఁడు. ఈయోగమాహాత్మ్యము (హి) ప్రసిద్ధమేకదా ?

శ్లో. పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. 44

టీ. తేన=ఆ, పూర్వాభ్యాసేనైవ=పూర్వజన్మాభ్యాసముచేతనే, సః= ఆయోగభ్రష్టుఁడు, అవశోపి= అవశమనస్కుఁడైనను, హ్రియతే = విషయములవలన నివర్తించుచున్నాఁడు, యోగస్య=యోగముయొక్క స్వరూపమును, జిజ్ఞాసురపి= తెలియ నిచ్ఛగించినవాఁడును, శబ్దబ్రహ్మ=వేదోక్తకర్మానుష్ఠానఫలమునకు, అతివర్తతే=అతిక్రమించుచున్నాఁడు.

శం. పైనజెప్పిన యోగభ్రష్టుఁడు స్వాధీన మనస్సు లేనివాఁడైనను తనపూర్వజన్మాభ్యాసముచేత నింద్రియవిషయములలోనుండి నివృత్తుఁడగుచున్నాఁడు. యోగస్వరూపమును దెలియఁగోరినవాఁడును వేదోక్త కర్మానుష్ఠానఫలములకు నతిక్రమించినవాఁడని యెఱుఁగుము.

రా. యోగమునఁ బ్రవర్తింపకపోయినను యోగముందెలి యఁగోరి దానినుండి తప్పినమనస్సుకలవాఁడు వెండియును ఆకో రికనె పొంది కర్మయోగము మొదలగు యోగాచరణచేసి, శబ్దబ్రహ్మము నతిక్రమింపుచున్నాఁడు. శబ్దబ్రహ్మము అనఁగా దేవుఁడు, భూమి, ఆకాశము, స్వర్గము అనియిట్లు శబ్దములచేఁ చెప్పఁబడఁదగినదైన ప్రకృతి దానినతిక్రమించుట యనఁగా ప్ర కృతిబంధమువదలినవాఁడై దేవమనుష్యాది శబ్దములచేఁ జెప్పఁ దగని జ్ఞానానందైకస్వరూపమైన యాత్మనుపొందుననుట.

మధ్వ. నాకు యోగము తెలియవలయునని మిక్కిలికోరికఁ గలవాఁడు కూడ (శబ్దబ్రహ్మ) పరబ్రహ్మమున (అతివర్తతే) పొందుచున్నాఁడనుట.

శ్లో. ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్.　　45

టీ. యోగీ=జ్ఞాననిష్ఠుఁడు, ప్రయత్నాత్=ప్రయత్నమువలన, యతమానస్తు=యత్నముచేయుచున్నవాఁడై, తతః=పిమ్మట, సంశుద్ధకిల్బిషః=పరిశుద్ధినిపొందినపాపముగలవాఁడై, అనేకజ న్మసంసిద్ధః=అనేకజన్మసంస్కారమువలన సిద్ధుఁడై, తతః=ఆపిద ప, పరాంగతిం=ఉత్కృష్టగతిని, యాతి=పొందుచున్నాఁడు.

శం. జ్ఞాననిష్ఠుఁడు పరబ్రహ్మైక్యమునకుఁ బ్రయత్నములు చేయుచున్నవాఁడై పాపవిముక్తుఁడై యనేక జన్మసంస్కారము లవలనఁ బరిశుద్ధుఁడై తర్వాత, సర్వోత్కృష్టమైన మోక్షము ను బొందుచున్నాఁడు.

రామా. యోగమాహాత్మ్య మిట్టిదికావున అనేక జన్మముల యం దుపార్జింపఁబడిన పుణ్యసముదాయములచేత పాపములు లేనివాఁడై యత్నము చేయుచున్నయోగి చలించినను తిరిగి పరమగతిని పొందును.

మధ్వ. తెలియఁగోరినవాఁడు తెలిసికొని ప్రయత్నముం జేయును. ఇట్లు అనేకజన్మములచే సిద్ధినిపొందినవాఁడై అపరో క్షజ్ఞానియై గొప్పగతిని పొందుచున్నాఁడు.

శ్లో. తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున. 46

టీ. హే అర్జున=ఓ యర్జునుఁడా! యోగీ=యోగి, తపస్విభ్యః=కృచ్ఛ్రాదితపస్సులుగలవారికంటెను, అధికః=శ్రేష్ఠుఁడు, జ్ఞానిభ్యోపి=శాస్త్రార్థపాండిత్యము గలవారికంటెను, అధికః=శ్రేష్ఠుఁడు, కర్మిభ్యశ్చ=కర్మముగలవారలకంటెను, అధికః=శ్రేష్ఠుఁడని, మతః=తలఁపఁబడినవాఁడు, తస్మాత్=ఆకారణము వలన, త్వం=నీవు, యోగీ=యోగివి, భవ=అగుము.

శం. ఓయి అర్జునా! యోగియైనవాఁడు తపస్విలకంటెను శాస్త్రార్థపాండిత్యము గలవారికంటెను కర్మనిష్ఠులకంటెను నధికుఁడు. ఆకారణమువలన నీవు యోగివి కమ్ము.

రామా. కేవల తపస్సులచేతను, ఆత్మజ్ఞానములు కాక మిగిలిన జ్ఞానములచేతను, కేవలమగు అశ్వమేధాదికర్మలచేతను, ఏయే పురుషార్థము సాధింపఁబడునో వానియన్నిటికన్న అధికమైనపురుషార్థమును సాధించునది యోగము. కాఁబట్టి నీవు యోగివి కమ్ము. ఓ అర్జునా!

మధ్వ. జ్ఞానులనగా యోగజ్ఞానులు. తపస్వులనగా కృచ్ఛ్రము మొదలగువానిని యాచరించువారు. గోమూత్రాదుల భక్షించి యుపవసించుట కృచ్ఛ్రము.

శ్లో. యోగినామపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః.

టీ. యః=ఎవఁడు, శ్రద్ధావాన్ = విశ్వాసముగలవాఁడై, మాం=నన్ను, మద్గతేన=నాయందు ఆసక్తమైన, అంతరాత్మనా=అంతఃకరణముచేత, భజతే=సేవించుచున్నాఁడో, సః=వాఁడు, సర్వేషాం=సమస్తములైన, యోగినామపి=యోగులలోపలను, యుక్తతమః=శ్రేష్ఠుఁడని, మే=నాకు, మతః=సమ్మతుఁడు.

శం. ఎవఁడయితే విశ్వాసముగలిగి నన్నాశ్రయించి మనస్సుచేత సేవించుచున్నాఁడో, వాఁడు సమస్తయోగులలో శ్రేష్ఠుఁడని నా మతము. అనఁగా శివుఁడు, ఆదిత్యుఁడు మొదలగువారిని ధ్యానముచేయువారి యందఱిలోపలను వాసుదేవుఁడనైన నాయందు సమాహితమైన అంతఃకరణముతో నన్ను సేవించువాఁడు మిక్కిలి యుక్తుఁడు.

రామా. వెనుక (29, 30, 31, 32 శ్లో) నలుగురు యోగులు చెప్పఁబడిరి. వీరందఱును ప్రత్యగాత్మను (జీవుని) చూచువారు. వారికంటెను పరవిద్య (భగవదుపాసనము) నాచరించువాఁడు గొప్పవాఁడు. అని యీశ్లోకము ప్రతిపాదించుచున్నది. ఆవగింజలు వానిలోఁ బరస్పరము హెచ్చు తగ్గులున్నను మేరుపర్వతముంబట్టి క్రొద్దివగుటలో నెట్లుతుల్యములో అట్లు యోగము· తపస్సు మొదలగువానిలో నన్యోన్యతారతమ్య

మున్నను పరవిద్యకంటె తక్కువగుటలో నన్నియు సమానము లె. అంతరాత్మయనఁగా బాహ్యములును ఆభ్యంతరములును అగుప్రవృత్తి విశేషములకు ఆశ్రయమగుమనస్సు. నాయందు ప్రీతిఁ గలవాఁడగుటచేత నన్ను విడిచి యాత్మను నిలిపికొన లేఁడుగాన నన్నుఁజేరినమనస్సుతో శ్రద్ధావంతుఁడై ఒకక్షణమైనను నన్నువిడిచియుండ లేకపోవుటచేత నన్ను పొందుటకైన ప్రవృత్తియందు త్వరకలవాఁడై ఎవ్వఁడు నన్ను ఉపాసించుచున్నాఁడో వాఁ డందఱికంటె శ్రేష్ఠుఁడని తలఁచుచున్నాను.

మధ్వ. తపస్సులకంటెను యజ్ఞాదికర్మములకంటెను ధ్యానయోగము విశేషించుచున్నది. ఆధ్యానములలోఁగూడ ఆదిశేషుఁడు లక్ష్మి బ్రహ్మ శివుఁడు మొదలగువారి ధ్యానముకంటె విష్ణువుయొక్కధ్యానము శ్రేష్ఠము. ధ్యానముకంటె జ్ఞానము శ్రేష్ఠము. కేవల జ్ఞానముకంటె ధ్యానముతోఁగూడిన ధ్యానము శ్రేష్ఠము. ధ్యానముకంటె దర్శనము, దర్శనముకంటె భక్తికంటె సాధనము లేనేలేదు.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే ఆత్మసం
యమ యోగోనామ షష్ఠోఽధ్యాయః.

ఉపనిష దర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునుల సంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయం దాత్మసంయమ యోగ
మనెడి షష్ఠాధ్యాయము.

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## వి జ్ఞా న యో గః.



శ్రీభగవాన్ ఉవాచ:—

శ్లో. మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు.

శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.—

టీ. హే పార్థ=ఓయి అర్జునుఁడా! మయి=నాయందు, ఆసక్తమనాః =తగిలినమనస్సుగలవాఁడవై, యోగం=యోగమును, యుంజన్=చేయుచున్నవాఁడవై, మదాశ్రయః=నేనే ఆశ్రయముగాఁ గలవాఁడవై, సమగ్రం=సకలగుణపరిపూర్ణుఁడైన, మాం=నన్ను,యథా=ఏప్రకారముగా, అసంశయం=సందియములేనట్లు, జ్ఞాస్యసి = తెలియఁగలవో, తత్=ఆజ్ఞానమును, శృణు=వినుము.

శం. అర్జునా! నాయందు చిత్తమునునిలిపి నన్నాశ్రయించి యోగాభ్యాసము చేయుచు సంపూర్ణుఁడైన (విభూతి, బలము,శక్తి, ఐశ్వర్యముమొదలగు వానితోఁగూడిన)నన్ను నిస్సంశయముగా నెట్లు ఎఱుఁగుదువో దానిని వినుము.

రామా. ఆసక్తమనస్సు అనఁగా నా స్వరూపము గుణములు నావ్యాపారములు నావిభూతి వీనితో విశ్లేషము గలి

గినచో తత్ క్షణమె నిలువలేని స్వభావము కలవాఁడగుటచే నాయందు దృఢముగా తగులుకొనిన మనస్సుకలవాఁడు. యోగము నాచరించు వాఁడనఁగా యోగాచరణమునకు ప్రవర్తకుఁడు. యోగమునకు విషయమైన నన్ను ఎట్లు తెలిసికొనునో ఆజ్ఞానమును వినుము.

మధ్వ. ఆసక్తమనస్సు అనఁగా మిక్కిలి స్నేహముతోఁ గూడిన మనస్సు కలవాఁడు-నేను ఆశ్రయముగాఁగలవాఁడు అనఁగా భగవంతుఁడే నాచేత నన్నిటిని చేయింపు చున్నాఁడు, వాఁడె నాకు శరణము, రక్షకుఁడు, వానియందు నేను ఉన్నాఁడను అనియున్నవాఁడగు నీకు నన్ను నిస్సంశయముగా నెట్లు ఎఱుంగదగునో చెప్పెదను వినుమనుట.

శ్లో. జ్ఞానం తేఽహం స విజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యత్ జ్ఞాత్వా నేహభూయోన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే.2

టీ. అహం=నేను, సవిజ్ఞానం = అనుభవజన్యజ్ఞానముతోఁ గూడిన, ఇదంజ్ఞానం=ఈశ్రవణజన్యజ్ఞానమును, అశేషతః=సాకల్యముగా, తే=నీకొఱకు, వక్ష్యామి=చెప్పఁగలను, యత్=దేనిని, జ్ఞాత్వా=ఎఱిఁగి, ఇహ=ఈమోక్షవిషయమై, భూయః=తిరిగిన్ని, జ్ఞాతవ్యం=తెలియఁదగినది, అన్యత్=మఱియొకటి, నావశిష్యతే=మిగిలియుండదో.

శం. నీకొఱకు ననుభవజ్ఞానముతోఁగూడిన శాస్త్రీయజ్ఞానమును సవిస్తరముగా నేనుజెప్పెదను. ఈజ్ఞానమును దెలిసికొంటివేని తెలిసికొనఁదగిన వేఱువిషయ మేదియును లేకపోవు చున్నది.

రామా. విజ్ఞానము అనఁగా భగవంతుఁడు మిగిలిన చేతనా చేతనము లన్నిటికంటె విలక్షణుఁడను జ్ఞానము-నీకొఱకు పై భగవద్విషయమైన జ్ఞానముతోఁగూడిన శాస్త్రీయజ్ఞానమును సవిస్తరముగా నేను చెప్పెదను - ఇదియ ముఖ్యముగా నన్నింటికంటె తెలియఁదగినది.

మధ్వ. ఈజ్ఞానమనఁగా నన్ను గుఱించిన జ్ఞానము. విజ్ఞానమనఁగా విశేషజ్ఞానము.

శ్లో. మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
　　యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః. 3

టీ. మనుష్యాణాం = మనుష్యులయొక్క-, సహస్రేషు = సహస్రములయందు, కశ్చిత్ =ఒకానొకఁడు, సిద్ధయే=ఆత్మసిద్ధికొఱకు, యతతి = యత్నముచేయుచున్నాఁడు, యతతామపి = యత్నము చేయుచున్నవారలలోను, సహస్రేషు = సహస్రములయందు, కశ్చిత్ =ఒకానొకఁడు, మాం=నన్ను, తత్త్వతః = యథార్థమువలన, వేత్తి = తెలియుచున్నాఁడు.

శం. వేలజనులలో జ్ఞానసిద్ధికొఱకు ఒకఁడు ప్రయత్నము చేయుచున్నాఁడు. యత్నముజేసినట్టి సిద్ధులలో నొకఁడుమాత్రమే నన్ను నిశ్చయముగా నెఱుఁగుచున్నాఁడు. మోక్షముకొఱకు మోక్షమార్గమునఁ బ్రవర్తింపు చున్నవారు సిద్ధిని పొందినవారె కదా.

రామా. మనుష్యులనఁగా శాస్త్రమును అధికరించుటకు (నేర్చుకొనుటకు) తగినవారు - సిద్ధివఱకు ప్రయత్నముచేయు వారి వేలలో ఒకానొకఁడె నన్ను తెలిసికొని నావలన సిద్ధిగొ

అకు ప్రయత్నముసేయుచున్నాఁడు. నన్ను తెలిసికొను వారి వేలలో నొకానొకఁడె నన్ను యథాస్థితిగా నెఱుంగువాఁడు. ఎవ్వఁడు నెఱుంగఁడనుట.

మధ్వ. ఈశ్లోకమువల్ల జ్ఞాన దుర్లభత్వము స్పష్టపఱుపఁబడినది.

అవ. తనస్వరూపమును జెప్పుచున్నాఁడు.

శ్లో. భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. 4

టీ. భూమిః=పృథివితన్మాత్రగంధగుణమున్ను, ఆపః=ఉదకతన్మాత్రరసగుణమున్ను, అనలః=అగ్నితన్మాత్రరూపగుణమున్ను, వాయుః=వాయుతన్మాత్రస్పర్శగుణమున్ను, ఖం=ఆకాశతన్మాత్రశబ్దగుణమున్ను, మనః=మనస్సున్ను, బుద్ధిరేవచ=బుద్ధిన్ని, అహంకారః=అహంకారమున్ను, ఇతి=ఇవి, మే=నాయొక్క, ఇయం=ఈచెప్పఁబడిన, ప్రకృతిః=మాయాశక్తి, అష్టధా=ఎనిమిదివిధములుగా, భిన్నా=భేదమును పొందినది.

శం. భూమి, నీళ్లు, అగ్ని, వాయువు, ఆకాశము, చిత్తము, బుద్ధి, అహంకారము అని నామాయ యెనిమిదిభేదములుగానున్నది. తన్మాత్రయనగా సూక్ష్మభూతములు. బుద్ధిశబ్దము చేత నహంకారమునకు కారణభూతంబైన మహత్తత్త్వంబును, అహంకారశబ్దము చేత నవిద్యతోఁ గూడిన యవ్యక్తంబును చెప్పంబడును. ఈప్రకృతి నాయొక్క ఈశ్వరమాయాశక్తి.

రామా. ఈవిచిత్రమైన జగత్తుయొక్క ప్రకృతి మూలము పంచభూతములును, మనస్సు మొదలగు నింద్రియములును,

మహదహంకారములను నది యెనిమిది విధములు గలది. అది నాయది యనుట.

మధ్వ. వెనుక ప్రతిజ్ఞ చేయఁబడిన జ్ఞానము చెప్ప నారంభింపఁబడినది. మహత్తత్త్వమునకు అహంకారముననె యంతర్భావము.

శ్లో. అపరేఽయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్.5

టీ. హే మహాబాహో=ఓయి అర్జునుఁడా! ఇయం=ఈ ప్రకృతి, అపరా= నికృష్టమయినది, ఇతస్తు=ఈప్రకృతికంటె, అన్యాం=ఇతరమయిన, జీవభూతాం = ప్రాణధారణనిమిత్తభూతమయిన, పరాం=ఉత్కృష్టమయిన, మే=నాయొక్క, ప్రకృతిం=ప్రకృతిని, విద్ధి=తెలియుము, యయా=ఏప్రకృతిచేత, ఇదంజగత్ =ఈప్రపంచము, ధార్యతే=ధరింపఁబడుచున్నదో.

శం. నికృష్టమైనది అనఁగా అపరిశుద్ధమైనదియు సంసారస్వరూపమైనదియు బంధక స్వరూపమనుట. మే=నాయొక్క, అనఁగా నాకాత్మరైనదనుట. జీవభూతాం = ప్రాణమునిలిచియుండుటకు నిమిత్తమై క్షేత్రజ్ఞుఁడు, ఏక్షేత్రజ్ఞుఁడు లోపలఁ జొచ్చుటచేత యీజగత్తు నిలిచి యున్నదో, అర్జునా! పైఁజెప్పిన నామాయాశక్తి నికృష్టమైనది. దీనికన్న జీవభూతమై ఉత్కృష్టమైన ప్రకృతి మఱియొకటియున్నదని తెలియుము. దానిచేతనే యీప్రపంచము ధరింపఁబడియున్నది.

రామా. పరయనఁగా భోక్త అనుభవించువాఁడు అగుటచే ప్రధానమైనది. జగత్తనఁగా నచేతనము.

మధ్వ. జీవభూత యనఁగా లక్ష్మి.

శ్లో. ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా. 6

టీ. సర్వాణి=సమస్తములైన, భూతాని=భూతములను, ఏతద్యోనీని=ఈరెండుప్రకృతులే కారణముగాఁగలిగినవి, ఇతి=ఇట్లు, ఉపధారయ=తెలియుము, తథా=అట్లు, అహం=నేను, కృత్స్నస్య=సమస్తమయిన, జగతః=ప్రపంచమునకు, ప్రభవః=ఉత్పత్తికారణమును, ప్రళయః=నాశకారణమును, (అనియు తెలియుము.)

శం. ఈ జీవభూతమైన పరప్రకృతియే సమస్తభూతములకుఁ గారణమని నిశ్చయింపుము. సమస్తప్రపంచమునకు నుత్పత్తిలయస్థానములు నేనేను.

రామా. భూతము లనఁగా బ్రహ్మాది స్తంభపర్యంతములైనవి. నాప్రకృతులవలన కలిగినవిగా నవి యన్నియు నావియే. నేను వానికి శేషియైన వాఁడను (నియామకుఁడను).

మధ్వ. ఉనికికిని తెలియఁబడుటకును కారణ మగుట చేత ప్రభవము మొదలగునది యగుచున్నాను.

శ్లో. మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7

టీ. హే ధనంజయ=ఓ యర్జునుఁడా! మత్తః=నాకంటె, పరతరం=మిక్కిలి శ్రేష్ఠమయిన, అన్యత్=మఱియొక కారణము, కించిత్=ఏదియును, నాస్తి=లేదు, మయి=నాయందు, సర్వం=సమస్తమగు, ఇదం=ఈజగత్తు, సూత్రే=దారమందు, మణిగణాఇవ=రత్నసమూహములవలె, ప్రోతం=కూర్చఁబడెను.

శం. ఓ ధనంజయా! నాకన్న నితరకారణము మఱొకటి లేదు. ఈ సమస్తప్రపంచము దారమునందు రత్నములవలె నాయందుఁ గూర్పఁబడియున్నది. నేనే జగత్కారణమనుట.

రామా. నేను అన్నిటికిని కారణమైన రెండు ప్రకృతులకును కారణమగుటచేత అన్నియచేతనములకును శేషియైనచేతనునికిఁ గూడ నియామకుఁడనగుట చేతను, గొప్పవాఁడనైనట్లు జ్ఞానము, శక్తి, బలము మొదలగు గుణములు కలుగుటచేతఁ గూడ నేనే గొప్ప వాఁడను. జ్ఞాన బలాదులు గలది మఱియేదియుగొప్పదికాదు. ఈచేతనాచేతనవస్తుసముదాయ మంతయు కార్యావస్థలో నున్నదియు, కారణావస్థలో నున్నదియుఁగూడ నాకు శరీరమై ఆత్మయైన నాయందు దారమునందు మణులవలె గ్రుచ్చఁబడినట్లు నన్నాశ్రయించి యున్నదనుట.

మధ్వ. నేనే గొప్ప వాఁడను. నాకంటె మిగిలినది ఒక్కటియును గొప్పది కాదు. అని తలంచుట జ్ఞానము పైశ్లోకములందు "విజ్ఞానము" వ్యక్తము.

శ్లో. రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః,
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. 8

టీ. కౌంతేయ = అర్జునుఁడా ! అప్సు = ఉదకములయందు, రసః = రుచియును, శశిసూర్యయోః = చంద్రసూర్యుల యందు, ప్రభా=కాంతియును, సర్వవేదేషు=సమస్తవేదముల యందు, ప్రణవః=ఓంకారమును, ఖే=ఆకాశమందు, శబ్దః= శబ్దమును, నృషు=పురుషులయందు, పౌరుషం=పురుషప్రభావమును, అహం=నేను, అస్మి=అగుచున్నాను.

శం. అర్జునా! ఉదకమునందు రసము, సూర్యచంద్రాదుల యందుఁ బ్రకాశము, వేదములయందుఁ బ్రణవము, ఆకాశమునందు శబ్దము, పురుషులయందు పౌరుషము నేనుగా నెఱుఁగుము.

శ్లో. పుణ్యో గంధః పృథివ్యాంచ తేజ శ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తపశ్చాఽస్మి తపస్విషు. 9

టీ. అహం=నేను,పృథివ్యాం=భూమియందు, పుణ్యః=పరిమళించుచున్న,గంధశ్చ=గంధమును,విభావసౌ=అగ్నియందు, తేజశ్చ= తేజమును, అస్మి=అగుచున్నాను.సర్వభూతేషు=సమస్తభూతములయందు, జీవనం=ప్రాణాధారమైన ఆయుస్సును, తపస్విషు=తపస్సుగలవారలయందు,తపశ్చ=తపస్సును, అస్మి= అగుచున్నాను.

శం. భూమియందు సుగంధము,అగ్నియందుఁ దేజము,ఎల్ల భూతములయందు ఆయువు, తపస్వులయందు తపస్సు నేనుగా నెఱుఁగుము.

శ్లో. బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనం,
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్, 10

టీ. హేపార్థ = అర్జునా ! సనాతనం = శాశ్వతమైన, మాం=నన్ను, సర్వభూతానాం=సమస్తప్రాణులకు, బీజం=ప్రరోహకారణమయినవానిగా, విద్ధి=తెలియుము. (ఇదియునుంగాక), అహం=నేను, బుద్ధిమతాం=వివేకశక్తిగలవారలయొక్క, బుద్ధిః=నిశ్చయాత్మకబుద్ధియును, లేక అంతఃకరణముయొక్క వివేకశక్తి, తేజస్వినాం=తేజోవంతులయొక్క, తేజః=ప్రాగల్భ్యము (నేర్పు), అస్మి=అగుచున్నాను.

శం. ఓ పార్థా ! ఎల్ల చరాచరభూతములకు నుత్పత్తికారణమైన యనాదిబీజము బుద్ధిమంతుల బుద్ధి తేజస్సు గలవానియందు తేజస్సు నేనుగా నెఱుఁగుము.

శ్లో. బలం బలవతాం చాహం కామరాగవివర్జితం,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ. 11

టీ. హేభరతర్షభ=ఓయి అర్జునుఁడా ! బలవతాం=బలముగలవారలయొక్క, కామరాగవివర్జితం=ఆశానురాగములచేత విడువఁబడిన, బలం=బలమును, (సామర్థ్యము). దీనినే ఓజస్సు అందురు. భూతేషు=ప్రాణులయందు, ధర్మావిరుద్ధః = ధర్మశాస్త్రవిరుద్ధముగాని, (స్వస్త్రీలయందుఁ బుత్రోత్పత్తి నిమిత్తమైన), కామః=కామమును, అహం=నేను, అస్మి=అగుచున్నాను.

శం. అర్జునా ! బలవంతులయందు కామరాగములులేని బలము ప్రాణులయందు ధర్మమునకు విరుద్ధముగాని కామము నేనుగా నెఱుఁగుము.

రామా. అంతయును పరమపురుషునికి శరీరమగుటను అన్నిశబ్దములచేతను అతఁడే చెప్పఁబడుచున్నని తెలియఁజేయఁబడుచున్నది. ఈవిలక్షణమైన పదార్థము లన్నియు నావలననె పుట్టినవి. నాకు శేషములు (నియామ్యములు) అయినవి. నాకుశరీరమగుటచే నాయందె యున్నవి. కాఁబట్టి అవి ప్రకారముగాఁ గలవాఁడ నేనె యున్నాను.

మధ్వ. నీళ్లు మొదలగునవి అతనివలననె కలుగుచున్నవి. రసము మొదలగునని వానివాని స్వభావములగుటయును, సారము లగుటయును ఏర్పఱచువాఁడు (నియామకుఁడు) ఆతఁడెకాని జలాదులయొక్క ఏర్పాటువలన రసాదులు రసాదు లగుటయు వానివానిసారములగుటయును లేదు - వానినియనుభవించువాఁడు (భోక్త) అగుటచేతను అతనికి రసాదిశబ్దములు నామములు. వీనియందు భగవదుపాసనచేయవలసినది - అన్నిబలములయందును అన్నికామములయందును భగవదుపాసనకూడదు. కామరాగములు లేనిబలమందును ధర్మావిరుద్ధమైన కామమునందె యుపాసించవలయును. ఈశ్వరుఁడు పుణ్యగంధమునకె భోక్త, పుణ్యగంధమునందె అతని నుపాసించవలయును-జీవుఁడును, ఈశ్వరుఁడునుఁ గూడ శారీరులని చెప్పఁబడుదురు అనుట.

శ్లో. యేచైవ సాత్త్వికాభావా రాజసా స్తామసాశ్చ యే,
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి. 12

టీ. సాత్త్వికాః=సత్త్వగుణములచేతనైన, భావాః=శమదమాదులయినపదార్థములును, రాజసాశ్చ = రజోగుణముచేతనైన దర్పహర్షాదులును, తామసాశ్చ=తమోగుణముచేతనైన

శోకమోహాదులును, యే=ఏవిగలవో, తాః=ఆభావములను, మత్తఏవ ఇతి=నావలననే నవేయని, విద్ధి=తెలియుము, తేషు= ఆభావములయందు, అహం=నేను, న=లేను, తే=ఆభావములు, మయి=నాయందు, (సన్తి=ఉన్నవి.)

శం. సత్త్వగుణరూపములైన శమదమాదులు రజోగుణ రూపములైన గర్వసంతోషాదులు తామసగుణరూపములైన శోకమోహాదులు నాయందుఁ బుట్టినవియని తెలియుము, వాటికి నేను సంసారులవలె స్వాధీనుఁడ గాను, అవి నాకు స్వాధీనము.

రామా. దేహముగాను, ఇంద్రియములుగాను, భోగ్యము లుగాను, వానికి కారణములుగానుండే సాత్త్వికరాజసతామస భావములన్నియు నావలన బుట్టినవనియు, నాకు శరీరమగుట చేత నాయందె యున్నవనియు తెలిసికొనుము. నేను ఎప్పు డును వానికి అధీనమైన ఉనికి కలవాఁడనుకాను, శరీరము జీవుని కధీనమైన స్థితికలదైనను జీవునియొక్క స్థితియందు శరీరపు ఉపకారముకూడ కలదు. నాకు వానివలన అట్టి ఉపకారము లేదు. వట్టి లీలయేనాకు ప్రయోజనము.

మధ్వ. నేను వానియందు లేననుటచే అవి నాకాధార ములు కావని చెప్పఁబడుచున్నది.

శ్లో. త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్. 13

టీ. త్రిభిః=మూడువిధములయినట్టియు, గుణమయైః=సత్త్వా దిగుణవికారములయినట్టి, ఏభిర్భావైః = ఈశమదమాదిపదా

ర్థములచేత, మోహితం = అవివేకమును బొందింపఁబడిన, సర్వం=సమస్తమైన, ఇదంజగత్=ఈప్రపంచము, ఏభ్యః = ఈ భావములకంటె, పరం=విలక్షణుఁడనైనట్టియు, అవ్యయం = నాశరహితుఁడనైనట్టియు అనగా భావవికారాదులు *ఆఱును లేనివాఁడనగు, మాం=నన్ను, నాభిజానాతి=ఎఱుఁగదు.

శం. పైఁజెప్పిన సత్త్వరజస్తమోగుణవికారములచే మోహింపఁబడిన ఈ సమస్తజగత్తు వికారరహితుఁడనై గుణముల కన్న నితరుఁడనైన నన్ను నెఱుఁగఁజాలదు.

రామా. ఈ సాత్త్వికరాజస తామస గుణమయములగు భావములకంటె గొప్పవాఁడను, అవ్యయుఁడ ననఁగా ఎల్లప్పుడొక్కవిధముగా నుండువాఁడను నగు నన్ను క్షణమునశించి పోయెడివిని, పూర్వకర్మానుసారములుగా దేహములుగాను, ఇంద్రియములుగాను, భోగ్యములుగా నుండెడి గుణమయ పదార్థముచేత మోహితమై దేవతిర్యఙ్మనుష్యస్థావర రూపముగా నున్న యీ జగత్తు ఎఱుంగదు.

మధ్వ. గుణమయము లనఁగా గుణాత్మకములు, భావము లనఁగా పదార్థములు, వీనికంటె పరుఁడు. ఈ కనఁబడుచుండు భావములన్నియు గుణమయములె. జ్ఞానులుకాక మిగిలిన యీ జగత్తంతయు గుణమయమగు యీశరీరాదికమునుజూచి ఈశ్వరశరీరంబు నట్టిదె యనుకొనుటచే మాయా మోహిత మైనది యనుట.

---

* 1 జాయతే, 2 అస్తి, 3 వర్ధతే, 4 విపరిణమతే, 5 అపక్షీయతే, 6 నశ్యతి.

శ్లో. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే.

టీ. దైవీ=నాసంబంధమైన, దైవియనఁగా ఈశ్వరుఁడను విష్ణువునగు నాకు స్వభావమైనది. గుణమయీ=త్రిగుణాత్మకమైన, ఏషా=ఈచెప్పఁబడిన, మమ=నాయొక్క, మాయా=మాయ, దురత్యయాహి=దాఁట శక్యముగానిదిగదా, మామేవ=నన్నే, యే=ఎవరు, ప్రపద్యంతే=శరణుపొందుచున్నారో, తే=వారు, ఏతాంమాయాం=ఈమాయను, తరంతి = అతిక్రమించుచున్నారు.

శం. నాయందు పుట్టి త్రిగుణాత్మకమైన నామాయను ఎవరు నతిశయింపఁజాలరు. ఎవరు మాయకలవాఁడను వారికి యాత్మయునగు నన్నే శరణుబొందుచున్నారో వా రీమాయ నతిక్రమించఁగలరు.

రామా. మాయ భగవత్స్వరూపమును తెలియనీయక అడ్డపెట్టును. కాఁబట్టి మాయామోహితమైన జగత్తు భగవంతుని యానందస్వరూపమును తెలిసికొనకయున్నది. నన్నే శరణముగా నెవరు పొందుచున్నారో వా రీమాయనువిడిచి నన్ను ఉపాసించుచున్నారు.

మధ్వ. ఇది మోహిక యను మాయ. ఇది సృష్ట్యాది క్రీడ మొదలగునవి కలదేవునిది కాన శక్తివలన దాఁటశక్యముకానిది. మిగిలినవానినంతయు విడిచి నన్నే ఎవరు సేవింపుచున్నారో, గురువుమొదలగువారికి చేయువందనములగూడ నాయందె సమర్పించుచున్నారో, భగవంతుఁడె వారియందున్నవాఁడై,

గురువు మొదలగువారు అగుచున్నాఁడు. అని తెలిసికొను చున్నారో వారిచే దాఁటఁదగినది.

శ్లో. నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. 15

టీ. దుష్కృతినః=పాపముచేసినట్టిన్ని, మూఢాః = వివేక రహితులైనట్టి, నరాధమాః=మనుష్యాధములు,మాయయా= మాయచేత, అపహృతజ్ఞానాః= అపహరించఁబడిన జ్ఞానముగల వారలై, ఆసురం=అసురసంబంధమైన, భావం=హింసానృత్యా దిస్వభావమును, ఆశ్రితాః = ఆశ్రయించినవారలై, మాం = న న్ను, నప్రపద్యంతే=భజింపరు.

తం. పాపముచేయు మనుష్యులును మూఢులును నీచులు ను నామాయవల్ల వివేకశూన్యులై అసురస్వభావులై హింసా దికర్మలు జేయువారై నన్ను శరణుపొందరు.

రామా. నన్నాశ్రయింపని దుష్కృతులు నాలుగు తెఱఁగు లవారు. (1) మూఢులు, వీరు విపరీతజ్ఞానముగలవారు, తమ యాత్మయును, మిగిలినవన్నియునుకూడ తమకే భోగ్యమను కొనువారు. (2) నరాధములు, నాస్వరూపమును తెలిసి యును నాయందలి యభిముఖ్యమునకు తగనివారు. (3) మా యాపహృతజ్ఞానులు,అనగా నాజ్ఞానము కలిగియు దానిని చెడు యుక్తులచే పోఁగొట్టుకొన్నవారు. (4) అసురభావము నాశ్రి యించినవారు, నన్ను లెస్సగా తెలిసికొని నాయందు ద్వేష మును వహించువారు. వీరిలో ఉత్తరోత్తరులు పాపిష్ఠులు.

మధ్వ. దుష్కృతు లగుటచేత మూఢులు-కావుననె నరాధములు. అపహరింపఁబడిన అనఁగా తిరస్కరింపఁబడిన జ్ఞానముకలవా రగుటకూడ మూఢు లగుటకు హేతువు-కావుననే యసురభావమును పొందినవారు. అనఁగా ప్రాణాసక్తిఁగలవా రనుట.

శ్లో. చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ, 16

టీ. హేభరతర్షభ=ఓయర్జునుఁడా! ఆర్తః=చోరవ్యాఘ్రాదులచేతఁ బీడితుఁడైనవాఁడును,జిజ్ఞాసుః=తెలిసికొనఁగోరువాఁడును, అర్థార్థీ=ధనకాముఁడును, జ్ఞానీచ=ఆత్మజ్ఞానముకలవాఁడును, (అనునీ), చతుర్విధాః=నాలుగువిధములుగలిగిన, సుకృతినః=పుణ్యవంతులైన, జనాః=జనులు, మాం=నన్ను, భజంతే=సేవించుచున్నారు.

శం. అర్జునా!నన్ను నాశ్రయించు పుణ్యపురుషులు నాలుగు జాతులుగా నున్నారు. ఎవరనిన, చోరవ్యాఘ్రరోగాదులచేఁ బీడింపఁబడినవారు జ్ఞానాపేక్షగలవారు సకాములు జ్ఞానముగలవారు.

రామా. పుణ్యకర్మలు కలవారు నన్ను శరణముగాఁ బొంది నన్ను భజింతురు. వారు పుణ్యతారతమ్యములచే నాల్గు విధంబులవారు. అందుత్తరోత్తరు లధికులు. (1) ఆర్తుఁ డనఁగా నైశ్వర్యముపోయి స్థితిలేనివాఁడై తిరిగియు నైశ్వర్యమును కోరువాఁడు. (2) అర్థార్థియనఁగా నైశ్వర్యమును పొందకుండుటచే నైశ్వర్యమును కోరువాఁడు.(3) జిజ్ఞాసువనఁగా ప్రకృతిసంబంధ

ములేని యాత్మస్వరూపమును (కైవల్యమును) పొందఁగోరు వాఁడు. (4) జ్ఞానియనఁగా నాత్మస్వరూపము భగవంతునికి శేష భూతమనిఎఱింగినవాఁడై భగవంతుని పొందఁగోరువాఁడు.

శ్లో. తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమ ప్రియః. 17

టీ. తేషాం=ఆనలుగురిలోపల, నిత్యయుక్తః=నిత్యయోగి యైనట్టియు, ఏకభక్తిః=ముఖ్యభక్తిగలిగినట్టియు, జ్ఞాని=జ్ఞానముగలవాఁడు, విశిష్యతే=అధికుఁడగుచున్నాఁడు, జ్ఞానినః= జ్ఞానికి, అహం=నేను, అత్యర్థం=మిక్కిలి, ప్రియః=ప్రియుఁడైన వాఁడను, సః=ఆజ్ఞాని, మమ=నాకు, ప్రియోహి=ఇష్టుఁడైన వాఁడునుగదా?

శం. ఈ నలుగురిలోఁ జలింపనిభక్తిగల ఆత్మజ్ఞాని యందరి కన్నశ్రేష్ఠుఁడు. అట్టివానికి నేను మిక్కిలి యిష్టుఁడను. వాఁడు నాకిష్టుఁడు. వాసుదేవుఁడనగు నేను జ్ఞానికి ఆత్మనుగాన ప్రియుఁడను.

రామా. నేనొక్కఁడనే ప్రాప్యుఁడుగాఁ గలవానికి నాతోడ యోగము (సంబంధము) నిత్యము. మిగిలినవారికి వారి వారికోరికలు లభించువరకునె నాతోసంబంధము. జ్ఞానికి నాయొక్కనియందె భక్తి. మిగిలినవారికి నాచేఁ గోరఁబడినదానియందును దానికి సాధనమగుటచే నాయందును భక్తి.

శ్లో. ఉదారా స్సర్వఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థిత స్సహి యుక్తాత్మా మా మే వాను త్తమాం గతిమ్.

టీ. ఏతేసర్వే=ఈనలుగురున్ను, ఉదారాఏవ=ఉత్కృష్టు లే, జ్ఞానీతు=జ్ఞానియైతే, ఆత్మైవ=నేనేయని, మే=నాయొక్క, మతం=ఇష్టము, సః=ఆజ్ఞాని, యుక్తాత్మాసన్=నియమింపఁబడి న మనస్సుగలవాఁడై, అనఁగా భగవంతుఁడైన వాసుదేవుఁడు నేనే అని సమాధానమునుపొందిన చిత్తముఁగలవాఁడై, మా మేవ=నన్నే, అనుత్తమాం=శ్రేష్ఠమైన, గతిం=ప్రాప్యస్థానము గాను, ఆస్థితోహి=పరబ్రహ్మమైన నన్ను పొందినవాఁడుగదా!

శం. ఈనలుతెగలవారును ఉత్కృష్టులే, అయినను అం దులో జ్ఞాని నేనే యని నాయభిప్రాయము. ఎందువల్లననఁ జలింపని చిత్తముగలజ్ఞాని నన్నే ఉత్తమగతిగా నమ్మియుండును.

రామా. ఉదారులనఁగా దాతలు. ఎవ్వారలు నావలన నొ క్కదానిని నిగ్రహింతురో వారు నాకు సర్వస్వము నిచ్చినవా రు. జ్ఞాని నాకు ఆత్మయనఁగా జ్ఞానికి నేను అధీనమైన ఉనికి కలవాఁడనుగాఁ దలఁచెదను. ఈజ్ఞాని నన్నువిడిచి తాను ఉండ లేక నన్నెప్రాప్యునిగాఁ బొందెను గాన నేనును ఆతనివిడిచి యుండలేను, కాఁబట్టి యాతఁడు నాకు ఆత్మగదా?

శ్లో. బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః. 19

టీ. బహూనాం=అనేకములయిన, జన్మనాం =జన్మముల యొక్క, అంతే=కడపటను, జ్ఞానవాన్‌సన్=జ్ఞానముగలవాఁడై, సర్వం=సమస్తమున్ను, వాసుదేవ ఇతి=వాసుదేవుఁడేయని, మాం=నన్ను, ప్రపద్యతే=పొందుచున్నాఁడు, సఃమహాత్మా= ఆలాటిమహాత్ముఁడు, సుదుర్లభః=మిక్కిలి దుర్లభుఁడు.

శం. జ్ఞానార్థసంస్కారముగల యనేకజన్మము లెత్తినపిదప మనుష్యుఁడు జ్ఞానియై సమస్తము దేవస్వరూపమని నన్ను శరణు బొందుచున్నాఁడు. అట్టివాఁడు మహాపురుషుఁడు మిక్కిలి దుర్లభుఁడు.

రామా. లెక్కలేని పుణ్యజన్మములు గడచినపైని, నేను వాసుదేవునకు శేషభూతుఁడను, నాస్వరూపంబును నాయునికియు నాప్రవృత్తియు వాని యధీనంబులు, వాఁడు లెక్కలేని కల్యాణగుణంబులచే నుత్కృష్టుఁడు అనుజ్ఞానము కలవాఁడై వాసుదేవుఁడె నాకంతయును అనఁగా ప్రాప్యంబును ప్రాపకంబును, ఇదిగాక నేను కోరవలసిన దంతయును వాసుదేవుఁడే నన్ను ఉపాసింపుచున్నాఁడు (భజించుచున్నాఁడు) వాఁడు మహాత్మయనఁగా గొప్ప మనస్సు గలవాఁడు.

మధ్వ. అనేకజన్మము తుదను జ్ఞానవంతుఁడగును.

శ్లో. కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః,
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా.

టీ. స్వయా=ఆత్మీయమైన, ప్రకృత్యా=స్వభావముచేత, జన్మాంతరఆర్జితమైన సంస్కారముచే, నియతాః=ఆజ్ఞాపింపఁబడిన జనులు, తైస్తైఃకామైః=ఆయావిషయములచేత, (సంతానము పశువులు మొదలగు కామములు.) హృతజ్ఞానాస్సంతః = అపహరింపఁబడిన వివేకముగలవారలై, తంతంనియమం=ఆయా దేవతారాధనాది నియమమును, ఆస్థాయ=అధిష్ఠించి, అన్యదేవతాః=ఇతర దేవతలను, ప్రపద్యంతే=భజించుచున్నారు.

శం. మనుష్యులు కోరికలవలన వివేకశూన్యులై ఆయా కోరికలనిచ్చు దేవతలను వారివారి స్వభావములచేత నాయా కల్పోక్తనియమముల నాచరించి శరణుపొందుచున్నారు.

రామా. ప్రకృతి యనఁగా పాపవాసన, అది గుణమయ భావములయందలిది. (అ 7. శ్లో 13). దానితో నియతులనఁగా నిత్యముగాఁ గూడియున్నవారు. జ్ఞానమనఁగా నాభగవంతుని స్వరూపము తెలుసుకొనుట. ఇతరదేవత లనఁగా వట్టి ఇంద్రాదిదేవతలను ఆశ్రయించి పూజించుచున్నారు.

మధ్వ. ప్రకృతియనఁగా స్వభావము.

శ్లో. యో యో యాం యాం తనుం భక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్. 21

టీ. యోయః=ఏయేకామముగలవాఁడు, భక్తస్సన్=భక్తుఁడై, యాంయాంతనుం=ఏయే దేవతావిగ్రహమును, శ్రద్ధయా=విశ్వాసముచేత, అర్చితుం=పూజించుటకొఱకు, ఇచ్ఛతి=ఇచ్ఛయింపుచున్నాఁడో, తస్యతస్య = ఆయాకామము గలవానికి, అహం=నేను, తాంశ్రద్ధామేవ= ఆశ్రద్ధనే, అచలాం=స్థిరమైనదానినిగా, విదధామి=చేయుచున్నాను.

శం. ఎవఁ డెవఁడు ఏయే కోరికలచేత నేయే దేవతలను భక్తిశ్రద్ధలతోఁ గొలుచుచున్నాఁడో వానివానికి నాయా దేవతలయందు శ్రద్ధాభక్తులను నేను నిశ్చయముగాఁ జేయుచున్నాను.

రామా. తనుమ్ = నాకు శరీరమైనదేవతను, అర్చితుం ఇచ్ఛతి = నాశరీరమని ఎఱుఁగకపోయినను పూజింపఁగోరు

చున్నాఁడో యాశ్రద్ధగలపూజను, అచలాం=నిర్విఘ్నమైనదానినిగాఁ జేయుచున్నాను.

మధ్వ. తనుమ్=బ్రహ్మాదిస్వరూపమగు దేహమును.

శ్లో. స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్. 22

టీ. సః=ఆభక్తుఁడు, తయా=నాచేతఁజెప్పఁబడిన, శ్రద్ధయా=శ్రద్ధతోడను, యుక్తస్సన్=కూడినవాఁడై, తస్య=ఆదేవతావిగ్రహముయొక్క, ఆరాధనం=పూజను, ఈహతే=ఇచ్ఛయించుచున్నాఁడు, మయైవ=నాచేతనే, విహితాన్=చేయఁబడిన, హితాన్=ఇష్టములైన, కామాన్=కోరికలను, తతః=ఆవిగ్రహమువలన, లభతే=పొందుచున్నాఁడు.

శం. అట్టి మనుష్యుఁడు అట్టి శ్రద్ధచే నాయా దేవతను పూజించుచున్నాఁడు. ఆదేవత మూలముగా నాచేతనే యియ్యఁబడిన వానివాని యభీష్టములను వాఁడువాఁడు పొందుచున్నాఁడు.

శ్లో. అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్,
దేవాన్ దేవయజోయాంతి మద్భక్తాయాంతి మామపి. 23

టీ. దేవయజః=అన్యదేవతలనుపూజించువారలు, దేవాన్=దేవతలను, యాంతి=పొందుచున్నారు, అల్పమేధసాం=కొంచెపుబుద్ధిగల్గిన, తేషాం=ఆయన్యదేవపూజకులయొక్క, తత్ఫలంతు=ఆఫలమైతే, అంతవత్=నాశముగలిగినది, భవతి=అగుచున్నది, మద్భక్తాః=నాభక్తులు, మాం=నన్ను, యాంతి=పొందుచున్నారు.

శం. అల్పబుద్ధిగల యా పురుషుల కోరికల ఫలములు నశించునవి. దేవతల నారాధించువారు ఆయా దేవతల స్థానములను పొందుచున్నారు. నాభక్తులు నన్నే పొందుచున్నారు.

రామా. ఇంద్రాదులు కొంతకాలమె యుండువారును, పరిమితమైన భోగములు కలవా రగుటచే, వారల గూర్చి యాగముచేసిన వారు వారలతోఁగూడ భోగముల ననుభవించి వారలతోఁగూడనే జారుదురు. నాభక్తులైనవారు, నాయారాధన రూపముల నెఱింగి స్వల్పఫలములనువీడి నాప్రీతికొఱకె కర్మముల నాచరింపు చున్నవారై నన్నుఁజెందుచున్నారు. మఱి మఱలరు.

మధ్వ. అవ్యక్తుఁడనఁగా కార్యము దేహము మొదలగునవి లేనివాఁడనగు నన్ను కార్యదేహాదులు పొందినవానినిగా అజ్ఞులు తలఁచెదరు. ఆనంద దేహముకలవాఁడనగు నన్ను గౌణదేహముగలవానినిగా తలఁచెదరు. భావమనఁగా యాథార్థ్యము.

మధు. కోరికకల నాభక్తులు మొదటను నాయనుగ్రహమువలన కావలసిన కోరికలను పొందుదురు. అటుపైన నన్ను గూర్చిన యుపాసన ముదురుట వలన నన్నుఁగూడఁజెందుదురు. అని అపిశబ్దస్వారస్యము.

శ్లో. అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః,
 పరం భావ మజానంతో మ మావ్యయ మను త్తమమ్. 24

టీ. అవ్యయం=నాశరహితమైనట్టియు, అను త్తమం=నిరతిశయమైనట్టియు, పరం=ఉత్కృష్టమైనట్టియు, మమ=నాయొ

క్క, భావం=స్వరూపమును, అజానంతః=తెలియక, అబుద్ధయః=మూఢులు, అవ్యక్తం=అప్రకాశకుఁడైన, మాం=నన్ను, వ్యక్తిం=ప్రకాశమును, ఆపన్నం=పొందినవానిగా, మన్యంతే=తలఁచుచున్నారు.

శం. వ్యక్తముగాని నన్ను బుద్ధిహీనులు వ్యక్తునిగా ఎంచుచున్నారు. నా సర్వోత్కర్షమును ఎఱుఁగనివారు నాకు నాశముగలదని భావించుచున్నారు.

మధు. అవ్యక్త శబ్దము నీ క్రింది విధమున వివరించిరి. ఈ దేహమును ధరించుటకు ముందు కార్యములు చేయుటకు తగని స్థితిలో నుండి, ఇప్పుడు వసుదేవుని యింట భౌతిక దేహమును ధరించుటచే వ్యక్తిని అనఁగా కార్యములు చేయతగిన స్థితిబొందిన వానిగాయని.

రామా. సర్వేశ్వరుఁడనగు నేను నా స్వభావమును వదలకయె వసుదేవుని యింట నవతరించితినని యెఱుఁగక ప్రాకృతులైన రాజపుత్త్రులవలె పుట్టకముందు అభివ్యక్తిలేక యుండి కర్మవశమున జన్మమును పొంది వ్యక్తిని పొందిన వానినిగా బుద్ధి లేనివారు తలంచెదరు. ఇందు వలననె నన్నాశ్రయింపరు. నన్ను కర్మములచే నారాధింప రనుట.

శ్లో. నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్.

టీ. అహం=నేను, సర్వస్య=సమస్తలోకమునకును, ప్రకాశః=ప్రకాశమయినవాఁడను, న=కాను, మూఢః=జ్ఞానహీనమయిన, అయంలోకః=ఈజనము, యోగమాయాసమావృతః=

త్రైగుణ్యమనెడిమాయచేతఁ గప్పఁబడినదై, మాం=నన్ను, అజం=జన్మరహితునిగానున్ను, అవ్యయం = నాశరహితునిగానున్ను, నాభిజానాతి=ఎఱుఁగదు.

శం. యోగమాయచేత ననగా సత్త్వరజస్తమోసంఘాతరూపమగు మాయచేఁ గప్పఁబడి మోహమునుం బొందిన యందఱికిని నాస్వస్వరూపజ్ఞానములేదు. అట్టిమూఢులు నేను ఉత్పత్తి నాశములు లేని వాఁడనని తెలిసికొనఁ జాలరు. అదియే యవివేక మనఁబడును.

రామా. క్షేత్రజ్ఞులకు కలిగెడి మనుష్యత్వము మొదలగు ఆకారముల యోగమనెడి మాయచేత, సర్వేశ్వరుఁడనైనను నన్ను ఆశ్రయించుటకుగాను మనుష్యాకారమును పొందిన వానిగా నెఱుఁగరు.

మధ్వ. అట్లు తెలిసి కొనక పోవుటను నాయిచ్ఛచేతనే. సామర్థ్యోపాయముచేతను మాయచేతను మోహమును పొందిన జనులకు నాస్వరూపజ్ఞానములేదు. వారు నన్ను జన్మరహితునిగాను నాశరహితునిగాను తెలిసికొనఁ జాలరు.

శ్లో. వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున,
భవిష్యాణి చ భూతాని మాంతు వేద న కశ్చన. 26

టీ. హేఅర్జున=ఓయర్జునుఁడా! అహం=నేను, సమతీతాని=అతిక్రమించినట్టియు, వర్తమానానిచ=ఉన్నట్టియు, భవిష్యాణి చ=కాఁగలయట్టియు, భూతాని=ప్రాణులను, వేద=ఎఱుఁగుదును, కశ్చన=ఒక్కఁడును, మాంతు=నన్నుమాత్రము, నవేద=ఎఱుఁగఁడు.

శం. అర్జునా! భూతకాలమునం దుండినట్టి వర్తమానకాలమందుండినట్టి భవిష్యత్కాలమునం దుండఁగల ప్రాణిసమూహములను నే నెఱుఁగుదును. అయినను నన్ను నెవఁడును ఎఱుఁగఁడు. నాభక్తుఁడు తప్ప మఱి యెవ్వఁడును నన్ను ఎఱుంగఁడు నాతత్త్వము తెలిసికొనక నన్ను భజింపఁడు.

రామా. అందఱు నాశ్రయించుటకు నై నేనవతరించితినని యెవ్వఁడు నెఱుంగఁడు.

మధ్వ. మాయ నన్ను బంధింపఁ జాలదు. యెంత సమర్థుఁడైనను తనసామర్థ్యముచేత నన్నెఱుంగలేఁడు అనుట.

శ్లో. ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత,
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప. 27

టీ. హే పరంతప=శత్రువులఁ దపింపఁజేయునట్టి, భారత=అర్జునా! సర్గే=ఉత్పత్తికాలమందు, ఇచ్ఛాద్వేషసముత్థేన=కామక్రోధములవలనబుట్టిన, ద్వంద్వమోహేన=సుఖదుఃఖాది హేతువైన యవివేకముచేతను, సర్వభూతాని=సర్వభూతములు, సంమోహం = మిక్కిలి యజ్ఞానమును, యాంతి = పొందుచున్నవి.

శం. ఓ యర్జునా! ఈ స్థూలశరీరమం దిచ్ఛాద్వేషములవలనఁబుట్టిన ద్వంద్వరూపమయిన సుఖదుఃఖములయందు మోహముచేత నెల్లప్రాణులు జన్మసమయమునందే మూఢత్వమునుఁ బొందుచున్నారు.

ఇచ్ఛాద్వేషములను నిలకడగాఁ జేసి తెలివిని తమస్వాధీనముఁ జేసికొని పరమార్థజ్ఞానము పుట్టుటకు ప్రతిబంధకమైన మోహమును, అజ్ఞానమును కలుగజేయును. అట్లు పరవశమై చిత్తునకు వెలుపలఁగూడ యథార్థజ్ఞానము పుట్టదుకదా! అనేక ప్రతిబంధకముగల ప్రత్యగాత్మజ్ఞానము పుట్టదనికూడ చెప్పవలయునా.

రామా. అందఱకును జన్మకాలము నందె ద్వంద్వమను పేరుగల ద్వంద్వమోహము సుఖదుఃఖాదులయందు ఇచ్ఛాద్వేషములు కలుగుటచే పూర్వాపూర్వ జన్మవాసనానుసారముగా కలుగుచున్నది. కావున నెవ్వఁడును నాతో కలియుటయే సుఖముగాను నాతో నెడబాయుట దుఃఖముగాను తలంచుటయే స్వభావముగాఁ గలవాఁడు కాఁడు.

మధ్వ. ద్వంద్వ మోహమనఁగా సుఖదుఃఖాది విషయమోహము. ఇచ్ఛాద్వేషములు పెఱిగినచో నేదియును తెలియశక్యముకాదు. ఇదియొక కారణము. సృష్టికాలమునందు శరీరాదులు కలిగినకదా ఇచ్ఛాదులు కలుగును. శరీరము లేనియప్పు డజ్ఞానము మాత్రమే యుండుననుట.

శ్లో. యేషాం త్వంతం గతం పాపం జనానాం పుణ్యకర్మణాం,
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః.

టీ. పుణ్యకర్మణాం = సుకృతకర్మములు గలిగిన, యేషాం జనానాం = ఏజనులయొక్క, పాపంతు = పాపమైతే, అంతం గతం=నాశమునుపొందినదో, తే = ఆజనులు, ద్వంద్వమోహనిర్ముక్తాస్సంతః = సుఖదుఃఖాది ద్వంద్వహేతువైన యవివేకము

చేత విడువఁబడినవారలయి, దృఢవ్రతాః=నిశ్చయమైన నియ
మము కలవారలై, మాం=నన్ను, భజంతే=సేవించుచున్నారు.

శం. సుకృతకర్మలు గలవారు వారిపాపములు నశించిన పిదప ద్వంద్వగుణములయిన సుఖదుఃఖములకు కారణమగు నవివేకమునుండి విడువఁబడి నిశ్చలనియమముతో నన్నుఁ గొలుచుచున్నారు.

రామా. పాపమనఁగా గుణమయ ద్వంద్వములగు రాగద్వేషములకు కారణమై నాయెడ నాభిముఖ్యముకలుగుటకు విరోధియైనది. అది యనేకజన్మోపార్జితంబైన గొప్ప పుణ్యముల చేత నెవ్వరికి క్షయించినదో వారు నన్ను ప్రపత్తిచేయుటచే గుణమయమోహవినిర్ముక్తులై జరామరణముల విడుదలకొఱకును, గొప్ప యైశ్వర్యము కొఱకును, నన్నుఁజెందుటకును, దృఢమైన సంకల్పము కలవారై నన్నే భజించుచున్నారు.

మధ్వ. వెనుకటి శ్లోకమునఁజెప్పఁబడిన, కామక్రోధముల వలనఁ బుట్టినసుఖదుఃఖాదిహేతువైన యవివేకముచేత సమ్మోహితులగువారికంటె విపరీతమైనవారునుకలరని యీశ్లోకము వివరించుచున్నది- అట్టివారు సుఖదుఃఖాదిహేతువగు యవివేకమునుండి విడువఁబడి దృఢసంకల్పులై నన్నెగొలిచెదరు.

శ్లో. జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే,
తేబ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మచాఖిలం. 29

టీ. యే=ఎవరు, జరామరణమోక్షాయ=జరామరణముల విడుపుకొఱకు, మాం=నన్ను, ఆశ్రిత్య=ఆశ్రయించి, యతంతి=యత్నముచేయుచున్నారో, తే=ఆజనులు, తద్బ్రహ్మచ=ఆ

బ్రహ్మమును, కృత్స్నం=సమస్తమైన, అధ్యాత్మం=ప్రత్యగాత్మ విషయవస్తువును, అఖిలం=సమస్తమయిన, కర్మచ=కర్మమును, విదుః=ఎఱుఁగుదురు.

శం. ఎవరు జనన మరణ రహితమయిన మోక్షాపేక్షతో నన్ను ఆశ్రియించి యందులకుఁ దగిన యత్నములు చేయుచున్నారో, అట్టివారు సమస్తజీవకోటికి నంతర్గతముగానుండు ఆ పరబ్రహ్మమును సమస్తకర్మలను తెలిసికొనినవారగుదురు.

మధు. వేదవిహితకర్మముల నాచరించి ఫలమును గోరక సగుణుఁడనైన నన్ను శరణముగాఁ బొందిన ఇట్టివారు తత్పదార్థమైన నిర్గుణబ్రహ్మమును, త్వంపదార్థమైన జీవాత్మను తెలిసి కొందురు. ఈజ్ఞానసాధనమైన గురువు నాశ్రయించుట, అతనివలన వినుట, దానిని మననముచేయుట, మొదలగుకర్మమును గూడ తెలిసికొందురు.

రామా. జరామరణ మోక్షమనఁగా ప్రకృతి సంబంధములేని యాత్మస్వరూపమును చూచుట.

మధ్వ. ఏకాంతభక్తిఁ గలవారు ఫలము కోఱకు భగవంతు నాశ్రయింపఁ గూడదు కావున జరామరణ మోక్షము కొఱకని సూచింపఁబడినది. మిగిలిన కోరికలు లేకుండవలయునని తెలియఁజేయును గాని మోక్షమును కోరవలయు నని విధింపదు.

శ్లో. సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః,
ప్రయాణకాలేఽపిచ మాం తే విదు ర్యుక్తచేతసః. 30

టీ. యే=ఎవరు, సాధిభూతాధిదైవం=అధిభూతాదిదైవముతోఁగూడినట్టియు, సాధియజ్ఞంచ=అధియజ్ఞము తోఁ గూడిన

ట్టియు, మాం=నన్ను, విదుః=తెలియుదురో, తే=వారు, ప్రయాణకాలేపిచ=అంత్యకాలమందును,యుక్తచేతసః=నియమింపఁబడిన మనస్సుగలవారలయి,మాం=నన్ను,విదుః=తెలియుదురు.

శం. అధిభూతాధిదైవతాధియజ్ఞములతోనుఁ జేరియున్న నన్నెవ రెఱుఁగుదురో యట్టివా రంత్యకాలమునగూడ నచంచలమయిన మనస్సు గలవారై నన్నుఁ దెలిసికొనుదురు.

రామా. భగవద్భక్తులు మూఁడువిధములుగ చెప్పఁబడియున్నారు. ఒకవిధమైన భక్తులు వెనుకటి శ్లోకమున వివరింపఁబడిరి. ఈశ్లోకమున మఱియొక్కవిధమువారుగ ఐశ్వర్యార్థులుగ చెప్పంబడుచున్నారు. ముగ్గురుఅధికారులకును నిత్యనైమిత్తికరూపములగు పంచమహాయజ్ఞాదులనాచరించుట యావశ్యకముగాన 'సాధియజ్ఞంవిదుః' అనునది అందఱకును అన్వయించును. ప్రయాణకాలమున వారివారి ప్రాప్యమునకు తగినట్లు నన్నెఱుఁగుటయును ముగ్గురికి తుల్యమే అనుట.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విజ్ఞాన
యోగోనామ సప్తమోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును, యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునుల సంవాదాత్మకంబు నైన
శ్రీభగవద్గీతలయందు విజ్ఞానయోగ
మనెడి సప్తమాధ్యాయము.

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## అక్షరపరబ్రహ్మయోగః.

అర్జున ఉవాచ:—

శ్లో. కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతంచ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే. 1

అర్జునుఁ డడుగుచున్నాఁడు.—

టీ. హేపురుషోత్తమ=ఓశ్రీకృష్ణస్వామీ! తద్బ్రహ్మ=ఆబ్ర హ్మము, కిం=ఏది, అధ్యాత్మం=అధ్యాత్మము, కిం=ఎట్టిది, క ర్మ=కర్మము, కిం=ఎట్టిది, కిం=ఏది, అధిభూతం=అధిభూతమని, ప్రోక్తం=చెప్పఁబడును, కిం=ఏది, అధిదైవం=అధిదైవమని, ఉ చ్యతే=చెప్పఁబడుచున్నది.

తం. ఓ పురుషోత్తమా! ఆపరబ్రహ్మ మేది? అధ్యాత్మమన నేమి? కర్మయన్న నెట్టిది? అధిభూతమని యెద్ది చెప్పఁబడుచు న్నది? అధిదైవమని ఏది చెప్పఁబడును.

రామా. కైవల్యార్థులకు తెలియఁదగిన బ్రహ్మంబును అధ్యాత్మంబును ఎయ్యవి ఐశ్వర్యార్థులకుం దెలియఁదగిన అధి భూతంబును, అధిదైవంబును ఏవి.

శ్లో. అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన,
ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2

టీ. హే మధుసూదన=ఓ శ్రీకృష్ణస్వామీ! (అస్మిన్) దేహే=ఈశరీరమందు, అధియజ్ఞః=అధిష్ఠాతయును ప్రయోజకుఁడును ఫలదాయకుఁడును, కః=ఎవ్వఁడు? అత్ర=ఈవిషయమందు, కథం=ఎట్లు? జ్ఞేయః=తెలియఁదగినవాఁడు, ప్రయాణకాలే=దేహాంతకాలమందు, నియతాత్మభిః=నియమింపఁబడిన చిత్తముగలవారలచే, కథం=ఏప్రకారముగా, జ్ఞేయః=తెలియఁదగినవాఁడవు, అసి=అగుచున్నావు.

శం. ఓ మధుసూదనా! ఈ దేహమునందు అధియజ్ఞుఁ డనెడివాఁ డెవ్వఁడు? వాఁ డెట్లున్నవాఁడు? చలింపని మనస్సుగలవారలచేత నంత్యకాలమునందు నీ వేవిధమున నెఱుఁగఁబడువాఁడవు? అన్నియును నాకు స్పష్టముగాఁ దెలియఁ జేయుము.

రామా. ముగ్గురికిని తెలియఁదగిన అధియజ్ఞుం డెవ్వండు? ఈముగ్గురి చేతను ప్రయాణకాలంబున నెట్లు తెలియందగిన వాఁడవు?

మధ్వ. మరణ కాలమున చేయవలసిన గతి మొదలగునవి యీ యధ్యాయమున నుపదేశింపఁబడును. అనుట.

శ్రీ భగవా నువాచ:—

శ్లో. అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. 3

భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. పరమం=నిరతిశయమైన, బ్రహ్మ=బ్రహ్మము, అక్షరం=నాశరహితమైనది, స్వభావః=అపరబ్రహ్మముయొక్క ప్రత్యగాత్మభావము, అధ్యాత్మం=అధ్యాత్మమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది, (అనఁగా దేహమును ప్రత్యగాత్మస్వరూపముచేత నధిష్ఠించియుండునది యధ్యాత్మము. అదియును బ్రహ్మరూపమయినదే.) భూతభావోద్భవకరః-భూత=ప్రాణులయొక్క, భావ=స్వరూపమునకు, ఉద్భవ=ఉత్పత్తిని, కరః=చేయుచున్నట్టి, విసర్గః=దేవతలనుద్దేశించి చేయఁబడుచున్నట్టి పురోడాశాదిద్రవ్యపరిత్యాగము, కర్మసంజ్ఞితః=కర్మమనుసంజ్ఞగలది.

శం. పరమమైన యక్షరమనఁగా పరమాత్మ స్వభావమనఁగా నాబ్రహ్మము ప్రతిశరీరంబునను ప్రత్యగాత్మ యగుట. దేవతలంగూర్చి చరుపురోడాశముల విడుచుటయె కర్మము అనఁబడును. అది వర్షాదిక్రమముచే స్థావరజంగమాదిభూతోత్పత్తికి కారణమగును (చరువనఁగా అన్నము-పురోడాశము అనఁగా వరిపిండితోఁ జేయఁబడినది) స్థావరములు వృక్షాదులు జంగమములు మనుష్యపశుపక్ష్యాదులు పరబ్రహ్మము నాశములేనిది. ఆ పరబ్రహ్మముయొక్క స్వభావమే అధ్యాత్మము. ప్రాణులయొక్క యుత్పత్తివృద్ధినిమిత్తమై చేయఁబడునది కర్మయనఁబడును.

రామా. కైవల్యమును గోరువారిచే పరమాక్షరము (ప్రకృతిసంపర్కములేని యాత్మస్వరూపము) ప్రాప్యము (పొందఁదగినది గాను) స్వభావము (ప్రకృతి) పరిత్యాజ్యము (విడువ

వలసినది) గాను, తెలియఁ బడవలసినది. భూతభావమనఁగా మనుష్యాదులనుట అది కలుగుటకు కారణమై స్త్రీసంయోగముచేత కలిగెడి రేతోవిసర్జనము కర్మమని చెప్పఁబడును. ఈ కర్మంబును దీనితో సంబంధించినవియునుగూడ సేవగింపఁదగినవిగాను, పరిహరింపఁదగినవిగాను మోక్షముం గోరువారిచే తెలియఁబడఁదగినవి అనుట.

మధ్వ. పరమమైన యక్షరము బ్రహ్మముగాని వేదాదులుగావు. ఆత్మయందున్నది అధ్యాత్మము ఆత్మాధికారంబున నేదికలదో యదియైనను అధ్యాత్మమే-స్వభావము జీవసంబంధి యగునది, లేక స్వభావమనగా జీవుఁడనియుకూడ చెప్పనగు. ఎల్లప్పుడు నొక్క విధముగా నుండు వాఁడని భావము. అంతఃకరణాదులు వికారమును పొందునవి కాన ఎప్పుడు నొక్కవిధముగా నుండవు. స్వశబ్దముచేత ఈశ్వరుడు కాకుండుటయనుట భూతములయొక్కయును జీవులయొక్కయును భావములయొక్కయును ఉద్భవమును అనఁగా ఉత్పత్తినిఁజేసెడి ఈశ్వరవ్యాపారము విసర్గము. విశేషముగా సృజించుట విసర్గము.

శ్లో. అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర. 4

టీ. దేహభృతాంవర = దేహధారులలో శ్రేష్ఠుఁడవైన ఓయర్జునుఁడా! అధిభూతం=ప్రాణిజాతము, క్షరః=నశించునట్టి, భావః=ఉత్పత్తిగలవస్తువు, పురుషః=సూర్యాంతర్గతుఁడును సకలప్రాణుల యింద్రియములకు ననుగ్రాహకుఁడునయినహిరణ్యగర్భుఁడు. శ్రు. "సవై శరీరీ ప్రథమస్సవై పురుషఉచ్యతే, ఆది

కర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత" దేహధారులలో మొదటివాఁడును పురుషుఁడని చెప్పఁబడెడివాఁడును సకల భూతములకు నాదికర్తయునైన బ్రహ్మ ముందుగా పుట్టెనని యీశ్రుత్యర్థము.), అధిదైవతం= దేవతలకు నధిపతియాటవల్ల నధిదైవతము, అత్ర దేహే= ఈశరీరమందు, అధియజ్ఞః=సర్వయజ్ఞాభిమానియైన విష్ణ్వాఖ్యదేవత, అహమేవ=నేనే. (శ్రు. "యజ్ఞో వై విష్ణుః=యజ్ఞమే విష్ణువని శ్రుత్యర్థము.)యజ్ఞము దేహముచేతఁ జేయఁబడుటవలన దేహమందుండునట్టిదనియు దేహమే యాధారముగాఁ గలిగినదనియు భావము.

శం. అర్జునా ! నశించెడి స్వభావముగల యెల్ల చరాచరములు నధిభూతంబని చెప్పఁబడును. అధిదైవమనగా హిరణ్యగర్భస్వరూపుఁడు. ప్రాణులయొక్క దేహములయం దంతర్యామియైన యధియజ్ఞుఁ డనియెడువాఁడు నేనే.

రామా. అధిభూతాధిదైవతములైశ్వర్యార్థులకు తెలియఁదగినవి. ఆకాశాదిభూతములయందుండెడు శబ్దస్పర్శరూపరసగంధాదులును వానియాశ్రయంబులును అధిభూతము. పురుషుఁడనఁగాభోక్త-ఇంద్రుఁడుప్రజాపతి మొదలగువారిభోగ్యములకంటె విలక్షణమైనశబ్దాదుల ననుభవించెడి పురుషుఁడు అధిదైవతము. ఈభోక్తృత్వావస్థయైశ్వర్యాదులచే ప్రాప్యముగాఁదలపఁబడఁదగినది. అధియజ్ఞుఁడు యజ్ఞములచే నారాధింపఁబడెడు వాఁడు. పంచమహాయజ్ఞములు మొదలగు నిత్యనైమిత్తికకర్మము లాచరించెడు వేళలలో ముగ్గురు అధికారులచేత నుతలఁపఁబడవలసినది.

మధ్వ. భూతములనఁగా శరీరముతోఁ గూడిన జీవులు; వారిని అధికరించి యేదికలదో ఆవినాశి (నశించెడి) పదార్థము అధి

భూతము. అవ్యక్తమునకుగూడ మఱియొక్క విధముగానగుట యనెడి వినాశముకలదు; పురుషుఁడనఁగా జీవుఁడు. ఇచ్చట సంకర్షణుఁడైనను బ్రహ్మయైననుఅతఁడందఱు దేవతలపై నియధిపతిగాన అధిదైవతమనఁబడును. దేవాధికారములోనున్న వాఁడని కానిచె ప్పవచ్చును. అన్నియజ్ఞములను అనుభవించుట మొదలగుదాని చేత నధియజ్ఞుఁడు. అందఱు ప్రాణులశరీరమునందుండెడి విష్ణు స్వరూపము అధియజ్ఞము.

శ్లో. అంతకాలే చ మామేవ స్మర న్ముక్త్వా కళేబరమ్,
యఃప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్రసంశయః. 5

టీ. యః=ఎవఁడు, అంతకాలేచ=దేహాంతసమయమందును, మామేవ=నన్నే, స్మరన్=స్మరింపుచున్నవాఁడై, కళేబరం=శరీరమును, ముక్త్వా=విడిచి, ప్రయాతి=పోవుచున్నాఁడో, సః=వాఁడు, మద్భావం=నాస్వరూపమును, యాతి=పొందుచున్నాఁడు. అత్ర=ఈయర్థమందు, సంశయః=సందేహము, నాస్తి=లేదు.

శం. ఎవఁడంత్యకాలమందు నన్నే ధ్యానించుచున్నవాఁడై శరీరమును వదలుచున్నాఁడో వాఁడు నన్నుఁ జెందుచున్నాఁడు ఇందుల కెంతమాత్రము సందేహము లేదు.

రామా. ఇది ముగ్గురుఅధికారులకు నావశ్యకమె. మద్భావమునుఅనఁగానాయొక్క స్వభావమును. మరణకాలమునన న్నెట్లు తలంచునో యట్టియాకారముకలవాఁ డగును. ఆది భరతుఁడు మరణకాలమున తలఁపఁబడిన మృగముతో సమానమైనయాకారముకలవాఁడై పుట్టెనుగదా?

మధ్వ. మద్భావమనఁగానాయందునికిని అదిదుఃఖములేనిది నిరతిశయానందస్వభావము కలది.

శ్లో. యం యం వాపి స్మరన్ భావం త్యజ త్యంతే కళేబరమ్,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. 6

టీ. హేకౌంతేయ=ఓయర్జునుఁడా ! యః = ఎవఁడు, అంతే= అంతకాలమందు, యంయంభావం = ఏయేదేవతావిశేషమును, స్మరన్=చింతింపుచున్నవాఁడై, కళేబరం=శరీరమును, త్యజతి=త్యజించుచున్నాఁడో, సః=వాఁడు, సదా=ఎల్లప్పుడును, తద్భావభావితస్సన్ = ఆయా దేవతావిశేషమునందును చింతనము జెందినవాఁడై, తం తమేవ=ఆయాస్మరింపఁబడిన భావమునే, ఏతి=పొందుచున్నాఁడు.

శం. ఓయర్జునా! పురుషు లేయేదేవతలను జలింపనిమనస్సుతో నంత్యకాలమందు స్మరించుచు శరీరములను వదలుచున్నారో వారయ్యేదేవతలస్వరూపములను జెందుచున్నారు.

రామా. అంతకాలమందలి తలంపు, తలంచువానిని, తలంపఁబడినదానితో సజాతీయమైన ఆకారముగలవానిఁగాఁజేయును. సదాతద్భావభావితః అనునది అంతకాలపు తలంపు, అంతకు పూర్వముబ్రదికియున్నప్పుడు భావింపఁబడినదానియందె కలుగునని తెలియజేయును.

మధ్వ. సదాతద్భావభావితః అనుదానిచేతను అంతకాలస్మరణమునకు ఉపాయము చెప్పఁబడినది. భావ మనఁగా లోపలనుండెడి మనస్సు. భావితమనఁగా మిక్కిలివాసనఁగలది.

శ్లో. తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుద్ధ్యచ,
మయ్యర్పితమనోబుద్ధి ర్మామే వైష్య స్యసంశయః. 7

టీ. తస్మాత్=ఆకారణమువలన, సర్వేషు=సమస్తములయిన, కాలేషు=సమయములయందు, మాం=నన్ను, అనుస్మర=చింతించుచును, యుద్ధ్యచ = యథాశాస్త్రముగా యుద్ధముఁజేయుము. త్వం=నీవు, మయి= నాయందు, అర్పితమనోబుద్ధిస్సన్-అర్పిత=ఉంచఁబడిన, మనః=మనస్సును, బుద్ధిః=బుద్ధియుఁగలవాఁడవై, మామేవ=నన్నే, ఏష్యసి = పొందఁగలవు, అసంశయః=ఈయర్థమందు సందియములేదు.

శం. కాఁబట్టి నీవు సర్వకాలములయందును నన్నే ధ్యానించుచు యుద్ధముఁజేయుము. నాయందు నిశ్చలమయిన మనోబుద్ధులనుంచితివేని నన్నుఁజెందగలవు. ఇందుకు సందియములేదు.

రామా. మరణమువఱకు నన్నుస్మరింపుము. నాస్మృతినికలుగచేసెడి యుద్ధాదికమైన నిత్యనైమిత్తికవర్ణాశ్రమధర్మము నాచరింపుము-దీనిచేతనీబుద్ధియును మనస్సును నాయందర్పింపఁబడినవిఅయినవాఁడై అంతకాలమున నన్నెతలంపుచు నన్నుపొందెదవు.

అవ. ఉపాసనాప్రకారమును జెప్ప నారంభించుచున్నాఁడు.-

శ్లో. అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. 8

టీ. హేపార్థ = ఓ యర్జునుఁడా! అభ్యాసయోగయుక్తేన-అభ్యాస=అభ్యాసమనెడి, యోగ=యోగముతోడను, యుక్తే

న = కూడియున్నట్టియు, నాన్యగామినా = మఱియొకవస్తువును బొందనట్టి, చేతసా = మనస్సుచేతను, దివ్యం = సూర్యమండలమందుండినట్టియు, పరమం = ఉత్కృష్టుఁడైన, పురుషం = పురుషుని, అనుచింతయన్ = శాస్త్రాచార్యోపదేశములవలన స్మరింపుచున్నవాఁడై, తమేవ = ఆపరమపురుషునే, యాతి = పొందుచున్నాఁడు.

శం. అర్జునా! ఎవఁడభ్యాసయోగముతోఁ గూడుకొని యితరవ్యాకులములులేని చిత్తముతో దివ్యరూపుఁడయిన మహాపురుషుని స్మరణచేయుచున్నాఁడో వాఁడాపరమపురుషునే చెందుచున్నాఁడు.

రామా. అభ్యాసమనఁగా నిత్యనైమిత్తిక కర్మలకు విరోధములేనికాలముల యందంతటను మనస్సుచేత నుపాసింపవలసినదానిని అనుసంధించుట. యోగమనగా యోగకాలమున ప్రతిదినంబును ఆచరించవలసిన సలక్షణమైనయుపాసనము. ఈరెంటితోనుం గూడినమనస్సుచేత అంతకాలమున దివ్యపురుషుఁడనైననన్ను తలంచునేని నన్నె పొందును. ఆదిభరతునకు మృగత్వమువచ్చినట్లు ఐశ్వర్యముచేతనాతోసమానమైన ఆకారము కలవాఁడగును.

మధ్వ. సదాసద్భావభావిత్వము ఈశ్లోకముచేత స్పష్టపఱుపఁబడుచున్నది. అభ్యాసమే యోగము. దివ్యుఁడనగా సృష్ట్యాది క్రీడలుకలవాఁడు. పురుషుఁడనఁగా శరీరమున నుండువాఁడును పూర్ణుఁడును.

అవ. దేనితోఁగూడియున్నపురుషుని బొందుచున్నాఁడ నినఁ జెప్పుచున్నాఁడు.—

శ్లో. కవిం పురాణ మనుశాసితార
మణో రణీయాంస మనుస్మరే ద్యః,
సర్వస్య ధాతార మచింత్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. 9

టీ. యః=ఎవడు, కవిం=సర్వజ్ఞుఁడైనట్టియు, పురాణం=పురాణతనుఁడైనట్టియు, అనుశాసితారం=సకలప్రపంచమునకు శిక్షకుఁడైనట్టియు, అణోః=సూక్ష్మమునకంటె, అణీయాంసం=మిక్కిలి సూక్ష్మమైనట్టియు, సర్వస్య=సమస్తకర్మఫలజాతములకు, ధాతారం=విభజనకర్తయైనట్టియు, అచింత్యరూపం-అచింత్య=చింతింపనశక్యమైన, రూపం=స్వరూపముగలిగినట్టియు, ఆదిత్యవర్ణం-ఆదిత్య=సూర్యునియొక్క,వర్ణం=కాంతివంటినిత్యచైతన్యప్రకాశముగలిగినట్టియు,తమసః=అజ్ఞానలక్షణమైన మోహాంధకారమునకంటె, పరస్తాత్=పరమగువానిఁగానున్న,పురుషం=పురుషుని, అనుస్మరేత్=చింతించునో,సః=వాఁడు, (ఆపురుషుని బొందుచున్నాఁడని యుత్తరశ్లోకముతో సంబంధము.)

శం. ఆ మహాపురుషుఁడు సర్వజ్ఞుఁడు పురాణపురుషుఁడు నెల్లప్రపంచమునకు శిక్షకుఁడు సూక్ష్మమైన యణువుకన్న సూక్ష్మరూపి సమస్తచరాచరములకు కర్మఫలదాయి చింతింపనలవిగాని స్వరూపముగలవాఁడు సూర్యుని తేజస్సువంటి తేజోరూపముగలవాఁడు అజ్ఞానలక్షణమైనయంధకారమునకన్న నితరుఁడు.

రామా. అణువుకంటెను సూక్ష్ముఁడనఁగా జీవునికంటెను మిక్కిలి సూక్ష్ముఁడనుట ధాతయనఁగా సృజించువాఁడు.

అచిన్త్యరూపుఁడనఁగా మిగిలినపదార్థము లన్నిటి కంటె విలక్షణమైన స్వరూపముకలవాఁడు. తమసఃపరస్తాత్ ఆదిత్య వర్ణమ్=ప్రకృతికంటె పైభాగమున దివ్యమంగళవిగ్రహముతోఁ గూడియున్నవాఁడు ఇట్టివానిని ప్రయాణకాలమున నెవ్వఁడు తలంచునోయని యుత్తరశ్లోకముతో నన్వయము.

మధ్వ. ఈశ్లోకముచే ధ్యానము చేయవలసినది. ధాతయనగా ధారణపోషణములఁ జేయువాఁడు తమస్సుకంటెను అనఁగా నవ్యక్తముకంటెను పైనున్నవాఁడు.

శ్లో. ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేనచైవ,
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్. 10

టీ. ప్రయాణకాలే=దేహావసానసమయమందు, అచలేన=నిశ్చలమయిన, మనసాచ=మనస్సుతోడను, భక్త్యాచ=భజనముతోడను, యోగబలేనచైవ=సమాధిజసంస్కారజనితచిత్తస్థైర్యలక్షణమయిన యోగబలముతోను,యుక్తస్సన్=కూడినవాఁడై, భ్రువోః=కనుబొమలయొక్క, మధ్యే=మధ్యమందు,ప్రాణం=ప్రాణవాయువును, సమ్యక్=లెస్సగా,ఆవేశ్య=ప్రవేశింపఁజేసి, తం=ఆపురుషుని, యః=ఎవ్వఁడు, అనుస్మరేత్=స్మరించునో,సః=ఆయోగి, దివ్యం=దివ్యమయిన, పరం=ఉత్కృష్టమైన, పురుషం=పురుషుని, ఉపైతి=పొందుచున్నాఁడు.

శం. అవసానకాలమందుఁ జలింపని మనస్సుతో భక్తి వహించి యోగజన్యమైన చిత్తస్థైర్యముతో భ్రూమధ్యమందు

ప్రాణవాయువులను ప్రవేశింపఁజేసి పైఁజెప్పిన పరమపురుషుని ఎవఁడు చింతించునో అట్టి యోగపురుషుడు దివ్యోత్కృష్టమయిన మహాపురుషుని జెందుచున్నాఁడు.

రామా. ప్రతిదినము నభ్యసింపఁబడుచున్న భక్తితోఁగూడిన యోగబలముచేత సంస్కారము కలిగి యుండుటచేత నిశ్చలమైన మనస్సుకలిగి ప్రయాణకాలమున కనుబొమలమధ్యను ప్రాణమును నిలిపి, దివ్యపురుషుని యెవ్వఁడుతలంచునో వాఁడు తనినె పొందును అనఁగా నాదివ్య పురుషునితో సమానమైన ఐశ్వర్యమును పొందినవాఁడగును.

మధ్వ. వాయువులను జయించుట మొదలగు యోగముతోఁగూడినవారికి మరణకాలమున చేయవలసినది చెప్పఁబడుచున్నది. వాయుజయాదులు లేనివారైనను జ్ఞానభక్తి వైరాగ్యాదులు సంపూర్ణముగాఁ గలిగెనేని ముక్తినిపొందుదురు. వాయుజయాదులుకలవారికో యంటే జ్ఞానాదిసంపూర్తికొంచెము తగ్గినను నేర్పరులైనచో ముక్తికలుగును.

శ్లో. యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః,
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

టీ. వేదవిదః=వేదార్థమునెఱిఁగినవారలు, యత్=ఏస్థానమును, అక్షరం=నాశములేనిదని, వదంతి=చెప్పుచున్నారో, వీతరాగాః=పోయినకోరికలుగలిగిన, యతయః=జితేంద్రియులైన సన్న్యాసులు, యత్=ఏనాశరహితమైనపదమును, విశంతి=

ప్రవేశించుచున్నారో, యత్=ఏ యక్షరపదమును, ఇచ్ఛన్తస్సంతః=తెలియఁగోరుచున్నవారలై, బ్రహ్మచర్యం=బ్రహ్మచర్యమును, చరంతి=ఆచరించుదురో, తత్=ఆయక్షరాఖ్యమయిన, పదం=ప్రాప్యస్థానమును, సంగ్రహేణ=సంక్షేపముచేత, తే=నీకొఱకు, ప్రవక్ష్యే=లెస్సగాఁ జెప్పెదను.

శం. వేదార్థతత్త్వములను దెలిసినవారేస్థానమును నశింపనిదని చెప్పుచున్నారో జితేంద్రియులయి నిష్కాములయిన సన్న్యాసులేనాశరహితమైన స్థానమును బ్రవేశించుచున్నారో ఏయుత్కృష్టమయిన పదమునుగోరి మనుష్యులు గురుకులవాసము జేయుచు బ్రహ్మచర్యవ్రతమునుఁ జేయుచున్నారో అట్టి నశింపని మిక్కిలి యుత్తమమయినపదమును నీకుగాను మిగుల సూక్ష్మముగాఁ జెప్పుచున్నాను.

రామా. కైవల్యమునుకోరువారు స్మరించవలసిన ప్రకారము చెప్పఁబడుచున్నది. అస్థూలత్వము మొదలగు గుణములుగల యక్షరమును పొందుటకు బ్రహ్మచర్యము నాచరింతురో, ఏది మనస్సుచేత పొందఁబడినదై పదమనఁబడునో వేదాన్తముచే పొందఁదగిన నాయక్షరస్వరూపమును దాని యుపాసనమును సంక్షేపముగా చెప్పెదననుట.

మధ్వ. ఇందు అధ్యాయము విస్తారముగాఁ జెప్పఁబడుచున్నది. పదమనఁగా మోక్షమును గోరువారిచే పొందఁదగినది అని నిర్వచనము.

శ్లో. సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్.

టీ. సర్వద్వారాణి=నవద్వారములను, సంయమ్య=లెస్సగా నియమించి, హృది=హృత్కమలమందు, మనః=మనస్సును, నిరుద్ధ్య చ = నిలిపియును, (అప్పుడు వశీకృతమైన మనస్సుచే తను హృత్కమలమునకంటె నూర్ధ్వగామియైన నాడిచేతను ఊర్ధ్వము నెక్కించి), మూర్ధ్ని=శిరఃప్రాంతమైన భ్రూమధ్యమందు, ఆత్మనః = తనయొక్క, ప్రాణం = ప్రాణవాయువును, ఆధాయ = ఉంచి, యోగధారణాం - యోగ=యోగముయొక్క, ధారణాం=ధారణను, ఆస్థితస్సన్=ఆశ్రయించినవాఁడై, (ఉత్కృష్టమైన ప్రాప్యస్థానమును బొందుచున్నాఁడని యుత్తర శ్లోకముతో సంబంధము )

శం. ఇంద్రియద్వారములను బిగించి మనస్సును హృదయమందు నిలిపి తనప్రాణములను సహస్రారచక్రమునందుఁ జేర్చి యోగము నభ్యసించవలెను.

12 వ, 13 వ శ్లోకములకు రామా. జ్ఞానమునకు ద్వారములైన శ్రోత్రము మొదలైన నింద్రియముల నన్నిటిని వానివాని వ్యాపారములనుండి మఱలించి హృదయకమలమునను న్న అక్షరుఁడనైన నాయందునిలిపి యోగమను పేరుగల ధారణను అనగా నాయందు నిశ్చలమైనస్థితిని పొందినవాఁడై నాకు వాచకమైన ఓమ్ అనుదానిని పలుకుచు దానికి వాచ్యుఁడనైన నన్ను తలంపుము, పరమగతి అనఁగా ప్రకృతి సంపర్కము లేనివాఁడును నాతో సమానమైన యాకారము కలవాఁడునగు కైవల్యమును (ఆత్మను) పొందుచున్నాఁడు. మఱి పునరావృత్తిలేదు.

12, 13 శ్లోకములకు మధ్వ. బ్రహ్మనాడితప్ప మఱి యొక్కనాడినుండి వెడలునేని మోక్షమును పొందక సూర్యుఁడు దిక్కులు మొదలగు స్థానాంతరములు పొందును గాన అన్ని ద్వారములను నియమించి హృది (నారాయణుని) యందు మనస్సును నిలిపి (శిరస్సున ప్రాణముండగా హృదయమున మనస్సుండుట సంభవింపదు) యోగమును ధరించుట యందె మిక్కిలి యుక్తుఁడై పరమోత్కృష్టమైన మోక్షమును బొందుచున్నాఁడు.

అవ. భగవంతునిపొందుటకు సులభోపాయమును జెప్పుచున్నాఁడు.

శ్లో. ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్. 13

టీ. బ్రహ్మ=బ్రహ్మవాచకమైన, ఓమితి=ఓం అనెడి, ఏకాక్షరం-ఏక=ముఖ్యమైన, అక్షరం=వర్ణమును, వ్యాహరన్=ఉచ్చరింపుచున్నవాఁడై, మాం=ఆ ఓంకారవాచ్యుఁడైన నన్ను, అనుస్మరన్ = చింతింపుచున్నవాఁడై, దేహం = శరీరమును, త్యజన్=త్యజింపుచున్నవాఁడై, యః=ఎవ్వఁడు, ప్రయాతి=పోవుచున్నాఁడో, సః=వాఁడు, పరమం = ఉత్కృష్టమైన, గతిం = ప్రాప్యస్థానమును, యాతి = పొందుచున్నాఁడు.

శం. పరబ్రహ్మవాచకమైన ఓం అనెడి యేకాక్షరమును ఉచ్చరించుచు ఓంకారస్వరూపుఁడైన నన్నుఁ జింతించుచు నెవఁడు దేహమును వదలుచున్నాఁడో యట్టివాఁడు పరమోత్కృష్టమైన మోక్షపదమును బొందుచున్నాఁడు.

పూర్వశ్లోకమున దీనిభావము వివక్షితము.

శ్లో. అనన్యచేతాః సతతం యోమాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః. 14

టీ హే పార్థ = ఓయర్జునుఁడా! యః=ఎవఁడు, అనన్యచేతాః-అనన్య=అన్యవిషయముగానట్టి, చేతాః=మనస్సుగలవాఁడై, మాం=పరమేశ్వరుఁడైన నన్ను, సతతం=యావజ్జీవమును, నిత్యం=ప్రతిదినమును, స్మరతి=చింతింపుచున్నాఁడో, నిత్యయుక్తస్య - నిత్య=ఎల్లప్పుడును, యుక్తస్య = సమాహితచిత్తుఁడైన, తస్యయోగినః=ఆయోగికి, అహం=నేను, సులభః=సులభముగాఁ బొందశక్యుఁడైనవాఁడను,అన్యునకు సులభుఁడను గాననుట.

శం. ఓ యర్జునా! ఎవఁడు విషయాంతరములందు ప్రవేశించని నిశ్చల మనస్సుగలిగి పరబ్రహ్మస్వరూపుఁడైన నన్ను సర్వకాలములయందుఁ జింతించుచున్నాఁడో యట్టి నిరంతరధ్యానపరుఁడైనయోగికి నేను సులభుఁడను.

రామా. ప్రయత్నించినది మొదలు అన్నికాలములయందును నాతలంపు లేనిచో నిలువలేనివాఁడై అతిప్రీతితో నన్నెవ్వండుతలంచునో, నిత్యయోగమును కోరువాఁడైన యతనిని నన్ను విడువలేనివానిని, నేనే కోరెదను, నన్ను పొందుటకు తగినయుపాసనపరిపాకముగలవాఁ డగుటచేతను, ఆయుపాసన విరోధులు లేనివాఁడగుటను, నేనే మిక్కిలి ప్రియుండనైయుండుటను కలుగఁజేసెదను.

అవ. నీవు సులభసాధ్యుఁడ వగుటచేత నేమియనినఁ జెప్పు చున్నాఁడు.—

శ్లో. మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్,
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః. 15

టీ. మహాత్మానః-మహాత్ =శ్రేష్ఠమయిన, ఆత్మానః=బుద్ధి గలవారలు, మాం=నన్ను, ఉపేత్య=పొంది, పరమాం=ఉత్కృష్టమైన, సంసిద్ధిం=మోక్షసిద్ధిని, గతాస్సంతః=పొందినవారలై, దుఃఖాలయం - దుఃఖ=ఆధ్యాత్మికాదిదుఃఖములకు, ఆలయం=ఆశ్రయమైన, అశాశ్వతం=అస్థిరమైన, పునర్జన్మ=పునర్జన్మము ను, నాప్నువంతి=పొందరు.

తం. మహాత్ములైన యోగీశ్వరులు పరమోత్కృష్టమైన యోగసిద్ధిచే నన్నుఁబొందినవారై నాశాస్పదమై దుఃఖాస్పద మయినట్టి జన్మమును బొందరు.

రామా. ఈశ్లోకము మొదలు అధ్యాయాంతమువఱకు జ్ఞానికిని, కైవల్యార్థికిని, అపునరావృత్తియు, ఐశ్వర్యార్థికి పునరావృత్తియు చెప్పఁబడుచున్నది.

శ్లో. ఆబ్రహ్మభవనా ల్లోకాః పునరావర్తినోఽర్జున,
మా ముపేత్యతు కౌంతేయ పునర్జన్మ న విద్యతే. 16

టీ. హే అర్జున=ఓయర్జునుఁడా! ఆబ్రహ్మభవనాత్ =బ్రహ్మలోకముతోఁగూడ, లోకాః=సమస్తములైనలోకములు, పునరావర్తినః-పునః= మరల, ఆవర్తినః=వచ్చెడిస్వభావముగలిగినవి, హేకౌంతేయ=ఓయర్జునా! మాం=నన్ను, ఉపేత్యతు=పొంది మాత్రము, పునర్జన్మ=పునర్జన్మము, నవిద్యతే=లేదు.

శం. ఓ కౌంతేయా! బ్రహ్మాండమునకు లోబడిన యీ పల్లోకములును జీవులకు మరల జన్మముల నియ్యఁగల స్వభావము గలవి. నన్నుఁ బొందినపిదప యన్ననో పునర్జన్మములు లేవు.

మధ్వ. మహామేరువుననుండెడి బ్రహ్మయొక్కస్థానము మొదలు పునరావృత్తి లేదు. ఆక్రిందనె పునరావృత్తి.

అవ. బ్రహ్మలోకముతోఁగూడిన సకలలోకములును నెందువలనఁ బునరావృత్తిగలవని శంకించి కాలనిర్ణయమువలన నని చెప్పుచున్నాఁడు.—

శ్లో. సహస్రయుగపర్యంత మహ ర్యద్బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదోజనాః. 17

టీ. అహోరాత్రవిదః = అహోరాత్రములను దెలిసిన, తే = ఆకోవిదులు, బ్రహ్మణః = చతుర్ముఖబ్రహ్మకు, యత్ = ఏ, అహః = పగలు (కలదో దాని), సహస్రయుగపర్యంతం- సహస్ర = వేయిద్యైన, యుగ=యుగములు, పర్యంతం=తుద గాఁగలిగినదానినిగా, రాత్రిం=రాత్రిని, యుగసహస్రాంతాం- యుగ=యుగములయొక్క, సహస్ర=వేయి, అంతాం=తుదగా గలిగినదానినిగా, విదుః= తెలియుదురు.

శం. సహస్ర మహాయుగకాల నిర్ణీతమయిన బ్రహ్మయొక్క పగటిని అంతయే పరిమాణముగల బ్రహ్మయొక్క రాత్రిని ఏగొప్పవారు తెలియుదురో అట్టివారే రేయుంబవళ్లు తెలిసినవారలుగా నున్నారు. బ్రహ్మయనఁగా ప్రజాపతి. అతఁడె విరాట్టు.

రామా. బ్రహ్మయనఁగా చతుర్ముఖుఁడే. యుగములనఁగా చతుర్యుగములు.

మధ్వ. నన్ను పొందినపైన పునరావృత్తి లేదని తెలియఁ జేయుటకు అవ్యక్తుఁడను పేరు గల తన సామర్థ్యమును చూపు టకు ప్రళయాదులు చూపఁబడుచున్నవి. సహస్రమనఁగా అనే కములనుట బ్రహ్మముయొక్క యనఁగా పరబ్రహ్మముయొక్క ద్విపరార్ధప్రళయమె ఇచ్చట వివక్షింపఁబడినది.

శ్లో. అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవం త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే.　　18

టీ. అహరాగమే-అహః=బ్రహ్మదేవుని పగటియొక్క, ఆగ మే=ఆగమన కాలమందు, అవ్యక్తాత్=బ్రహ్మదేవునివలన, స ర్వాః=సమస్తములైన, వ్యక్తయః=స్థావరజంగమాత్మకములైన జంతువులు, ప్రభవంతి=పుట్టుచున్నవి, రాత్ర్యాగమే=ఆబ్ర హ్మకు రాత్రివచ్చినకాలమందు, వ్యక్తయః=ఆజీవరాసులు, త త్రైవావ్యక్తసంజ్ఞకే=ఆ బ్రహ్మదేవునియందే, ప్రలీయంతే=అ డఁగుచున్నవి.

శం. బ్రహ్మయొక్కపగటికాలము ప్రారంభమం దవ్యక్తమైన ప్రకృతిలోనుండి వ్యక్తమైన స్థావరజంగమాత్మకసర్వభూతప్ర పంచములుఁ బుట్టుచున్నవి. ఆబ్రహ్మకు రాత్రికాలప్రారంభ ములో నీ సమస్తప్రపంచములు నవ్యక్తమయిన ప్రకృతిలో మరల లీనమగుచున్నది.

రామా. వ్యక్తయః = వ్యక్తులనఁగా మూడులోకముల లోనుండు శరీరములు, ఇంద్రియములు భోగములు భోగస్థా

నములు, అవ్యక్తమనఁగా చతుర్ముఖభోగావస్థను పొందిన ప్రకృతి.

మధ్వ. అవ్యక్తుఁడనఁగా భగవంతుఁడు.

శ్లో. భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే. 19

టీ. హేపార్థ=ఓయి యర్జునుఁడా! సఏవాయం=ఆయీ, భూతగ్రామః=భూతసమూహమే, అవశస్సన్=అస్వతంత్రమైనదై, భూత్వాభూత్వా=పుట్టిపుట్టి, రాత్ర్యాగమే=రాత్రివచ్చినసమయమందు, ప్రలీయతే=లీనమవుచున్నది. (ఈప్రకారముగా,) అహరాగమే = పగలువచ్చినసమయమందు, ప్రభవతి =పుట్టుచున్నది.

తా. ఓయర్జునా! ఏప్రాణిసమూహము తత్పూర్వకల్పమునందు జన్మించెనో యాప్రాణిసమూహమే స్వాధీనము లేనిదై పగలువచ్చినప్పుడెల్ల కర్మవశ్యములై పుట్టుచు రాత్రివచ్చినపుడెల్ల లీనమగుచునున్నది.

శ్లో. పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తా త్సనాతనః,
య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి. 20

టీ. తస్మాత్=ఆపూర్వోక్తమైన, అవ్యక్తాత్=భూతసమూహమునకు గారణభూతుఁడైన చతుర్ముఖునికంటె, పరః=ఉత్కృష్టమైనదియును, అన్యః=వ్యతిరిక్తమయినదియును, అవ్యక్తః = అగోచరమయినదియును, సనాతనః = శాశ్వతమయినదియునైన, యోభావః=ఏయక్షరబ్రహ్మము కలదో, సః=ఆపరబ్ర

హ్మము, సర్వేషుభూతేషు=సమస్తశరీరములు, నశ్యత్సునత్సు=నశించుచున్నను, నవినశ్యతి=నశింపదు.

శం. పై జెప్పిన భూతమయప్రపంచములకుఁ గారణరూపుఁడైన యీశ్వరునికన్న వేఱై యుత్కృష్టమైయగోచరమై శాశ్వతమై యుండు పరబ్రహ్మమనునది యొక్కటిగలదు. ఆపరబ్రహ్మము సమస్తప్రపంచములు నశించుచున్నను నశించునదికాదు.

శ్లో. అవ్యక్తోఽక్షరఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్,
యం ప్రాప్య ననివర్తంతే తద్ధామ పరమం మమ. 21

టీ. యః=ఏపరబ్రహ్మము, అవ్యక్తః = ఇంద్రియగోచరముకాని, అక్షరః=నాశరహితము, ఇతి = ఇట్లని, ఉక్తః=చెప్పఁబడెనో, తం=దానిని,పరమాం=ఉత్కృష్టమైన, గతిం=ప్రాప్యస్థానమునుగా, ఆహుః=చెప్పుచున్నారు, యం=ఏభావమును, ప్రాప్య=పొంది, ననివర్తంతే=జన్మాదులకుఁ దిరుగరో, తద్ధామ=ఆస్థానము, మమ=నాయొక్క, పరమం=పరమపదము.

శం. ఏ పరబ్రహ్మము ఇంద్రియములకుఁ గోచరముగాక నాశరహితముగా నున్నదని చెప్పఁబడెనో దేనికి సాధనము మొదట ఓంఇత్యేకాక్షరంబ్రహ్మమని చెప్పఁబడెనో అదియే మిక్కిలి ఉత్కృష్టమయిన మోక్షస్థానముగాఁ జెప్పఁబడుచున్నది. ఆస్థానమును బొందినవారికి మరల జన్మములేదు. అదియే నాస్థానమయిన పరమపదముగా నెఱుఁగుము.

రామా. 20, 21 వ తాత్పర్యము. అవ్యక్తముకంటె ననఁగా నచేతనమైన ప్రకృతికంటెనుత్కృష్టంబును, విలక్షణంబును, ఏప్రమాణముచేతను తెలియంబడఁదగనిదై తనకు మా

త్రము తెలియఁదగిన యాకారము కలదియునగు పరిశుద్ధాత్మ స్వరూపము అక్షరము - అనగా ప్రకృతిసంబంధము పోయిన ఆత్మస్వరూపము - దీనిపొందుటయే కైవల్యము-అది అపునరావృత్తియైనది - ధామమనఁగా నియమనస్థానము - దానితోఁ గలిసి యున్న జీవుఁడనెడి ప్రకృతి రెండవనియమనస్థానము - అచేతన సంసర్గము పోయిన ముక్తస్వరూపము గొప్పనియమనస్థానము-ధామశబ్దమునకు ప్రకాశముఁగూడ నర్థముకాన ప్రకృతి సంపర్కముకలిగి పరిమితజ్ఞానము కలయాత్మకంటె, అపరిమితజ్ఞానము గల ముక్తస్వరూపము గొప్పప్రకాశమనియు నర్థము చెప్పవచ్చును. ఏదిఅవ్యక్తముకంటె గొప్పదో యని మొదలిడి ఏది సర్వభూతములు నశించినను నశింపదో ఆయవ్యక్తమె అక్షరమని యన్వయము.

మధ్వ. ధామశబ్దమునకు స్వరూపము తేజస్సు.

శ్లో. పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా,
యస్యాంతస్స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్. 22

టీ. హే పార్థ=అర్జునా! భూతాని=ప్రాణులు, యస్య=ఏ పురుషునియొక్క, అంతస్స్థాని=లోపలనున్నవో, యేన=ఏపురుషునిచేత, సర్వం=సమస్తమైన, ఇదం=ఈజగత్తు, తతం=వ్యాపించఁబడెనో, సః=ఆ, పరః=ఉత్కృష్టుఁడయిన, పురుషః=పురుషుఁడు, అనన్యయా=ఇతరమందాసక్తిలేని, భక్త్యా=జ్ఞానముచేత, లభ్యః=పొందఁదగినవాఁడు.

శం. ఓయర్జునా! ఏగొప్పవానియందు దీయెల్లలోకములు లీనమయియున్నవో ఏమహాపురుషునివల్ల నీలోకము లన్నియు

వ్యాపింపఁబడియున్నవో అట్టి పరమపురుషుని నితరాసక్తిలేని చలించని జ్ఞానముచేతఁ బొందవచ్చును.

రామా. జ్ఞానియొక్క ప్రాప్యము కైవల్యము కంటె విలక్షణమైనదని తెలియఁజేయుచున్నది. ఆపరమపురుషుఁడె విషయముగాఁగలిగి భక్తియోగముచేత నట్టి పురుషుని పొందవచ్చును.

మధ్వ. ఈశ్లోకముచేత పరమపురుషపరమసాధనత్వవివక్షితము.

శ్లో. యత్ర కాలే త్వనావృత్తి మావృత్తించైవ యోగినః,
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ. 23

టీ. హే భరతర్షభ=ఓయర్జునా ! యత్రకాలేతు=ఏకాలమందు,ప్రయాతాః=మరణమును జెందిన, యోగినః=కర్మయోగులు, ఆవృత్తిం=పునర్జన్మమును, యాంతి=పొందుచున్నారో, యత్రి=ఏకాలమందు, ప్రయాతాః=పోయిన, యోగినః=కర్మయోగులు, అనావృత్తిం=పునర్జన్మరాహిత్యమును, యాంతి=పొందుచున్నారో, తంకాలం = ఆకాలమును, వక్ష్యామి=చెప్పెదను.

శం. ఓయి ధనంజయా ! ప్రణవోపాసకులు శరీరమును వదలినవారై యేత్రోవను వెళ్ళి మరల జన్మములను పొందరో, కర్మయోగులు శరీరమును వదలినవారై యేత్రోవను వెళ్ళి మరల జన్మములనుఁ బొందుచున్నారో ఆ మార్గములను జెప్పుచున్నాను.

రా. కాలమనఁగా మార్గము కైవల్యమును బొందు వానికిని భగవత్ప్రాప్తిని పొందువానికిని గూడ ననావృత్తిమార్గమె. పుణ్యకర్మములు చేయువారికి ఆవృత్తిమార్గము.

శ్లో. అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణం,
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

టీ. అగ్నిః=అగ్న్యభిమాని దేవతయు, జ్యోతిః=జ్యోతిరభిమాని దేవతయు, అహః=దివాభిమాని దేవతయు, శుక్లః=శుక్లపక్షాభిమాని దేవతయు, షణ్మాసాః = షణ్మాసాత్మకమయిన, ఉత్తరాయణం = ఉత్తరాయణాభిమాని దేవతయును మార్గమైయున్నది, తత్ర=ఆమార్గమందు, ప్రయాతాః=పోయిన, బ్రహ్మవిదః=బ్రహ్మవేత్తలయిన (సగుణోపాసకులైన), జనాః=జనులు, క్రమేణ=క్రమముగా, బ్రహ్మ=బ్రహ్మమును, గచ్ఛంతి=పొందుచున్నారు.

శం. ఏత్రోపయందు అగ్న్యభిమాని దేవతయు దివసాభిమాని దేవతయు శుక్లపక్షాభిమాని దేవతయు ఉత్తరాయణాభిమాని దేవతయు ప్రాపకులుగా నున్నారో దేహములువదలి ఆయర్చిరాదిమార్గమున వెళ్ళు ప్రణవోపాసకులు క్రమముగా ముక్తిఁ జెందుచున్నారు.

శ్లో. ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనం,
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

టీ. ధూమః=ధూమాభిమాని దేవతయు, రాత్రిః=రాత్ర్యభిమాని దేవతయు, తథా=అలాగుననే, కృష్ణః = కృష్ణపక్షాభిమాని దేవతయు, షణ్మాసాః=షణ్మాసాత్మకమయిన, దక్షిణాయ

నం = దక్షిణాయనాభిమానిదేవతయును మార్గమైయున్నది. తత్ర=ఆమార్గమందు, ప్రయాతః=పోయిన, యోగీ=కర్మయోగి, చాంద్రమసం=చంద్రసంబంధమయిన, జ్యోతిః = ఇష్టాపూర్తాదిఫలమును, ప్రాప్య=పొంది, నివర్తతే=మరలుచున్నాఁడు.

శం. ఏమార్గమున ధూమాభిమానిదేవతయు రాత్ర్యభిమానిదేవతయు కృష్ణపక్షాభిమానిదేవతయు దక్షిణాయనాభిమానిదేవతయు ప్రాపకులుగా నున్నారో శరీరములను వదలి ఆధూమాదిమార్గమున వెళ్ళు కర్మయోగులు చంద్రలోకమును బొంది కర్మనశించినవెనుక పునర్జన్మముల నెత్తుచున్నారు.

శ్లో. శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః. 26

టీ. శుక్లకృష్ణే=జ్ఞానాజ్ఞానప్రకాశకములైన, శాశ్వతే=నిత్యములైన, జగతః=లోకమునకు,మతే=సమ్మతములైన, ఏతే=ఈరెండును, గతీ=మార్గములు (ఈమార్గములలో), ఏకయా=ఒకటైన శుక్లమార్గముచేత, అనావృత్తిం = రాకయుండుటను, యాతి=పొందుచున్నాఁడు. అన్యయా=మఱియొకటగు కృష్ణమార్గముచేతనైతే, పునః=మరలి, ఆవర్తతే=వచ్చుచున్నాఁడు.

శం. ఈపైప్రకార మీప్రపంచమునకు శుక్లకృష్ణములనే జ్ఞానాజ్ఞానప్రకాశములైన రెండుమార్గములు శాశ్వతముగా నేర్పడియున్నవి. వానిలో జ్ఞానప్రకాశమైన శుక్లమార్గము పునర్జన్మములు లేనిదిగాను, అజ్ఞానప్రకాశమైన కృష్ణమార్గము మరల జన్మములు గలదిగాను ఉన్నది.

రామా. శుక్లగతియనఁగా నర్చిరాదిమార్గము; కృష్ణగతియనఁగా ధూమాదిమార్గము. ఈగతులురెండు విధములైన జ్ఞానులకు కలవు. పుణ్యకర్మములుకలవారికిని తప్పవని శ్రుతిలోఁజెప్పఁబడినవి.

శ్లో. నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. 27

టీ. హే పార్థ=ఓయర్జునా! ఏతే=ఈచెప్పఁబడిన, సృతీ=మార్గములను, జానన్ = తెలిసిన, కశ్చన = ఒకానొకఁడైన, యోగీ=యోగి,నముహ్యతి=మోహమునొందఁడు. తస్మాత్ = ఆకారణమువలన, సర్వేషుకాలేషు = సమస్తకాలములయందును, త్వం=నీవు, యోగయుక్తః=యోగముతోఁ గూడినవాఁడవు, భవ=కమ్ము.

శం. అర్జునా! పైనుదాహరించిన రెండుత్రోవలు నెఱిఁగిన యోగులు మోసపోనేరరు. అందువలన నెల్లకాలములయందు నీవు యోగముతోఁ గూడినవాఁడ వగుము.

రామా. ఈమార్గముల నెఱిఁగిన యోగి ప్రయాణకాలమున మోహమును జెందఁడు. తనయర్చిరాది మార్గముననే పోవును. కాఁబట్టి ప్రతిదినంబును అర్చిరాది మార్గంబును తలంచుటయనెడి యోగము కలవాఁడవు అగుము.

మధ్వ. ఈ మార్గమును తెలిసికొని ఉపాయమును ఆచరించువాఁడు మోహమును జెందఁడు.

శ్లో. వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్,

అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్. 28

టీ. వేదేషు=వేదములయందును, యజ్ఞేషు=యజ్ఞములయందును, తపస్సు=తపస్సులయందును, దానేషుచైవ=దానములయందును, యత్=ఏ, పుణ్యఫలం=పుణ్యఫలము, ప్రదిష్టం=ఉపదేశింపఁబడెనో, తత్సర్వం=ఆసమస్తఫలమును, యోగీ=యోగి, అత్యేతి = అతిక్రమించుచున్నాఁడు. కించ=ఇంతియకాదు. ఇదం=ఈయర్థమును, విదిత్వా=ఎఱిఁగి, ఆద్యం=ఆదికారణమైన, పరం=ఉత్కృష్టమైన, స్థానం=బ్రహ్మమును, ఉపైతి=పొందుచున్నాఁడు.

శం. యోగులు వేదార్థములు తెలిసికొనుటయందేమి క్రతువులు జేయుటయందేమి తపస్సులు చేయుటయందేమి దానములయందేమి చెప్పియుండు ఫలములను లక్ష్యము చేయరు. దీనియందు గల ఫలములు పునర్జన్మహేతువు లని యెఱిఁగినవారై యాదికారణమై పరమోత్కృష్టమైన పరబ్రహ్మమును బొందుచున్నారు.

రామా. ఈసప్త మాష్ట మాధ్యాయములలోఁ జెప్పఁబడిన భగవన్మాహాత్మ్యమును తెలిసికొనినవాఁడు వేదాభ్యాసాది సమస్తపుణ్య కార్యములయందును ఏఫలము చెప్పఁబడినదో దాని నతిక్రమించు చున్నాఁడు. భగవన్మాహాత్మ్యమును తెలిసికొనుట యనెడి సుఖముతప్ప రెండవదానిని గడ్డిపరకను వలె తలఁచుచున్నాఁడు అటుపైని యోగియనఁగా జ్ఞానియై, జ్ఞానికి పొందఁదగిన గొప్ప జ్ఞానమును పొందు చున్నాఁడు.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే అక్షరపర
బ్రహ్మ యోగో నామ అష్టమోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునుల సంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయం దక్షరపరబ్రహ్మ యోగ
మనెడి అష్టమాధ్యాయము.

---

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## రా జ వి ద్యా రా జ గు హ్యా యో గః.

శ్రీ భగవా నువాచః—

శ్లో. ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. యత్=ఏజ్ఞానమును, జ్ఞాత్వా=ఎఱిఁగి, అశుభాత్=సంసారమునుండి, మోక్ష్యసే=ముక్తుఁడవు కాఁగలవో, తత్=ఆ, గుహ్యతమం=మిక్కిలిగోప్యమయిన, విజ్ఞానసహితం=అనుభవజన్యజ్ఞానముతోఁగూడిన, ఇదం జ్ఞానం=అంతయును వాసుదేవుఁడనెడి ఈజ్ఞానమును, అనసూయవే = అసూయారహితుఁడవైన, తే=నీకొఱకు, ప్రవక్ష్యామి=లెస్సగాఁ జెప్పెదను.

తా. అసూయలేని నీకు శాస్త్రసిద్ధమై యనుభవముతోఁగూడుకొనినయీక్రిందఁజెప్పఁబోవుడి రహస్యమగు వాసుదేవుఁడనెడిజ్ఞానమును తెలియఁజెప్పెదను. దానిని తెలిసికొంటివేని అశుభమగు సంసారబంధమునుండి నీవు నివృత్తుఁడవు కాఁగలవు.

రామా. జ్ఞాన మనఁగా భక్తిరూపమైన యుపాసనము. విజ్ఞాన మనఁగా ఉపాసనయొక్క గతివిశేషములజ్ఞానము.

అసూయలేనివాఁ డనఁగా నామాహాత్మ్యమును విని దానిని నమ్మినవాఁడు.ఏజ్ఞానము అనుష్ఠానపర్యంతముగా (ఆచరించుట వఱకును) తెలిసికొని నన్ను జెందుటకు విరోధియైనయశుభమునుండి విడువంబడుదువో అట్టిభక్తిరూపమైన యుపాసనమును నీకుఁ జెప్పెదను లెస్సగా వినుము.

శ్లో. రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. 2

టీ. ఉత్తమం=ఉత్కృష్టమైన, పవిత్రం=పావనమైన, ఇదం=ఈబ్రహ్మజ్ఞానము, రాజవిద్యా=విద్యలలో శ్రేష్ఠమయినదియును, రాజగుహ్యం=రహస్యములలో శ్రేష్ఠమయినదియును, ప్రత్యక్షావగమం =ప్రత్యక్షసుఖబోధక మయినదియును, ధర్మ్యం=ధర్మముతోఁగూడుకొనునదియును, కర్తుం=చేయుటకొఱకు, సుసుఖం=మిక్కిలి సుఖకరమయినదియును, అవ్యయం=నాశము లేనిదియును.

శం. ఈ జ్ఞానము పరమోత్కృష్టమైనదిగా పరమపావనమైనదిగా మిక్కిలి శ్రేష్ఠమైనదిగా పరమరహస్యమైనదిగా ప్రత్యక్షసుఖబోధక మైనదిగా ధర్మముతోఁ గూడుకొనునదిగా నాశరహితమయినదిగా నభ్యసించుటకు సులభమయినదిగా నున్నది.

రామా. ఈజ్ఞానము, విదివిదైన గంభీరమైన మనస్సుగలవారలుగాన రాజులకె యర్హమైనది. నన్ను పొందుటకు విరోధులైన పాపములనన్నిటిని ఈజ్ఞానము పోఁగొట్టును. ప్రత్యక్షవిషయము గలది. భక్తిరూపమై యుపాసనాదులచే సేవిం

పఁబడుచున్న నేను అప్పుడె యారాధించువానికి ప్రత్యక్షుఁడ నగుదును - మఱియును ఈజ్ఞానము నిశ్శ్రేయస్సు, మంగళకరమైనది. గొప్పమేలు నొసగూర్చునది. నన్ను పొందుటకు సాధనమువంటిది. ఇది యాచరించఁబడుచుండఁగనె సుఖమును కలుగఁజేయును. నన్ను పొందించియు తాను నశింపదు. ఇట్టి యుపాసకునకు ప్రీతిఁజెందినవానికి నన్నిచ్చియును వానికి నేనే మియు చేయనైతినే యని నాకు తోఁచును.

మధ్వ. ఈజ్ఞానము ప్రధానవిద్య. ప్రధానరహస్యము. దీనిచే ప్రత్యక్షమైన బ్రహ్మము తెలియఁబడును- భగవంతుఁడే విషయముగాఁ గలది.

శ్లో. అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని. 3

టీ. హేపరంతప=ఓయి అర్జునా! అస్య ధర్మస్య=ఈయాత్మజ్ఞానధర్మమును, అశ్రద్ధధానాః=విశ్వసించని, పురుషాః=నాస్తికులయినపురుషులు, మాం=నన్ను, అప్రాప్య=పొందక, మృత్యుసంసారవర్త్మని=మృత్యురూపమయినసంసారమార్గమందు, నివర్తంతే=నిశ్చయముగా తిరుగుచున్నారు.

తా. అర్జునా! ఇట్టి దేహమె యాత్మ యనుకొనుఆత్మజ్ఞానధర్మమును నమ్మని మనుష్యులు నన్నుఁజెందక అనఁగా అందుకు సాధనమైన భక్తినిగూడ పొందక మృత్యువుతోఁగూడిన సంసారమునకు లోఁబడుచున్నారు.

రామా. ఈయుపాసనమును స్వీకరించుటకు తగినదశను పొందియును నమ్మకముతో గూడినత్వరలేనివారై మృత్యురూపమగు సంసారమార్గమున నిశ్చయముగా నున్నారు.

శ్లో. మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా,
మత్స్థాని సర్వభూతాని. న చాహం తే ష్వవస్థితః. 4

టీ. అవ్యక్తమూర్తినా=ఇంద్రియగోచరముగాని స్వరూపముగల, మయా=నాచేత- నాయొక్క పరమభావముచేత, సర్వం=సమస్తమయిన, ఇదం జగత్=ఈజగత్తు, తతం=వ్యాప్తమయినది, సర్వభూతాని=సమస్తజీవములును అనఁగా బ్రహ్మ మొదలు గడ్డికాడవఱకునుండు జీవములు, మత్స్థాని=నాయందుండునట్టివి. అహంచ=నేనైతే, తేషు=ఆభూతములయందు, నావస్థితః=ఉన్నవాఁడనుగాను.

శం. ఈసమస్తజగత్తు నింద్రియములకు గోచరముగానిరూపముగల నాచే వ్యాపింపఁబడియున్నది. ఈసమస్తప్రాణిసమూహములు నాయందున్నవి. నే నాప్రపంచములనంటియున్నవాఁడను కాను. ఆత్మలేనిభూత మొక్కటియు వ్యవహారమునకు తగదుగాన నాయందున్నవి. అనఁగా నేను ఆత్మయగుటచే నాత్మకలవైయున్నవి. ఆభూతములకు నేనాత్మను కాన నేను వానియందున్నానని మూఢబుద్ధులకు తోఁచును. ఒకవస్తువునకు మఱియొకవస్తువు తోడవలెనాకు వానితో సంశ్లేషము లేదు గాన నేను వానియందు లేననిచెప్పుచున్నాను. నేను సంసర్గము లేనివాఁడను గావుననె బ్రహ్మాదిభూతములు నాయందున్నవియును గావు.

రామా. (4,5 శ్లోకతాత్పర్యము) - చేతనాచేతన స్వరూపమగు నీజగత్తును నిలుపుటకును నియమించుటకును అంతర్యామినై నేను వ్యాపించియున్నవాఁడను- నేను వానియందు లేదు అనఁగా నాయునికి వానికి అధీనముకాదు. నేను నిలిచియుండు

టకు వానియుపకార మేమియు లేదు. నీళ్ళకు కడవ యాంధారమగు నట్లు నేను వానిని ధరింపుచున్నవాఁడనుగాను. నాసంకల్ప ముచేతనే వానిని నిలువబెట్టుచున్నాను. నేను సమస్తభూత ములను పోషించువాఁడను. వానివలన నాకేమియు నుపకార ము లేదు. భూతములను కలుగఁజేయునదియును నియమించు నదియును అనెడి యీయాశ్చర్యమైన అనఁగా మఱియొక్క చో నూహింపశక్యముకాని యోగమును చూడుము- అనుట. నాయాత్మ యనఁగా నాసంకల్పము.

శ్లో. న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. 5

టీ. భూతాని=బ్రహ్మాదిస్థావరాంతభూతములు, మత్స్థాని= నాయందున్నవి, నచ=కావు. (మఱియేమనిన), ఐశ్వరం= ఈశ్వరసంబంధమైన, మే=నాయొక్క, యోగం=చాతుర్యము ను, పశ్య=చూడుము. మమ=నాయొక్క, ఆత్మా=స్వరూప ము, భూతభృత్=ప్రాణులభరించునదియును, భూతభావనః= ప్రాణులను వృద్ధిఁ బొందించునదియును, (అయినను), భూత స్థః=భూతములయందున్నది, నచ=కాదు.

శం. బ్రహ్మాదిస్థావరాంతభూతములు నాయందున్నవి కావు. అయినను నాస్వరూప మెల్లను పంచభూతములను భరించుచు నభివృద్ధిఁజెందించుచు నుండినను నే నాభూతములయందు చేరి నవాఁడను గాను. ఈచమత్కారమైన నాస్వరూపమును దెలిసి కొనుము. మమాత్మా = నాయాత్మయనుట. లోకబుద్ధ్యాను

సారముగా అనఁగా లోకులెన్ను రీతిని అనుట. లోకమునం దజ్ఞానులు దేహమును పరమేశ్వరుఁడనుకొనునట్లు, ఆత్మయైన భగవంతునకు మఱియొకఆత్మ లేదుగదా?

శ్లో. యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ. 6

టీ. యథా=ఏప్రకారముగా, సర్వత్రగః=అంతటవ్యాపించియున్న, మహాన్=అధికమయిన, వాయుః=వాయువు, నిత్యం=నిత్యమును, ఆకాశస్థితః=ఆకాశమందున్నదో, తథా=ఆప్రకారముగా, సర్వాణిభూతాని=సమస్తప్రాణులు, మత్ స్థానీతి=నాయందున్నవని, ఉపధారయ=తెలియుము.

శం. ఎల్లెడల వ్యాపించియున్న గొప్పవాయు వాకాశమం దేవిధముగ నణఁగియున్నదో ఆవిధముగ సమస్తభూతప్రపంచములు నాయందు సంశ్లేషములేక నాయం దున్నవని యెఱుఁగుము.

రామా. నిరాలంబమున నున్నవాయు వంతటను సంచరింపుచున్నది. ఆనిరాలంబనమైన వాయువు నాయధీనమైన యునికిగలదని అవశ్యముగా నంగీకరింపవలసినదై నాచేత ధరింపఁబడినదని యెట్లు తెలియఁబడుచున్నదో, అట్లె అన్ని భూతములును వానికి కనుపడని నాయందుండి నాచేత ధరింపఁబడినవని నిశ్చయించుకొనుము.

మధ్వ. ఆకాశమునం దున్నవాయువు స్పర్శము మొదలగు వానిని పొందనట్లు నాయందున్నవియు నాయందు లేనివియగు

భూతములకై నాసంశ్లేషము లేకయుండియును నాచేత ధరింపఁ బడునవని తెలియుము.

శ్లో. సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్. 7

టీ. హేకౌంతేయ=అర్జునా! కల్పక్షయే=కల్పాంతమందు, సర్వభూతాని=సమస్తప్రాణులు, మామికాం=నాసంబంధమైన, ప్రకృతిం=త్రిగుణాత్మకమగుమాయను, యాంతి=పొందుచున్నవి. అహం=నేను, కల్పాదౌ=సృష్టికాలమందు, తాని=ఆసర్వభూతములను, పునః=తిరిగియు, విసృజామి=పుట్టించుచున్నాను.

శం. అర్జునా! ప్రళయకాలమం దెల్లభూతములు నాసంబంధమైన ప్రకృతిలో లయించిపోవుచున్నవి మరల సృష్టిప్రారంభమున నెల్ల ప్రపంచములను నేను పుట్టించుచున్నాను.

రామా. స్థావరజంగమాత్మములగు భూతము లన్నియు చతుర్ముఖుని యవసానకాలమున నాయది యనఁగా నాకు శరీరమైన ప్రకృతి యనఁగా నామరూపవిభాగములేని అవిభక్తతమస్సును సృష్టిసంగ్రహమును పొందుచున్నవి.

మధ్వ. జ్ఞానమును జూపుటకై ప్రళయాదులు విస్తృత మగుచున్నవి అనుట.

శ్లో. ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. 8

టీ. స్వాం=స్వకీయమైన, ప్రకృతిం=మాయను, అవష్టభ్య=అవలంబించి, ప్రకృతేః= స్వభావముయొక్క, వశాత్ =అధీనతవలన, అవశం = అవిద్యాదిదోషములచేత నస్వతంత్రమైన,

కృత్స్నం=సమస్తమైన, ఇమం భూతగ్రామం= ఈభూతసమూహ మును, పునఃపునః = మాటిమాటికి, విసృజామి = పుట్టించు చున్నాను.

శం. అస్వతంత్రమైన యీసమస్తభూతసమూహమును వానిప్రకృతి యను మాయను జెంది యాప్రకృతిస్వభావను వలన మరల మరల నేను పుట్టించుచున్నాను.

మధ్వ. కాళ్ళునడచుటకు సమర్థుఁడైనవాఁడె లీలచేత కఱ్ఱ నుపట్టుకొనినడచునట్లు భగవంతుఁడు ప్రకృతిచేత సమస్తభూత ములను పుట్టించుచున్నాఁడు.

శ్లో. న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు. 9

టీ. హేధనంజయ=అర్జునా! తేషుకర్మసు=ఆకర్మములయం దు, అసక్తం=అభిమానములేని, ఉదాసీనవత్ = ఉపేక్షకునివ లెనే, ఆసీనం = ఉన్నట్టి, మాం=నన్ను, తానికర్మాణి = ఆక ర్మములు, న నిబధ్నంతి=బంధింపవు.

శం. ధనంజయా! ఈ సృష్ట్యాదికర్మలయందు నాకుఁ బ్రీతి లేదు. లక్ష్యమునులేదు గాన ఈ కర్మలు నన్నంతమాత్రము బంధింపవు. కాఁబట్టియె మఱియెవ్వఁడును ఫలసంగమును కర్తృత్వాభిమానము లేనివాఁడు బంధమును పొందఁడు.

రామా. ఆకర్మములు అనఁగా భూతములను హెచ్చు తగ్గులుగా సృష్టి చేయుట మొదలగునవి నన్ను బంధింపవు. నాకు దయలేకపోవుట మొదలగువానిని కలుగఁజేయవు. జీవుల

పూర్వకర్మములే విషమసృష్టికి హేతువులు. ఆవైషమ్యమున నాకు సంబంధము లేదు అనుట.

మధ్వ. అసక్తమ్ అనఁగా ఉదాసీనునివలె నుండును గాని ఉదాసీనుఁడు కాఁడు. ఎవ్వనికి సంగములేక పోవుటవలన సర్వకర్మశక్తియు కలుగుచున్నదో వానికి సర్వకర్మబంధమెట్లు కలుగును? ఎవ్వఁడు కర్మమును గూడ నియమించునో వానిని కర్మ మెట్లు బంధించును? అనుట.

శ్లో. మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్,
హేతునాఽనేన కౌంతేయ జగ ద్విపరివర్తతే. 10

టీ. హేకౌంతేయ=ఓయర్జునా! అధ్యక్షేణ=జ్ఞానమాత్రస్వరూపుఁడను ఆత్మనగునేను సాక్షిగానుండఁగా, మయా=నాచేత, ప్రకృతిః=త్రిగుణాత్మికమైన మాయ, సచరాచరం=స్థావరజంగమములతోఁ గూడిన ప్రపంచమును, సూయతే=పుట్టించుచున్నది. అనేన హేతునా=ఈసాక్షిత్వనిమిత్తముచేత, జగత్=జగత్తు, విపరివర్తతే=వర్తించుచున్నది.

శం. అర్జునా! సాక్షిభూతమైన నాచే సమస్తచరాచర ప్రపంచములు ప్రకృతియందుఁబుట్టుచున్నవి. పైనుదాహరించిన నాసాక్షిత్వముచేతనే యీప్రపంచమంతయుఁ దిరుగుచున్నది.

రామా. క్షేత్రజ్ఞులకర్మము ననురించియె నేను ప్రకృతి కధ్యక్షుఁడనై యుందును. ఇందువలననె నాకు నైర్ఘృణ్యాది (దయలేక పోవుట మొదలగు) దోషములు లేవు.

మధ్వ. ప్రకృతియొక్క సూతిని నేనే. అనఁగా సృష్టిని చూచెడికర్తను నేనే. ఉదాసీనునివలెనుంటినా ప్రకృతి స్వయముగానే సృజించును.

శ్లో. అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్,
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్. 11

టీ. భూతమహేశ్వరం=ప్రాణినియామకమైన,పరం=ఉత్కృష్టమైన, మమ=నాయొక్క, భావం = తత్త్వమును, అజానంతః=తెలియనట్టి, మూఢాః=అవివేకులు, మాం=నన్ను, మానుషీం తనుం=మనుష్య దేహమును, ఆశ్రితమితి=ఆశ్రయించినవానినిగా, అవజానంతి=అవజ్ఞ జేయుచున్నారు.

శం. పరమోత్కృష్టమయి ప్రపంచనియామకమయిన నా తత్త్వమును దెలియని మూఢజనులు నేను మనుష్యశరీరము నవలంబించిన హేతువుచే నన్నలక్ష్యముచేయుచున్నారు.

రామా. భూతములకు పరమేశ్వరుఁడనైన నన్ను మనుష్యశరీరముపొందినవాఁడ నగుటచేత మూఢులు ప్రాకృత మనుజునిగా భావించెదరు. ఈశ్వరుఁడనై యుండియు కారుణ్యాదులచేత నీదేహముల నెత్తవలసినది యావశ్యకము.

మధ్వ. పరమోత్కృష్టమై, మూఢజనులకు మనుష్య సంబంధియగు, అనఁగా నట్లు తోఁచెడి నాశరీరమును ఆద్యంతములు లేనిదానినిగా ప్రాకృతులు భావింతురనుట. ఈశ్వరుఁడు సృష్ట్యాదినె అవతారరూపములను ఏర్పఱచియుంచునుగాన అవి మనుష్యాదిసంబంధు లనుకొనుట భ్రాంతి.

శ్లో. మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. 12

టీ. మోఘాశాః=వ్యర్థాశగలిగిన, మోఘకర్మాణః=వ్యర్థకర్మములుగలిగిన, మోఘజ్ఞానాః=వ్యర్థజ్ఞానముకలిగిన, విచేత

సః=మూఢులు, రాక్షసీం=హింసారూపమయిన, ఆసురీం=కామదర్పాదిబహుళమయిన, మోహినీం=మోహనరూపమయిన, ప్రకృతిం=స్వభావమును, శ్రితాస్సంతః=ఆశ్రయించినవారలై, మాం=నన్ను, అవజానంతి=అవజ్ఞఁజేయుచున్నారు.

శం. అట్టివారు పనికిమాలిన యాశలు గలవారుగా కర్మానుష్ఠాతలుగా జ్ఞానముగలవారుగా నుండుటయే గాక హింసారూపమయినట్టియు కామక్రోధాదులతో నిండినట్టియు మోహనరూపమయినప్రకృతికి లోఁబడినవారయి నన్ను లక్ష్యము చేయకయున్నారు. మోహనరూపమగు ప్రకృతి యనఁగా ఛేదింపుము, భేదింపుము, త్రాగుము, పరులసొమ్మును హరింపుము అనియిట్లు పలికెడివారై క్రూరవ్యాపారములు కలవారగుదురు.

రామా. కర్మము లనఁగా ఆరంభములు, విచేతస్సు లనఁగాయథార్థజ్ఞానము లేనివారు. బ్రహ్మజ్ఞానమునకై ప్రారంభించి కామక్రోధాదులతో నిండినట్టి ప్రకృతికి లోఁబడినవారై నన్ను లక్ష్యపెట్టక యుండెదరని.

మధ్వ. భగవంతునియందు ద్వేషము కలవారు కోరెడి యాముష్మికము కొంచమైనను పొందఁబడదు-బ్రహ్మ,రుద్రుఁడు మొదలయినవారియందలి భక్తిమొదలగు నుపాయము చేత వారు యేయాముష్మికపురుషార్థమును పొందలేరు. తనభక్తుఁడైనవాఁడొకానొకప్పుడు శాపముచేత ద్వేషించినను వానికి భక్తిఫలము తప్పక కలుగును. ఇందుకు శిశుపాలాదులు దృష్టాంతము.

శ్లో. మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః,
భజం త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. 13

టీ. హే పార్థ=ఓయర్జునా! మహాత్మానస్తు = మహాత్ములు, దైవీం=దేవతాసంబంధమయిన, ప్రకృతిం=స్వభావమును, ఆశ్రితాస్సంతః =ఆశ్రయించినవారలై, భూతాదిం=భూతకారణమయిన, అవ్యయం=నాశరహితుఁడైన, మాం=నన్ను, జ్ఞాత్వా= తెలిసికొని, అనన్యమనసస్సంతః = ఇతరచింతలేనివారలయి, భజంతి=సేవించుచున్నారు.

శం. ఓ యర్జునా! మహాత్ములయినవారు దేవతాసంబంధమైన సాత్త్వికప్రకృతి నాశ్రయించినవారలయి భూతప్రపంచములకు ముఖ్యకారణమయి నాశరహితమయినట్టి నా తత్త్వము నెఱిఁగియు యితరచింతలు లేనివారయి నన్నే కోరుచున్నారు. ఈ శ్లోకమున చెప్పఁబడినవారు భగవద్భక్తి యనెడి మోక్షమార్గము నవలంబించినవారు.

రామా. నేను పరమకారుణికుఁడ నగుటచేత సాధువులను రక్షించుటకై మనుష్యుఁడనుగా నవతరించితి నని తెలిసికొని నన్ను శరణుపొంది సమస్తపాపరహితు లగుదు రనుట.

శ్లో. సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 14

టీ. యతంతః=జితేంద్రియులును, దృఢవ్రతాః=దృఢవ్రతులు నైనట్టికొందఱు, నిత్యయుక్తాః=నిత్యసమాధిచింతనముగలవారలయి, మాం=నన్ను, సతతం=నిరంతరమును, కీర్తయంత

శ్చ=స్మరించుచున్నవారలయి, భక్త్యా=భక్తిచేత, మాం=న
న్ను, నమస్యంతస్సంతః=నమస్కరించుచున్నవారలై, ఉపాస
తే=సేవించుచున్నారు.

శం. ఇంద్రియనిగ్రహము గలిగి దృఢవ్రతులయిన కొం
దఱు ఎడతెగని సమాధిచింతనము గలవారయి సమస్తకాల
ములయందు నన్ను స్మరించుచు భక్తిశ్రద్ధాయుక్తముగా వంద
నములు చేయుచు నన్ను సేవించుచున్నారు.

రామా. నానామసంకీర్తనములు చేయుచు, నా కర్చనాదుల
నొనర్చుచు, నాకై దేవాలయములను నందనవనములను ని
ర్మించుచు, ఉపవాసాదిదృఢవ్రతములను స్థిరసంకల్పములతో
నాచరించుచు, ధూళియనక బురదయనక రాలనక భూమియం
దు సాష్టాంగదండవత్ప్రణామంబులు చేయుచున్నవారు సదా
నన్ను గుఱించి నిత్యయుక్తులు అనఁగా నా నిత్యయోగమును
కోరుచున్నవా రనుట.

శ్లో. జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. 15

టీ. అన్యే=మఱికొందఱు, జ్ఞానయజ్ఞేన=జ్ఞానమనెడి యజ్ఞ
ముచేత, మాం=నన్ను, యజంతః=పూజించుచున్నవారై, ఉ
పాసతే=సేవించుచున్నారు. అన్యే=మఱికొందఱు, ఏకత్వేన=
ఒకఁడనుభావముచేతను, (కొందఱు), పృథక్త్వేన=పృథగ్భావ
ముచేతను, (మఱికొందఱు), బహుధా=బహుప్రకారములుగా,
విశ్వతోముఖం చ=అంతటముఖములుగలవానినిగా, ఉపాసతే=
సేవించుచున్నారు.

శం. మఱికొందఱు 'వాసుదేవస్సర్వ' మను జ్ఞానయజ్ఞముచే తను గొందఱు సర్వము బ్రహ్మమను భావముచేతను గొంద ఱుపాస్యోపాసకభావముచేతను గొందఱు సమస్తదైవస్వరూపభావముచేతను అనేకరీతులుగా నన్నుఁ గొలిచెదరు.

రామా. భగవంతుఁడు సృష్ట్యాదియందు సూక్ష్మములై, నామరూపముల యేర్పాటు లేని చేతనాచేతనముల శరీరములు గలవాఁడై యుండి, అనేకవిధము లగు నామరూపములతోఁ గూడిన స్థూలచేతనాచేనముల శరీరముగాఁ గలవాఁడను కావలయునని సంకల్పించి ఆతఁడొక్కఁడే దేవతిర్యఙ్మనుష్యస్థావరము లనెడి విచిత్రములైన జగత్తంతయు శరీరముగాఁ గలవాఁడై యున్నాఁడు అని కొందఱనుసంధానముచేయుచు నుపాసింపుచున్నారు. అనుట.

మధ్వ. అంతట నొక్కఁడేయగు నారాయణుఁ డున్నాడు. అని ఏకత్వముతోను, అన్నిటికంటె విలక్షణుఁ డను పృథక్త్వముతోను, భగవంతునిరూప మనేకవస్త్రైలై యుండు దానివలె బహువిధముగాఁ దెలియఁబడును.

శ్లో. అహం క్రతు రహం యజ్ఞః స్వధాఽహమహ మౌషధమ్,
మంత్రోఽహ మహ మేవాజ్య మహమగ్ని రహం హుతమ్.

టీ. క్రతుః=జ్యోతిష్టోమాదికములు, అహం=నేను. యజ్ఞః=స్మార్తకర్మము, అహం=నేను. స్వధా=పైత్రకాన్నము, అహం=నేను. ఔషధం=ఓషధీవికారమును, అహం=నేను. మంత్రః=మంత్రము, అహం=నేను. ఆజ్యం=ఆజ్యాదిహవిస్సు, అహమే వ=నేనే. అగ్నిః=అగ్నిహోత్రము, అహం=నేను. హుతం=హోమకర్మము, అహం=నేను.

శం. జ్యోతిష్టోమాదిశ్రౌతకర్మము, స్మార్తకర్మము, పైతృకకర్మము, ఓషధీవికారమయిన అన్నము, మంత్రము, ఆజ్యాదిహవిస్సు, అగ్నిహోత్రము, హోమకర్మము సర్వము నేనే.

మధ్వ. యజ్ఞమనఁగా దేవతలంగూర్చి ద్రవ్యములను విడుచుట.

శ్లో. పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవచ. 17

టీ. అస్య జగతః=ఈజగత్తునకు, పితా= తండ్రి, అహం=నేను. మాతా=తల్లి, అహం=నేను. ధాతా=ఫలప్రదుఁడను, అహం=నేను. పితామహః= తండ్రికిఁదండ్రిని, అహం= నేను. వేద్యం= తెలియఁదగినవస్తువును, అహం=నేను. పవిత్రం=పావనవస్తువను, అహం=నేను. ఓంకారః=ఓంకారమును, అహం=నేను. ఋక్సామయజురేవచ=ఋగ్యజుస్సామవేదములు, అహం=నేను.

శం. ఈయెల్లప్రపంచములకుఁ దల్లిని, తండ్రిని, కర్మఫలమును విధించువాఁడును, తాతయును, తెలియఁదగిన వస్తువును, పావనమైన వస్తువును, ఓంకారవర్ణమును, ఋగ్యజుస్సామవేదములును నేనే.

రామా. వేద్యం అనఁగా వేదమువలన తెలియఁబడెడి పావనమైనవస్తువును నేనే యనుట.

శ్లో. గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయమ్. 18

టీ. గతిః = కర్మఫలము, భర్తా = పోషకుఁడును, ప్రభుః = స్వామియు, సాక్షీ = ద్రష్టయును, నివాసః = ఉనికిపట్టును, శరణం = ఆశ్రయించఁదగినచేతనావిశేషమును, సుహృత్ = మిత్రుఁడును, ప్రభవః = ఉత్పత్తియు, స్థానం = స్థితియు, ప్రళయః = సంహారమును, నిధానం = నిక్షేపమును, అవ్యయం = నాశములేనట్టి, బీజం = జగత్ప్రరోహకారణమును, అహమేవ = నేనే.

శం. కర్మఫలమును, పోషకుఁడును, ఈశ్వరుఁడును, సర్వసాక్షియును, ఉనికిపట్టును, ఉపకారియును, మిత్రుఁడును, ఉత్పత్తియును, స్థితియును, సంహారమును, నిక్షేపమును, జగత్తులకు ఉత్పత్తికారణమైన నశించని బీజమును నేనే.

రామా. శరణమనుటకు, ఇష్టము నిచ్చువాఁడును అనిష్టమును పోఁగొట్టువాఁ డనుట.

మధ్వ. గతియనఁగా మోక్షమునుగోరువారిచేఁ బొందఁబడువాఁడు-శరణమనఁగా సంసారమునకుఁ బెదరినవానికి ఆశ్రయమైనవాఁడు - నిధానము అనఁగా సంహారకాలమున జగత్తు యీయనయందు ఉంచఁబడును అనుట.

శ్లో. తపామ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ,
అమృతంచైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున. 19

టీ. హే అర్జున = ఓయర్జునుఁడా ! అహం = నేను, తపామి = తపింపఁజేయుచున్నాను. అహం = నేను, వర్షం = వర్షమును, ఉత్సృజామి = వర్షించుచున్నాను. నిగృహ్ణామి = వర్షమును నిరోధించుచున్నాను, అమృతం = జీవనమును, మృత్యుశ్చ = మృత్యు

వును, సత్=స్థూలమును, అసత్=సూక్ష్మమును, అహమేవేతి=నేనే యని, మాం=నన్ను, ఉపాసతే=సేవించుచున్నారు.

శం. ఓయర్జునా! నన్నుష్ణముగాను, వర్షముగాను, వర్షము నిలుపువానిఁగాను, అమృతముగాను, మృత్యువుగాను, స్థూలసూక్ష్ములైన ప్రకృతివికృతులుగాను గొలుచుచున్నారు. ఎవ్వరువెనుకఁ జెప్పఁబడిన ఏకత్వపథక్త్వాదిజ్ఞానము లనెడియజ్ఞముల చేత నన్ను పూజింపుచు నుపాసింతురో ఆజ్ఞానులు వారివారి జ్ఞానమునకు తగినట్లు నన్నుపొందుదురు.

రామా. సత్తనఁగా ప్రకృతకాలమున నుండునది. అసత్తనఁగా నప్పుడులేనిది భూతమును భవిష్యత్తుకు అన్నియవస్థలచేతను, చేతనాచేతనములు నాకు శరీరములు గాన తత్ప్రకారుఁడనై నేనెయున్నాను.

మధ్వ. సత్ అనఁగా కార్యము. అసత్ అనఁగా కారణము.

శ్లో. త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే,
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్. 20

టీ. త్రైవిద్యాః= వేదత్రయవేత్తలైన, యే=ఎవరు, సోమపాః=సోమపానముచేసినవారలై, పూతపాపాః=పవిత్రములైన పాపములుకలవారలై, యజ్ఞైః= అగ్నిష్టోమాదియజ్ఞములచేత, మాం=నన్ను, ఇష్ట్వా=పూజించి, స్వర్గతిం=స్వర్గగమనమును, ప్రార్థయంతే=కోరుచున్నారో, తే=ఆజనులు, పుణ్యం=పవిత్ర

మయిన, సురేంద్రలోకం=ఇంద్రలోకమును, ఆసాద్య=పొంది, దివి=స్వర్గమందు, దివ్యాన్=అప్రాకృతములైన, దేవభోగాన్=దేవభోగములను, అశ్నంతి=అనుభవించుచున్నారు.

శం. ఎవరు వేదత్రయవేత్తలయి సోమపానముచేసి, పాపములను నశింపఁజేసి, యగ్నిష్టోమాది యజ్ఞములచే నన్నుఁ బూజించి, స్వర్గప్రాప్తిని గోరుచున్నారో యట్టివారు పావనమయిన యింద్రలోకమునుజెంది దేవతాసుఖము లనుభవించుచున్నారు.

రామా. ఇదివఱకు భగవద్భక్తుల (జ్ఞానుల) నడత చెప్పఁబడెను. ఇకను అజ్ఞులనడత చెప్పఁబడును. వేదాంతముల యందు నిష్ఠలేనివారై మిగిలి ఋగ్యజుస్సామవేదములయందు మాత్రము నిష్ఠకలవారు త్రైవిద్యులు. వీరు కేవలేంద్రాదులగూర్చి యాగములంజేసి తచ్ఛేషంబగు సోమమునుత్రాగి స్వర్గాదులకు విరోధులగుపాపమును పోగొట్టుకొనువారగుదురు. వారు కేవలు రగు నింద్రాదుల నుద్దేశించినను వస్తుస్థితినిగూర్చి నన్నుద్దేశించియే యాగముచేసినవార లగుచున్నారు. అట్టి నన్ను ఎఱుఁగక స్వర్గగతిని కోరుచున్నారు.

శ్లో. తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే. 21

టీ. తే=ఆజనులు, విశాలం=విస్తారమయిన, తంస్వర్గలోకం=ఆస్వర్గలోకమును, భుక్త్వా=అనుభవించి, పుణ్యే=పుణ్యము,

క్షీణేసతి=క్షయించుచుండఁగా, మర్త్యలోకం=మనుష్యలోకమును, విశంతి=ప్రవేశించుచున్నారు. ఏవం=ఈప్రకారముగా, త్రయీధర్మం=వేదధర్మమును, అనుప్రపన్నాః=ఆశ్రయించిన, కామకామాః=విషయములను గోరెడిజనులు, గతాగతం=పోవుచువచ్చుచుండుటను, లభంతే=పొందుచున్నారు.

శం. అట్టివారు గొప్పదయిన స్వర్గలోకసుఖములను అనుభవించి వారి పుణ్యకర్మఫలము నశించినపిదప మరల మర్త్యలోకమునందుఁ బుట్టుచున్నారు. ఈవిధముగ వేదకర్మలనుఁ గామ్యార్థముతోఁ జేయువారు మర్త్యస్వర్గలోకములకుఁ బోవుచును, మరల వచ్చుచును న్నారు.

రామా. అట్టివారు పుణ్యమైన అనఁగా దుఃఖములేని స్వర్గలోకమును పొంది అచ్చట దేవభోగముల ననుభవించుచున్నారు. ఆయనుభవమునకు హేతువైన పుణ్యము నశించినతోడనే వెండియు మనుష్యలోకము ప్రవేశింతురు. ఇట్లు వేదాంతసిద్ధిజ్ఞానము లేనివారును, కామ్యములగు స్వర్గాదులం గోరువారును కేవలమగు వేదత్రయధర్మమును ఆశ్రయించిన వారునగు వారును, అల్పంబులును, అస్థిరంబు లగు స్వర్గాదుల ననుభవించి మాటిమాటికిని మఱలుచుందురు.

శ్లో. అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

టీ. అనన్యాః = అస్మదితరదైవోపాసనలేని, యేజనాః = ఏజనులు, మాం= నన్ను, చింతయంతస్సంతః = స్మరించుచున్నవారలయి, పర్యుపాసతే = భజించుచున్నారో, నిత్యాభియుక్తా

నాం=నిత్యసమాహితచిత్తులయిన, తేషాం=ఆజనులకు, అహం =నేను, యోగక్షేమం= యోగక్షేమమును (తనకు లేనిదానిని సంపాదించుట యోగము. సంపాదించినదానిని కాపాడుట క్షేమము), వహామి=పొందించుచున్నాను.

శం. ఎవరితరకోరికలేక నన్నే శరణుపొంది కొలిచెదరో యట్టి యచంచలచిత్తులయిన వారల యోగక్షేమములను నేనే పూనియుండెదను.

రామా. ఎవరు నన్ను దలంచుటకంటె నితరములైన ప్రయోజనములేక అన్ని కల్యాణగుణములతోను, అన్ని విభూతులతోను నన్నుఁగూడిన వానిగా తలచి కొలిచెదరో, నాయందలి నిత్యసంబంధమును కోరు నట్టి వారి బుద్ధిని నాయందే పొందునట్లు చేయుటకును, పొందిన దానిని మఱలకుండునట్లు చేయుటకు నేనే పూని యుండెదను.

మధ్వ. 21 - 22, శ్లోకములయందు తన భజనము అన్యదేవతాభజనమునకన్న మేలనియు, తన్నే చింతించుచున్నవారిని చాలకాలము అంతట యుక్తులగునట్టి భక్తుల యోగక్షేమమును తానే భగవంతుఁడు పూనుకుంటున్నాఁడనుట.

శ్లో. యే ప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్. 23

టీ. హే కౌంతేయ=ఓయర్జునుఁడా! యేపి=ఏజనులు, అన్యదేవతాభక్తాః=ఇతరదేవతాభక్తులైనవారలై, శ్రద్ధయా=ఆస్తిక్యబుద్ధితోడ, అన్వితాస్సంతః=కూడినవారలై, యజంతే=పూజించుచున్నారో, తే=ఆజనులు, అవిధిపూర్వకం=మోక్షప్రా

పకాభావ విధిపూర్వకముగా, మామేవ=నన్నే, యజంతి=పూజించుచున్నారు.

శం. అర్జునా! ఎవరైతే యితరదేవతాశ్రితులై భక్తిశ్రద్ధలతో నాయీ దేవతలను బూజించెదరో, యట్టివారు మోక్షప్రాప్తియం దిచ్ఛలేనివారయినను, అజ్ఞానులైనను నన్నే పూజించెదరని తెలియుము.

రామా. 'యేత్వన్యదేవతా భక్తాః' అని పాఠాంతరము అన్నిపదములభావమును నన్ను చెప్పును గాన ఇంద్రాది శబ్దము గూడ నన్నే చెప్పుచున్నది గాన ఇంద్రాదులంజూచి యాగము చేయువారుంగూడ నన్ను గూర్చి చేయువారె. వేదాంతములు (ఉపనిషత్తులు) పరమపురుషునికి శరీరమైన ఇంద్రాదుల నారాధించునది యని విధింపుచున్నవై, వారికి యాత్మయైన పరమపురుషునే సాక్షాత్తుగా నారాధింపవలయునని విధింపుచున్నవి. వీరు వట్టి ఇంద్రాదుల నారాధించుటచే ఆవిధి ననుసరించక యజ్ఞముచేయువార లగుచున్నారు.

శ్లో. అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవ చ,
న తు మా మభిజానంతి తత్త్వే నాత శ్చ్యవంతి తే. 24

టీ. సర్వయజ్ఞానాం = సమస్త శ్రౌతస్మార్తకర్మములకు, భోక్తాచ = అనుభవించువాఁడును, ప్రభుశ్చ=స్వామియు, అహమే వహి=నేనేకదా! మాం=నన్ను, తత్త్వేన=యథార్థముచేత, యే=ఎవరు, నాభిజానంతి=ఎఱుఁగరో, తే తు=వారు, అతః = అవిధిపూర్వకమైన యాగఫలమువలన, చ్యవంతి = జారుచున్నారు.

శం. ఎల్ల శ్రౌతస్మార్తకర్మల ననుభవించువాఁడును, వానికి ప్రభువును నేనే. నాయథార్థబ్రహ్మతత్త్వమును దెలియనివారు పైఁజెప్పిన కర్మఫలానుభవముల కునికిపట్టై స్వర్గమునుండి తిరిగి మర్త్యలోకమునకు వచ్చెదరు.

రామా. త్రైవిద్యలు ఈకర్మములు. ఇంద్రాది శరీరకుండగు పరమపురుషుని యారాధనము లనియు, ఆరాధింపఁబడువాఁడాతఁడేయని ఎఱుఁగరు. వారు కొంచెము ఫలమును పొంది మఱలు వా రగుదురు. ప్రభుశబ్దము ఫలము నిచ్చువాఁడని యర్థము.

శ్లో. యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః,
భూతానియాంతిభూతేజ్యాయాంతి మద్యాజినోపిమామ్.

టీ. దేవవ్రతాః=దేవతానియమముగలవారు, దేవాన్=దేవతలను, యాంతి=పొందుచున్నారు, పితృవ్రతాః=పితృనియమముగలవారు, పితౄన్=పితృదేవతలను, యాంతి=పొందుచున్నారు, భూతేజ్యాః=భూతపూజలుగలవారలు, భూతాని=వినాయకాదిభూతములను, యాంతి = పొందుచున్నారు, మద్యాజినోపి = నన్నుఁబూజించువారును, మాం = నన్ను, యాంతి=పొందుచున్నారు.

శం. ఇంద్రాది దేవతలను భక్తిశ్రద్ధలతోఁ బూజించువారింద్రాది దేవలోకములను, పితృదేవతల నాశ్రయించువారు పితృలోకమును, వినాయకాదిభూతములం బూజించువారు భూతగణలోకమును బొందెదరు. నన్ను భక్తిశ్రద్ధలతోఁ బూజించువారు నన్నే పొందెదరు.

రామా. భూతము లనఁగా యక్షరాక్షస పిశాచాది భూతము లనుట. ఈ చెప్పఁబడిన యజ్ఞములచేతనె దేవతలును పితృదేవతలును భూతములును శరీరముగాఁగల భగవంతుని యారాధించెదమని ఎవ్వారలు సంకల్పింతురో వారు నన్నే చెందుదురు. దేవాది యజ్ఞముల చేయువారు దేవాదులతో కూడ పరిమితిగల భోగముల ననుభవించి వారు నశించునపుడు వారితో నశింతురు. నన్నారాధించు వారు నన్ను జేరి మఱలకుందురు.

శ్లో. పత్రం పుష్పం ఫలంతోయం యో మేభక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. 26

టీ. యః=ఎవ్వఁడు, భక్త్యా=భక్తిచేత, మే=నాకొఱకు, పత్రం=ఆకునైనను, పుష్పం=పుష్పమునైనను, ఫలం=ఫలమునైనను, తోయం=ఉదకమునైనను, ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నాఁడో, ప్రయతాత్మనః=భక్తిబుద్ధిగలిగిన, తస్య=వానియొక్క, భక్త్యుపహృతం=భక్తిపూర్వకముగా సమర్పించఁబడిన, తత్ =ఆపత్రాదికమును, అహం=నేను, అశ్నామి=ఆరగించుచున్నాను.

శం. ఎవఁడు భక్తితో నాకు ఆకునైనను, పుష్పమునైనను ఫలమునైనను, ఉదకమునైనను నమర్పించుచున్నాఁడో అట్టి బుద్ధిమంతునిచే భక్తిపూర్వకముగ సమర్పింపఁబడిన యా వస్తువులను నేను భక్షించుచున్నాను.

రామా. పత్రము, పుష్పము, ఫలము, ఉదకము వీనిలో నేదియైనను నాకు ఇచ్చుటయె ప్రయోజనముగాఁ గలుగుట

యనెడి శుద్ధితోఁగూడిసమనస్సు కలవాని యొక్క ఆ పత్రాదిక మును నేను అవాప్త సమస్త కాముఁడైనను, దొరకరానిది దొరకనిచోఁ గలుగవలసిన ప్రీతితో ననుభవించు చున్నాను.

మధ్వ. నీవు గొప్పవాఁడవు కాన నీవు దుర్బలులచే నారాధింప శక్యుండవుగావు అను శంక గలవారి నిమిత్తమై ఈశ్లోకము చెప్పఁబడుచున్నది. శాస్త్రములో విధింపఁబడని పత్రాదులను సమర్పింపఁగూడదు. భక్తియున్న చాలును. అందుతోనే నేను సంతోషించు చున్నానని భగవంతుఁడు సెలవిచ్చు చున్నాఁడు.

శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. 27

టీ. కౌంతేయ=అర్జునా! యత్=దేనిని, కరోషి=చేయుచున్నావో, యత్=ఏవస్తువును, అశ్నాసి=భుజించుచున్నావో, యత్=దేనిని, జుహోషి=వ్రేల్చుచున్నావో, యత్=ఏవస్తువును, దదాసి=ఇచ్చుచున్నావో, యత్=దేనిని, తపస్యసి=తపస్సుచేయుచున్నావో, తత్=దానిని, మదర్పణం=నాయందు సమర్పణమైనదానినిగా, కురుష్వ=చేయుము.

శం. ఓ యర్జునా! నీ వొనర్చుకర్మను, భుజించుపదార్థములను చేయు హవిస్సులను, దానములను, తపస్సును నాకు సమర్పణచేయుము.

రామా. లౌకిక వైదిక కర్మము లన్నిఁటి యొక్కయు కర్తృత్వంబును, భోక్తృత్వంబును ఆరాధ్యత్వంబును నాయందు సమర్పింపఁబడినట్లు చేయుము.

శ్లో. శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి. 28

టీ. ఏవం=ఈప్రకారముగా, సన్న్యాసయోగయుక్తాత్మా=త్యాగోపాయముతోఁగూడిన యాత్మగలవాఁడవై, శుభాశుభఫలైః=ఇష్టానిష్టఫలములు కలిగిన, కర్మబంధనైః=పుణ్యపాపములనెడి కర్మబంధములచేత, మోక్ష్యసే=విడువఁబడఁగలవు, విముక్తః=కర్మవిముక్తుఁడవై, (అతర్వాతను), మాం=నన్ను, ఉపైష్యసి=పొందఁగలవు.

శం. నీవు పైఁజెప్పినవిధమున నివృత్తిమార్గముతోఁ గూడిన యాత్మగలవాఁడ వైనచోఁ గర్మసంబంధమైన శుభాశుభఫలములలోనుండి తప్పించుకోఁగలవు. అట్లు కర్మఫలములలోనుండి విడువఁబడినవాఁడవైన వెనుక నాస్థానమైన మోక్షమును చెందఁగలవు.

రామా. నీవు పై చెప్పిన చొప్పున సన్న్యాసమనెడి యోగముతోఁ గూడిన మనస్సు కలవాఁడవు అనఁగా శేషుఁడవనియు, నియామ్యుఁడనియు, కర్మమెల్లను నారాధన మనియు, ననుసంధించినవాఁ డైనచో నన్ను చెందుటకు విరోధులగు ప్రాచీనకర్మములనుండి తప్పించుకోఁగలవు. అట్లు తప్పించుకొన్నవాఁడవై నాస్థానమైన పరమప్రాప్తి నందుచున్నావు.

శ్లో. సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.

టీ. అహం=నేను, సర్వభూతేషు=సమస్తప్రాణులయందు, సమః=తుల్యుఁడను, మే=నాకు, ద్వేష్యః=అప్రియుఁడు, నా

స్తి=లేఁడు, ప్రియః=ఇష్టుఁడును, నా స్తి=లేఁడు, ఏతు=ఎవ్వరు, మాం=నన్ను, భక్త్యా=భక్తిచేత, భజంతి=భజించుచున్నారో, తే=ఆభక్తులు, మయి=నాయందు, వర్తంతే=వర్తింపుచున్నారు, అనఁగా నుంటున్నారు. అహమపి=నేనును, తేషు=ఆభక్తుల యందు, వర్తే=ఉన్నాను.

శం. నేను ఎల్లభూతములకు సముఁడను. నాకు నిష్టుఁడుగాని విరోధిగాని లేఁడు. ఎవఁడు భక్తిశ్రద్ధలతో నన్నుఁ గొలుచుచున్నాఁడో యట్టివాఁడు నాయం దున్నవాఁడు. వానియం దనుగ్రహరూపుఁడై నే నుండువాఁడను.

రామా. జాతినిబట్టికాని, ఆకారమును బట్టికాని, స్వభావమునుబట్టికాని మిక్కిలి హెచ్చుతగ్గులుగా నుండెడి దేవతిర్యఙ్మనుష్యస్థావరము లనెడిభూతములయందు, అందఱికి నాశ్రయింపఁదగినవాఁడ నగుటచే సముఁడను. కొందఱినె ప్రీతిచేత నాశ్రయింప నిచ్చుటయును, మిగిలినవారిని ద్వేషముచేత నాశ్రయింపనీయకపోవుటయును లేదు. నేనే మిక్కిలి ప్రియుఁడుగాఁ గలవారై నన్నుభజింపనిచో నిలువలేనిభక్తు లుత్కృష్టులైనను నాతో సమానముగల గుణములు గలవారివలె నాయందుందురు. నేను వారియెడను నాకంటె యుత్కృష్టుల యెడనువలె యుందును.

మధ్వ. నీవు స్నేహాదులు గలవాఁడవగుటచే కొంచెము భక్తుఁడైన వానికిని గొప్ప ధనము నిచ్చెదవు. గొప్పభక్తునికి కొంచెము ఫలము నిచ్చెదవు కాబోలు నను శంకకై నేను సముఁడనని చెప్పఁబడుచున్నది. అయితే భక్తికార్యకరము కాదా

యనఁగా వారు నాయందున్నారు. వారియందు నే నున్నాను. నాకు వారు వశ్యులు. వారికి నేను వశ్యుఁడను. వారెల్లప్పుడును కర్మలకు వశ్యులైనను బుద్ధిపూర్వకముగా వశ్యులైనవారును, అబుద్ధి పూర్వకముగా వశ్యులయిన వారను భేదము కలదు. మొదటి విధమువారు ఉద్ధవాదులు, రెండవ విధమువారు శిశుపాలాదులు.

శ్లో. అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః. 30

టీ. సుదురాచారోపి = మిక్కిలి నిందితమైన యాచారము గలవాఁడయినను, అనన్యభాక్=నాకంటె నితర దేవతనుభజనసేయనివాఁడై, మాం=నన్ను, భజతేచేత్ =సేవింపుచున్నవాఁడాయెనేని, సః=వాఁడు, సాధురేవేతి=సదాచారముగలవాఁడే యని,మంతవ్యః=తెలియఁదగినవాఁడు, సః=వాఁడు, సమ్యక్ = లెస్సగా, వ్యవసితోహి=మోక్షముకొఱకు నుద్యోగించినవాఁడు గదా.

శం. మిగుల దురాచారముగల యెవఁడయినను నితరమును భజింపక నన్నే శరణుజెంది భక్తిచేసినయెడల నట్టివాఁడు ఆత్మతత్త్వమెఱిఁగిన నాభక్తుఁడు గనుక వాఁడు సదాచారము గలవాఁడనియే యెఱుఁగుము.

రామా. తనజాతికి తగిన యాచారము చొప్పున నడవనివాఁ డెవఁడైనను, నన్ను భజించుట యొక్కటియె ప్రయోజనముఁగలవాఁ డెవఁడైనను, నన్ను తనకు మిత్రుఁడు, తనకు గొప్పభోగ్యము అను నిశ్చలముతోనుండు వైష్ణవాగ్రేసరుఁ

డెవఁడైనను, అట్టివానికి ఆచారమునుండి తప్పుట స్వల్పలోప ముఁగాన అంతమాత్రమున ననాదరముచేయఁదగఁడు.

మధ్వ. భగవద్భక్తుఁడు తఱుచుగా దురాచారుఁడై యుండఁడు. అయినను బహుపుణ్యము చేతను నెట్లో అట్టివాఁ డయ్యేనా వాఁడు సాధువె.

శ్లో. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. 31

టీ. (సః=ఆపురుషుఁడు), క్షిప్రం=శీఘ్రముగా, ధర్మాత్మా=ధర్మమందు మనస్సుగలవాఁడు, భవతి=అగుచున్నాఁడు. శశ్వత్=నిత్యమైన, శాంతిం=ఉపశమనమును, నిగచ్ఛతి=పొందుచున్నాఁడు, హేకౌంతేయ=ఓ యర్జునా! మే=నాయొక్క, భక్తః=భక్తుఁడు, నప్రణశ్యతీతి= నశింపఁడని, ప్రతిజానీహి = ప్రతిజ్ఞచేయుము.

శం. అట్టివాఁ డతిత్వరలో ధర్మాత్ముఁడై నిత్యమైన పరమశాంతిని జెందుచున్నాఁడు. ఓ యర్జునా! అట్టి దురాచారము గలిగిన నాభక్తుఁడు అనఁగా నాయందు సమర్పింపఁ బడిన యంతరాత్మఁ గలవాఁడు నాశము చెందఁడని నీవు ప్రతిజ్ఞ చేయుము.

రామా. ప్రతిబంధకములేనిదై పరికరముతోఁ గూడినదైన నాభజనమందె మనస్సు కలవాఁడై నన్ను చెందుటకు విరోధులైన యాచారములు లేక పోవుటచేత నాయందలి యపరిమిత భక్తిచేత చెడఁడు.నాభక్తియొక్క మాహాత్మ్యముచేత విరోధి

నంతయు నశింపఁజేసి శాశ్వతమైన విరోధినివృత్తిఁ బొంది, శీఘ్రముగా సంపూర్ణభక్తిఁగలవాఁ డగును.

మధ్వ. పై హేతువులచేత నట్టి భక్తుఁ డతిశీఘ్రముగా ధర్మాత్ముఁడగును. ఇది దేవతలు దేవాంశకలవారియందె కలుగును. మిగిలిన వారియందు కలుగదు. అట్టివారు దాంభికులు అగుదురు.

32, 33-వ శ్లోకములకు శంకరతాత్పర్యము. పురుషార్థములను సాధించికొనుటకు దగినదియు, దుర్లభమైనదియు నగు మనుష్యత్వమును పొందితివిగాన నన్ను భజింపుము.

32, 33-వ శ్లోకములకు రామా. నీవు రాజర్షివిగాన అస్థిరమైనదియు, తాపత్రయముల బాధకలదగుటచే నసుఖమైనదియు నగు నీలోకమును పొందియున్నావు కాన నన్ను భజింపుము.

32, 33-వ శ్లోకములకు మధ్వ. మనుష్యులకు బ్రాహ్మణత్వము మొదలగునవి స్వాభావికము లనియు, పాపాపాదికృతములనియు రెండు విధములు. అందుముక్తిని పొందినట్టివి స్వాభావికములు. అవియె పుణ్యములు. శాపమువల్లను, కామమువల్లను పురుషులును స్త్రీత్వమును పొందుదురు.

శ్లో. మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః,
స్త్రియోవైశ్యాస్తథాశూద్రా స్తేపియాంతిపరాంగతిమ్.

టీ. హే పార్థ=ఓయి అర్జునా! ఏపి=ఎవరు, పాపయోనయః=నికృష్టజన్మములుగలవారలు, స్యుః=అవుదురో, తేపి=

వారును, స్త్రియః=స్త్రీలును, తథా=ఆలాగుననే, వైశ్యాః=వైశ్యులును, శూద్రాశ్చ=శూద్రులును, మాం=నన్ను, వ్యపాశ్రిత్య=ఆశ్రయించి, పరాం=ఉత్కృష్టమైన, గతిం = గతిని, యాంతిహి=పొందుచున్నారుగదా.

శం. అర్జునా ! నికృష్టజన్మములు గలవారును స్త్రీలును వైశ్యులును శూద్రులును నన్నే యాశ్రయించి భక్తిచేయువారయిరేని యెట్టివారును నుత్కృష్టమైనగతినిఁ బొందుచున్నారు.

శ్లో. కింపున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్. 33

టీ. పుణ్యాః=పవిత్రులైన, భక్తాః=భజనశీలురైన, బ్రాహ్మణాః=బ్రాహ్మణులును, తథా=ఆలాగుననే, రాజర్షయః=రాజఋషులును, కింపునః=ఉత్కృష్టగతిని బొందుదురని యేమిచెప్పవలెను, అనిత్యం=క్షణభంగురమైన, అసుఖం=సుఖవర్జితమైన, ఇమంలోకం=ఈలోకమును, ప్రాప్య=పొంది, మాం=నన్ను, భజస్వ=సేవించుము.

శం. కాన పావనులై భక్తితోఁ గూడుకొనియున్నబ్రాహ్మణోత్తములును రాజర్షులును ఉత్తమమయినగతిని బొందువారనుటకు సంశయములేదు. క్షణభంగురమయి తుచ్ఛసుఖములుగల యీమర్త్యలోకమునందు జన్మమెత్తిన నీవు నన్ను శరణుపొంది భజింపుము.

శ్లో. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః.

టీ. మన్మనాః=నాయందు మనస్సుగలవాఁడవును, తథా=ఆలాగుననే, మద్భక్తః=నాకు సేవకుఁడవును, మద్యాజీ=నన్నుఁబూజించువాఁడవును, భవ=కమ్ము,మాం=నన్నుఁగూర్చి, నమస్కురు=సమస్కరించుము, ఏవం=ఈప్రకారముగా, మత్పరాయణస్సన్=నాయందుఁ బ్రీతిగలవాఁడవై, ఆత్మానం=మనస్సును, మయి=నాయందు, యుక్త్వా=కూర్చి, మామేవ=నన్నే, ఏష్యసి=పొందఁగలవు.

శం. నీవు నాయందు మనస్సు నిలిపినవాఁడనయి భక్తి చేసి నన్ను పూజించి నాకు వందనములు జేయుము. ఈవిధముగ నీవు ఎల్లకాలములయందు భక్తిశ్రద్ధలతో స్థిరచిత్తము నుంచితివేని నన్నే పొందఁగలవు.

రామా. మద్భక్తుఁడవై, నాయందు ప్రీతిగలవాఁడవై, తైలధారవలె నాయందవిచ్ఛిన్నమైన మనస్సుకలవాఁడవై సంపూర్ణమైన కైంకర్యాదుల నొనర్చుచు ఔపచారిక, సాంస్పర్శిక, అభ్యవహారిక మనెడి మూడువిధములైన భోగముల సమర్పించుము.అంతరాత్మయైన నాయందు నమ్రుఁడై నేనేయాశ్రయము గాఁగలవాఁడవై మనస్సును సంపూర్ణముగా నాయందె నిలిపి యుండుము. తిరువారాధనము ఔపచారికము అర్ఘ్యపాద్యాదులు సాంస్పర్శికములు మాల్య అభ్యవహారికములు అన్నపానాదులు అని యెఱుంగునది.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్య
యోగో నామ నవమోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును, యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునుల సంవాదాత్మకంబు నైన శ్రీభగవద్గీతలయందు రాజవిద్యారాజగుహ్యయోగ మనెడి నవమాధ్యాయము.

---

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## వి భూ తి యో గః.

---

శ్రీభగవా నువాచ:—

శ్లో. భూయ ఏవ మహాబాహో శ్రుణు మే పరమం వచః,
యత్తేహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా.

భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. మహాబాహో=అర్జునా! అహం=నేను, ప్రీయమాణాయ=సంతోషపడుచున్న, తే=నీకొఱకు, హితకామ్యయా=హితముఁజేయు నిచ్ఛచేత, భూయఏవ = మరల, పరమం=ఉత్కృష్టమైన, యద్వచః=ఏవాక్యమును, వక్ష్యామి=చెప్పఁగలనో, మే=నాయొక్క, తత్=ఆవాక్యమును, శృణు=వినుము.

తం. అర్జునా! ప్రీతితో వినుచున్న నీకు మంచి చేయవలెనను కోరికతోఁ బరమోత్కృష్టమైన యేవాక్యమును నేను చెప్పఁబోవుచున్నానో దాని నాలకింపుము.

రామా. నామాహాత్మ్యమును విని ప్రీతిచెందుచున్న నీకు నాయందుభక్తిపుట్టి అధివృద్ధిపొందుటకై నామాహాత్మ్యమును తెలియఁజేసెడు ఏవాక్యముకలదో దానిని చెప్పెదను. ఆలకించుము.

మధ్వ. ఉపాసనాదులకు విభూతులును విశేషముగా కొన్నిటికి కారణ మగుటచేత అవి యీయధ్యాయమునఁ జెప్పఁబడును. విని సంతోషపడుచున్న ఓ అర్జునా! వినుము.

శ్లో. నమేవిదు స్సురగణాః ప్రభవం న మహర్షయః,
అహ మాది ర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. 2

టీ. సురగణాః=దేవసమూహములు, మే=నాయొక్క, ప్రభవం = ప్రభుశక్త్యతిశయమును, నవిదుః = తెలియరు. మహర్షయః=భృగ్వాదిమహర్షులు, నవిదుః=ఎఱుఁగరు. అహం=నేను, దేవానాం = దేవతలకును, మహర్షీణాంచ = మహర్షులకును, సర్వశః=సర్వప్రకారములచేత, ఆదిర్హి=మొదటివాఁడనుగదా.

శం. ఇంద్రాదిదేవతలు గొప్పఋషులు నా యుత్పత్తి స్థానమును తెలియరు. ఇంద్రాదిదేవతలకును ఋషులకును నుత్పత్తికారణము నేనే గదా!

రామా. ఇంద్రియములచేఁ దెలియఁబడనివాని తెలిసికొనెడి వారు కూడ నా నామము, కర్మము (పని), స్వరూపము, స్వభావము మొదలగు ప్రభావముల నెఱుఁగరు. ఆ దేవతలను, ఆమహర్షులను నేను సృజించి, వారివారి పుణ్యానుసారముగా వారికి నే నిచ్చిన జ్ఞానము పరిమితిగలది.

మధ్వ. ప్రభవమనఁగా ప్రభావము, నాజగత్సృష్టియున్నచో దేవాదులెఱుంగకుండరు. కాఁబట్టి లేదనిభావము. పుట్టుకకూడ నెవనికి వశమో వానికి పుట్టుక ఎట్లు.

శ్లో. యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3

టీ. అనాదిం=ఆదిలేని, అజం=పుట్టువులేని, లోకమహేశ్వ రం=లోకమునకు నియామకుఁడైన, మాం=నన్ను, యః=ఎవఁ డు, వేత్తి=తెలియుచున్నాఁడో, మర్త్యేషు=మనుష్యులయందు, అసమ్మూఢః = మౌఢ్యవర్జితుఁడైన, సః=వాఁడు, సర్వపాపైః= సమస్తపాపములచేత, ప్రముచ్యతే=విడువఁబడుచున్నాఁడు.

శం. నన్ను మొదలులేనివాఁ డనియుఁ బుట్టుకలేనివాఁడని యు నెల్లజనులకు నియామకుఁ డనియు నేపురుషుఁడు తెలియు నో యట్టివాఁడు మోహము విడిచినవాఁడై సమస్తపాప ములచేత విడువఁబడినవాఁ డగును.

రామా. కర్మవిశేషముచేత నొక్కొక్కఁడు మనుష్యులకు ప్రభువగుచున్నాఁడు. అట్లే దేవాధిపతియు, అండాధిపతియు; వీనికి భావనాత్రియసంబంధముకలదు. భావనయనఁగా తానుచే యవలసినపనియందలి ఉద్దేశము (1) కర్మభావన (2) బ్రహ్మభా వన (3) ఉభయభావనలని. కర్మభావనయనఁగా కర్మచేయువల యునను ఉద్దేశము. అదికలవారు మనుష్యులు, దేవతలు. బ్రహ్మ భావనయనఁగా భగవంతుని యుపాసించవలయునని యుద్దేశ ము. అదికలవారు సనకాదులు. రెంటియందు నుద్దేశ ముభయ భావన. అదికలవారు చతురాననుఁడు మొదలగువారు. అణి మాదియైశ్వర్యములు పొందినవారు నట్లే. ఈభగవంతుఁడో పుట్టుకలేనివాఁడు కాన అచేతనము కన్నను దానితోఁజేరియున్న సంసారికన్నను విలక్షణుఁడు. ఇతరవస్తువులతో భగవంతునిఁ గూడ నొక్కజాతి కలవానిగాఁ దలంచుట సంమోహము. అది లేనివాఁడు అసమ్మూఢుఁడు.ఇట్టివాఁడు భక్తిపుట్టుటకు విరోధు లుగానుండెడి పాపము లన్నిటిచేతను విడువఁబడును.

శ్లో. బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః,
సుఖం దుఃఖం భవోభావో భయం చాఽభయమేవచ. 4

అహింసా సమతా తుష్టి స్తపోదానం యశోఽయశః,
భవంతి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః. 5

టీ. బుద్ధిః=బోధసామర్థ్యమును, జ్ఞానం=తెలియుటయును, అసమ్మోహః= మోహరాహిత్యమును, క్షమా = ఓర్పును, సత్యం=యథార్థమును, దమః=బాహ్యేంద్రియనిగ్రహమును, శమః = అంతరింద్రియ నిగ్రహమును, సుఖం = సుఖమును, దుఃఖం=సంతాపమును, భవః = ఉత్పత్తియును, అభావః = నాశమును, భయం=భయమును, అభయంచ = భయములేక పోవుటయును, అహింసా = ప్రాణిహింస లేకపోవుటయును, సమతా = సమత్వమును, తుష్టిః=సంతోషమును, తపః=తపస్సును, దానం=ఇచ్చుటయు, యశః=కీర్తియు, అయశః=అపకీర్తియు, (ఈప్రకారముగా), భూతానాం = ప్రాణులకు, పృథగ్విధాః=నానావిధములైన, భావాః = ఈచెప్పఁబడిన బుద్ధ్యాదులు, మత్తఏవ = నావలననే, భవంతి=కలుగుచున్నవి.

శం. బుద్ధి, జ్ఞానము, మోహము లేకపోవుట, ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, శాంతి, సుఖదుఃఖములు, ఉత్పత్తినాశములు, భయము, భయము లేకపోవుట, హింసచేయక పోవుట, సమచిత్తత్వము, సంతుష్టి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి ఈపలువిధములైన గుణములు ప్రాణిసమూహములకు నాచేతనే కలుగుచున్నవి.

రామా. ప్రవర్తించుటకు నివర్తించుటకు హేతువులగు మనస్సు యొక్కవృత్తులు అనఁగా వ్యాపారములు నా సంకల్పమున కధీనములై కలుగుచున్నవి.

శ్లో. మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః. 6

టీ. పూర్వే = అతీతకాలసంబంధులైన, (తే=ఆ), సప్త = ఏడుగురైన, మహర్షయశ్చ=భృగ్వాదిమహర్షులును, తథా= ఆలాగుననే, చత్వారః=నలువురైన, మనవశ్చ=సావర్ణికులని ప్రసిద్ధులైన మనువులున్ను, మద్భావాః = మద్గతభావనులై, మానసాః = మనస్సుచేతఁ బుట్టింపఁబడినవారలై, జాతాః=పుట్టిరి, యేషాం=ఎవరికి, లోకే=లోకమందు, ఇమాః=ఈచరాచరరూపములైన, ప్రజాః=ప్రజలు, జాతాః=పుట్టిరో.

శం. మఱియు భృగ్వాదిమహర్షిసప్తకము, సనకసనందనాదిచతుష్టయము, స్వాయంభువాదిమనువులు బ్రహ్మాత్మకంబగు నావల్ల మద్గతభావముగలవారై జన్మించిరి. ఈయెల్ల లోకముల యందుఁ జరాచరరూపములైనభూతములు పుట్టెను.

రామా. కడచినమన్వంతరములో నిత్యసృష్టి జరుగుటకు బ్రహ్మమనస్సువలన కలిగిన భృగ్వాది సప్తమహర్షులును, నిత్య పరిపాలనకై సావర్ణికులను పేరుగల నలుగురు మనువులును నా యభిప్రాయమున నున్నవారు; అనఁగా నాసంకల్పము ననుసరించువారు. వారి సంతానమైన ఈలోకమునందలి ప్రజలందఱు ప్రతిక్షణంబును ప్రళయమువఱకు సంతానములం బుట్టించువారును పరిపాలనం జేయువారునై యున్నారు. (సావర్ణికులు బ్రహ్మ

వునివంశమునఁ బుట్టిన స్వారోచిషుఁడు, ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు అనువారు.)

మధ్వ. సప్తర్షులనఁగా మరీచి, అత్రి, అంగిరస్సు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు అనువారు. మనువులు స్వాయంభువుఁడు, రోచిషుఁడు, ఉత్తముఁడు, రైవతుఁడనువారు. తాపసుఁడు భగవదవతారముగాన నిచ్చట పరిత్యక్తము - వీరు నావలన పుట్టుకఁగలవారు. వీరు బ్రహ్మకు మానసజనితులైనను నావలన బుట్టినవారే యనుట.

శ్లో. ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః,
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః. 7

టీ. యః=ఎవ్వఁడు, ఏతాం=ఈ, మమ=నాయొక్క, విభూతిం = విస్తారమును, యోగంచ = యోగమును, తత్త్వతః = యథార్థముగా, వేత్తి = తెలియుచున్నాఁడో, సః = వాఁడు, అవికంపేన =చలించనట్టి, యోగేన=యోగముచేత, యుజ్యతే=కూర్చఁబడుచున్నాఁడు, అత్ర=ఈయర్థమందు,సంశయః= సందేహము, నాస్తి=లేదు.

శం. ఎవఁ డీ పైఁజెప్పిన నావిభూతిని యోగమహిమనుఁ జక్కఁగాఁదెలిసికొనునో వాఁడు చలింపని యోగసిద్ధిని నిస్సంశయముగాఁ జెందుచున్నాఁడు.

రామా. ఎవఁడీపైఁజెప్పిన నాయైశ్వర్య మంతయును ఎఱుంగుట యందును నాకల్యాణగుణంబుల నెఱుంగుట యందును ఆసక్తికలిగి యుండునో వాఁడు భక్తియోగమును వృద్ధిచేసికొను నంశము నీవుస్వయముగానె తెలిసికొనఁగలవు.

శ్లో. అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః. 8

టీ. అహం=నేను, సర్వస్య=సమస్తమయినజగత్తుకు, ప్రభవః=ఉత్పత్తికారణమైనవాఁడును, మత్తః=నావలన, సర్వం=సమస్తము, ప్రవర్తతే=ప్రవర్తించుచున్నది, ఇతి=ఈప్రకారము, మత్వా=తలఁచి, బుధాః=పండితులు, భావసమన్వితాస్సంతః=పరమార్థతత్త్వమందలి అభినివేశముతోఁ గూడినవారలయి, మాం=నన్ను, భజంతే=సేవించుచున్నారు.

శం. ఎల్లసృష్టికి నుత్పత్తికారణ మయినవాఁడను నేనే. నా మహిమవల్లనే యెల్లప్రపంచములు జరుగుచున్నవి. పండితులు నాభావము నీవిధముగా నెఱిఁగినవారై నన్నుఁగొలుచుచున్నారు.

రామా. ఎల్ల సృష్టికి కారణమైన వాఁడును నేనే సౌశీల్యవాత్సల్యాది కల్యాణగుణయోగమును,పండితులు మనోవృత్తి విశేషమున నెఱింగి నీ విధముగా నాయందు స్పృహ (ఆశ) కలవారై నన్ను భజింపుచున్నారు.

మధ్వ. ఎల్లసృష్టికి కారణమైనవాఁడను నేనే, యను దాని నెఱింగి నాయం దాశకలవారైన పండితులు కొందఱున్నారనుట.

శ్లో. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్,
కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతిచ. 9

టీ. మచ్చిత్తాః=నాయందు మనస్సుగలవారలు, మద్గతప్రాణాః=నన్నుఁబొందినప్రాణములుగలవారలయి, పరస్పరం=

అన్యోన్యముగా, బోధయంతః = తెలియఁజేసికొనుచున్నవార లయి, మాం=నన్ను, కథయంతః=కీర్తించుచున్నవారలయి, నిత్యం=ఎల్లప్పుడును, తుష్యంతిచ = సంతోషించుచున్నారు, రమంతిచ=క్రీడించుచున్నారు.

శం. మఱియుఁ బండితులు నాయందుఁ జిత్తముగలవారై నాయందే ప్రాణము లప్పగించినవారై నాస్వభావమహిమలను తామెఱింగి యొకరికొక రుపదేశము చేసికొనుచు నాకథామృతమువలన సంతుష్టులై బ్రహ్మానంద మనుభవించుచున్నారు.

రామా. మఱియుఁ బండితులు మచ్చిత్తులై, తమ్మును నిలువఁ బెట్టుకొనలేనివారై తా మనుభవించిన నాగుణముల ను మిగిలిన వారికి బోధచేయుచు, నేను చేసిన దివ్యములైన పనులను చెప్పుకొనుచు ప్రయోజనా నంతరములేని ఆచెప్పుట చేతనె సంతోషింపుచు, వినువారు మిక్కిలి యిష్టములయి న ఆగుణములు మొదలగు వానిని వినుటచే ప్రీతిం జెందు చుందురు.

శ్లో. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే. 10

టీ. సతతయుక్తానాం=నిత్యయుక్తులైన, ప్రీతిపూర్వకం=వి శ్వాసపూర్వకముగా, భజతాం=సేవించుచున్న, తేషాం=వార లకు, తంబుద్ధియోగం=అజ్ఞానయోగమును, దదామి=ఇచ్చు చున్నాను, యేన=ఏబుద్ధియోగముచేత, తే=వారలు, మాం= నన్ను, ఉపయాంతి=పొందుచున్నారో.

శం. ఈవిధముగ నెల్లెడల నాయందాసక్తిగలిగి విశ్వాస పూర్వకముగ సేవించెడు మహాత్ములకు నాలో నైక్యమునకుఁ గారణమైన జ్ఞానయోగమును నే నిచ్చెదను.

రామా. ఈవిధముగ నిత్యముగ నాతోఁ జేరియుండుటను గోరుచున్న మహాత్ములకు పరిపక్వమైన భక్తిని ప్రీతి పూర్వకముగా నిచ్చెదను.

శ్లో. తేషామే వానుకంపార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. 11

టీ. తేషామేవ = వారలకే, అనుకంపార్థం=దయచేయుటకొఱకు, ఆత్మభావస్థః=స్వాభిప్రాయమందున్న, అహం=నేను, భాస్వతా=ప్రకాశించుచున్న, జ్ఞానదీపేన=వివేకమనెడి దీపముచేత, అజ్ఞానజం=అవివేకమువలనఁ బుట్టిన, తమః = అంధకారమును, నాశయామి = నశింపఁజేయుచున్నాను.

శం. అట్టివారికిమాత్రమే నేను దయచేసి నాసర్వవ్యాపకమైన జ్ఞానప్రకాశముచేత వారల ప్రకృతి సంబంధమైన యవివేకమనెడి యంధకారమును నశింపఁజేయుచున్నాను.

రామా. అజ్ఞానులయొక్క మనోవృత్తికి విషయముగానున్నవాఁడనైనా కల్యాణగుణములను ప్రకటన జేయుచు నాయందలి జ్ఞానమనెడి ప్రకాశించుచున్న వెలుఁగుచేత, జ్ఞానమునకు విరోధు లనెడి పూర్వకర్మము లనెడి యజ్ఞానముచేఁ బుట్టిన నాకంటె నితరములగు విషయములందలి ప్రావణ్యమనెడి చీకటిని నశింపఁ జేయుచున్నాను.

అర్జున ఉవాచ:—

శ్లో. పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్. 12
ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా,
అసితో దేవలో వ్యాస స్స్వయంచైవ బ్రవీషి మే. 13

అర్జునుఁడు పలుకుచున్నాఁడు.—

టీ. భవాన్=నీవు, పరం=ఉత్కృష్టమైన, బ్రహ్మ=బ్రహ్మము, పరం=ఉత్కృష్టమైన, ధామ= తేజస్సు, పరమం=ఉత్కృష్టమైన, పవిత్రం=పావనము, (ఇదియునుంగాక), త్వాం=నిన్ను, పురుషం=పురుషునిఁగా, శాశ్వతం=నిత్యమైనవానిఁగా, దివ్యం=ప్రకాశించుచున్నవానినిగా, ఆదిదేవం=దేవతలలో మొదటి వానినిగా, అజం=పుట్టుకలేనివానినిగా, విభుం=విభవనశీలుని గా సర్వవ్యాపకునిగా, ఆహుః=చెప్పుదురు. (అని ఉత్తరశ్లోక ముతోనన్వయము). దేవర్షిః=దేవఋషియైన, నారదశ్చ=నారదుఁడును, అసితః=అసితుఁడైన, దేవలః=దేవలుఁడు, తథా= ఆలాగుననే, వ్యాసః=వేదవ్యాసులును, సర్వే=అందఱు, ఋషయశ్చ=వసిష్ఠాదిఋషులును, త్వాం=నిన్ను, ఆహుః=పూర్వోక్తప్రకారముగాఁ జెప్పుదురు, స్వయంచ=నీవును, మే=నాకొఱకు, బ్రవీషి=చెప్పుచున్నావు.

తా. ఓ కృష్ణా! నిన్నుఁ బరబ్రహ్మ మనియు, పరంధాముఁడనియు, పరమోత్కృష్టుఁ డనియు, పరమపావనుఁ డనియు, పురాణపురుషుఁ డనియు, శాశ్వతుఁ డనియు, దివ్యమూర్తియనియు, దేవతలలో మొదటివాఁ డనియు,పుట్టువులేనివాఁ డనియు,

ప్రభువనియు, నారదుఁడును, దేవలుఁడును, అసితఋషియును, వ్యాసులును మహర్షులందఱుఁ జెప్పెదరు. నీవును ఆవిధముగానే నీమహిమను నాకుఁ దెలియఁజేయుచున్నావు.

రామా. శ్రీకృష్ణుఁడుగా నవతరించిన నీవు భగవంతుఁడవె అనుట.

శ్లో. సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ,
　　న హి తే భగవ న్వ్యక్తిం విదు ర్దేవా న దానవాః.　　14

టీ. హే కేశవ=ఓకృష్ణా! మాం=నన్నుఁగూర్చి, యత్=ఏవాక్యమును, వదసి=చెప్పుచున్నావో, ఏతత్సర్వం=ఆయీసమస్తమును, ఋతం=సత్యమైనదానినిగా, మన్యే=తలంచుచున్నాను. హేభగవన్=ఓ శ్రీకృష్ణస్వామీ! తే=నీయొక్క, వ్యక్తిం=మహిమను, దేవాః=దేవతలును, దానవాశ్చ=రాక్షసులును, నవిదుః=ఎఱుఁగరు.

శం. ఓ శ్రీకృష్ణా! నీవు నాకుపదేశించిన సమస్తవిషయములను సత్యమని నమ్ముచున్నాను. నీమహిమను దేవతలుఁగాని అసురులుఁగాని బాగుగాఁ దెలియఁజాలరు.

రామా. నీచేఁ జెప్పఁబడిన నీయొక్క ఐశ్వర్యమంతయును, నీకల్యాణగుణములను స్తోత్రము చేయుటకు చెప్పఁబడినవికావు. జ్ఞాన, శక్తి, బల,వీర్య తేజస్సులుకల ఓ భగవంతుఁడా! నీవైభవమును దేవతలును దానవులును స్వల్పజ్ఞానము కలవారుగాన నెఱుఁగరు.

శ్లో. స్వయ మే వాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ,
　　భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే.　　15

టీ. భూతభావన=ప్రాణులను వృద్ధిఁబొందించువాఁడా! భూతేశ=ప్రాణులకు నియామకుఁడగువాఁడా! దేవదేవ=దేవతలకు దేవుఁడగువాఁడా! జగత్పతే=లోకనాయకుఁడవైనవాఁడా! హే పురుషోత్తమ=ఓశ్రీకృష్ణస్వామీ! త్వం=నీవు, ఆత్మనా=నీచేత, స్వయమేవ=(అస్మదాదులవలె గురూపదేశాపేక్షలేక) నీవే, ఆత్మానం=నిన్ను, వేత్థ=ఎఱుంగుచున్నావు.

శం. వాసుదేవా! నీవు ప్రాణులను వృద్ధిచేయువాఁడవు, ప్రాణులకు నియామకుఁడవు, దేవదేవుఁడవు, లోకనాయకుఁడవు, పురుషశ్రేష్ఠుఁడవు, నీ మహత్త్వము దెలియఁదగినవాఁడు నీవుఁగాని వేఱొకఁడు లేఁడు.

రామా. వాసుదేవా! నీవు నీజ్ఞానముచేతనే నియమించువాఁడుగాను,మృగమనుష్యాదులకంటె దేవతలెట్లు సౌందర్యము మొదలగు కల్యాణగుణములచే అతిశయించియుందురో అట్లు వారినిగూడ నతిశయించువాఁడుగాను,వారికందఱకును స్వామిగాను నీవెఱుంగుదువు.

శ్లో. వక్తు మర్హస్య శేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః,
యాభిర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి. 16

టీ. ఆత్మవిభూతయః=స్వకీయమైన మాహాత్మ్య విస్తారములు, దివ్యాహి=ప్రకాశించుచున్నవి గదా! యాభిర్విభూతిభిః=ఏమాహాత్మ్యవిస్తారములచేత, ఇమాన్ లోకాన్=ఈలోకములను,వ్యాప్య=వ్యాపించి, త్వం=నీవు, తిష్ఠసి=ఉన్నావో, తాః=ఆమాహాత్మ్యవిస్తారములను, అశేషేణ=నిశ్శేషముగా,వక్తుం=చెప్పెడికొఱకు, అర్హసి=తగుదువు.

శం. నీ స్వకీయమైనమాహాత్మ్యము లనేకముగాఁ గనఁబడుచున్నవి. ఈ సమస్తలోకములను, ఏమాహాత్మ్యవిస్తారములచేత నీవు సర్వమును వ్యాపించి ప్రకాశింపఁజేయుచున్నావో, అవి యన్నియు సవిస్తారముగాఁ దెలియఁ జేయుటకు నీవే యర్హుఁడవు.

రామా. నీ యాత్మైశ్వర్యములు నీ కసాధారణములైనవి. అవిమఱియొక్కనికిలేవు. ఏనియమనవిశేషములతోఁగూడినవాఁడవై ఈలోకముల నన్నిటిని నియమించువాఁడవై వ్యాపించియున్నావో యవియన్నియు సవిస్తరముగాఁ జెప్పుటకు నీవెయర్హుఁడవు.

మధ్వ. విభూతి యనఁగా వివిధములైనభూతులు, ఐశ్వర్యము లనుట.

శ్లో. కథం విద్యా మహం యోగిన్ త్వాంసదా పరిచింతయన్,
కేషు కేషుచ భావేషు చింత్యోఽసి భగవ న్మయా. 17

టీ. హే యోగిన్=ఓశ్రీకృష్ణస్వామీ! అహం=నేను, కథం=ఎట్లు, త్వాం=నిన్ను, సదా=ఎల్లప్పుడును, పరిచింతయన్=ధ్యానము జేయుచున్నవాఁడనై, విద్యాం=తెలియుదును, హేభగవన్=ఓ శ్రీకృష్ణస్వామీ! కేషు కేషుచభావేషు=ఏయేవస్తువులయందు, మయా=నాచేత, చింత్యః=ధ్యానము జేయఁదగినవాఁడవు, అసి=అగుచున్నావు.

శం. ఓయీశ్వరా! ని న్నన్నిపూటలయందును ఏవిధముగ ధ్యానము జేసి యెఱుఁగఁగలను. నీవు ఏయేస్వరూపములు గలవాఁడవుగా ధ్యానముచేయుటకు తగినవాఁడవు?

రామా. యోగీయను పాఠము. నేను యోగినై యనఁగా భక్తియోగనిష్ఠుఁడనై భక్తిచేత నిన్నెప్పుడును చింతించుటకు ప్రవర్తించిన వాఁడనై చింతింపఁబడవలసిన వాఁడవైన నిన్నెట్లు తెలిసికొందును. బుద్ధిజ్ఞానాదులు కాక మిగిలిన ఏయేభావములయందు నియమించు వాఁడవుగా నీవు నాచేఁ జింతింపబడఁదగిన వాఁడవు.

శ్లో. విస్తరే ణాత్మనో యోగం విభూతిం చ జనార్దన,
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్.

టీ. హే జనార్దన=ఓశ్రీకృష్ణస్వామీ! ఆత్మనః=నీయొక్క, యోగం=యోగమును, విభూతించ=ఐశ్వర్యమును, విస్తరేణ=విస్తారముచేత, భూయః=మరల, కథయ=చెప్పుము, అమృతం=మీవాక్యామృతమును, శృణ్వతః = వినుచున్న, మే=నాకు, తృప్తిః=తనివి, నాస్తిహి=లేదుగదా.

శం. ఓ జనార్దనా! నీసర్వజ్ఞత్వవిభూతివిస్తారములను జక్కఁగా మరల నాకు సెలవిమ్ము. నీవాక్యామృతధార లెంత యాలకించినప్పటికిని నాకుఁ దృప్తిలేదు.

రామా. నావలన నంతయుం బ్రవర్తింపు చున్నదని సంక్షేపముగాఁ జెప్పఁబడిన నీయోగమును అనఁగా సృజించుట మొదలగు దానిని విభూతిని అనఁగా నియమనమును నీచేఁజెప్పఁబడెడి నీ మాహాత్మ్య మనెడి యమృతమును వినుచున్న నాకు తృప్తిలేక పోవుటను నీవె యెఱుంగుదువు.

శ్రీభగవా నువాచ.—

శ్లో. హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే. 19

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హే కురుశ్రేష్ఠ=ఓ యర్జునా! హంత=అయ్యో! దివ్యాః=ప్రకాశించుచున్న, ఆత్మవిభూతయః=స్వకీయమయిన మాహాత్మ్యవిస్తారములను, ప్రాధాన్యతః = ముఖ్యముగా, తే=నీకొఱకు, కథయిష్యామి = చెప్పఁగలను, మే=నాయొక్క, విస్తరస్య = మాహాత్మ్యవిస్తారమునకు, అంతః = తుద, నాస్తి=లేదు.

శం. అర్జునా! నా మాహాత్మ్యములు అనేకములుగా నున్నయవి. వానిని లెక్కపెట్టనలవికాదు. అయినను వానిలో ముఖ్యములయిన కొన్నిటిని నీకుఁగాను చెప్పెదను ఆలకింపుము.

రామా. అర్జునా! నామాహాత్మ్యము లనేకములుగా నున్నవి. విస్తరముగాఁ జెప్పుటకును వినుటకును గూడ నలవికాదు. నావిభూతియనఁగా నాచే నియమింపఁబడునవి యనుట.

శ్లో. అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః,
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మంతఏవచ. 20

టీ. హేగుడాకేశ=ఓయర్జునా! అహం=నేను, సర్వభూతాశయస్థితః=నాకు శరీరభూతములైన సమస్తభూతముల హృదయముననుండు, ఆత్మా=ఆత్మను, భూతానాం=భూతములకు, ఆదిశ్చ=సృష్టికర్తయును, మధ్యంచ=రక్షకుఁడును, అన్తశ్చ=లయకర్తయున్ను, అహమేవ=నేనే.

శం. ఓయర్జునా! ఎల్లభూతముల మనస్సులయందున్న పరమాత్మస్వరూపిని నేనే. ఎల్లభూతముల యుత్పత్తి, స్థితి, నాశములకుఁ గారణభూతుఁడను నేనే.

రామా. ఓయర్జునా! నాకు శరీరమైన యన్ని భూతములకు నేనే యాత్మను. (ఆత్మయనఁగా శరీరమునకు సర్వవిధముల ఆధారమైన వాఁడును, నియమించువాఁడును, శేషి (స్వామి) యును)-ఇట్టినేను ఆభూతముల ఉత్పత్తిస్థితిలయములకు కారణమైన వాఁడను.

శ్లో. ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్,
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. 21

టీ. అహం=నేను, ఆదిత్యానాం=ద్వాదశాదిత్యులలో, విష్ణుః=విష్ణువనెడి యాదిత్యుఁడను, జ్యోతిషాం= తేజస్సులలో, అంశుమాన్=కిరణములుగల, రవిః=సూర్యుఁడను, మరుతాం=సప్తమరుత్తులలో, మరీచిః=మరీచియను వాయువును, నక్షత్రాణాం=నక్షత్రములలో, శశీ=చంద్రుఁడను, అస్మి=అగుచున్నాను.

శం. ద్వాదశాదిత్యులలో విష్ణువను నాదిత్యుఁడు నేనే, జ్యోతిస్స్వరూపములలోఁ గిరణములుగల సూర్యుఁడు నేనే, వాయువులలో మరీచి యనువాయువు నేనే, నక్షత్రములలో చంద్రుఁడు నేనే.

శ్లో. వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః,
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా. 22

టీ. వేదానాం=నాల్గు వేదములలో, సామవేదః=సామవేదము, అస్మి=అగుదును, దేవానాం=దేవతలలో, వాసవః=ఇంద్రుఁడను, అస్మి=అగుదును, ఇంద్రియాణాం=ఏకాదశేంద్రియములలో, మనశ్చ=మనస్సును, అస్మి=అగుదును, భూతానాం=చేతనము గలజంతువులలో, చేతనా=చైతన్యము-తెలివి, అస్మి=అగుచున్నాను.

శం. వేదములలో సామవేదము నేనే. దేవతలలో దేవేంద్రుఁడు నేనే. ఇంద్రియములలో మనస్సు నేనే. ప్రాణులలో బుద్ధి నేనే.

శ్లో. రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్,
వసూనాం పావకశ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్. 23

టీ. రుద్రాణాం=ఏకాదశరుద్రులలో, శంకరశ్చ=శంకరుఁడను, అస్మి=అగుచున్నాను, యక్షరక్షసాం = యక్షరక్షోగణములలో, విత్తేశః=కుబేరుఁడను, అస్మి=అగుచున్నాను, వసూనాం=అష్టవసువులలో, పావకశ్చ = అగ్నియును, అస్మి=అగుచున్నాను, శిఖరిణాం=కొండలలో, మేరుః = మేరుపర్వతము, అహం=నేనే, అస్మి=అగుచున్నాను.

శం. ఏకాదశరుద్రులలో శంకరుఁడు నేనే. యక్షరాక్షసగణములలోఁ గుబేరుఁడు నేనే. అష్టవసువులలో నగ్ని హోత్రుఁడు నేనే. గొప్పకొండలలో మేరుపర్వతము నేనే.

శ్లో. పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః, 24

టీ. హేపార్థ=ఓయర్జునా! మాం=నన్ను, పురోధసాం=పురోహితులలో, ముఖ్యం=శ్రేష్ఠుఁడగు, బృహస్పతించ=బృహస్పతినిగానున్ను, విద్ధి=ఎఱుఁగుమా, అహం=నేను, సేనానీనాం=సేనాపతులలో, స్కంద=కుమారస్వామియు, సరసాం=మడువులలో, సాగరః=సముద్రమును, అస్మి=అగుచున్నాను.

శం. ఓయర్జునా! పురోహితులలో దేవపురోహితుఁడైన బృహస్పతి నేనే. సేనాధిపతులలోఁ గుమారస్వామి నేనే. తటాకములలో సముద్రుఁడు నేనే.

శ్లో. మహర్షీణాం భృగు రహం గిరా మ స్మ్యేకమక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః. 25

టీ. అహం=నేను, మహర్షీణాం=మరీచ్యాదిమహర్షులలో, భృగుః=భృగువు, అస్మి=అగుచున్నాను. గిరాం=అర్థవంతములగు శబ్దములలో, ఏకమక్షరం = ఒకటియగు ప్రణవాక్షరము, అస్మి=అగుచున్నాను. యజ్ఞానాం=పలుదెఱఁగులగు యజ్ఞములలో, జపయజ్ఞః=జపయజ్ఞము, అస్మి=అగుచున్నాను. స్థావరాణాం = అచలవస్తువులలో, హిమాలయః=హిమవత్పర్వతము, అస్మి=అగుచున్నాను.

శం. మహర్షులలో భృగువు నేనే. వాక్కులలోఁ బ్రణవము నేనే. యజ్ఞములలో జపయజ్ఞము నేనే. స్థావరములలో హిమవత్పర్వతము నేనే.

రామా. మహర్షులనఁగా మరీచ్యాదులు.

శ్లో. అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః,
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః. 26

టీ. సర్వవృక్షాణాం = అన్నిరకముల వృక్షములలో, అశ్వత్థః=రావిచెట్టున్ను, దేవర్షీణాం=దేవఋషులలో, నారదః = నారదుఁడు, గంధర్వాణాం = గంధర్వులలో, చిత్రరథః=చిత్రరథుఁడు, సిద్ధానాం = సిద్ధులలో, కపిలోమునిః = కపిలముని యును (అస్మి=అగుచున్నాను).

శం. వృక్షములలో నశ్వత్థవృక్షము నేనే. దేవఋషులలో నారదుఁడు నేనే. గంధర్వులలో చిత్రరథుఁడు నేనే. సిద్ధులలోఁ గపిలమహాముని నేనే.

మధ్వ. కపిలశబ్దమునకు; క=సుఖరూపుఁడైన వాఁడును, పి=పాలింపఁబడెడు జగత్తుకలవాఁడును, ల=లయము చేయఁబడెడు జగత్తుకలవాఁడును.

శ్లో. ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్,
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్. 27

టీ. అశ్వానాం = అశ్వములలో, అమృతోద్భవం=అమృతమందుఁ బుట్టిన, ఉచ్చైశ్శ్రవసం = ఉచ్చైశ్శ్రవముగను, గజేంద్రాణాం=దిగ్గజములలో, ఐరావతం = ఐరావతముగను, నరాణాం = మానవులలో, నరాధిపం = రాజుగను, మాం= నన్ను, విద్ధి= తెలిసికొనుము. (అమృతోద్భవమనునది యైరావతమునకు నన్వయించును.)

శం. అశ్వములలో నమృతముతోఁబుట్టిన ఉచ్చైశ్శ్రవము నేనే. గజశ్రేష్ఠములలో నైరావతము నేనే. మనుష్యులలో రాజును నేనే.

శ్లో. ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్,
ప్రజనశ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః. 28

టీ. అహం = నేను, ఆయుధానాం = ఆయుధములలో, వజ్రం=వజ్రమును, ధేనూనాం=గోవులలో, కామధుక్ =కామధేనువును, అస్మి = అగుచున్నాను. ప్రజనః = ప్రజలపుట్టువుకుఁ గారణుఁడగు, కందర్పశ్చ = మన్మథుఁడను, అస్మి=అగుదును. సర్పాణాం = ఒకతలగల యురగములలో, వాసుకిశ్చ=వాసుకియు, అస్మి=అగుచున్నాను.

శం. ఆయుధములలో వజ్రాయుధము నేనే. గోవులలోఁ గామధేనువు నేనే. ప్రాణులను బుట్టించు కాముఁడను నేనే. సర్ప సమూహములలో రాజయిన వాసుకి నేనే.

శ్లో. అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్,
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్.

టీ. అహం=నేను, నాగానాం=బహుశిరస్సులుగల పాములలో, అనంతశ్చ=అనంతుఁడును, యాదసాం=జలవాసులలో, వరుణః=వరుణుఁడును, అస్మి=అగుదును. అహం=నేను, పితౄణాం=పితృదేవతలలో, అర్యమా = అర్యముఁడును, సంయమతాం=దండించువారలలో, యమః=యముఁడును, అస్మి=అగుచున్నాను.

శం. నాగుపాములలో ననంతుఁడను నేనే. జలదేవతలలో వరుణుఁడు నేనే. పితృదేవతలలో నర్యముఁడు నేనే. దండించు వారలలో యముఁడు నేనే.

శ్లో. ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్,
మృగాణాం చ మృగేంద్రోహం వైనతేయశ్చ పక్షిణామ్.

టీ. అహం=నేను, దైత్యానాం=రాక్షసులలో, ప్రహ్లాదశ్చ=ప్రహ్లాదుఁడును, కలయతాం=(అనర్థమును గలిగింపఁగోరి) గణించువారిలో, కాలః=కాలరూపుఁడగు మృత్యువును, అస్మి=అగుచున్నాను. అహం=నేను, మృగాణాం=మృగములలో, మృగేంద్రః=సింహమును, పక్షిణాం=పక్షులలో, వైనతేయశ్చ = గరుడుఁడును, అస్మి=అగుచున్నాను.

శం. రాక్షసులలోఁ బ్రహ్లాదుఁడు నేనే. గణికులలోఁ గాలము నేనే. మృగములలో సింహము నేనే. పక్షులలో గరుత్మంతుఁడు నేనే.

శ్లో. పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్,
　　ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ. 31

టీ. పవతాం=గమనస్వభావముగలవారిలో, పవనః=వాయువు, అస్మి=అగుచున్నాను. శస్త్రభృతాం=విలుకాండ్రలో, రామః=రఘురాముఁడును, ఝషాణాం=జలజంతువులలో, మకరః=మొసలియును, అస్మి=అగుచున్నాను. స్రోతసాం=ప్రవాహములలో, జాహ్నవీ=గంగయును, అస్మి=అగుచున్నాను.

శం. పరిశుద్ధవస్తువులలో వాయువు నేనే. ధనుర్ధరులలో దశరథరాముఁడు నేనే. మత్స్యము మొదలయిన జలజంతువులలో మొసలి నేనే. నదులలో గంగానది నేనే.

మధ్వ. రామ; ర=ఆనందస్వరూపుఁడు, అమ=పరిమాణము లేనివాఁడు గాన రాముఁడు.

శ్లో. సర్గాణా మాది రంతశ్చ మధ్యం చైవాహ మర్జున,
　　అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్.32

టీ. అర్జున=అర్జునా! సర్గాణాం=సృష్టులకు, ఆదిః=మొదలును, అంతశ్చ=తుదయును, మధ్యంచ=నడుమును, అహమేవ=నేనే. విద్యానాం=విద్యలలో, అధ్యాత్మవిద్యా=బ్రహ్మవిద్యయును, ప్రవదతాం=వాదులలో, వాదః=వాదమును, అహం=నేనే.

శం. ఓయర్జునా! సృష్టులకు ఆది, స్థితి,లయములు నేనే. విద్యలలో మోక్షవిద్య నేనే. వాదించెడివారలలో వాదము నేనే.

రామా. సృజించెడివారలందఱును నేనే. అట్లే సంహరించు వారలందఱును నేనే. రక్షించువారలందఱును నేనే. తత్త్వము నిర్ణయించుటకై చేసెడి జల్పవితండాదులును నేనేయనుట.

శ్లో. అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ,
అహమే వాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః.

టీ. అక్షరాణాం=అక్షరములలో, అకారః=అకారమును, సామాసికస్య=సమాససమూహములో, ద్వన్ద్వశ్చ=ద్వంద్వసమాసమును, అస్మి=అగుచున్నాను. అక్షయః=నాశములేని, కాలః=కలాముహూర్తాదిమయమగు కాలము, అహమేవ = నేనేను, విశ్వముఖః=నలుదెసలమోములుగల,ధాతా=బ్రహ్మయును, అహం=నేనే.

శం. అక్షరములలో అకారము నేనే. సమాసములలో ద్వంద్వసమాసము నేనే. తుదలేని కాలము నేనే. కర్మఫలదాయకుఁడయిన విశ్వతోముఖుఁడను బ్రహ్మ నేనే.

శ్లో. మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్,
కీర్తిః శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా.

టీ. సర్వహరః=సర్వప్రపంచమును నశింపఁజేయునట్టి, మృత్యుశ్చ=మృత్యువును, భవిష్యతాం = పుట్టఁగలవారియొక్క, ఉద్భవశ్చ=పుట్టువుయును, అహమస్మి = నేనగుచున్నాను. నారీణాం=స్త్రీలలో, శ్రీః=లక్ష్మియును,కీర్తిః=కీర్తియును, వాక్చ=సరస్వతియును, స్మృతిః=జ్ఞాపకశక్తియును, మేధా=బుద్ధియును, ధృతిః=ధీరతయును,క్షమా=ఓరిమియును, అహమస్మి =నేనమైయున్నాను.

శం. సమస్తప్రపంచములను నాశముచేయు మృత్యుదేవత నేనే. ఉత్పత్తికాఁగల వస్తువులకు నుత్పత్తిస్థానము నేనే. స్త్రీల యందుఁ గీర్తి, లక్ష్మి, వాక్కు, తెలివి, బుద్ధి, ధైర్యము, ఓర్పు నేనే.

శ్లో. బృహత్సామతథాసామ్నాం గాయత్రీ ఛందసామహమ్,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః.

టీ. సామ్నాం=సామములలో, బృహత్సామ=బృహత్సామమును, ఛందసాం=ఛందస్సులలో, గాయత్రీ=గాయత్రియు ను, తథా=అలాగుననే, మాసానాం=మాసములలో, మార్గ శీర్షః=మార్గశీర్షమును, ఋతూనాం=ఋతువులలో, కుసుమా కరః=వసంతమును, అహమస్మి=నేనైయుందును.

శం. సామవేదములో బృహత్సామము నేనే. ఛందస్సుల లో గాయత్రీఛందస్సు నేనే. మాసములలో మార్గశీర్షమాస ము నేనే. ఋతువులలో వసంతఋతువు నేనే.

శ్లో. ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్,
జయోఽస్మివ్యవసాయోఽస్మిస త్త్వంస త్త్వవతామహమ్.

టీ. అహం=నేను, ఛలయతాం=జగద్వంచకములగువాని లో, ద్యూతం=జూదము, అస్మి=అగుచున్నాను. తేజస్వినాం= తేజోవంతులయొక్క, తేజః=తేజమును, అస్మి=అగుచున్నాను. జయః=జయించువారలజయమును, అస్మి=అగుచున్నాను. వ్యవ సాయః=ఉద్యోగవంతులయుద్యోగమును, అస్మి=అగుచున్నాను. సత్త్వవతాం=బలముగలవారలయొక్క, సత్త్వం=బలమును, అహం=నేను, అస్మి=అగుచున్నాను.

శం. వంచకములైన వస్తువులలో జూదము నేనే. తేజో వంతుల తేజస్సు నేనే. జయముగలవారల జయమును, దార్ఢ్య వంతుల దార్ఢ్యమును, ఉద్యోగులయుద్యోగమును నేనే.

శ్లో. వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనాకవిః. 37

టీ. వృష్ణీనాం=యాదవులలో, వాసుదేవః=వసుదేవనంద నుఁడు, అస్మి=అగుచున్నాను. పాండవానాం=పాండుకుమా రులలో, ధనంజయః=అర్జునుఁడు, అస్మి=అగుచున్నాను. అపి= మఱియును, అహం=నేను, మునీనాం=మునులలో, వ్యాసః= వ్యాసుఁడు. అహం=నేను, కవీనాం=వర్ణనఁజేయుపండితులలో, ఉశనాకవిః = శుక్రుఁడను విద్వాంసుఁడు.

శం. యాదవులలో వాసుదేవుఁడు నేనే. పాండవులలో నర్జునుఁడయిన నీవును నేనే. ఋషులలో వేదవ్యాసమహాముని నేనే. శాస్త్రార్థముల నెఱింగినవారలలో శుక్రాచార్యులు నేనే.

రామా. కవీనామ్=పండితులలో.

శ్లో. దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్.

టీ. దమయతాం=దండించువారలయొక్క, దమః = దండ నీతి, అస్మి=అగుచున్నాను. జిగీషతాం = జయింపఁగోరువారి యొక్క, నీతిః=రాజనీతియును, అస్మి=అగుచున్నాను. గుహ్యా నాం=గోప్యములలో, మౌనంచైవ=మౌనమున్ను, అస్మి = అగుచున్నాను. జ్ఞానవతాం=జ్ఞానముగలవారియొక్క, జ్ఞానం= జ్ఞానము, అహం=నేనే, అస్మి=అగుచున్నాను.

శం. శిక్షించువారలయొక్క దండనీతి నేనే. జయించ నిచ్ఛయించినవారల జయోపాయములు నేనే. గోప్యమయిన వస్తువులలో మౌనము నేనే. జ్ఞానవంతులలో జ్ఞానము నేనే.

శ్లో. యచ్చాపి సర్వభూతానాం బీజం త దహ మర్జున,
న త ద స్తి వినా య త్స్యా న్మయాభూతం చరాచరమ్.

టీ. హేఅర్జున=ఓయర్జునా! యత్=ఏది,సర్వభూతానాం=సమస్తభూతములకు, బీజం=ఆదికారణమో, తదపిచ = అదియును, అహం=నేను, యత్=ఏది, మయావినా=నన్ను విడిచి, స్యాత్=ఉండునో, తత్=అట్టి, చరాచరం = జంగమస్థావరరూపమైన, భూతం=భూతసమూహము, నాస్తి=లేదు.

శం. ఓ యర్జునా! సమస్తభూతములకు బీజము నేనే. నేనుగానిచరాచరభూతములు లేనేలేవు.

రామా. సమస్తవస్తువులును అన్నియవస్థలలో నన్ను ఆత్మఁగాఁగలవియే. ఇందుచేత, వెనుకఁజెప్పిన యన్నివిభూతులకును నేనే యాత్మనగుటచేత, నేనే అవిగాఁ జెప్పఁబడినవి.

శ్లో. నాంతోఽ స్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. 40

టీ. హే పరంతప=ఓయర్జునా ! మమ=నాయొక్క, దివ్యానాం=ప్రకాశించుచున్న, విభూతీనాం=మాహాత్మ్య విస్తారములకు, అంతః=తుద, నాస్తి=లేదు, ఏషః=ఈ, విభూతేః=విభూతియొక్క, విస్తరస్తు=విస్తారము, మయా=నాచేత, ఉద్దేశతః=సంక్షేపముగా, ప్రోక్తః=చెప్పఁబడెను.

శం. ఓ పార్థా! నామాహాత్మ్య విస్తారములకు నంతము లేదు. అయినను నీకుఁగాను వానిని సంగ్రహముగాఁ దెలియఁ జేసితిని.

శ్లో. యద్య ద్విభూతి మ త్స_త్త్వం శ్రీమ దూర్జిత మేవవా,
త_త్త దేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్. 41

టీ. లోకే=లోకమందు, విభూతిమత్ = ఐశ్వర్యయు_క్తము యిన, శ్రీమత్ = కాంతియు_క్తమైన, ఊర్జితమేవ=ఉత్సాహము తోఁగూడిన, యద్యత్స_త్త్వం=ఏయేవస్తువుకలదో, త_త్తత్= ఆయావస్తువు, మమ = నాయొక్క, తేజోఽంశసంభవమేవ= తేజోభాగసంభవమయినదానినిగానే, త్వం=నీవు, అవగచ్ఛ= తెలియుము.

శం. లోకమునం దైశ్వర్యయు_క్తమై, బలపరాక్రమయు_క్త మై, యుత్సాహయు_క్తమై, కాంతియు_క్తమై యేయేవస్తువులు గలవో వానినెల్ల నా తేజోభాగసంభవమైనవానిఁగాఁ దెలిసి కొనుము.

రామా. లోకమునం దేలఁబడునవి కలదై, కాంతి యు_క్తమై, శుభకార్యారంభమునందు ప్రియత్నము కలదై, ఇతరులను తిరస్కరించెడు సామర్థ్యము గలదై యేయేవస్తువు లున్నవో అవి నానియమనశ_క్తియొక్క ఏకదేశమువలన కలిగినదానిగాఁ దెలిసికొనుము.

శ్లో. అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్.42

టీ. హే అర్జున=ఓయర్జునుఁడా! అథవా=అటుగాక, తవ=నీకు, బహునా=అధికమయిన, ఏతేనజ్ఞానేన=ఈ తెలియఁబడిన దానిచేత, కిం=ఏమి, (స్యాత్=కలుగును). అహం=నేను, ఏకాంశేన=ఒకపాదముచేత(అనగా సర్వభూతస్వరూపముచేతననుట), కృత్స్నం=సమస్తమయిన, ఇదంజగత్ = ఈజగత్తును, విష్టభ్య=విశేషముగా వ్యాపించి, స్థితః=ఉన్నాను. ఇందుకు శ్రుతి. ('పాదోస్యవిశ్వాభూతాని'= ఈపరమాత్మకు సమస్తమయిన ప్రపంచమును నొకపాదమని శ్రుత్యర్థము.)

శం. ఓయర్జునా!నామాహాత్మ్యవిస్తారములను వేర్వేరుగా వివరింపవలసిన యావశ్యకములేదు. వానిని జక్కగాఁ దెలియ వలసినపని నీకును లేదు. ఈయెల్లప్రపంచములు నా యనేకాంశములలో నొకయంశముచేతనే వ్యాపింపఁబడియున్నవని యెఱుఁగుము.

రామా. 'కింజ్ఞానేన' అనిపాఠము. చేతనాచేతన రూపమైన ఈజగత్తంతయు స్వరూపము సిద్ధించుటయందును, ఉనికియందును, ప్రవర్తించుటయందును నాసంకల్పము నతిక్రమింప కుండునట్లు నామహిమలోని యతిస్వల్పభాగముచేత దాని నంతయును నిలువఁబెట్టియున్నా ననుట.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే విభూతి
యోగోనామ దశమోఽధ్యాయః.

ఉపనిష దర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునుల సంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయందు విభూతియోగమనెడి
దశమాధ్యాయము.

---

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## విశ్వరూపసందర్శనయోగః.

---

అర్జున ఉవాచ:—

శ్లో. మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయంవిగతో మమ. 1

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు:—

టీ. మదనుగ్రహాయ=నన్ననుగ్రహించుటకొఱకు, త్వయా=నీచేత, పరమం=ఉత్కృష్టమైన, గుహ్యం=గోప్యమైన, అధ్యాత్మసంజ్ఞితం=ఆత్మానాత్మవస్తువివేచనవిషయమైన, యద్వచః=ఏవాక్యము, ఉక్తం=చెప్పఁబడెనో, (ఆవాక్యముచేత,) మమ=నాయొక్క, అయం మోహః=ఈయజ్ఞానము, విగతః=పోఁగొట్టఁబడెను.

శం. నన్ననుగ్రహించుటకుఁగాను నీ వుపదేశించిన సర్వోత్తమమైనట్టియు, రహస్యమైనట్టియు, ఆత్మానాత్మవస్తు వివేకజ్ఞాపకమైనట్టియు నుపదేశవాక్యమువలన నాయజ్ఞానము వదలిపోయినది.

రామా. నన్ననుగ్రహించుటకై నీవుపదేశించిన సర్వోత్తమమైనట్టియు, రహస్యమైనట్టియు, ఆత్మవిషయమునఁ జెప్ప

వలసినదియు నగు ఉపదేశ వాక్యమువలన దేహాత్మాభిమానము వదలిపోయినది.

మధ్వ. ఎట్లు వినిన యెడల ధ్యానముచేయుట సుకరమో అట్లే స్వరూపస్థితి ఈయధ్యాయమున చెప్పఁబడును.

శ్లో. భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్. 2

టీ. హే కమలపత్రాక్ష=ఓశ్రీకృష్ణస్వామీ!త్వత్తః=నీవల్ల, భూతానాం=ప్రాణులయొక్క, భవాప్యయౌ=ఉత్పత్తిప్రళయములు, విస్తరశః=విస్తారముగా, మయా=నాచేత,శ్రుతౌ=వినఁబడినవి; అవ్యయం = అక్షయమయిన, తే=నీయొక్క,మాహాత్మ్యంచ=మాహాత్మ్యమును, శ్రుతం=వినఁబడెను.

శం. ఓ కృష్ణా! నీవలన భూతసమూహముల యుత్పత్తి నాశములు విస్తారముగా విన్నదేగాక యక్షయమైన నీ ప్రభావమునుసయితము బాగుగా వింటిని.

రామా. అన్నిభూతములకు నీచేఁ గలిగెడియుత్పత్తి ప్రళయములు నేను విన్నాను. అంతేకాక నీవు చేతనాచేతనములన్నిటికిని శేషి యగుటయు, కల్యాణ గుణములచే నన్నింటికంటె గొప్పవాఁడగుటయు, అన్నిటి ప్రవృత్తులను ప్రవర్తింపఁజేయువాఁడగుటయును గూడ బాగుగా వింటిని అనుట.

శ్లో. ఏవ మేత ద్యథాఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర,
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ. 3

టీ. హేపరమేశ్వర = ఓశ్రీకృష్ణస్వామీ! ఏతత్ = ఇది, ఏవం = ఈలాగే, (ఇందుకు వ్యత్యాసములేదు.) యథా=ఏరీతి

గా, ఆత్మానం=ఆత్మస్వరూపమును, త్వం = నీవు, అత్థ=చెప్పితివో, హేపురుషోత్తమ=ఓ శ్రీకృష్ణా! తథా = ఆరీతిగా, ఐశ్వరం=జ్ఞానైశ్వర్యబలశక్తివీర్యతేజస్సులతోఁ గూడిన విష్ణుసంబంధియగు, తే=నీయొక్క, రూపం=స్వరూపమును, ద్రష్టుం=చూచుటకొఱకు, ఇచ్ఛామి=ఇచ్ఛయించుచున్నాను.

శం. ఓపరమేశ్వరా! నీవు చెప్పినది యథార్థమే. నీయాత్మస్వరూపమెట్టిదని నీవు తెలియఁజేసితివో యట్టి ప్రభావముగల నీ స్వరూపమును జూచుటకు నేను మిగులఁ గోరుచున్నాను.

రామా. ఐశ్వరం=ఈశ్వరుని కసాధారణమైనది.

శ్లో. మన్యసే యది త చ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో,
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్.

టీ. హే ప్రభో = హే యోగేశ్వరా, ఓ శ్రీకృష్ణస్వామీ! తత్=ఆరూపము, మయా=నాచేత, ద్రష్టుం = చూచుటకొఱకు, శక్యం=శక్యమైనదని, మన్యసే యది=తలంచితివేని, తతః=ఆతర్వాత, త్వం=నీవు, మే=నాకొఱకు, అవ్యయం=శాశ్వతమైన, ఆత్మానం=నిన్ను, దర్శయ=చూపుము.

శం. ఓ శ్రీకృష్ణా! అట్టిప్రభావముగల నీ దివ్యరూపమును జూచుటకు నాకు సాధ్యమని నీవు భావించితివేని నీ యవ్యయమైన స్వరూపమును నాకుఁ జూపుము. (యోగేశ్వర అనఁగా యోగుల యోగమున కీశ్వరుఁడైనవాఁడు.)

రామా. యోగేశ్వర అనఁగా, యోగమనఁగా జ్ఞానము మొదలగు కల్యాణ గుణముల సంబంధము కలవాఁడా! ఓప్రభువగు కృష్ణా! నాకు నిన్ను సంపూర్ణముగా చూపుమనుట.

శ్రీభగవా నువాచః—

శ్లో. పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. 5

శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడుః—

టీ. హే పార్థ=ఓయర్జునా! నానావిధాని=అనేకప్రకారము లైన, దివ్యాని=అప్రాకృతములైన, నానావర్ణాకృతీని=అనేకములైన వర్ణములును అవయవస్థితివిశేషములును గలిగిన, శతశః=నూరులైన, అథ=మఱియు, సహస్రశః = వేలసంఖ్య లైన, మే = నాయొక్క, రూపాణి = ఆకారములను, పశ్య= చూడుము.

శం. అర్జునా! దివ్యములై, నానావిధములై, యనేకవర్ణము లై, పలువిశేషములుగలవై విశేషసంఖ్యగల నా స్వరూపము లను జూడుము.

శ్లో. పశ్యాఽదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా,
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాఽశ్చర్యాణి భారత. 6

టీ. హే భారత=ఓయర్జునా! ఆదిత్యాన్=ద్వాదశాదిత్యుల ను, వసూన్ = అష్టవసువులను, రుద్రాన్ = ఏకాదశరుద్రులను, అశ్వినౌ=అశ్వినీదేవతలను, తథా=అలాగుననే, మరుతః=సప్త వాయువులను, పశ్య=చూడుము. అదృష్టపూర్వాణి=ఎన్నఁడుఁ జూడఁబడని, బహూని=అనేకములైన, ఆశ్చర్యాణి=అద్భుతము లను, పశ్య=చూడుము.

శం. భారతా! ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాద శరుద్రులను, అశ్వినీదేవతలను, సప్తవాయువులను, ఇంతవఱ

కు నీచేఁజూడఁబడని యనేకసంఖ్యలుగల యద్భుతములను నిపుడు నారూపమందు కనుము.

శ్లో. ఇహైకస్థం జగ త్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమ దేహే గుడాకేశ యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి. 7

టీ. హేగుడాకేశ=ఓయర్జునుఁడా! అద్య=ఇప్పుడు, సచరాచరం=జంగమస్థావరములతోఁగూడిన,కృత్స్నం=సమస్తమైన, జగత్=జగత్తును, మమ=నాయొక్క, ఇహ దేహే=ఈశరీరమందు, ఏకస్థం=ఒకప్రదేశమందున్నదానినిగా, పశ్య=చూడుము. అన్యత్=మఱియొకటైన, యచ్ఛ=దేనిని, ద్రష్టుం=చూచుటకొఱకు, ఇచ్ఛసి = ఇచ్ఛయించుచున్నావో, తత్= దానిని, పశ్య=చూడుము.

శం. అర్జునా! చరాచరంబగు సమస్తప్రపంచమును నేకస్థానమైన నాదివ్యదేహమునఁ జూడుము. ఇదిగాక జయపరాజయములు మొదలగు నేయే యంశములను నీవుచూడఁదలచియున్నావో వానినన్నిటినిఁ జూడుము.

శ్లో. న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్. 8

టీ. అనేన=ఈప్రాకృతమైన, స్వచక్షుషైవ = నీనేత్రముచేతనే, మాం=నన్ను, ద్రష్టుం=చూచుటకొఱకు, నశక్యసే=శక్తుఁడవుకావు. దివ్యం=అప్రాకృతమైన, చక్షుః=నేత్రమును, తే=నీకొఱకు, దదామి=ఇచ్చుచున్నాను. ఐశ్వరం=ఈశ్వరసంబంధమైన, మే=నాయొక్క, యోగం=యోగశక్తియొక్క ఐశ్వర్యమును, పశ్య=చూడుము.

శం. ఈప్రాకృతములైన నీ కన్నులతో నాదివ్యస్వరూప మును జూడఁజాలవు. నీకు దివ్యదృష్టి నిచ్చుచున్నాను. దాని చే నాశ్చర్యమైన నాయోగశక్తిని జూడుము.

రామా. యోగ మనఁగా జ్ఞానము మొదలగువానియొక్క ఐశ్వర్యము.

సంజయ ఉవాచ.—

శ్లో. ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్. 9

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హే రాజన్=ఓయి ధృతరాష్ట్రుఁడా! మహాయోగే శ్వరః=అధికమైన యోగములకుఁ బ్రభువైన, హరిః=శ్రీకృష్ణ స్వామి, ఏవం=ఈప్రకారముగా, ఉక్త్వా=పలికి, తతః=ఆపిమ్మట, పార్థాయ=అర్జునునికొఱకు, పరమం = ఉత్కృష్టమైన, ఐశ్వ రం=ఈశ్వరసంబంధమైన, రూపం=విశ్వరూపమును, దర్శయా మాస=చూపెను.

శం. ధృతరాష్ట్రా! మహాయోగియైన శ్రీకృష్ణుఁడు పైఁ జెప్పి నట్లు పలికి సర్వోత్కృష్టమై దివ్యమైన తనవిశ్వరూపమునర్జు నునికిఁ జూపెను. గొప్పవాఁడును, యోగేశ్వరుఁడును గాన మహాయోగేశ్వరుఁడు. హరి యనఁగా నారాయణుఁడు.

రామా. గొప్ప యాశ్చర్యయోగముల కీశ్వరుఁ డగుట మహాయోగేశ్వరుఁడు.

మధ్వ. యజ్ఞాదిభాగముల నన్నిటిని హరించునుగాన హరి యనుట.

శ్లో. అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్,
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్. 10

టీ. అనేకవక్త్రనయనం= అనేకములయిన ముఖములును నేత్రములును గలిగినట్టియు,అనేకాద్భుతదర్శనం=బహువిధములైన యాశ్చర్యములను జూపుచున్నట్టియు, అనేకదివ్యాభరణం=అనేకదివ్యభూషణములుకలిగినట్టియు, దివ్యానేకోద్యతాయుధం=దివ్యములై యనేకములై యెత్తబడియున్న యాయుధములు గలిగినట్టియు (రూపమును జూపె) నని భావము.

శం. ఆరూప మనేకముఖములతోను, నేత్రములతోను, అద్భుతములతోను, దివ్యాభరణములతోను, ఆయుధములతోను గూడుకొని యుండెను.

శ్లో. దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్. 11

టీ. దివ్యమాల్యాంబరధరం=అప్రాకృతములైన మాల్యములను వస్త్రములను ధరించియున్న, దివ్యగన్ధానులేపనం=దివ్యగంధలేపనముగల్గిన, సర్వాశ్చర్యమయం = సమస్తాశ్చర్యరూపమైన, విశ్వతోముఖం = అంతటముఖములుగలిగిన, అనంతం= అపరిచ్ఛిన్నమైన, దేవం=శ్రీభగవంతుని, (అర్జునుఁడు చూచెను.)

శం. మఱియు దివ్యములైన హారములతోను, వస్త్రములతోను, పరిమళముగల గంధములతోను గూడుకొని యెల్లెడల ముఖములుగలదై యాశ్చర్యకరమై యంతములేనిదైన స్వరూపము నర్జునుఁడు కనెను.

రామా. అనంతం=మూడుకాలములయం దుండునది, పరిమాణములేనిది.

శ్లో. దివి సూర్యసహస్రస్య భవే ద్యుగప దుత్థితా,
యది భాస్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః. 12

టీ. దివి=ఆకాశమందు, సూర్యసహస్రస్య=సహస్రసూర్యులయొక్క, భాః=కాంతి, యుగపత్=ఏకకాలమందు, ఉత్థితా=ఎగసినది, భవేద్యది=అయెనేని, సా=ఆకాంతి, తస్య మహాత్మనః=ఆమహాత్మునియొక్క, భాసః = కాంతికి, సదృశీ=సమానమైనది, స్యాత్=అగును.

శం. ఆ దివ్యరూపముయొక్క కాంతి, యేకకాలమున వేయిసూర్యు లాకాశమందుఁ బ్రకాశించిన నెంతకాంతిగ నుండునో దానికి సమానముగా నుండెను.

మధ్వ. సహస్రశబ్దమువలన అంతములేనిది యనుట.

శ్లో. తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా. 13

టీ. అనేకధా=దేవతలు మనుష్యులు తిర్యక్కులుమొదలుగా బహుప్రకారములుగా, ప్రవిభక్తం=పర్వఁబడిన, కృత్స్నం=సమస్తమైన, జగత్=జగత్తు, దేవదేవస్య=శ్రీకృష్ణస్వామియొక్క, తత్ర=ఆశరీరమందు, ఏకస్థం=ఒకప్రక్కనున్నదానిసిగా, తదా=అప్పుడు, పాండవః = అర్జునుఁడు, అపశ్యత్=చూచెను.

తా. అనేకప్రకారములుగాఁ బలువిధములుగా నేర్పఱచియుండు నెల్ల జగత్తును దేవదేవుఁడయిన శ్రీకృష్ణుని దేహమం దొకటిగాఁ జేరియుండుట నర్జునుఁడు చూచెను.

శ్లో. తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత. 14

టీ. తతః=అనంతరము, ధనంజయః=అర్జునుఁడు, విస్మయావిష్టస్సన్=ఆశ్చర్యముతోఁగూడినవాఁడయి, హృష్టరోమా=గగ్గురుపాటుచిన వెంట్రుకలు గలవాఁడయి, దేవం=విశ్వరూపధరుఁడయిన శ్రీకృష్ణస్వామిని, శిరసా=శిరస్సుచేతను, ప్రణమ్య=నమస్కరించి, కృతాంజలిః=చేయఁబడిన అంజలిగలవాఁడయి, అభాషత=పలికెను.

తా. అపు డర్జునుఁడు చిత్తవిభ్రాంతినొంది శరీరమున గగుర్పాటుచెందినవాఁడయి విశ్వరూపధరుఁడయిన శ్రీకృష్ణునికి నమస్కరించి చేతులు చేర్చి ఈక్రిందఁజెప్పినవిధమునఁ బలికెను.

అర్జున ఉవాచ:—

శ్లో. పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూతవిశేషసంఘాన్,
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్. 15

అర్జునుఁడు పలుకుచున్నాఁడు.—

టీ. హే దేవ=శ్రీకృష్ణస్వామీ! తవ=నీయొక్క, దేహే=దేహమందు, దేవాన్ = దేవతలను, తథా=ఆలాగుననే, సర్వాన్=సమస్తములయిన, భూతవిశేషసంఘాన్ = ప్రాణికోట్ల

ను, కమలాసనస్థం=కమలమందున్న, ఈశం=ప్రభువయిన, బ్రహ్మాణం = చతుర్ముఖ బ్రహ్మను, సర్వాన్ = సమస్తులయిన, ఋషీన్ = ఋషులను, దివ్యాన్ = దివ్యములైన, ఉరగాన్ = వాసుకి మొదలైన సర్పములను, పశ్యామి = చూచుచున్నాను.

శం. ఓ దేవా ! నీశరీరమునం దెల్ల దేవతలు, ప్రాణికోట్లు, కమలము ఆసనముగాఁగల చతుర్ముఖబ్రహ్మ, ఎల్ల ఋషులు, దేవసర్పములైనవాసుకి మొదలుగాఁగలవారు అగపడుచున్నారు. కమలాసనస్థం బ్రహ్మాణం = భూమియనెడి పదమునకు మధ్యమైన మేరుపర్వత మనెడి యాసనమున నున్నవాఁ డగు బ్రహ్మను.

శ్లో. అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్,
నాంతం న మధ్యం నపున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూపమ్. 16

టీ. విశ్వేశ్వర=విశ్వనియామకుఁడా ! హేవిశ్వరూప=విశ్వరూపధరుఁడవైనయోస్వామీ! అనేకబాహూదరవక్త్రనేత్రం= అనేకములైన బాహువులును ఉదరములును ముఖములును నేత్రములును గలిగిన, త్వాం=నిన్ను, సర్వతః = అంతటను, అనంతరూపం = అనంతాకారములుగలవానిగాను, పశ్యామి= చూచుచున్నాను. పునః=మఱియు, తవ=నీయొక్క, ఆదిం=మొదలును, మధ్యం=మధ్యమును, అంతం=తుదను, న పశ్యామి= కానను.

శం. జగములకు నియామకుఁడవయిన యోయీశ్వరా! నీ విశ్వరూపమునకు ననేకబాహువులు, ఉదరములు, ముఖములు,

కన్నులు గలిగియున్నవి. నీరూపము మిగుల నెల్లెడల వ్యాపించియున్నది. అయినను నీయాకారమునకుఁ జివర, మొదలు, మధ్యభాగము నా కగపడలేదు.

మధ్వ. అనేకవిశ్వపదములచే ననంతము లనుట స్పష్టము. ఎచ్చటను నీరూపమున కంతము లేదు గాన ననంతమనియు, సంపూర్ణరూపముగలవాఁడు గాన విశ్వరూపుఁడనియు, భగవంతుఁ డచింత్యశక్తియగుటచే నిట్లు సందర్శించును.

శ్లో. కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్. 17

టీ. కిరీటినం=కిరీటముగలిగినట్టియు, గదినం=గదగలిగినట్టియు, చక్రిణం=చక్రముగలిగినట్టియు, తేజోరాశిం=కాంతిపుంజమగునట్టియు, సర్వతోదీప్తిమంతం=అంతటనుప్రకాశముగలిగినట్టియు,దుర్నిరీక్ష్యం=చూడనలవికానట్టియు,దీప్తానలార్కద్యుతిం=ప్రకాశింపుచున్న యగ్నిసూర్యులకాంతివంటి కాంతిగలిగినట్టియు, అప్రమేయం=అపరిచ్ఛేద్యుఁడవైనట్టియు, త్వాం=నిన్ను, సమంతాత్=అంతటను, పశ్యామి=చూచుచున్నాను.

శం. కిరీటమును గదాచక్రములను దాల్చిన నీ విశ్వరూపము కాంతిచే నిండినదియై యగ్నిసూర్యులకు సాటిగ నంతటను రగులుచున్నది. అపరిచ్ఛేద్యమయిన నీస్వరూపము గనుటకు మిగుల నశక్యముగ నున్నది.

మధ్వ. ''దీప్తానలార్కద్యుతిమ్'' అనుటచే మితమైన కాంతిగలవాఁడని భ్రాంతి పుట్టునని వెంటనే 'అప్రమేయమ్' అను పదప్రయోగము.

శ్లో. త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్,
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే. 18

టీ. త్వం=నీవు, పరమం=ఉత్కృష్టమయిన, అక్షరం=పరబ్రహ్మమని, వేదితవ్యం=తెలియఁదగినవాఁడవు. త్వం= నీవు, అస్యవిశ్వస్య=ఈజగత్తుకు, పరం=ఉత్కృష్టమయిన, నిధానం=ఆశ్రయము. త్వం=నీవు, అవ్యయః=నాశరహితుఁడవును, శాశ్వతధర్మగోప్తా=స్థిరమయినధర్మమునకు రక్షకుఁడవును, త్వం=నీవు, సనాతనః=పురాణుఁడైన, పురుషః=పురుషుఁడవని, మే=నాయొక్క, మతః=మతము.

తా. ఓ యీశ్వరా! నీవు పరమోత్కృష్టమయిన పరబ్రహ్మమనియు, ఎల్లజగములకు నుత్కృష్టమయిన యాశ్రయమనియు, నశింపనివాఁడవనియు, నూర్జితములయిన ధర్మములకు రక్షకుఁడవనియు, పురాణపురుషుఁడ వనియు నెఱుఁగఁదగినవాఁడవు.

శ్లో. అనాదిమధ్యాంత మనంతవీర్య
మనంతబాహుం శశిసూర్యనేత్రం,
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతమ్. 19

టీ. అనాదిమధ్యాంతం=మొదలు నడుము తుద లేనట్టియు, అనంతవీర్యం=అపరిమితపరాక్రమముగలిగినట్టియు, అనంతబాహుం=అపరిమితములైన బాహువులు గలిగినట్టియు, శశిసూర్యనేత్రం=చంద్రసూర్యులే నేత్రములుగాఁ గలిగినట్టియు, దీప్తహుతాశవక్త్రం = ప్రకాశించుచున్న యగ్నివంటి ముఖము గలిగినట్టియు, త్వాం=నిన్ను, స్వతేజసా=నిజతేజముచేత, ఇదం విశ్వం=ఈప్రపంచమును, తపంతం=తపింపఁజేయుచున్నవానిగా, పశ్యామి=చూచుచున్నాను.

తా. ఓ దేవా! నీవు ఆదిమధ్యాంతములు లేనివాఁడవై, యపరిమితబలము గలవాఁడవయి, యనేకబాహువులు గలిగి సూర్యచంద్రులను గన్నులుగా నుంచుకొని రగులుచున్న నిప్పు ముఖమునందు గల్గి యీ యెల్లలోకములను నీకాంతిచేఁ దపింపఁ జేయువాఁడవుగా నాకగపడుచున్నావు.

శ్లో. ద్యావాపృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః,
దృష్ట్వాద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. 20

టీ. ఏకేన=ఒక్కఁడైన, త్వయా = నీచేత, ద్యావాపృథివ్యోః=భూమ్యాకాశములయొక్క, ఇదమంతరం = ఈ యవకాశము, వ్యాప్తం=వ్యాపించఁబడెనుగదా! సర్వాదిశః=సమస్తదిక్కులును, వ్యాప్తాః = వ్యాపింపఁబడినవి. హేమహాత్మన్=ఓయి మహానుభావా! అద్భుతం=ఆశ్చర్యమయిన, ఉగ్రం=భయంకరమైన, తవ=నీయొక్క, ఇదంరూపం = ఈరూపమును, దృ

ష్ట్వా=చూచి, లోకత్రయం=మూఁడులోకములును, ప్రవ్యథితం=భయపడుచున్నవి.

శం. నీయొకనిరూపముచే భూమి, ఆకాశము, అంతరాళము అన్నియు వ్యాపింపఁబడియున్నవి. ఎల్లదిక్కులు వ్యాపించినయోమహానుభావా! ఆశ్చర్యముగాను,అతిభయంకరముగాను నుండు నీ రూపమును చూచి స్వర్గ, మర్త్య, పాతాళ లోకములు మూడును వణఁకుచున్నవి.

రామా. నీయొకనిరూపముచే మీఁదిలోకంబులు క్రిందిలోకంబులు, వీనిమధ్యనుండు నీలోకంబును వ్యాపింపఁబడియున్నవి. అత్యాశ్చర్యమును అతిభయంకరమునగు నీరూపమును చూచి యుద్ధమును జూచుటకు వచ్చిన బ్రహ్మాదిదేవతలు మొదలగువారిలోఁ బ్రతికూలురు, అనుకూలురు, మధ్యస్థులు (లోకత్రయము) వీరలందఱకును భగవంతుఁడు తన విశ్వరూపసందర్శనమునకై దివ్యదృష్టి ఇచ్చెను. పరిచ్ఛేదములేని మనోవృత్తి కలవాఁడా! ఆరూపమును చూచి వారు వణఁకుచున్నారనుట.

శ్లో. అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి,
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. 21

టీ. అమీ=ఈయుద్ధభూమినిపొందియున్న, సురసంఘాః=భూభారనివారణకొఱకు మర్త్యులయిపుట్టియున్న వస్వాదిదేవసమూహములు, త్వాం=నిన్ను, విశంతి=ప్రవేశించుచున్నారు-అనఁగా నీయందుఁ గనుపడుచున్నారనుట. కేచిత్=వారిలోఁ

గొందఱు, భీతాః=భయపడినవారలయి, ప్రాంజలయః=బద్ధాంజలులయి, గృణంతి=స్తుతింపుచున్నారు. మహర్షిసిద్ధసంఘాః=మహర్షిసిద్ధసమూహములు, స్వస్తి=క్షేమము, అస్తు=అవుఁగాక, ఇతి=ఇట్లని, ఉక్త్వా=పలికి, పుష్కలాభిః=సంపూర్ణములయిన, స్తుతిభిః=స్తోత్రములచేత, త్వాం=నిన్ను, స్తువంతి=స్తోత్రముచేయుచున్నారు.

శం. నీదివ్యరూపమయిన విశ్వరూపమునందు దేవసమూహములు శరణుచెందుచున్నవి.అందులోఁ గొందఱు భయము నొంది చేతులుమోడ్చి నిన్ను స్తుతించుచున్నారు. గొప్ప ఋషులు, సిద్ధులును నీకు జయప్రదవాక్యములు చెప్పుచు నిన్నుఁ బలువిధములుగఁ బూర్ణముగ స్తోత్రముచేయుచున్నారు. అర్జునుని భయము తీర్చుటకై పాండవులకే జయము కలుగుననుట నిశ్చయమని తనరూపములో అర్జునవిజయమును భగవంతుఁడు స్పష్టీకరించినాఁడు.

రామా. గొప్ప దేవతలందఱును నిన్ను విశ్వమున కాశ్రయమైనవానినిగా జూచి సంతసించిన మనస్సు గలవారై నీయొద్దకు చేరుచున్నారు. మఱికొందఱు నీయుగ్రరూపమును చూచి బెదరినవారై చేతులు జోడించుకొని స్తుతింపుచున్నారు. ఆ స్తోత్రములు భగవంతునకు తగినవై యున్నవనుట.

మధ్వ. భగవంతునిరూపము చూచువారికెల్ల తప్పక భయము కలుగఁజేయునదికాదు. నారదునకు భయము కలుగలేదు. కొందఱకు మాత్రము భయమును కలుగఁజేయును. ఆరూపము నందఱును చూడలేరు. రూపము నూహించికొని బెదరినచోఁ జూచినట్లె కనబడును.

శ్లో. రుద్రాదిత్యా వసవో యేచ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ,
గంధర్వయక్షాసురసిద్ధసంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే. 22

టీ. రుద్రాదిత్యాః=ఏకాదశరుద్రులును ద్వాదశాదిత్యులును, వసవః=అష్టవసువులును, యే=ఎవరు, సాధ్యాః=సాధ్యులో, తేచ=వారును, విశ్వే=విశ్వేదేవతలును, అశ్వినౌ=అశ్వినీదేవతలును, మరుతశ్చ=మరుత్తులును, ఊష్మపాశ్చ=పితృదేవతలును, గంధర్వయక్షాసురసిద్ధసంఘాః=హాహా, హూహూ, మొదలగు గంధర్వులును, కుబేరుఁడు మొదలగు యక్షులును, విరోచనుఁడు మొదలగు రాక్షసులును, కపిలాదులైన సిద్ధులును వీరిసమూహములును, సర్వే=వీ రందఱును, విస్మితాస్సంతః=ఆశ్చర్యమును బొందినవారలై, త్వా మేవ=నిన్నే, వీక్షంతే=చూచుచున్నారు.

తం. ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినీదేవతలు, సప్తవాయువులు, పితృదేవతలు, గంధర్వ యక్ష రాక్షస సిద్ధసమూహములు ఆశ్చర్యముతో నిన్నే చూచుచున్నారు.

శ్లో. రూపం మహ త్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదం,
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్. 23

టీ. హే మహాబాహో=ఓ శ్రీకృష్ణస్వామీ! బహువక్త్రనేత్రం=అనేకములైన ముఖములును నేత్రములును గలిగినట్టి

యు, బహుబాహూరుపాదం=అనేకములైన బాహువులును తొడలును పాదములును గలిగినట్టియు, బహూదరం=అనేకములైన కడుపులుగలిగినట్టియు, బహుదంష్ట్రాకరాళం=అనేకములైన కోరలచేత భయంకరమైనట్టియు, మహత్=గొప్పదైనట్టి, తే=నీయొక్క, రూపం=ఆకారమును, దృష్ట్వా=చూచి, లోకాః=ప్రాణులు, ప్రవ్యథితాః=భయపడుచున్నారు. తథా=ఆలాగుననే, అహం=నేనును, ప్రవ్యథితః=భయపడుచున్నాను.

శం. పెక్కు ముఖములు, కండ్లు, చేతులు, తొడలు, పాదములు, కడుపులు, ఘోరమైనకోరలుగల నీగొప్పయాకారమును గని యెల్లప్రాణులును నేనును మిగుల వెఱపు చెందియున్నారము.

శ్లో. నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్,
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో. 24

టీ. హేవిష్ణో=ఓకృష్ణస్వామీ! నభస్స్పృశం=ఆకాశమును తాఁకుచున్నట్టియు, దీప్తం=మండుచున్నట్టియు, అనేకవర్ణం=నానావర్ణములుగలిగినట్టియు, వ్యాత్తాననం=తెరవఁబడినముఖములు గలిగినట్టియు, దీప్తవిశాలనేత్రం=ప్రకాశించుచున్న గొప్పకన్నులు గలిగినట్టియు, త్వాం=నిన్ను, దృష్ట్వా=చూచి, ప్రవ్యథితాంతరాత్మా=భయపడినమనస్సుగలిగిన నేను, ధృతిం=ధైర్యమును, న విందామి = పొందకయున్నాను. శమంచ=మనస్తుష్టిని, న విందామి=పొందకయున్నాను.

శం. ఆకాశమును దాఁకునట్టియు, ప్రజ్వలించునట్టియుఁ, బెక్కు-రంగులు కలిగినట్టియుఁ, దెరవఁబడియుండు నోళ్లు కలిగినట్టియుఁ, బ్రకాశించెడు విశాలమయిన కన్నులు గలిగినట్టియు నీ రూపమును జూచి నామనస్సు భయమునొందియున్నది గాన నాకు ధైర్యము సంతుష్టి లేకయున్నది.

రామా. పరమపదము నంటునట్టియు మొదలగు నీరూపమును జూచి మనసు భయము నొందియున్నది గాన దేహము నిలుచునట్లుండ లేదు.

శ్లో. దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని,
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస. 25

టీ. దంష్ట్రాకరాళాని=కోరలచేత భయంకరములయినట్టి, కాలానలసన్నిభాని=ప్రళయాగ్నికి సమానములయినట్టి, తే=నీయొక్క, ముఖాని=ముఖములను, దృష్ట్వా=చూచి, దిశః=దిక్కులను, నజానే=తెలియకయున్నాను. శర్మ చ=సుఖమును, న లభే=పొందకయున్నాను. జగన్నివాస=జగదాధారుఁడవయిన, హే దేవేశ = దేవదేవుఁడవయినయోస్వామీ! త్వం=నీవు, ప్రసీద=ప్రసన్నుఁడవగుము.

శం. కోరలచే భయంకరములయి ప్రళయాగ్నిసమానములయిన నీముఖములను జూచుటవలన నాకు దిక్కులు దెలియకయున్నవి. నాకు సుఖము లేకయున్నది. జగత్తున కాధారుఁ

డవయిన యో దేవా! నాయందు దయచేసి నాకుఁ బ్రసన్నుఁడ
వగుము.

శ్లో. అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రా
స్సర్వే సహైవావనిపాలసంఘైః,
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః. 26

వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచి ద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః. 27

టీ. అవనిపాలసంఘైస్సహైవ=భూపాలసమూహములతోఁ
గూడనే, సర్వే=సమస్తులయిన, అమీ=ఈ, ధృతరాష్ట్రస్య
పుత్రాః=ధార్తరాష్ట్రులును, భీష్మః=భీష్మాచార్యుఁడును, ద్రోణ
శ్చ=ద్రోణాచార్యుఁడును, తథా=ఆప్రకారముగా, అసౌ=ఈ,
సూతపుత్రః = కర్ణుఁడును, అస్మదీయైః=నాసంబంధులయినధృ
ష్టద్యుమ్నుఁడు మొదలుగాఁగలిగిన, యోధముఖ్యైస్సహ=యో
ధాగ్రేసరులతోఁగూడ, త్వాం=నిన్ను, ప్రవేశించుచున్నారని
యుత్తరశ్లోకముతోడ నన్వయము. ఏతే=ఈదుర్యోధనాదులు,
త్వరమాణాస్సంతః=త్వరతోఁగూడినవారయి, దంష్ట్రాకరాళా
ని=కోరలచేతవికృతములైనట్టి, భయానకాని = భయంకరమై
నట్టి, తే=నీయొక్క, వక్త్రాణి = ముఖములను, విశంతి=ప్రవే
శించుచున్నారు. కేచిత్=వారిలోఁ గొందఱు, దశనాంతరే
షు=దంతములసందులయందు, విలగ్నాస్సంతః = చిక్కినవార

లై, చూర్ణితైః=పొడిగాఁజేయఁబడిన, ఉత్తమాంగైః=శిరస్సులతోఁగూడ, సందృశ్యంతే=కనుపడుచున్నారు.

తం. ఈ ధృతరాష్ట్రకుమారులైన దుర్యోధనాదులు భూపాలకరాజసమూహములు భీష్మ ద్రోణులు కర్ణుఁడు నా సేనానాయకులు గుమిగూడి యతివేగముగలవారై కోరలుగలిగి భయంకరములైన నీముఖములందుఁ బ్రవేశించుచున్నారు. వారిలోఁ గొందఱు నీపండ్లసందులయందుఁ జిక్కి శిరస్సులు పొడిగాఁజేయఁబడినవారయి కనఁబడుచున్నారు.

రామా. భగవంతుఁ డసురాంశజులగు దుర్యోధనాదులను తానే సంహరించి భూభారమును తగ్గించుట నర్జునునకు చూపెను. దానిని చూచి యర్జునుఁ డీ శ్లోకముల భావమును చెప్పుచున్నాఁడు.

శ్లో. యథా నదీనాం బహవోఽంబువేగా
స్సముద్ర మేవాభిముఖా ద్రవంతి,
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి. 28

టీ. యథా=ఏప్రకారముగా, బహవః=అనేకములైన, నదీనాం=నదులయొక్క, అంబువేగాః=ఉదకవేగములు, అభిముఖాస్సంతః=సముద్రమునకు నభిముఖములైనవై, సముద్రమేవ = సముద్రమునే, ద్రవంతి=ప్రవేశించుచున్నవో, తథా=ఆప్రకారముగా, అమీనరలోకవీరాః=ఈశూరులు, అభివిజ్వలంతి=అంతటఁప్రకాశించుచున్న, తవ=నీయొక్క, వక్త్రాణి=ముఖములను, విశంతి=ప్రవేశించున్నారు.

శం. అనేకములైన పూర్ణప్రవాహములు మిక్కిలి వేగముతో సముద్రమం దేలాగు ప్రవేశించుచున్నవో, ఆవిధముగ నీశూరులందఱుఁ బ్రజ్వలించుచున్న నీ ముఖములందుఁ బ్రవేశించుచున్నారు.

శ్లో. యథా ప్రదీ_ప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశంతి లోకా
_స్తవా పి వక్త్రాణి సమృద్ధవేగాః. 29

టీ. పతంగాః=పక్షులు, నాశాయ=నశించుటకొఱకు, సమృద్ధవేగాః=అధికమైన వేగముగలిగినవై, ప్రదీ_ప్తం=మండుచున్న, జ్వలనం=అగ్నిని, యథా=ఏప్రకారముగా, విశంతి=ప్రవేశించుచున్నవో, తథైవ=ఆప్రకారముగానే, లోకాః=ప్రాణులు, నాశాయ=నశించుటకొఱకు, సమృద్ధవేగాస్సంతః=అధికమైనవేగముగలవారలై, తవ=నీయొక్క, వక్త్రాణి=ముఖములను, విశంతి=ప్రవేశించుచున్నారు.

శం. పక్షులు రగులుచుండు నిప్పునం దతివేగముతోఁ బ్రవేశించి యేలాగు నశించుచున్నవో ఆప్రకారమే యనేకప్రాణులతివేగముతో నీముఖములయందుఁ బ్రవేశించి నశించుచున్నారు. పతంగములు=పక్షులు.

రామా. పతంగము లనఁగా మిడుతలు.

శ్లో. లేలిహ్యసే గ్రసమాన స్సమంతా
ల్లోకా న్సమగ్రా న్వదనైర్జ్వలద్భిః,

తేజోభి రాపూర్య జగ త్సమగ్రం
భాస _స్తవో గ్రాః ప్రతపంతి విష్ణో. 30

టీ. జ్వలద్భిః=మండుచున్న, వదనైః= ముఖములచేత, సమగ్రాన్=సమ _స్తములైన,లోకాన్=జనములను, గ్రసమానః= మ్రింగుచున్నవాఁడవై, సమంతాత్=అంతటను, లేలిహ్యసే= ఆస్వాదించుచున్నావు. హేవిష్ణో = ఓ శ్రీకృష్ణస్వామీ! తవ=నీయొక్క, ఉగ్రాః=భయంకరములైన, భాసః=కాంతులు, తేజోభిః= తేజస్సులచేత,సమగ్రం=సమ _స్తమైన,జగత్=జగత్తును, ఆపూర్య=నిండించి, ప్రతపంతి=తపింపఁజేయుచున్నవి.

శం. జ్వలించుచున్న నీముఖములచే నెల్లప్రాణులనుమ్రింగుచున్నవాఁడవై యన్నిదిక్కులయందు నీనాలుకతో ప్రాణుల నీడ్చుకొనుచున్నావు. నీభయంకరమయినకాంతు లెల్ల జగత్తులు నిండి వానిని దపింపఁజేయుచున్నవి.

రామా. అందఱు జనులను( రాజులను) వెలుఁగుచున్న నీముఖములచేతమ్రింగుచున్నవాఁడవై యంతటనాకుచున్నావు.వారి నెత్తుట పూయఁబడిన నీపెదవులను కోపముతో మాటిమాటికి నాకుచున్నావు. ఓకృష్ణా! మిక్కిలిఘోరములైన నీకిరణములు వెలుఁగులచే సంపూర్ణమైన జగత్తును నిండించి, తపింపఁజేయుచున్నవి.

శ్లో. ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృ _త్తిమ్. 31

టీ. హే దేవవర=ఓ దేవశ్రేష్ఠుఁడా! తే=నీకొఱకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక. మే=నాకొఱకు, ప్రసీద=ప్రసన్నుఁడవగుము. తే=నీయొక్క, ప్రవృత్తిం = వ్యాపారమును, న ప్రజానామిహి=ఎఱుఁగనుగదా. ఉగ్రరూపః=భయంకరాకారముగలిగిన, భవాన్=నీవు, కః=ఎవఁడవు ? అహం=నేను, ఆద్యం=ఆద్యుఁడవైన, భవంతం=నిన్ను, విజ్ఞాతుం=తెలియుటకొఱకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. మే=నాకొఱకు, ఆఖ్యాహి=చెప్పుము.

శం. ఓ దేవదేవా ! నీకు నమస్కారములు చేసెదను. నాకు గాను దయచేసి ప్రసన్నుఁడవగుము. నీకిప్పుడు గలిగియుండు ప్రవృత్తికి హేతువు నాకుఁ దెలియలేదు. ఈ ఘోరరూపము గల నీ వెవఁడవు ? ఆద్యుఁడవైన నిన్నుఁ దెలిసికొనవలెనని కోరియున్నాను. దయసేసి నాకుఁ జెప్పుము.

రామా. ఓ దేవదేవా ! నీసర్వేశ్వరత్వమును జూడఁగోరి నాచేఁ బ్రార్థింపఁబడిన నీవు సర్వేశ్వరత్వమును చూపుచు నతిఘోరరూపమును ఆవిర్భవింపఁజేసితివి. ఇట్టిఘోరరూపముగల నీ వెవ్వఁడవో ఏమిచేయఁబ్రవర్తింపుచున్నావో నేను తెలియ గోరుచున్నాను. నీవిషయమై ఎట్లు నేను నడుచుకొనవలయునో ఎఱుఁగకున్నాను. ఇట్లు చేయుటకై యీసంహారకరూపమును బయలుపుచ్చితి నని చెప్పి ప్రసన్నరూపత్వమును పొందుమనుట.

మధ్వ. లోకములో నొకనినామమును మాత్ర మొక్కఁ డెఱింగియున్నను,జాతిని తెలియఁగోరి,నీవెవ్వఁడవనియడిగినట్లు అర్జునుఁడు 'విష్ణో త్వమక్షరం'అని భగవంతునినెఱింగియు మఱి

కొన్ని భగవద్ధర్మములను (గుణములను) ఎఱుంగుటకై నీ వెవ్వఁడవని భగవంతుని నడుగుచున్నాఁడు.

శ్రీభగవా నువాచ:—

శ్లో. కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32

శ్రీకృష్ణుఁడు జెప్పుచున్నాఁడు.—

టీ. లోకక్షయకృత్=లోకనాశకరమైన, ప్రవృద్ధః=ప్రబలమైన, కాలః=కాలము, అస్మి=అగుచున్నాను. లోకాన్=లోకములను, సమాహర్తుం=సంహరించుటకొఱకు, ఇహ=ఈకాలమందు, ప్రవృత్తః=ఉద్యోగించినవాఁడను, అస్మి=అగుచున్నాను. ప్రత్యనీకేషు=ఎదిరిసేనలయందు, యోధాః=ప్రతిపక్షులై యుద్ధముచేయువారు, యే=ఎవరు? అవస్థితాః=ఉన్నారో, తే సర్వే=వారలందఱును, త్వాం ఋతేపి=నీవు చంపకున్నను, నభవిష్యంతి=బ్రతుకజాలరు.

తం. నేను ఈ ప్రపంచము నెల్ల నశింపఁజేయు బలిష్ఠమైన కాలస్వరూపిని. నే నిపు డీలోకములను సంహరించుటకై సిద్ధమయియున్నాను. ఈ రెండుసేనలయందు యుద్ధము చేయుటకు వచ్చినవారలలో నీవు చంపకున్నను నెవరును బ్రతుకఁగలవారు లేరు.

రామా. దుర్యోధనాదులమరణమును లెక్కపెట్టెడినేను ఘోరరూపముతో వృద్ధిపొందినవాఁడనై రాజసమూహమును

సంహరించుటకై యీ లోకమునఁ బ్రవర్తించినవాఁడ నగు చున్నాను.

శ్లో. తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధం,
మయై వై తే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

టీ. తస్మాత్=ఆకారణమువలన, త్వం=నీవు, ఉత్తిష్ఠ=యుద్ధమునకు లెమ్ము. శత్రూన్=దుర్యోధనాదులను,జిత్వా=గెలిచి, యశః=కీర్తిని, లభస్వ=పొందుము. సమృద్ధం=నిష్కంటకమైన, రాజ్యం=రాజ్యమును, భుఙ్క్ష్వ = అనుభవించుము. ఏతే = ఈ నీ పగవారలు, పూర్వమేవ=మునుపే, మయైవ= నాచేతనే, నిహతాః=చంపఁబడిరి. హేసవ్యసాచిన్ = ఓయి అర్జునా! త్వం=నీవు, నిమిత్తమాత్రం = కారణమాత్రముగా, భవ=అగుము.

తం. కనుక నీవు యుద్ధముచేయుటకు బయలుదేరుము. నీశత్రువుల నందఱను దేవతలచేఁగూడ జయింప నలవికాని భీష్మద్రోణాదుల జయించి వారు నీచే జయింపఁబడిరను కీర్తి పొంది యేకచ్ఛత్రాధిపత్యము ననుభవింపుము.నీపగవారందఱు నాచే మున్నే సంహరింపఁబడిరి. నీవు కారణమాత్రుఁడవుగా నుండుము.

శ్లో. ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యా నపి యోధవీరాన్,
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుద్ధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్. 34

టీ. మయా = నాచే, హతాన్ = పూర్వమే చంపఁబడిన, ద్రోణంచ=ద్రోణాచార్యుని, భీష్మంచ=భీష్మాచార్యుని, జయ ద్రథంచ=సైంధవుని, కర్ణంచ=కర్ణుని, తథా=ఆరీతిగానే, అన్యాన్=ఇతరులైన, యోధవీరాన్=యుద్ధముచేయునట్టి పరాక్రమశీలురను, త్వం=నీవు, జహి=చంపుము. మావ్యథిష్ఠాః= భయపడకుము. యుద్ధ్యస్వ=యుద్ధముచేయుము. రణే=యుద్ధమందు, సపత్నాన్=శత్రువులను, జేతాఽసి=గెలువఁగలవు.

శం. ఇప్పటికే నాచేఁ జంపఁబడిన ద్రోణ, భీష్మ, సైంధవ, కర్ణాదులగు పరాక్రమశాలు రనేకులను జంపుము. నీవు చింతపడ నక్కరలేదు. యుద్ధములో శత్రువులను నీవు జయింపఁగలవు.

రామా. గురువులు మొదలగువారిని ఎట్లు చంపుదు నని విచారింపకుము. వా రపరాధులు గనుక నాచేఁ జంపఁబడుటకై మున్నే నియమింపఁ బడినారు.

మధ్వ. అచ్చటచ్చట విలుకాండ్ర కందఱకు గురువైన ద్రోణుఁడైనను, దేవతలుగూడ జయింపలేనిభీష్ముఁడైనను, తన కుమారుని శిర సెవ్వఁడు భూమిమీఁదఁబడవేయునో వాని శిరస్సు బ్రద్ద లగునని వరముపొందినతండ్రిగలవాఁడగు సైంధవుఁడైనను, ఇంద్రుఁ డిచ్చినశక్తిగల కర్ణుఁడైనను వీరందఱు సామాన్యులు కారు. అట్టివా రందఱు పూర్వమే నాచేత హతులైరి. వారిని జంపి జయముపొందు మనుట.

సంజయ ఉవాచ,—

శ్లో. ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ,

నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం,
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పుచున్నాఁడు.—

టీ. వేపమానః=వణఁకుచున్న, కిరీటీ=అర్జునుఁడు, ఏతత్=ఈ, కేశవస్య=శ్రీకృష్ణునియొక్క, వచనం=వాక్యమును, శ్రుత్వా=విని, నమస్కృత్వా=నమస్కరించి, కృతాంజలిః=ముకుళితహస్తుఁడై, భీతభీతస్సన్=మాటిమాటికి భయపడుచున్నవాఁడై, కృష్ణం=శ్రీకృష్ణునిఁగూర్చి, భూయఏవ=తిరిగియు, ప్రణమ్య=నమ్రుఁడై, సగద్గదం = తొట్రుపాటుతోఁగూడునట్లు, ఆహ=పలికెను.

తం. ఓ ధృతరాష్ట్రా! పైఁ జెప్పిన శ్రీ భగవంతునిపలుకులు గడగడవణఁకుచున్న యర్జునుఁడు విని నమస్కారముచేసి యంజలిబద్ధుఁడై మాటిమాటికి భయపడుచు, వందనములు చేయుచు భగవంతునిఁజూచి యొకమాట చెప్పెను.

అర్జున ఉవాచ.—

శ్లో. స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్య త్యనురజ్యతే చ,
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః. 36

అర్జునుఁడు పలుకుచున్నాఁడు.—

టీ. హేహృషీకేశ=ఓకృష్ణస్వామీ! తవ=నీయొక్క, ప్రకీర్త్యా=కీర్తనముచేత, జగత్=జగత్తు, ప్రహృష్యతీతియత్=సంతోషింపుచున్న దనునది యేది గలదో, తత్=అదియును,

అనురజ్యత ఇతి యత్=అనురాగమును పొందుచున్న దనునది యేదిగలదో, తత్=అదియును, రక్షాంసి=రాక్షసులు, భీతాని=భయపడినవారలయి, దిశః=దిక్కులనుగూర్చి, ద్రవంతీతి యత్ = పరుగిడుచున్నారనునది యేదిగలదో, తత్ = అదియును, సర్వే=సమస్తములయిన, సిద్ధసంఘాః=సిద్ధసమూహములు, నమస్యంతీతియత్ = నమస్కరింపుచున్నా రనునది యేదిగలదో, తత్=అదియును, స్థానే=యుక్తము.

శం. ఓ హృషీకేశ! నీ వింతటిమహాపురుషుఁడవు గనుకనే నిన్నెల్లలోకములు నుతించి సంతోషించుచున్నవి. నీయందధికశ్రద్ధాభక్తులు చేయుచున్నవి. రాక్షసు లందఱు నిన్నుఁ జూచి మిగుల భయమొంది యనేకదిక్కులకు వెళ్ళుచున్నారు. ఎల్లపురుషులు నీకు వందనము చేయుచున్నారు.

శ్లో. కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణో ఽప్యాదికర్త్రే,
అనంత దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదస త్తత్పరం యత్. 37

టీ. హే మహాత్మన్=ఓమహానుభావుఁడా! గరీయసే=శ్రేష్ఠుఁడయినట్టియు, బ్రహ్మణోఽపి=బ్రహ్మదేవునికిని, ఆదికర్త్రే= ఆదికారణమయినట్టియు, తే=నీకొఱకు, కస్మాత్=ఎందువలన, ననమేరన్=(జనులు)నమస్కరించకయుందురు? అనంత=అపరిచ్ఛిన్నుఁడా! దేవేశ=దేవదేవా! జగన్నివాస = జగత్తునకాధారభూతుఁడవైనయోస్వామీ! అక్షరం = నాశములేనట్టిదియు, సత్=ఉన్నదనఁబడునదియు, అసత్ = లేదనఁబడు

నదియు, తత్పరం=ఆరెంటికిని బరమయినదియు, యత్=ఏదో (తత్=అది), త్వమేవ=నీవే.

శం. ఓ భగవంతుఁడా! నీవు మిక్కిలి శ్రేష్ఠుఁడవై బ్రహ్మ కు నాదికారణభూతుఁడ వైనందున ని న్నెల్లప్రపంచములు పూజించుట సాధారణధర్మమే. నీవు అనంతుఁడవు ప్రపంచ ముల కాధారభూతుఁడవు నాశములేనివాఁడవు జగములను జీవ శరీరముల కన్న శ్రేష్ఠమైన పరబ్రహ్మస్వరూపివి.

రామా. నీ వనంతుఁడవు. జీవస్వరూపుఁడవు, కార్యకారణ రూపమగు ప్రకృతివి. జీవునికి, ప్రకృతికి వీని రెండింటికంటె నితరమగు ముక్తాత్మయు నీవే యని ఉత్తరార్ధ శ్లోకభావము.

శ్లో. త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్,
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప. 38

టీ. హే అనంతరూప=ఓకృష్ణస్వామీ! త్వం=నీవు, ఆది దేవః=మొదటి దేవుఁడవును, పురాణః = పురాతనుఁడైన,పురు షః=పురుషుఁడవును. త్వం=నీవు, అస్య=ఈ,విశ్వస్య=జగత్తు నకు, పరం=ఉత్కృష్టమైన, నిధానం = ఆధారభూతుఁడవును, వేత్తా=తెలిసినవాఁడవును, అసి=ఐతివి. వేద్యం=తెలియఁదగిన న, పరం=ఉత్కృష్టమైన, ధామ=స్థానమును, త్వమేవ=నీవే. త్వయా=నీచేతను, విశ్వం = ప్రపంచము, తతం=వ్యాపించఁ బడెను.

శం. ఓ పురాణపురుషా! నీవు సమస్తదేవతలకు నాదిదేవతవు. పురాణపురుషుఁడవు. ఈయెల్లప్రపంచములకుఁ బరమాధారభూతుఁడవు. విశ్వవేత్తవు. మహానుభావులైన పురుషులవల్లఁ బొందఁదగిన మోక్షస్థానము నీవే? ఈయెల్లజగత్తులు నీచే వ్యాపింపఁబడియున్నవి.

రామా. ఉత్తరార్ధశ్లోకతాత్పర్యము. జగత్తులో తెలిసికొనెడివారును తెలియఁబడునవియును నీవే. ఇట్లు అన్నిటికిని ఆత్మగానుండెడి నీవె పొందఁదగినస్థానము.

శ్లో. వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
* ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ,
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పున శ్చ భూయోఽపి నమో నమస్తే. 39

టీ. వాయుః=వాయువును, యమః=యముఁడును, అగ్నిః=అగ్నిదేవుఁడును, వరుణః=వరుణుఁడును, శశాంకః=చంద్రుఁడును, ప్రజాపతిః=బ్రహ్మదేవుఁడును, ప్రపితామహశ్చ=బ్రహ్మకుఁ దండ్రియును, త్వమేవ=నీవే. (అందువలన,) తే=నీకొఱకు, సహస్రకృత్వః=వేలతడవలు, నమః=నమస్కారము. పునః=తిరిగియు, నమః=నమస్కారము. భూయోఽపి=తిరిగియును, నమః=నమస్కారము. అస్తు=అగుఁగాక.

* రామా. 'పితామహ స్త్వం ప్రపితామహశ్చ' అని పాఠాంతరము. ప్రజాపతులు ప్రజలకు తండ్రులు. వారలకు తండ్రియైన బ్రహ్మ ప్రపితామహుఁడు. పితామహుఁడు మొదలగు దేవతలకు ఆత్మవుగాన పితామహాదిశబ్దములచే నీవే చెప్పఁబడుచున్నావు.

శం. ఓకృష్ణా ! వాయువు, యముఁడు, నిప్పు, వరుణుఁడు, ఇంద్రుఁడు, బ్రహ్మదేవుఁడు, బ్రహ్మతంద్రియైన మహావిష్ణువును నీవే. నీకు వేయిమార్లు వందనములు. పెక్కుమార్లు నమస్కారములు. మరలను నమస్కారములు.

శ్లో. నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనంతదివ్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. 40

టీ. హే సర్వ=ఓ శ్రీకృష్ణస్వామీ ! పురస్తాత్ = ముందరను, అథ=అనంతరమందు,పృష్ఠతః=వెనుకను, సర్వతఏవ=సర్వదిక్కులయందు, తే=నీకొఱకు,నమః=నమస్కారము. అస్తు=అవుఁగాక. అనంతదివ్యామితవిక్రమః = అమితమయిన సామర్థ్యమును పరాక్రమమును గలిగిన, త్వం=నీవు, సర్వం=సమస్తమును, సమాప్నోషి=లెస్సగా వ్యాపించియున్నావు. తతః=అందువలన, సర్వః = సర్వస్వరూపుఁడవు, అసి=అయితివి.

శం. ఓ కృష్ణా ! నీకు ముందు వెనుక నెల్లదిక్కుల నమస్కారములు. అమితమైన శక్తిపరాక్రమములు గలిగిన నీవు ఎల్లజగములయందు నిండుగా వ్యాపించియున్నందున సర్వస్వరూపుఁడవు నీవే.

రామా. ఉత్తరార్థతాత్పర్యము. నీకు సమస్తమైనదియు శరీరముకాన నీవుఆత్మఁగా అన్నిటియందును వ్యాపించియున్నావు. కాబట్టి సర్వశబ్దముచే చెప్పఁబడుచున్నావు.

శ్లో. సఖేతి మత్వా ప్రసభం య దుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి,
అజానతా మహిమానం త వేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాఽపి. 41

టీ. తవ=నీయొక్క, ఇదం=ఈస్వరూపమును, మహిమానం=మహిమను, అజానతా = తెలియనట్టి, మయా = నాచేతను, ప్రమాదాత్=అజ్ఞానమువలన, ప్రణయేనవాపి = పరిచయముచేతనయినను, సఖేతి = స్నేహితుఁడని, మత్వా=తలఁచి, హేకృష్ణ= ఓకృష్ణుఁడా! హేయాదవ = ఓయాదవుఁడా! హేసఖే=ఓసఖుఁడా! ఇతి=అని, ప్రసభం=బలత్కారముగా, యత్=ఏవాక్యము, ఉక్తం=పలుకఁబడెనో (దానిని క్షమింపుము).

తా. ఓకృష్ణా! నీప్రభావములను నేనిదివరలో నెఱుఁగకపోయినందున నజ్ఞానమువల్ల ని న్నిదివఱకు మిత్రుఁడవని యెంచి, ఓకృష్ణ! ఓ యాదవ! ఓ మిత్రుఁడ! అని సాధారణముగాఁ బిలిచిన పలుకులను నాయందుఁ గటాక్షించి మన్నించవలయును.

శ్లో. య చ్చాపహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు,
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయమ్. 42

టీ. హేఅచ్యుత=ఓకృష్ణస్వామీ! అపహాసార్థం = పరిహాసముకొఱకు, విహారశయ్యాసనభోజనేషు = విహారణశయనా

సనభోజనకాలములందు, అసత్కృతః=తిరస్కరింపఁబడినవాఁడ వు, అసీఅియచ్చ=అయితి వనునది యేదికలదో, అథవా=అ టుగాకపోయినట్లాయెనా, ఏకస్సన్=పరోక్షమైనవాఁడవై, త త్సమక్షం=తత్ప్రత్యక్షమందును తిరస్కరింపఁబడినవాఁడ వను నదియేదికలదో, తత్=ఆయపరాధమునుగూర్చి, అప్రమేయం =ప్రమాణగోచరుఁడవు కానట్టి, త్వాం=నిన్ను, అహం=నే ను, క్షామయే=క్షమింపఁజేయుచున్నాను.

తా. ఓ మహానుభావా! నీవు అప్రమేయుఁడవని యెఱుఁగక ఏకాంతంబునను,ఇతరులయెదుటను ఎగతాళిగా విహారశయ్యా సనభోజనసమయములయందుఁ దిరస్కారపుమాటలాడిన యప రాధంబులు దయచేసి క్షమింపుము.

శ్లో. పితాఽసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్య శ్చ గురు ర్గరీయాన్,
న త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయే ఽప్యప్రతిమప్రభావ. 43

టీ. హేఅప్రతిమప్రభావ=అసమానమైన ప్రభావముగల యోస్వామీ ! త్వం=నీవు, చరాచరస్య=జంగమస్థావరాత్మక మైన, అస్యలోకస్య=ఈప్రాణిసమూహమునకు, పితా=తండ్రి యు, పూజ్య=పూజార్హుఁడవును, గరీయాన్=శ్రేష్ఠుఁడైన,గు రుశ్చ=గురువును, అసి=అయితివి. అందువలన, లోకత్రయే ఽపి=మూఁడులోకములయందును, త్వత్సమః=నీకుసమానుఁ డు, నాస్తి=లేఁడు. అన్యః=ఇతరుఁడు, అభ్యధికః=అధికుఁడు, కుతః=ఎక్కడివాఁడు? అనఁగా లేఁడనుట.

శం. నీవీడులేనిప్రభావములుగలవాఁడవు. చరాచరాత్మకములగు నీ సమస్తప్రాణులకుఁ దండ్రివి. పూజార్హుఁడవు. పరమగురుఁడవు. స్వర్గమర్త్యపాతాళలోకములయందు నీకు సమానుఁడు లేఁడు. ఇఁక నధికుఁ డెచ్చటనుండి వచ్చును.

శ్లో. తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్. 44

టీ. తస్మాత్=ఆకారణమువలన, కాయం=శరీరమును, ప్రణిధాయ=పడవేసి, ప్రణమ్య=నమస్కరించి, ఈశం=నియామకుఁడవైన, ఈడ్యం=స్తోత్రార్హుఁడవైన, త్వాం=నిన్ను, ప్రసాదయే=ప్రసన్నునిగాఁ జేసికొనుచున్నాను. హే దేవ=ఓశ్రీకృష్ణస్వామీ! పుత్రస్య=కొమారునియొక్క అపరాధమును, పితేవ=తండ్రివలెను, సఖ్యుః=చెలికానియొక్క అపరాధమును, సఖేవ=చెలికానివలెను, ప్రియాయాః=ప్రియురాలియొక్క అపరాధమును, ప్రియఇవ=ప్రియుఁడువోలెను, మే=నాయొక్క యపరాధమును, త్వం=నీవు, సోఢుం=సహించుటకొఱకు, అర్హసి=తగుదువు.

శం. ఓ కృష్ణ! స్తోత్రార్హుఁడవయిన నీకు సాష్టాంగముగా నమస్కరించి నాకు ప్రసన్నుఁడు గావలయు నని వేడుకొనుచున్నాను. నేను చేసిన సమస్తాపరాధములను పుత్రునితప్పులను తండ్రివలెను, సఖునితప్పులు స్నేహితునివలెను, ప్రేయసితప్పులను ప్రియునివలెను నీవు మన్నించి క్షమించవలయును.

శ్లో. అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే,
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస. 45

టీ. హే దేవ=ఓకృష్ణస్వామీ ! అదృష్టపూర్వం=ఒకప్పుడును జూడఁబడనివిశ్వరూపమును, దృష్ట్వా=చూచి,హృషితః=సంతోషించువాఁడను, అస్మి=అయితిని. మే=నాయొక్క, మనః=మనస్సు, భయేన=భయముచేతను, ప్రవ్యథితం=మిక్కిలి పీడింపఁబడినది. తద్రూపమేవ=ఆపూర్వరూపమునే, మే=నాకొఱకు, దర్శయ=చూపుము. హే దేవేశ=ఓదేవదేవుఁడ ! జగన్నివాస=జగదాధారభూతుఁడవైన యోస్వామీ! మే=నాకు, ప్రసీద=ప్రసన్నుఁడవగుము.

శం. ఓజగన్నాయక! ఇదివఱకు నెన్నఁడును జూడని నీ విశ్వరూపమును దర్శించి నేను విశేషానందముతోఁ గూడినవాఁడనయితిని. అయినప్పటికిని నామనస్సు బహుభయమును జెందియున్నది. నీపూర్వాకారమును నాకుఁ జూపుము. ఓదేవదేవ! ఓ జగదాధారభూతుఁడవయిన స్వామీ ! నాకు నీవు ప్రసన్నుఁడవు కమ్ము.

శ్లో. కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ,
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే. 46

టీ. సహస్రబాహో = వేయిభుజములుగలిగిన, హే విశ్వమూర్తే=విశ్వరూపధరుఁడైన ఓస్వామీ ! త్వాం=నిన్ను, కిరీ

టినం=కిరీటముగలవానిఁగాను, తథైవ=ఆలాగుననే, గదినం=గదగలవానిఁగాను, చక్రహస్తం=హస్తమందు చక్రముగలవానిఁగాను, ద్రష్టుం=చూచుటకొఱకు, అహం=నేను, ఇచ్ఛామి=కోరుచున్నాను. (కావున,) చతుర్భుజేన=నాలుగుభుజములు గలిగిన, తేనరూపేణ=అపూర్వరూపముతోఁ గూడినవాఁడవు, భవ=కమ్ము.

తా. అనేకభుజములుగలిగి విశ్వరూపధరుఁడవైన యో స్వామీ! కిరీటము, గద, చక్రము ధరించిన నీ సహజరూపమును దర్శనముచేయుటకుఁ జాలకోరియున్నాను గనుక, నీవు దయయుంచి నీసహజమయిన వసుదేవపుత్త్రుఁడ వగురూపమును జూపుము.

శ్రీ భగవానువాచ.—

శ్లో. మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్,
తేజోమయం విశ్వమనంత మాద్యం
య న్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్. 47

శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.—

టీ. హే అర్జున=ఓయర్జునుఁడా! మే=నాయొక్క, యద్రూపం=ఏరూపము, తేజోమయం=తేజస్స్వరూపమైనదో, అనంతం=అంతములేనట్టిదియు, ఆద్యం=ఆదిభూతమైనదియు, త్వదన్యేన=నీకంటె నితరునిచేత, నదృష్టపూర్వం=పూర్వమందుఁ జూడఁబడనట్టిదియు, పరం=ఉత్కృష్టమైనదియు, ఇదంవిశ్వరూపం=ఈవిశ్వరూపమును, ప్రసన్నేన=ప్రసన్నుఁడనైన, మయా=

నాచేతను, ఆత్మయోగాత్ = ఆత్మయోగసామర్థ్యమువలన, తవ=నీకు, దర్శితం=చూపింపఁబడెను.

రామా. ఆత్మయోగాత్=నాసంకల్పమువలన.

శం. ఓయర్జునా! నీయందు దయచేసి నాయోగసామర్థ్యమువల్లఁ దుద మొదలు లేనిదియు, ననాదియుఁ, దేజోమయమైనట్టిదియు, నీకంటె నితరులచేత నింతకుమునుపు చూడఁబడనిదియుఁ బరమోత్కృష్టమైనదియు నైన నా విశ్వరూపమును నీకుఁ జూపితిని.

శ్లో. న వేదయజ్ఞాధ్యయనై ర్నదానై
ర్నచ క్రియాభి ర్నతపోభి రుగ్రైః,
ఏవంరూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. 48

టీ. హే కురుప్రవీర= ఓ యర్జునా! ఏవంరూపః=ఈవిశ్వరూపముగల, అహం=నేను, నృలోకే=మనుష్యలోకమందు, త్వదన్యేన=నీకంటె నితరునిచేతను, వేదయజ్ఞాధ్యయనైః=వేదయజ్ఞాధ్యయనములచేతను, దానైః=దానములచేతను, క్రియాభిః=క్రియలచేతను, ఉగ్రైస్తపోభిః=ఉగ్రతపస్సులచేతను, ద్రష్టుం=చూచుటకొఱకు, నశక్యః=వీలుకానివాఁడను.

శం. ఓ యర్జునా! ఈ మహత్తైన విశ్వరూపమును మర్త్యలోకమునందు నీ కొక్కనికే దర్శనము నిచ్చితిని. మఱియొకరెంత వేదయజ్ఞాధ్యయనములు చేసినవారలయిన నెంతకర్మనిష్ఠులయినను నెంత యుగ్రమైన తపస్సుగలవారైనను వారికి దర్శనమిచ్చువాఁడనుఁ గాను.

రామా. నీకంటె నితరుఁడైన భక్తిలేనివానిచేఁ జూడ శక్యుఁడనుగాను.

శ్లో. మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ జ్మమేదమ్,
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
త దేవ మే రూప మిదం ప్రపశ్య. 49

టీ. ఈదృక్=ఇట్టి, ఘోరం=భయంకరమైన, మమ=నాయొక్క, ఇదం రూపం=ఈరూపమును, దృష్ట్వా=చూచి, తే=నీకు, వ్యథా=భయమును, విమూఢభావశ్చ=తెలివిలేకయుండుటయును, మా = వద్దు, త్వం=నీవు, వ్యపేతభీః=పోఁగొట్టఁబడినభయముగలవాఁడవై, ప్రీతమనాః=సంతోషమనస్సుగలవాఁడవై, పునః=తిరిగియు, మే=నాయొక్క, తదిదం రూప మేవ=ఆయీ పూర్వరూపమునే, ప్రపశ్య=చూడుము.

- శం. భయంకరమైన నా విశ్వరూపమును జూచుటవలన నీకుఁగలిగిన భయమును, చిత్తవిభ్రాంతిని విడువుము. నీవు నిర్భీతుఁడవై, సంతుష్టమనస్కుఁడవై యీ నా సహజరూపమునుఁ జూడుము.

సఞ్జయ ఉవాచ:—

శ్లో. ఇ త్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా. 50

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. ఇతి=ఇట్లని, వాసుదేవః=శ్రీకృష్ణస్వామి, అర్జునం=అర్జునునిగూర్చి, తథా=ఆలాగున, ఉక్త్వా=పలికి, భూయః=తిరిగి, స్వకంరూపం=స్వకీయమైనపూర్వరూపమును,దర్శయామాస=చూపెను. మహాత్మా=శ్రీకృష్ణస్వామి, సౌమ్యవపుః=శాంతశరీరముగలవాఁడు, భూత్వా=అయి, భీతం=భయపడిన, ఏనం=ఈయర్జునుని, పునః=తిరిగి, ఆశ్వాసయామాస=ఊరడించెను.

శం. ఓయి ధృతరాష్ట్రా! శ్రీకృష్ణుఁ డర్జునునిఁ జూచి యీ ప్రకారముగాఁ జెప్పినవాఁడై తన సహజరూపమునుఁ జూపి భయపడియున్న యర్జునుని నూరడించెను.

రామా. శ్రీకృష్ణునకు సహజముగా చతుర్భుజములుండినవి. కంసునకు వెఱచిన వసుదేవప్రార్థనచే కంససంహారము వఱకు రెండుభుజము లుపసంహరింపఁబడి ఆవెనుక నావిర్భవించిన వనుట.

అర్జున ఉవాచ:—

శ్లో. దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః. 51

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హే జనార్దన=ఓ కృష్ణస్వామీ! సౌమ్యం=ప్రసన్నమైన, మానుషం=మనుష్యసంబంధమైన, తవ=నీయొక్క, ఇదం రూపం=ఈ యాకారమును, దృష్ట్వా=చూచి, ఇదానీం=ఇప్పుడు, సంవృత్తః=స్వస్థతనుబొందినవాఁడను, సచేతాః=చైతన్యముతోఁగూడినవాఁడను, ప్రకృతిం=స్వభావమును, గతః=పొందినవాఁడను, అస్మి=అయితిని.

శం. ఓజనార్దనా ! ఇప్పుడు సౌమ్యమైన నీ మానుషరూప మునుజూచి నాకు బుద్ధి స్థిరమైనది. నేను జనులలోఁ జేరిన వాఁడనైతిని.

శ్రీ భగవా నువాచ.—

శ్లో. సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ,
దేవా అ ప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. 52

శ్రీ భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. మమ=నాయొక్క, యద్రూపం=ఏరూపమును, దృష్టవాన్=చూచినవాఁడవు, అసి=అయితివో, సుదుర్దర్శం=మిక్కిలి చూడ నశక్యమైన, ఇదం రూపం=ఈరూపమును, దేవా అపి=దేవతలును, అస్య=ఈ, రూపస్య = రూపమునకు, నిత్యం=ఎల్లప్పుడును, దర్శనకాంక్షిణః=చూడఁ గోరుచుందురు.

శం. నీకు దర్శనంబిచ్చిన నాస్వరూప మెవరికిని చూడఁ దొరకనిది. ఇట్టివిశ్వరూపము చూచుటకు దేవతలందఱు సదా కోరెదరు.

శ్లో. నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా. 53

టీ. మాం=నన్ను, యథా=ఏప్రకారముగా, దృష్టవాన్=చూచినవాఁడవు, అసి=అయితివో, ఏవంవిధః=ఇట్టి విశ్వరూపమును ధరించిన, అహం=నేను, వేదైః=వేదములచేతను, తపసా=తపస్సుచేతను, దానేన=దానముచేతను, ఇజ్యయా=యజ్ఞముచేతను, ద్రష్టుం=చూచుటకొఱకు, నశక్యః=శక్యుఁడనుగాను.

శం. నీకుఁ జూపిన విశ్వరూపమును వేదము చదివినవార లకుఁగాని, తపస్సు చేసినవారలకుఁగాని, యజ్ఞములుచేసినవార లకుఁగాని చిక్కదు.

రామా. నాయందు భక్తిలేక వేదాధ్యయనము మొదలగు వానిచేతమాత్రము పొందఁదగినవాఁడను కాను.

శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. 54

టీ. పరంతప=శత్రుతాపసుఁడవైన, హేఅర్జున=ఓయర్జునుఁడా! అనన్యయా=ఇతరాసక్తముగాని, భక్త్యా=భక్తిచేత, ఏవంవిధః=ఇట్టివిశ్వరూపమును ధరించిన, అహం=నేను, తత్త్వేన=యాథార్థ్యముచేత, జ్ఞాతుం=తెలియుటకొఱకును, ద్రష్టుం=చూచుటకొఱకును, ప్రవేష్టుంచ=ప్రవేశించుటకొఱకును, శక్యః=శక్యమైనవాఁడను.

శం. శత్రుతాపసుఁడనైన యో యర్జునా! విశ్వరూపధరుఁడనైన నన్ను నితరాసక్తిలేని యచంచలభక్తి చేతమాత్రమే తెలిసికొనవచ్చును, చూడవచ్చును, పొందవచ్చును. వేఱు సాధనములు లేవు.

శ్లో. మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ. 55

టీ. హేపాండవ=ఓ యర్జునుఁడా! మత్కర్మకృత్=నాకొఱకు సత్కర్మమునుజేయువాఁడును, మత్పరమః = నేనే యుత్కృష్టగతిగాఁగలవాఁడును, మద్భక్తః=నన్నే సర్వప్రకారములచేత భజించువాఁడును, సంగవర్జితః=ధనబంధుపుత్రమిత్రకళ

త్రాదిసంగముచేత విడువఁబడినవాఁడును, సర్వభూతేషు=సమస్తప్రాణులయందు, నిర్వైరః = వైరములేనివాఁడును, యః=ఎవఁడో, సః=వాఁడు, మాం=నన్ను, ఏతి=పొందుచున్నాఁడు.

శం. ఓయి పాండవా! ఎవఁడు నాకొఱకు సత్కర్మలు చేసి నేనే యుత్కృష్టగతి యని నమ్మి నన్నే యనేకప్రకారములచే ధ్యానించి ధనబంధుపుత్రమిత్రకళత్రాదిసంగములయం దాసక్తి విడచి సర్వప్రాణికోట్లయందు వైషమ్యము లేక యున్నాఁడో అట్టివాఁడు నన్నుఁ బొందుచున్నాఁడు.

రామా. వేదాధ్యయనాదులు నాయారాధనమె యని చేయువాఁడును, దేనినారంభించినను నన్నుద్దేశించియే యారంభించువాఁడును, నన్ను కీర్తించుట, ధ్యానించుట, నాకు నమస్కరించుట మొదలగునవి లేక నిలువలేనివాఁడును, నాతోఁ గలిసి యుండుట సుఖమనియు, నన్ను విడుచుట దుఃఖమనియు నుండుటచేత సమస్తభూతములన్ని నాయధీనములని తెలిసికొని ఏభూతమందైనను వైరము లేక ఎవఁడున్నాఁడో అట్టివాఁడు నన్ను పొందుచున్నాఁడు.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూప
సందర్శనయోగోనామ ఏకాదశోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునుల సంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయందు విశ్వరూపసందర్శన
యోగమనెడి ఏకాదశాధ్యాయము.

---

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## భ క్తి యో గః.

అర్జున ఉవాచ:—

శ్లో. ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే,
యే చాఽప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః.

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు:—

టీ. ఏవం=ఈప్రకారముగా, సతతయుక్తాః=నిరంతరమును, (భగవత్కర్మాదులయందు సమాహితులైనవారలై), యేభక్తాః= ఏభక్తులు, త్వాం=నిన్ను, పర్యుపాసతే=ధ్యానము సేయుచున్నారో, యేచాపి=ఎవ్వరైనను, అవ్యక్తం=ఇంద్రియాగోచరమైన, అక్షరం=బ్రహ్మమును,పర్యుపాసతే=ధ్యానముచేయుచున్నారో, తేషాం=వారలలోపల, కే=ఎవరు, యోగవిత్తమాః=మిక్కిలి యోగమును దెలిసినవారలు?

తం. ఓకృష్ణా! పైఁజెప్పినరీతిని భగవత్ప్రీతిగ నెల్లప్పుడు కర్మలుచేయుచు నిన్ను సదా ధ్యానము చేయువారలలోను నింద్రియములకు గోచరముగానట్టి పరబ్రహ్మాను సంధానము జేయువారలలోను యోగిశ్రేష్ఠు లెవరు? విశ్వరూపముగలనిన్ను ఉపాసించువారు సగుణోపాసకులు. అక్షరమనఁగా నుపాధులులేని బ్రహ్మము నుపాసించువారు నిర్గుణోపాసకులు.

రామా. నిన్ను అనఁగా కల్యాణగుణపరిపూర్ణుఁడగు భగవంతుని ఉపాసించువారు. అక్షరమనఁగా ప్రత్యగాత్మ, జీవస్వరూపము. యోగవిత్తము లనఁగా శీఘ్రముగా ఫలమును పొందువారు. ఓకృష్ణా! పైఁజెప్పినరీతిని కర్మలఁజేయుచు కల్యాణగుణపరిపూర్ణుఁడగు భగవదుపాసన చేయువారలలోను, ప్రత్యగాత్మానుసంధానము చేయువారలలో శ్రేష్ఠు లెవ్వరు.

మధ్వ. "అవ్యక్తం" అనఁగా మహత్తుకంటె నుత్కృష్టమైన ప్రకృతి. దానిని నుపాసించుటకంటె భగవదుపాసనచేయుట శ్రేష్ఠము. అందు కుపాయంబు చెప్పవలయు ననియడుగుట.

శ్రీభగవా నువాచ:—

శ్లో. మ య్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. 2

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు:—

టీ. యే=ఏభక్తులు, మయి=నాయందు, మనః=మనస్సును, ఆవేశ్య=ఉంచి, నిత్యయుక్తాః=నిరంతరసమాహితచిత్తులై, పరయా=ఉత్కృష్టమైన, శ్రద్ధయా=శ్రద్ధతోడ, ఉపేతాస్సంతః=కూడినవారలయి, మాం=నన్ను, ఉపాసతే = ధ్యానించుచున్నారో, తే=వారలు, యుక్తతమాః=మిక్కిలియుక్తులయినవారలని, మే=నాకు, మతాః=ఇష్టులు.

శం. ఎవరు నాయందు మనస్సు నిలిపి యెల్లప్పుడు సమాహితచిత్తులయి మిక్కిలి శ్రద్ధతోఁగూడుకొని నన్ను ధ్యానించుచున్నారో అట్టియుత్తమపురుషులు నాకు నమ్మతులైనవారు.

రామా. ఎవరు నాయందు మనసునిలిపి నిత్యమైన యోగమును (ప్రాప్తిని) కోరుచున్నారో అట్టి యుత్తమపురుషులు నన్ను శీఘ్రముగాఁ బొందువారనుట.

శ్లో. యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్. 3
సన్నియ మ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. 4

టీ. యేతు=ఎవ్వరైతే, ఇంద్రియగ్రామం=ఇంద్రియసమూహమును, సన్నియమ్య=లెస్సగా నిగ్రహించి, సర్వత్ర=సమస్త దేహములయందును, సమబుద్ధయః=సమబుద్ధిగలిగియున్నవారలై, సర్వభూతహితే=సమస్తప్రాణిహితమునందు, రతాః=ఆసక్తులైనవారలై, అనిర్దేశ్యం=నిర్ణయింపఁగూడని, అవ్యక్తం = రూపాదిహితమైన, సర్వత్రగం = అంతటవ్యాపించియున్న, అచింత్యం=ధ్యానించఁగూడని, కూటస్థం = ప్రకృతియందున్న, అచలం=చలించని, ధ్రువం=నిత్యమైన, అక్షరం=నాశరహితమైన, ప్రత్యగాత్మస్వరూపమును, పర్యుపాసతే=ఉపాసన చేయుచున్నారో, తే=వారలును, మామేవ=నన్నే, ప్రాప్నువంతి=పొందుచున్నారు.

శం. ఎవ రెల్లకాలములయందు నింద్రియనిగ్రహముగలిగి సమబుద్ధితో నెల్లప్రాణిసమూహములయం దాసక్తిగలిగి నాశములేనట్టియు, నిర్దేశింపఁగూడనట్టియు, రూపరహితమైనట్టియు, నంతట వ్యాపించియున్నట్టియు, ధ్యానించఁగూడనట్టియు, ప్రకృతియం దున్నట్టియు, చలించనట్టియు, శాశ్వతమైనట్టి

పరబ్రహ్మము నుపాసనచేయుచున్నారో వారును నన్నే చెందు చున్నారు.

రామా. ఎవ రెల్లకాలములయందు ఇంద్రియముల నియ మించి వానివానియథేష్టానుసారముగా ప్రవర్తించనీయక, దేవ మనుష్యాదిశరీరములయందంతట ఆత్మలు జ్ఞానస్వరూపముగల వారై సమానమైన యాకారముగలవారై యుందురనెడి సమ బుద్ధికలవారై, సమస్తభూతహితాసక్తులై, ఇతఁడు మను ష్యుఁడు ఇతఁడు దేవుఁడు అనువైషమ్యబుద్ధిలేనివారై అక్షరో పాసనచేయువారు నాతోసమానమైన యాత్మస్వరూపమును పొందుచున్నారు.

శ్లో. క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. 5

టీ. తేషాం=ఆ, అవ్యక్తాసక్తచేతసాం=పరబ్రహ్మమునందా సక్తమైనచిత్తముగలవారలకు, క్లేశః = కష్టము, అధికతరః = మిక్కిలియధికమైనది, హి=ఏకారణమువలన, దేహవద్భిః=దే హాభిమానముగలవారలచేత, అవ్యక్తా = అక్షరస్వరూపమైన, గతిః=మార్గము,దుఃఖం=దుఃఖముగునట్లు, అవాప్యతే=పొందఁ బడుచున్నదో.

శం. అట్టి పరబ్రహ్మమం దాసక్తమైన మనస్సుగలవారలకు అనఁగా సగుణోపాసకులకు, మిక్కిలి కష్టము కలుగును. శరీ రాభిమానముగల మనుష్యులకు హెచ్చుకష్టములు కలుగక యే పరబ్రహ్మనిష్ఠ సిద్ధింపదు.

శ్లో. యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. 6
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరా త్పార్థ మ య్యావేశితచేతసామ్. 7

టీ. యేతు=ఎవరు, మత్పరాస్సంతః=నేనేయుత్కృష్టగతిగాఁ గలవారలయి, సర్వాణికర్మాణి=సమస్తకర్మములను, మయి= నాయందు, సన్న్యస్య=సమర్పించి, అనన్యేన = అస్మదితరాలంబనములేని, యోగేనైవ = సమాధిచేతనే, మాం=నన్ను, ధ్యాయంతః=ధ్యానముచేయుచున్నవారలై, ఉపాసతే = సేవించుచున్నారో, హే పార్థ=ఓయి అర్జునా! మయి = నాయందు,ఆవేశితచేతసాం=ఉంచఁబడినచిత్తముగలిగిన, తేషాం =వారలకు, అహం = నేను, మృత్యుసంసార సాగరాత్ = మృత్యురూపమైన సంసారమనెడి సముద్రమువలనను, సముద్ధర్తా=ఉద్ధరించువాఁడను, నచిరాత్=శీఘ్రముగా, భవామి= అవుచున్నాను.

తం. ఓ యర్జునా! ఎవరు నన్నే మిక్కిలి యుత్తమగతిగాఁ దలఁచి యెల్లకర్మలను నాకు నర్పణముచేసి నన్నే తమబుద్ధి యందునిలిపి ధ్యానముచేయుచున్నారో యట్టి చిత్తవృత్తిగలిగినవారి నతిశీఘ్రముగా మృత్యురూపమయిన సంసారసాగరమును దాఁటించువాఁడనుగా నున్నాను.

రామా. ఎవరు శరీరము నిలుచుటకొఱకగు భోజనము మొదలగు లౌకికములును, వైదికములగు యాగాదులను నాకు నర్పణముచేసి నన్నే తమ బుద్ధియందునిలిపి, ధ్యానము,

అర్చనము, నమస్కారము, స్తోత్రము, కీర్తనము చేయుచున్న వారై నన్నుపాసించుచున్నారో, వారలకు సంసారము నన్ను చెందుటకు నిరోధించుగాన మృత్యువగునట్టి దానినుండి అతి శీఘ్రముగా తప్పించెదను.

మధ్వ. త న్నుపాసించెడి భక్తులకు క్లేశ మొక్కనాటికి కలుగ దనుట.

శ్లో. మ య్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. 8

టీ. మయ్యేవ= నాయందే, మనః=మనస్సును, ఆధత్స్వ= ఉంచుము. మయి=నాయందే, బుద్ధిం=బుద్ధిని, నివేశయ=ఉంచుము. అతఊర్ధ్వం= ఈ దేహము నశించినపిమ్మట, మయ్యేవ= నాయందే, నివసిష్యసి=ఉండఁగలవు, నసంశయః=సందేహము లేదు.

శం. నీమనస్సును తెలివిని నాయందే యూర్జితముగా నిలుపుము. ఆలాగు చేసితివేని యీ దేహము నశించిన వెనుక నిస్సంశయముగా నన్నే చెందుచున్నావు.

రామా. నీవు మనస్సమాధానముచేసి, నేనే పరమ ప్రాప్య మనెడి నిశ్చయముతో నుండుము. ఇట్టి నిశ్చయము కలిగిన పిమ్మట నాతో సమానుఁడవగుచున్నావు అనుట.

శ్లో. అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం,
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ. 9

టీ. హేధనంజయ = ఓయర్జునా ! అథ = అటుపిమ్మట, మయి=నాయందు, చిత్తం=చిత్తము, స్థిరం=నిశ్చలమగునట్లు,

సమాధాతుం=ఉంచుటకొఱకు, నశక్నోషి = శక్తుఁడవుకాక పోతివేని, తతః=ఆతర్వాత, అభ్యాసయోగేన=అభ్యాసయోగముచేత, మాం=నన్ను, ఆప్తుం=పొందుటకొఱకు, ఇచ్ఛ= కోరుము.

శం. ఓయర్జునా! పైజెప్పినవిధముగా నీమనస్సును తెలివిని నాయందు నిశ్చయముగా నిలుపుటకు శక్తిలేనివాఁడవైతివేని నన్నుఁబొందవలెననే కోరికఁగలిగి తిన్నఁగా నభ్యాసము చేయుము.

రామా. నేనే పరమప్రాప్యమనెడి నిశ్చయముతో నుండుటకు మనస్సమాధానము చేయలేనివాఁడవైతే, అతి ప్రీతితో స్మరించుటకు, అభ్యసించుటయనెడి యోగముచేత స్థిరమైన చిత్తసమాధానమునుబొంది నన్ను పొందఁ గోరుము.

శ్లో. అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
  మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి     10

టీ. అభ్యాసేఽపి=అభ్యాసయోగమందును, అసమర్థః=అశక్తుఁడవు, అసి=అయితివేని, మత్కర్మపరమః= నావిషయమైన కర్మమేప్రధానముగాఁ గలవాఁడవు, భవ=కమ్ము, మదర్థం= నాకొఱకు, కర్మాణి=సత్కర్మములను, కుర్వన్నపి=చేయుచున్న వాఁడవయ్యును, సిద్ధిం=మోక్షమును, అవాప్స్యసి=పొందఁ గలవు.

శం. అట్లభ్యాసము చేయుటకుఁగూడ నీకు శక్తిలేకపోయె న్నేని నావిషయమయి యెల్లకర్మలు చేయుము. అట్లు నాప్రీతికి గాను మంచికర్మజేసితివేని నీకు మోక్షము సిద్ధించును.

రామా. అభ్యాసయోగమును చేయవైతివేని నావిషయ మైన ఎల్లకర్మలుచేయుము. కర్మములనఁగా నాలయములు కట్టించుట, తోఁటలనువేయుట,దీపములు వెలిఁగించుట, ఆలయములు ఊడ్చుట, నీళ్లుజల్లుట, అలుకుట, పూవులుదెచ్చుట, పూజనునడిపించుట, నామములుచెప్పుట, ప్రదక్షిణములుచేయుట, స్తోత్రములుచేయుట, నమస్కారములు ఆచరించుట, వీనిని మిక్కిలిప్రీతితో నాచరింపుచు అభ్యాస యోగద్వారమున నాయందు చిత్తస్థైర్యమును పొంది నన్ను చేరుట యనెడి సిద్ధిని పొందుదువు.

శ్లో. అథైతదప్యశక్తోసి కర్తుం మద్యోగ మాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. 11

టీ. అథ=ఆపిమ్మట, ఏతదపి=ఈకార్యంబును, కర్తుం=చేయుటకొఱకు, అశక్తః=అసమర్థుండవు, అసి=అయితివేని, మద్యోగం=నాయొక్కయోగమును, ఆశ్రితస్సన్=ఆశ్రయించినవాఁడవై, తతః=పిమ్మట, యతాత్మవాన్=నియమింపఁబడిన చిత్తముగలవాఁడవై, సర్వకర్మఫలత్యాగం = సమస్తకర్మఫలత్యాగమును, కురు=చేయుము.

శం. అందుకును నీవు సామర్థ్యములేనివాఁడ వయితివేని నన్నే యాశ్రయించి చలింపని మనస్సుగలవాఁడవయి నాయందు భారమువేసి నీవు చేయు కర్మఫలమును నాకు సమర్పణచేయుము.

రామా. భక్తియోగమునకు మొలకవంటిదైన మత్కర్మాచరణమునకు చాలవైతివేని పరమభక్తికి సాధనమైన ఆత్మస్వ

భావము ననుసంధించుట యనెడి యక్షరయోగమునకు (సాంఖ్యయోగమునకు) సాధనముగా కర్మఫలత్యాగము చేయుము. ఫలములనువిడిచి నాయారాధనముగాఁ జేసెడి కర్మముచేత నాత్మధ్యానము సిద్ధించి దానివలన నజ్ఞానముపోయి భగవంతునకు శేషుఁడగుటయే స్వరూపముగాఁగల ప్రత్యగాత్మ ప్రత్యక్షము కాఁగా పిమ్మటనాయందు పరమభక్తి పొడమును.

శ్లో. శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాంతి రనంతరమ్. 12

టీ. అభ్యాసాత్=అభ్యాసయోగమునకంటె, జ్ఞానం=జ్ఞానము, శ్రేయోహి=శ్రేష్ఠమైనదిగదా, జ్ఞానాత్=జ్ఞానమునకంటె, ధ్యానం=ధ్యానము, విశిష్యతే=శ్రేష్ఠమవుచున్నది, ధ్యానాత్=ధ్యానముకంటె, కర్మఫలత్యాగః=కర్మఫలపరిత్యాగమును, త్యాగాత్=త్యాగమునకంటె, అనంతరం=ఆపిమ్మట, శాంతిః=సంసారముడుగుట (శ్రేష్ఠమయినది), స్యాత్=అవును.

శం. అభ్యాసయోగముకన్న జ్ఞానము శ్రేష్ఠము. జ్ఞానముకన్న ధ్యానము శ్రేష్ఠము. ధ్యానముకన్న కర్మఫలత్యాగము శ్రేష్ఠము. ఆలాటి కర్మఫలత్యాగమువల్ల సంసారమునుడుగుట సంభవిల్లుచున్నది. అందువల్లనే మోక్షము ప్రాప్తమగుచున్నది.

రామా. ప్రీతిలేని శుష్కమైన స్మృత్యభ్యాసమునకంటె ఆత్మస్వరూపము ననుసంధించి ప్రత్యక్షముగాఁ దెలుసుకొనుట శ్రేష్ఠము. లెస్సగా సిద్ధింపని ఆత్మాపరోక్ష్య జ్ఞానమునకంటె దానికి సాధనమైన ధ్యానము శ్రేష్ఠము. సిద్ధింపక యూఁడెడి ధ్యానమునకంటె దానికి సాధనమైన ఫలములనువిడిచి యాచ

రింపబడెడి కర్మమే మేలు. ఇట్టికర్మాచరణంబుచేత పాపరహిత్యమగును. పాపరాహిత్యత మనస్సునకు శాంతికలుగును. అట్టి మనస్సుచేత ఆత్మధ్యానముకలుగును. ఆత్మప్రత్యక్షము వలన పరభక్తికలుగును. కాఁబట్టి భక్తియోగము నభ్యసింపలేనివానికి ఆత్మనిష్ఠయే శ్రేష్ఠము. ఆత్మనిష్ఠుఁడైనను మనస్సునకు శాంతికలుగదేని ఫలాపేక్షలేని కర్మాచరణ ఆత్మనిష్ఠను కలుగచేయుటకు శ్రేష్ఠము.

మధ్వ. అజ్ఞానపూర్వకమగు నభ్యాసముకంటె జ్ఞానమే శ్రేష్ఠము. వట్టిజ్ఞానమునకంటె జ్ఞానముతోఁ గూడిన ధ్యానము శ్రేష్ఠము. ధ్యానముఁకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠము. స్తోత్రము ధ్యానాదులను పొందించునదిగాన త్యాగస్తోత్రము కర్తవ్యము. వట్టిధ్యానమునకంటె ఫలత్యాగముతోఁ గూడిన ధ్యానము శ్రేష్ఠము.

శ్లో. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణఏవచ,
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ. 13
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మ య్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్సమే ప్రియః. 14

టీ. సర్వభూతానాం=సమస్తప్రాణులకు, అద్వేష్టా=ద్వేషిగానివాఁడును, మైత్రః=మిత్రుఁడును, కరుణః=దయగలవాఁడును, నిర్మమః=మమకారరహితుండును, నిరహంకారః=అహంకారరహితుఁడును, సమదుఃఖసుఖః=సుఖదుఃఖములయందుసమబుద్ధిగలవాఁడును, క్షమీ=ఓర్పుగలవాఁడును, సతతం=ఎల్లప్పుడును, సంతుష్టః=సంతోషమును బొందినవాఁడును, యోగీ=ధ్యాన

పరుఁడును, యతాత్మా=నియమింపఁబడిన మనోవృత్తిగలవాఁడును, దృఢనిశ్చయః=సంశయరహితుఁడును, మయి=నాయందు, అర్పితమనోబుద్ధిః=ఉంచఁబడిన మనస్సును బుద్ధియు గలవాఁడును, మద్భక్తః=నాకుభక్తుఁడును, (ఇట్టిగుణములతోఁ గూడినవాఁడు,) యః=ఎవఁడో, సః=వాఁడు, మే=నాకు, ప్రియః =ఇష్టుఁడు.

శం. ఎవఁడు ఎల్లభూతములయందు వైరములేనివాఁడును, ఎల్లప్రాణులకు మిత్రుఁడును, దయగలవాఁడును, మమకారాహంకారములులేనివాఁడును, సుఖదుఃఖములను సమానముగాఁ జూచువాఁడును, ఓర్పుగలవాఁడును, నిత్యసంతోషి, ధ్యానపరుఁడును, అచంచల మనోవృత్తిగలవాఁడును, సందేహము లేనివాఁడును, నాయందుంచిన మనోబుద్ధులను నాభక్తుఁడును నగునో వాఁడు నాకు స్నేహితుఁడు.

రామా. నాకర్మమును బట్టి యీశ్వరునిచే ప్రేరణ చేయఁబడినవై భూతములు నాకుపకారాపకారములు చేయుచున్నవని తలంపుగలవాఁడగుటచే నన్ని భూతములయందును ద్వేషము చేయక స్నేహభావమును చూపువాఁడును, శరీరమునందును ఇంద్రియములయందును దేహసంబంధులయందును మమకారము లేనివాఁడును, దేహమే యాత్మయను తలంపు లేనివాఁడును, దైవవశంబునలభించిన యన్నాదులతోఁ దృప్తిఁ బొందినవాఁడును, ఎల్లప్పుడును ప్రకృతిసంపర్కము లేని యాత్మస్వరూపము ననుసంధించువాఁడును, నియమింపఁబడిన మనోవృత్తి కలవాఁడును, ఆత్మస్వరూపము నెఱింగించెడి శాస్త్రము

లలో చెప్పిన అంశములయందు, దృఢమైన నిశ్చయము కల వాఁడును, "భగవంతుఁడగు వాసుదేవుఁడే ఫలములను గోరక చేయఁబడెడు కర్మములచేత నారాధింపఁబడు చున్నాఁడు, ఇట్లారాధింపఁబడినవాఁడై నాకు ఆత్మప్రత్యక్షమును కలుగఁ జేయును," అని యుండువాఁడు నాయందు సమర్పింపఁబడిన మనోబుద్ధులు కలవాఁడు, కర్మయోగముచేత నన్ను సేవించు వాఁడగుటచేత నాభక్తుఁడనఁబడును.

శ్లో. యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చయః,
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః. 15

టీ. యస్మాత్ =ఎవనివలన, లోకః = జనము, నోద్విజతే= భయపడదో, యః=ఎవ్వఁడు, లోకాత్ = జనమువలన, నోద్విజతే=భయపడఁడో, యః=ఎవ్వఁడు, హర్షామర్షభయోద్వేగైః= హర్ష=ప్రీతిచేతను, అమర్ష=అసహిష్ణుత్వముచేతను, భయ= భయముచేతను, ఉద్వేగైః = ఉద్విగ్నత్వముచేతను, ముక్తః= విడువఁబడినవాఁడో, సచ = వాఁడును, మే = నాకు, ప్రియః= ఇష్టుఁడు.

శం. ఎవనివలన నెల్లజనులకును నెల్లజనులవలన నెవనికిని భయములేదో సంతోషమునకును,భయమునకును అసూయకును నెవఁ డతీతుఁడై యుండునో అట్టివాఁడు నాకు మిగుల నిష్టమైనవాఁడు.

రామానుజః—ఏకర్మనిష్ఠుఁడు లోకమున కుద్వేగము కలిగెడి పనులచేయఁడో,ఈతఁడందఱకును అవిరోధియను నిశ్చయ

మున సర్వలోకంబును యీతనికి ఉద్వేగము కలిగించదో అట్టి వాఁడు నాకిష్టుఁడు.

శ్లో. అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః. 16

టీ. అనపేక్షః=అపేక్షారహితుఁడును, శుచిః=పవిత్రుఁడును, దక్షః=సమర్థుఁడును, ఉదాసీనః=పక్షపాతరహితుఁడును, గతవ్యథః = నిర్భయుండును, సర్వారంభపరిత్యాగీ=సర్వసంకల్పరహితుఁడును, మద్భక్తః=నాకు భక్తుఁడును, యః=ఎవ్వఁడో, సః=వాఁడు, మే=నాకు, ప్రియః=ఇష్టుఁడు.

శం. ఎవఁ డిచ్ఛలులేక పవిత్రుఁడై శక్తిగలిగి పక్షపాతము లేక భయములేనివాఁడై కర్మఫలములుగోరక నాకు భక్తుఁడుగా నుండునో అట్టివాఁడు నాకు మిక్కిలి యిష్టుఁడు.

రామా. ఆత్మతప్పమిగిలిన వానియన్నింటియందును అపేక్షలేనివాఁడును, శాస్త్రములలో విధింపఁబడిన ద్రవ్యముచేత శరీరపోషణము చేసుకొనెడివాఁడును, శాస్త్రోక్తకార్య స్వీకారమున సమర్థుఁడును, అశాస్త్రీయమైనవానియందుపేక్షతోనుండువాఁడును, ఉదాసీనుఁడును, శాస్త్రములలో చెప్పఁబడిన కర్మముల చేయునప్పుడు తటస్థించెడి శీతోష్ణాదులవలన గలిగెడి దుఃఖమువలన బాధపడనివాఁడును, అశాస్త్రీయమగు కర్మారంభము లేనివాఁడును ఇట్టివారు నాకిష్టులు.

శ్లో. యో నహృష్యతి న ద్వేష్టి నశోచతి నకాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్సమే ప్రియః. 17

టీ. యః=ఎవ్వఁడు, నహృష్యతి=సంతోషించఁడో, న ద్వేష్టి=ద్వేషించఁడో, నశోచతి=దుఃఖించఁడో, నకాంక్షతి=అపే

క్షించఁడో, శుభాశుభపరిత్యాగీ=శుభాశుభములను బరిత్యజించినవాఁడును, భక్తిమాన్=భక్తిగలిగినవాఁడును, యః=ఎవ్వఁడో, సః=వాఁడు, మే=నాకు, ప్రియః=ఇష్టుఁడు.

తా. ఎవఁడు సంతోషమునకును, ద్వేషమునకును, దుఃఖమునకును, ఆశకును, శుభాశుభములకును నతీతుఁడై నాయందు భక్తిచేయున్నాఁడో అట్టివాఁడు నాకు మిగుల ప్రియుఁడు.

రామా. ఏకర్మయోగి ఇష్టానిష్టములు కలిగినప్పుడు సంతోష ద్వేషములు లేనివాఁడో, భార్య, పుత్త్రులు, ధనము మొదలగునవి పోయినను దుఃఖింపఁడో, తనకులేని దారాపుత్త్రాదులను కోరఁడో, పాపపుణ్యములు రెండును బంధహేతువులుకాన రెంటిని విడుచువాఁడైన శుభాశుభపరిత్యాగియై నాయం దపరిమితమైన భక్తిగలవాఁడు నాకిష్టుఁడు.

మధ్వ. ముందట శ్లోకములోని సర్వారంభ పరిత్యాగి యనుటకును, యీశ్లోకమునందు శుభాశుభపరిత్యాగి యనుటలోను ఒకటి సామాన్యంబుగాను, మఱియొకటి విశేషంబుగాను, ఒక్కటి సంక్షిప్తముగాను మఱియొకటి వివరణంబుగాగాను వక్కాణింపఁబడినది. కాఁబట్టి పునరుక్తిలేదు. హర్షాదులులేనివాఁ డనఁగా నొకప్పుడైనను కొంచము హర్షాదులు కలుగవచ్చు నని ఎవ్వఁడు సంతోషింపఁడో వాఁడు నాకిష్టుఁడనుట.

శ్లో. సమశ్శత్రౌ చ మిత్రేచ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః. 18
తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్,
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః. 19

టీ. శత్రౌచ=శత్రువునందును, మిత్రేచ=స్నేహితునియందును, తథా=ఆలాగుననే, మానావమానయోః = మానావమానములయందును, సమః=సమానుఁడైనవాఁడును, శీతోష్ణసుఖదుఃఖేషు=శీతోష్ణసుఖదుఃఖములయందును, సమః=సముఁడైనవాఁడును, సంగవివర్జితః=సంగరహితుఁడును, తుల్యనిందాస్తుతిః=నిందాస్తుతులయందుసమానుఁడును, మౌని=వాఙ్నియమముగలవాఁడును, యేనకేనచిత్=ఏమాత్రముచేనైనను,సంతుష్టః=తృప్తిఁబొందువాఁడును, అనికేతః=నివాసరహితుఁడును, స్థిరమతిః=నిశ్చయబుద్ధిగలవాఁడును, భక్తిమాన్=నాయందు భక్తిగలవాఁడును, యోనరః = ఏపురుషుఁడో, సః=వాఁడు, మే=నాకు, ప్రియః=ఇష్టుఁడు.

శం. ఎవఁడు పగవారియందును, స్నేహితులయందును, మానావమానములయందును, శీతోష్ణములయందును, సుఖదుఃఖములయందును సమానుఁడై సంగరహితుఁడై మౌనమును జెందినవాఁడై లాభమయినంతవఱకు సంతుష్టుఁడై నివాసరహితుఁడై చలించనిబుద్ధిగలవాఁడై నాయందు భక్తిచేయుచున్నాఁడో వాఁడు నాకు మిగులఁ బ్రియుఁడు.

రామా. (అ12. శ్లో13)లో ''అద్వేష్టాసర్వభూతానామ్'' ఇత్యాదికముచేత శత్రుమిత్రాదులయందు ద్వేషాదులు లేక పోవుట చెప్పంబడి వారు సమీపించినను చిత్తముసమముగా నుండవలసినదనుట వక్కాణింపఁబడినది. స్థిరమతిః యనగా నాత్మయందె స్థిరమైన బుద్ధికలవాఁడు కావుననే గృహారామములయందు సంగమము లేకపోవుటవల్ల అనికేతుఁడు. ఇట్టివాఁడె నాకిష్టుఁడు అనుట.

శ్లో. యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః. 20

టీ. యేతు=ఎవ్వరైతే, మత్పరమాస్సంతః=నేనే పరమగతి గలవారలయి, ఇదం=ఈ (అద్వేష్టా సర్వభూతానాం అ. 12. శ్లో 13 మొదలు చెప్పఁబడినది.) ధర్మ్యామృతం - ధర్మ్య=మోక్షప్రదమైన, అమృతం=అమృతమును, శ్రద్దధానాః=విశ్వసించినవారలై, యథోక్తం=నాచేఁ జెప్పఁబడిన క్రమము నతిక్రమింపక, పర్యుపాసతే=సేవింపుచున్నారో, తేభక్తాః=ఆభక్తులు (పరమార్థజ్ఞానమనెడి భక్తిగలవారలు), మే=నాకు, అతీవ=మిక్కిలి, ప్రియాః=స్నేహితులు.

తం. ఎవ్వరైతే నేనే పరమగతియని నమ్మి మోక్షప్రదమైన యీయమృతవాక్యములను నమ్మి నేను జెప్పినవిధమున శ్రద్ధతో నడచుకొనుచున్నారో యట్టి నాభక్తు లందఱికన్న నాకు మిగులప్రియులు.

మధ్వ. ధర్మ్యామృతం అను చో విష్ణువునే విషయముగాఁ గలిగి మరణము మొదలగు సంసారనివృత్తిని తెలియఁజేయునది. ఆస్తిక్యముగలవారు శ్రద్ధధానులు. వీరాదిగాఁ గలవారు నాభక్తులందఱికన్న నాకు ప్రియులు.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తి
యోగో నామ ద్వాదశోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునులసంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయందు భక్తియోగమనెడి
ద్వాదశాధ్యాయము.

—

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగః.

అర్జున ఉవాచ:—

శ్లో. *ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ,
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయంచ కేశవ. 1

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. హే కేశవ=ఓ కృష్ణస్వామీ! ప్రకృతిం=ప్రకృతిని, పురుషం=పురుషుని, క్షేత్రం=క్షేత్రమును, క్షేత్రజ్ఞంచ=క్షేత్రజ్ఞుని, జ్ఞానం=జ్ఞానమును, జ్ఞేయంచ=జ్ఞేయమును, ఏతత్=ఈసమస్తమును, వేదితుం=తెలియుటకొఱకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

శం. ఓ మాధవా! ప్రకృతియనఁగా నేది? పురుషుఁడనఁగా నెవ్వఁడు? క్షేత్రమనఁగా నెట్టిది? క్షేత్రజ్ఞుఁడనఁగా నెవ్వఁడు? జ్ఞానమనఁగా నేమి? జ్ఞేయమనఁగా నేమి? ఇవియెల్లఁ జక్కఁగాఁ దెలియ నిచ్ఛగించుచున్నాను.

* ఈశ్లోకము కొన్నిప్రతులయందులేదు. దీనిని చేర్చుటవలన భగవద్గీతలలో 701 శ్లోకము లగుచున్నవి. శంకరభాష్యపీఠికలో 700 శ్లోకముల మాత్రమున్నది. ఇది ప్రక్షిప్తశ్లోకము.

శ్రీభగవానువాచ.—

శ్లో. ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే,
ఏత ద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞః ఇతితద్విదః. 2

శ్రీ కృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.—

టీ. హేకౌంతేయ=ఓ యర్జునుఁడా! ఇదంశరీరం=ఈదేహము, క్షేత్రమితి=క్షేత్రమని, అభిధీయతే=చెప్పఁబడుచున్నది, యః=ఎవ్వఁడు, ఏతత్=ఈశరీరమును, వేత్తి=తెలియుచున్నాఁడో, తద్విదః=తత్ క్షేత్రవేత్తలు, తం=ఆ తెలిసినవానిని, క్షేత్రజ్ఞఇతి=క్షేత్రజ్ఞుఁడని, ప్రాహుః=చెప్పుదురు.

శం. అర్జునా! దేహము క్షేత్రమనియు, దేహమును తెలిసికొన్నవాఁడు క్షేత్రజ్ఞుఁ డనియు పెద్దలు చెప్పెదరు.

దెబ్బ (క్షత) నుండి కాపాడునది యగుటచేతను క్షయించుట (తగ్గిపోవుచుండుట) వల్లను, భూమి (క్షేత్రము) యందువలె దీనియందు కర్మఫలము సిద్ధించుటవల్లను, శరీరము క్షేత్రమని చెప్పఁబడును. స్వభావసిద్ధమగు జ్ఞానముచేత నాపాదమస్తకపర్యంతము తెలిసికొనువాఁడుగాన క్షేత్రజ్ఞుఁడనఁబడుచున్నాఁడు. ఉపదేశమువలనకలిగిన జ్ఞానమునఁగూడ నేర్పాటుగా శరీరము నెఱుంగునుగాన క్షేత్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁడు.

రామా. భోగాదు లనుభవించుటకై యాత్మకు క్షేత్రమ్మనఁగా స్థానము శరీరమని ఆత్మతత్త్వమెఱింగినవారిచే చెప్పఁబడుచున్నది. ఈశరీరమును అవయవాదులుగాను, మొత్తముగా నెవ్వరెఱుంగుచున్నారో, దీనిని తానెఱుంగునని ఎవ్వఁడు

తెలిసికొనుచున్నాఁడో వానిని ఈశరీరముకన్న వేఱైన క్షేత్రజ్ఞునిగాఁ జెప్పుచున్నారు.

శ్లో. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ.

టీ. హేభారత=ఓయర్జునా! సర్వక్షేత్రేషు=సమస్తక్షేత్రములయందు, క్షేత్రజ్ఞంచాపి=క్షేత్రవేత్తగాను, అనఁగా సంసారసంపర్కములేని పరమాత్మనుగా, మాం=నన్ను, విద్ధి=తెలియుము, క్షేత్రక్షేత్రజ్ఞయోః=క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క, జ్ఞానం=తెలియుట, యత్=ఏదో, తత్=అది, జ్ఞానం=జ్ఞానమని, మమ=నాకు, మతం=సమ్మతము.

శం. ఓయర్జునా! ఎల్లక్షేత్రములయందుండు క్షేత్రజ్ఞుఁడు నేనేయని తెలిసికొమ్ము. ఈక్షేత్రమును దదంతర్గతుఁడైన క్షేత్రజ్ఞుని విభజించి తెలియుట యేదియో యదియే మంచిజ్ఞానమని చెప్పఁబడుచున్నది. అన్నిక్షేత్రములయందొక్కఁడై బ్రహ్మాది స్తంభపర్యంతమైన అనేకక్షేత్రములనెడియుపాధులచేత విభజింపఁబడిన ఈతనిని ఉపాధులవలన వచ్చినభేదము లెవ్వియు లేనివానినిగా తెలియుము.

రామా. దేవమనుష్యాది సర్వశరీరములయందును జ్ఞాతృత్వమె (తెలిసికొనువాఁడగుటయె) స్వరూపముగాఁగల క్షేత్రజ్ఞుని (జీవుని) నన్నుగాను, అనఁగా నే నాత్మగాఁగల వానినిగా నెఱుంగుము. శరీరము క్షేత్రజ్ఞునికి విశేషణమగుటయె స్వభావముగాఁగలదగుటచేత,ఆత్మనువిడిచియుండకపోవుటచేతను,ఆత్మ

తోడి సామానాధికరణ్యము (నేను దేవుఁడను, మనుష్యుఁడను అని ఇట్లు ఐక్యముగా) చేత నిర్దేశింపఁబడునట్లు, ఈక్షేత్రంబును క్షేత్రజ్ఞుఁడునుకూడ నాకు విశేషణమగుటయె స్వభావముగాఁ గలవగుటచేత నన్ను విడిచి యుండకపోవుటను, నాతోటి సామానాధికరణ్యము (ఐక్యము) ననే నిర్దేశింపఁబడఁదగినవిగాఁ దెలిసికొనుము.

శ్లో. తత్ క్షేత్రంయచ్చయాదృక్చయ ద్వికారి యతశ్చయత్,
సచ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 4

టీ. హే భారత=ఓ యర్జునా! తత్ క్షేత్రం = ఆక్షేత్రము, యచ్చ=ఏదో, యాదృక్చ=ఎట్టిదో - అనఁగా ఎట్టిధర్మములు గలదో, యద్వికారి=యేవికారముగలదో, యతశ్చ=ఏకారణమువలన, యత్=ఏదిపుట్టునో, సచ=ఆక్షేత్రజ్ఞుఁడు, యః=ఎవ్వఁడో, యత్ప్రభావశ్చ=ఎట్టిప్రభావముగలవాఁడో, (ఉపాధుల వలన వచ్చినశక్తులు,) తత్=ఆస్వరూపమును, సమాసేన= సంక్షేపముచేత, మే=నాయొక్క వచనమువలన, శ్రుణు = వినుము.

శం. ఆ క్షేత్రమేదియో, దాని స్వభావమెట్టిదో, దాని వికారములేవియో, ఏకారణమువల్ల నది యుత్పత్తైనదో వానిని, క్షేత్రజ్ఞుని, వానిస్వభావమును సంక్షేపముగాఁ జెప్పెదను వినుము.

శ్లో. ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. 5

టీ. తత్=తత్స్వరూపము,ఋషిభిః=వసిష్ఠాదిఋషులచేత, బహుధా=బహుప్రకారములుగా, గీతం=చెప్పఁబడెను, వివి

ర్దైః=నానావిధములైన, ఛందోభిః=వేదములచేతను, పృథక్=ప్రత్యేకముగా, గీతం=చెప్పఁబడెను, హేతుమద్భిః = యుక్తియుక్తములైన, వినిశ్చితైః=నిస్సంశయముగా నిర్ణయింపఁబడిన, బ్రహ్మసూత్రపదైశ్చైవ=బ్రహ్మసూత్రవాక్యములచేతను, గీతం=చెప్పఁబడెను.

శం. ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపనిర్ణయములు మహర్షుల వల్లను పలువిధములుగాఁ జెప్పఁబడియున్నవి. ఇంతియకాదు, సంశయమునకు నాస్పదములేని బ్రహ్మసూత్రములవల్లను నెఱింగింపఁబడియున్నవి.

రామా. ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల తత్త్వము పరాశరుఁడు మొదలగు ఋషులచేఁ జెప్పఁబడినది. ఋగ్యజుస్సామాథర్వముల చేతను, బ్రహ్మసూత్రములనియెడు పేరుఁగల పదములు అనఁగా శారీరకసూత్రములచేతను నిర్ణయింపఁబడినవనుట.

శ్లో. మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ,
ఇంద్రియాణి దశైకంచ పంచ చేంద్రియగోచరాః. 6
ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనాధృతిః,
ఏత త్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. 7

టీ. మహాభూతాని=పృథివ్యాది భూతములును, అహంకారః=అహంకారమును, బుద్ధిః=బుద్ధియు, అవ్యక్తమేవచ=మాయయును, దశైకంచ=జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదియును (మనస్సున్ను చేరి పదునొకండయిన,) ఇంద్రియాణి=ఇంద్రియములును, పంచ=ఐదయిన, ఇంద్రియగోచరాః=శబ్దాది విషయములను, (ఇవి చతుర్వింశతితత్త్వములు.) ఇచ్ఛా=

కోరికయును, ద్వేషః=ద్వేషమును, సుఖం=సుఖమును, దుః ఖం=దుఃఖమును, సంఘాతః=దేహేంద్రియాదిసంహతియును, చేతనా=మనోవృత్తియును, ధృతిః=ధైర్యమును, (ఇవి యాత్మ గుణములు.) సవికారం = మహదాదివికారములతోఁగూడిన, ఏతత్=ఇది, క్షేత్రం=క్షేత్రమని, సమాసేన=సంగ్రహముచేత ను, ఉదాహృతం=చెప్పఁబడెను.

శం. పంచభూతములయిన పృథ్వి, అప్పు, తేజస్సు, వా యువు, ఆకాశమున్ను, అహంకారము, బుద్ధి, మాయయును, జ్ఞానేంద్రియములయిన శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రా ణములును, కర్మేంద్రియములయిన వాక్, పాద, పాణి, పా యు, ఉపస్థలును, మనస్సును, ఇంద్రియగోచరంబులగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములయిన పంచతన్మాత్రలును, (వీనిఁ సాంఖ్యులు యిరువదినాలుగు తత్వము లందురు.) కోరిక, ద్వేష ము, సుఖము, దుఃఖము దేహేంద్రియాది సమూహము, మ నోవృత్తి, ధైర్యము, (వీనినే వైశేషికు లాత్మగుణము లనియె దరు) అను వికారములతోఁ గూడినయిది క్షేత్రమని సంగ్రహ ముగాఁ జెప్పఁబడినది. అనఁగా నీచెప్పిన భేదముల సమూహ మైన ఈశరీరమె క్షేత్రము అని.

రామా. చేతనుఁడు తాను సుఖదుఃఖములను అనుభవిం చుటకు ఆధారమైనది క్షేత్ర మని.

మధ్వ. ఇచ్ఛ మొదలగునవి వికారములని.

శ్లో. అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః.

టీ. అమానిత్వం=తన్ను స్తోత్రముచేసికొనకయుండుటయు, అదంభిత్వం=తనధర్మమును ప్రకాశముచేసికొనకయుండుటయు, అహింసా=హింసారాహిత్యంబును, క్షాంతిః=క్షమించుటయు, ఆర్జవం=కౌటిల్యరాహిత్యంబును, ఆచార్యోపాసనం=గురుసేవయు, శౌచం=బాహ్యాభ్యంతర శుచిత్వంబును, స్థైర్యం=చలనములేకయుండుటయు, ఆత్మవినిగ్రహః=మనోనిగ్రహంబును.

శం. తన్నుఁదాను పొగడుకొనకయుండుట, తనధర్మము తాను ప్రకాశముచేసికొనక యుండుట, హింసచేయకయుండుట, క్షమ, కృత్రిమము లేకపోవుట, గురుసేవ, బాహ్యాభ్యంతర శుద్ధి, అచాంచల్యము, మనోనిగ్రహము పుట్టుట.

రామా. గొప్పవారి నగౌరవముగాఁ జూడకుండుట, తన్ను ధార్మికుఁడనుటకే ధర్మముల నాచరించ కుండుట, వాఙ్మన శ్శరీరములంగూడ పరులకు హింసచేయకుండుట, పరులు తన్ను బాధించినను చిత్తవికారములేక యుండుట, పరులంగూర్చి తన శరీరవాఙ్మనసాదులం దేకరీతిగా నుండుట, ఆత్మజ్ఞానమునిచ్చెడియాచార్యునిం గూర్చి, నమస్కారము,ప్రశ్న, సేవ పీనినాచరించుట, ఆత్మజ్ఞానమునకును తత్సాధనమునకును తగినమనోవాక్కాయములు కలిగియుండుట, అధ్యాత్మశాస్త్రమునందు చెప్పఁబడినదానియం దేకమనస్సుతో నుండుట,ఆత్మస్వరూపముకంటె మిగిలినవానినుండి మనస్సును మఱలించుట.

మధ్వ. పరబ్రహ్మమెట్టిదో, ఎటువంటి ప్రభావముకలదో, దానిజ్ఞానమునకు సాధనములు చెప్పఁబడుచున్నది. ఈక్రింది శ్లోకమువలన విస్పష్టము.

శ్లో. ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ,
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్. 9

టీ. ఇంద్రియార్థేషు = విషయములయందు, వైరాగ్యం= ఆశ లేకయుండుటయు, అనహంకారఏవచ=అహంకారము లేకయుండుటయు, జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనం= జన్మమరణ జరారోగదుఃఖములయందలి దోషముల నాలోచించుటయు.

శం. ఇంద్రియవిషయములయం దాశ లేకయుండుట, అహంకారము లేకయుండుట, జన్మము, మరణము, ముసలితనము, రోగము, దుఃఖము వీనిలోనిదోషములను యోజించి తెలిసికొనుట.

రామా. ఆత్మకంటె మిగిలిన విషయములు ఇంద్రియార్థములు. వానిదోషములం దెలిసికొని వానియందు రోతగలిగియుండుట, దేహమునే యాత్మగా తలంచకయుండుట, లేక తనవి ఇచ్చట కానివానిని తనవిగా ననుకొనుట, శరీరముతో నుండునపుడు జన్మము, మరణము, ముసలితనము, రోగము, దుఃఖము యివి తప్పనివని తలంచుట.

శ్లో. అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు,
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. 10

టీ. పుత్రదారగృహాదిషు = పుత్రదారగృహాదులయందు, అసక్తిః=శక్తి లేకయుండుటయు, అనభిష్వంగః=అనన్యాత్మభావనాలక్షణమైన యాసక్తివిశేషము లేకయుండుటయు, ఇష్టానిష్టో

పప త్తిషు=ఇష్టానిష్టప్రాప్తులయందు, నిత్యంచ=ఎల్లప్పుడును, సమచిత్తత్వం=సమబుద్ధికలిగియుండుటయు.

శం. విషయములయందాసక్తిలేకయుండుట, పుత్రదారాగృహాదులకుఁ గలుగు సుఖదుఃఖములు మొదలగునవి తనవి గాను విభావించుట, ఇష్టానిష్టప్రాప్తులయం దెల్లప్పుడు సమచిత్తత్వము గలిగియుండుట.

రామా. ఆత్మకంటె మిగిలిన వానియందు సంగములేకపోవుట, శాస్త్రోక్తకార్యములందు తప్ప మిగిలిన వానియందు పుత్త్రాదులను చేర్చికొనక పోవుట, ఇష్టానిష్టప్రాప్తులయందు సమచిత్తత్వము గలిగి యుండుట.

శ్లో. మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్తదేశ సేవిత్వ మరతి ర్జనసంసది. 11

టీ. మయిచ=నాయందే, అనన్యయోగేన=శ్రీవాసుదేవేతరగతి లేదనెడి యోగముచేత, అవ్యభిచారిణీ=వ్యభిచారమును పొందనట్టి, భక్తిః=భక్తియును, వివిక్తదేశసేవిత్వం = విజనస్థలవాసియగుటయు, జనసంసది=జనసమూహమునందు, అరతిః=అనురాగము లేకయుండుటయు.

శం. ఇతరదేవతారాధనయందు మనస్సు చలించక నేనే గతియని నమ్మి నాయందు గూఢమైన భక్తిచేయుట, విజనస్థలవాసియగుట, జనసమూహమునందు ప్రీతిలేకయుండుట.

శ్లో. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్,
ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం య దతోఽన్యథా. 12

టీ. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం=ఆత్మజ్ఞానమందు నిత్యభావమును, తత్త్వజ్ఞానార్థదర్శనం=మోక్షజ్ఞానమందుఁ బ్రయోజనదృష్టియును, ఏతత్=ఈచెప్పఁబడినది, జ్ఞానమితి=జ్ఞానమని, ప్రోక్తం=చెప్పఁబడెను, అతః=దీనికంటె, అన్యథా=ఇతరమైనది, యత్=ఏదిగలదో, తత్=అది,అజ్ఞానం=అజ్ఞానమని, ప్రోక్తం=చెప్పఁబడెను.

శం. ఆత్మజ్ఞానమందు నిత్యభావముగలుగుట, మోక్షప్రాప్తియందే ప్రయోజనదృష్టియుంచుట యివి యన్నియు జ్ఞాన మని పెద్దలు జెప్పుదురు. వీనికి నితరములన్నియు నజ్ఞానములని చెప్పఁబడును.

రామా. ఆత్మజ్ఞానమందు నిత్యభావము గలుగుట, తత్త్వజ్ఞానము ప్రయోజనముగాఁగల చింతయేదిగలదో దానియందు ఆసక్తుఁడై యుండుట, ఇదియ యాత్మజ్ఞానసాధనము. ఇతరములన్నియు ఆత్మజ్ఞానమునకు విరోధులని చెప్పఁబడును.

శ్లో. జ్ఞేయం య త్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే,
అనాదిమ త్పరం బ్రహ్మ న స త్తన్నాస దుచ్యతే. 13

టీ. జ్ఞేయం=తెలియఁదగినది, యత్=ఏదో,యత్=దేనిని, జ్ఞాత్వా=తెలిసి, అమృతం=మోక్షమును, అశ్నుతే=పొందఁగలఁడో, అనాదిమత్=ఆదిలేనిదియును, పరం బ్రహ్మ=నిరతిశయమైనబ్రహ్మము, తద్బ్రహ్మ=ఆబ్రహ్మము,సత్=సత్తున్ను, అసత్=అసత్తున్ను, న=కాదు. ఇతి=ఇట్లని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

శం. ఇఁకను దెలిసికొనఁదగిన విషయమేదియో దానిని జెప్పుచున్నాను. దేనిని తెలిసినయెడల మోక్షప్రాప్తికలుగునో దానినే నిరతిశయమైన బ్రహ్మమని చెప్పుచున్నారు. ఆబ్రహ్మము మొదలులేనిది. మిక్కిలి శ్రేష్ఠమయినది. వేదవిహితమగుట వలన సత్తైనఘటాఘటాదులకన్న నసత్తైన శశశృంగాదుల కన్న విలక్షణమయినది.

రామా. సాధనములచేతఁ బొందఁదగినప్రత్యగాత్మస్వరూపము చెప్పఁబడుచున్నది. దేనిని తెలిసికొనినపుట్టుక, ముదిమి, చావు లేదో,ఆ నేనే పరుఁడుగాఁగల జ్ఞానము గొప్పది. కార్యకారణావస్థలు ఆత్మకు కలుగుట కర్మమనెడి అవిద్యయొక్క ఆవరణముచేత వచ్చినది. దేవమనుష్యాది నామరూపములు కలిగియుండుటచేత నాత్మకు కార్యావస్థసిద్ధించుట. అది లేనియప్పుడు అనగా సృష్ట్యాదియందు కారణావస్థ సిద్ధించుట. కారణావస్థయందుకూడ సూక్ష్మరూపమైన అవిద్యయావరించియే యుండును. కాఁబట్టి కర్మ సంపర్కములేని యాత్మస్వరూపము సత్తనియు, అసత్తనియును గూడ చెప్పఁబడును.

శ్లో. సర్వతః పాణిపాదంత త్సర్వతోఽక్షిశిరోముఖమ్,
సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి. 14

టీ. తత్=ఆబ్రహ్మము, సర్వతః=అంతటను, పాణిపాదం=హస్తపాదములు గలిగినదై, సర్వతః=అంతటను, అక్షిశిరోముఖం=నేత్రశిరోముఖములు గలిగినదై, సర్వతః శ్రుతిమత్=అంతట శ్రోత్రములు గలిగినదై, సర్వం=సమస్తమును, ఆవృత్య=వ్యాపించి, లోకే=లోకమందు, తిష్ఠతి=ఉండును.

శం. ఆబ్రహ్మ మెల్లదిశలయందు చేతులు, కాళ్ళు, కన్నులు, శిరస్సులు, ముఖములు, చెవులుగలిగినదియై యెల్ల ప్రపంచమును వ్యాపించియుండునది.

రామా. పరిశుద్ధమైన యాత్మస్వరూపము చేతులు కాళ్ళు మొదలగువానితో చేసెడి కార్యములను అంతటను చేయసమర్థమైనది. ప్రత్యగాత్మకూడ పరిశుద్ధుఁడైనచో పరబ్రహ్మతో సమానుఁ డగును.

శ్లో. సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ. 15

టీ. (ఆబ్రహ్మము), సర్వేంద్రియగుణాభాసం=సకలేంద్రియ వ్యాపారములచేతఁ బ్రకాశింపుచున్నదానివలె నుండినను, సర్వేంద్రియ వివర్జితం=సకలేంద్రియ రహితమైనదియును, అసక్తం = ఎందులనంటనిదైనను, సర్వభృచ్చైవ=సమస్తమును ధరించినట్టిదియును, నిర్గుణం = గుణములేనిదైనను, గుణభోక్తృచ=గుణముల ననుభవించునట్టిదియును.

శం. ఆబ్రహ్మ మెల్ల యింద్రియవ్యాపారములచేఁ బ్రకాశించుదానివలెనుండియు నాయెల్ల యింద్రియవ్యాపారములకు సంబంధము లేనిది, ఎల్ల ప్రపంచములు ధరించినదయ్యును నెందులఁ దగులకయుండునది, త్రిగుణాత్మకముగానిదయ్యును సత్త్వరజస్తమోగుణముల ననుభవించునట్టిది.

రామా. ఇంద్రియగుణము లనఁగా నింద్రియవృత్తులు. వానిచేతఁగూడ విషయములను తెలిసికొనుటకు సమర్థమైనది. స్వభావమును పట్టి ఇంద్రియవృత్తుల యపేక్షలేకయే అన్నిటిని

తెలిసికొనునది. అది దేవాదిశరీరములతో నంటులేనిది. ఆశరీరములనన్నింటిని భరించుటకు సమర్థమైనది. స్వభావముంబట్టిగుణములు లేనిది. గుణముల ననుభవించుటకు సమర్థమైనది.

శ్లో. బహి రంత శ్చ భూతానా మచరం చర మేవ చ,
సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్.

టీ. తత్=ఆబ్రహ్మము, భూతానాం=ప్రాణులయొక్క, అంతశ్చ=లోపలను, బహిశ్చ=వెలుపలను, (అస్తి=ఉన్నది,) అచరం=స్థావరరూపముగాను, చరంచ=జంగమరూపముగాను, (ఉన్నది,) సూక్ష్మత్వాత్=రూపము లేకయుంటవలన, తత్=అది, అవిజ్ఞేయం=తెలియనశక్యమైనదిగాను, దూరస్థం=పొందనశక్యమైనదిగాను, అంతికేచ=సమీపమందును నున్నదని భావము.

శం. ఆబ్రహ్మము, ఎల్లచరాచరములయందు లోపల బైట నుండునది, మిగుల సూక్ష్మమైన రూపముగలిగినది గావున తెలిసికొన నశక్యమైనది, అజ్ఞానికి దూరముగాను జ్ఞానికి దాపుగాను నున్నట్టిది.

శ్లో. అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్,
భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. 17

టీ. తత్=ఆబ్రహ్మము, అవిభక్తంసత్=అపరిచ్ఛిన్నమైనదై, భూతేషు=సమస్తప్రాణులయందు, విభక్త మివ=పరిచ్ఛిన్నమైనదానివలె, స్థితం=ఉన్నది, భూతభర్తృ=భూతముల భరించునదియనియు, గ్రసిష్ణు=గ్రహించునట్టిదియు, ప్రభవిష్ణు=ఉత్ప

త్తిచేయునట్టిది యనియు, తత్=ఆబ్రహ్మము, జ్ఞేయం=తెలియఁదగినది.

శం. ఆబ్రహ్మము అపరిచ్ఛిన్నమయ్యును నెల్ల జీవకోట్లయందు పరిచ్ఛిన్నమైనదానివలె నుండునట్టిది, సమస్తభూతములను మోయునట్టిదియు గ్రహించునట్టిదియు మరలఁ బుట్టించునట్టిది యనియు నెఱుఁగుము.

రామా. దేవతలు మనుష్యులు మొదలగు భూతములయందంతటనుండెడి యాత్మవస్తువు తెలిసికొనునది యొ యాకారముగాఁ గలదగుటచేత విభజింపఁబడనిది. అజ్ఞులకు ఈతఁడు దేవుఁడు, ఈతఁడు మనుష్యుఁడని యిట్లువిభజింపఁ బడునదివలె నుండును. దేహరూపముగాఁ జేరియున్న పృథివి మొదలగు భూతములను పోషించున దేదో అదిపోషింపఁబడెడి భూతములకంటె వేఱుఅని తెలియశక్యమైనది. భూతములవికారమైన అన్నాదులను మ్రింగునది యెద్దియో అదిమ్రింగఁబడువానికంటె వేఱు అని తెలియ శక్యమైనది. పుట్టుటకు కారణమైనది. చచ్చినశరీరమున మ్రింగుట మొదలయినవి కనఁబడకపోవుట చేత మంగల మొదలగు వానికి భూతసముదాయరూపమైన యీశరీరము కారణముకాదని స్పష్టము.

శ్లో. జ్యోతిషా మపి త జ్జ్యోతి స్తమసః పర ముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్. 18

టీ. తత్=ఆబ్రహ్మము, జ్యోతిషామపి=సూర్యాది తేజస్సులకును జ్యోతిః=ప్రకాశకమైనదియు, తమసః=అజ్ఞానముకంటె, పరం=వ్యతిరిక్తమైనదియు, జ్ఞానం=జ్ఞానమైనదియు, జ్ఞేయం=

తెలియఁదగినదియు, జ్ఞానగమ్యం=జ్ఞానగోచరమైనదియు, సర్వస్య=సమస్తప్రాణులయొక్క, హృది=హృదయమందు, విష్ఠితం = ఉన్నదియు, (అని ఈరీతిగా,) ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

శం. ఆబ్రహ్మము జ్యోతిస్స్వరూపులైన సూర్యాదులకు ప్రకాశకమైనదనియు, అజ్ఞానమునకు వ్యతిరిక్తమైన దనియు, తెలియఁదగినది యనియు, జ్ఞానగోచరమైనది యనియు, నెల్ల ప్రాణులమనస్సులయందున్నదనియుఁ జెప్పఁబడును.

రామా. దీపము, సూర్యుఁడు మొదలగు వెలుతురుగలపదార్థములు ఇంద్రియములకును విషయములకును సంబంధము కలుగనీయని చీకటినిపోఁగొట్టుట మాత్రమే చేయును. అంతమాత్రమునకే వానిని ప్రకాశింపఁజేయువానిగాఁ జెప్పుచున్నారు. నూత్మావస్థయందుండు ప్రకృతి పై సూర్యాదుల కంటె నుత్కృష్టమైనది. జ్ఞానసాధనము చేతఁ బొందబడఁ దగినది. మనుష్యాదుల యందఱహృదయములందును సన్నిహితమై యుండునది యనుట.

శ్లో. ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే. 19

టీ. ఇతి=ఈప్రకారముగా, క్షేత్రంచ=క్షేత్రమును, తథా=ఆలాగుననే, జ్ఞానంచ=జ్ఞానమును, జ్ఞేయంచ=తెలియఁదగినదియు, సమాసతః=సంగ్రహాముగా, ఉక్తం=చెప్పఁబడెను. మద్భక్తః=నాభక్తుఁడు, ఏతత్=ఈయర్థమును, విజ్ఞాయ=తెలిసి

కొని, మద్భావాయ=నాస్వభావముకొఱకు, ఉపపద్యతే= అర్హుఁడగుచున్నాఁడు.

శం. ఈవిధముగ క్షేత్రమును జ్ఞానమును జ్ఞేయమును సూక్ష్మముగా నీకుఁ జెప్పితిని, ఈయర్థము నెఱిఁగిన మద్భక్తుఁడు నా స్థానమైన మోక్షమునకు నర్హుఁ డగుచున్నాఁడు.

రామా. ఈవిధముగ క్షేత్రముకంటె వేరుగానుండెడి యాత్మనుఁబొందఁదగిన యుపాయముయొక్క స్వరూపమును క్షేత్రజ్ఞుని స్వరూపమును తెలిసికొని, సంసారికాక, నాయొక్క స్వభావమును పొందుటకు తగినవాఁడవు కమ్ము అనుట.

శ్లో. ప్రకృతిం పురుషం చైవ వి ద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. 20

టీ. ప్రకృతిం=క్షేత్రమును, పురుషంచ=క్షేత్రజ్ఞుని, ఉభావపి=ఈరెంటిని, అనాదీ=నిత్యములుగాను, విద్ధి=తెలియుము, వికారాంశ్చ=బుద్ధ్యాదివికారరూపములను, గుణాంశ్చ=గుణములను, ప్రకృతిసంభవానేవ=ప్రకృతివలనఁ బుట్టినవానిగానే, విద్ధి=తెలియుము.

శం. ప్రకృతిపురుషు లిద్దఱు ననాదులని తెలిసికొమ్ము,మనోబుద్ధులకుఁ గలుగు వికారములును సత్వరజస్తమోగుణములును మూలప్రకృతివల్లఁ గలిగినవిగాఁ దెలిసికొమ్ము.

రామా. వికారము లనఁగా బంధహేతువులగు ఇచ్ఛ ద్వేషాదులు. మోక్షహేతువులగు అమానిత్వాదులు గుణములు పురుషునితోననాదిగాఁ గలిసి యుండి క్షేత్ర (శరీర) రూపము

గాఁ బరిణమించి యున్న యీప్రకృతియె ఇచ్ఛ ద్వేషము మొదలగు తన వికారములచేత పురుషునకు బంధమును కలుగఁ జేయును. అమానిత్వాది వికారములు మోక్షహేతువగును.

శ్లో. కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే,
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే.21

టీ. ప్రకృతిః=మాయ, కార్యకారణకర్తృత్వే = శరీరసుఖదుఃఖాదులను బుట్టించుటయందు, హేతుః=కారణమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది, పురుషః=క్షేత్రజ్ఞుఁడు, (అనఁగా జీవుఁడు లేక భోక్త యీనాలుగును పర్యాయపదములుగా నెంచవలయును) సుఖదుఃఖానాం=సుఖదుఃఖములయొక్క, భోక్తృత్వే=అనుభవించుటయందు, హేతుః=కారణమని, ఉచ్యతే=చెప్పఁబడు చున్నాఁడు.

శం. ప్రకృతికి మాయయనికూడ నామముగలదు. ఆమాయ శరీరసుఖదుఃఖాదులనుబుట్టించుటకుఁ గారణమని తెలిసికొమ్ము. క్షేత్రజ్ఞుఁడనెడివాఁడు సుఖదుఃఖము లనుభవించుటలోఁ గారణమని తెలిసికొమ్ము.

రామా. కార్యమనఁగా శరీరము కారణములనఁగా జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములును. అవి పనులనొనర్చుట పురుషాధిష్ఠాతమైన ప్రకృతియె హేతువు. ఇట్టి ప్రకృతియైన క్షేత్రము ఆధారముగాఁగలవియె భోగములను కలుగఁ జేసెడి వ్యాపారములనుట. శరీరమునధిష్ఠించుట యందలి ప్రయత్నమునకు హేతువు పురుషుఁడగుట వానికి కర్తృత్వము ప్రకృతితో కలిసియుండు పురుషుఁడే సుఖదుఃఖాదుల కాధారమైనవాఁడు.

మధ్వ. పురుషుఁడుచిద్రూపుండగుట ననుభవించుచున్నాఁడు. ప్రకృతి జడమగుటం బట్టి పరిణమించునది.

శ్లో. పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు. 22

టీ. ప్రకృతిస్థః=ప్రకృతియందున్నవాఁడై, పురుషః=పురుషుఁడు, ప్రకృతిజాన్=ప్రకృతివలనఁబుట్టిన, గుణాన్=గుణములను, భుఙ్క్తేహి=అనుభవింపుచున్నాఁడు గదా, అస్య=ఈపురుషుని, గుణసఙ్గః=సుఖదుఃఖాదిగుణాసక్తి, సదసద్యోనిజన్మసు=పుణ్యాపుణ్యరూపయోనుల జన్మించుటయందు, కారణం=హేతువు, భవతి=అగుచున్నది.

శం. క్షేత్రజ్ఞుఁడను పురుషుఁడు క్షేత్రమను ప్రకృతియందుండువాఁడు. ప్రకృతివల్లఁ బుట్టినగుణములను పురుషుఁ డనుభవించుచున్నాఁడు. ఈపురుషునికి సుఖదుఃఖరూపములైన గుణములయం దాసక్తియుండుటచేతఁ బుణ్యాపుణ్యరూపములైన యోనులయందు జన్మములకుఁ గారణమగుచున్నది.

రామా. స్వయముగా తన్ననుభవించుటయె సుఖముగాఁగలఈపురుషుండు ప్రకృతిసంపర్కము కలవాఁడై, దానివలనం గలిగిన సత్త్వాదిగుణములకార్యములైన, సుఖదుఃఖాదులననుభవింపుచున్నాఁడు. ఇట్లు ప్రకృతిపరిణామములగు దేవమనుష్యాదిజన్మములలో నున్నవాఁడై, ఆయాజన్మములకు తగిన సాత్త్వికాది సుఖాసక్తుఁడై వానికి సాధనములగు పుణ్యాపాపములం జేయును. వాని ననుభవించుటకు కర్మానుసారణములైన జన్మముల నెత్తును. అటపైనిగూడ కర్మములం జేయుచుండును.

మరల పుట్టుచుండును. అమానిత్వాదులగు నాత్మప్రాప్తిని కలుగఁజేసెడి గుణములను సేవించునఱకును సంసారమును పొందుచుండును.

శ్లో. ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. 23

టీ. ఉపద్రష్టా=కార్యకారణ వ్యాపారములయం దుపద్రష్టయైనట్టియు, అనుమంతా=అనుమోదించునట్టియు, భర్తా=భరించునట్టియు, భోక్తా=అనుభవించునట్టియు, మహేశ్వరః=నియామకుఁడైనట్టియు, పరమాత్మేతి=పరమాత్మయని, ఉక్తః=చెప్పఁబడినట్టి, పురుషః=క్షేత్రజ్ఞుఁడు, అస్మిన్ దేహే=ఈదేహమందు, పరః=ఉత్కృష్టుఁడైనవాఁడు.

తం. ఈక్షేత్రమను దేహమందు క్షేత్రజ్ఞుఁడను పురుషుఁడు కార్యకారణవ్యాపారములయం దుపద్రష్టయై ఋత్విక్కులును యజమానులును యజ్ఞముచేయుచుండఁగా పనిని చేయక తటస్థముగానుండి యజ్ఞమునుచేయుట నెఱింగినవాఁడై ఋత్విగ్యజమానులు చేయువానిలోని గుణదోషములను చూచువాఁడై (Spectator) యనుమోదించువాఁడై భరించువాఁడై యనుభవించువాఁడై నియామకుఁడై ఉత్కృష్టుఁడై పరమాత్మగానున్నవాఁడు.

రామా. ఈదేహమునందున్న పురుషుఁడు, (జీవుఁడు) దేహము ప్రవర్తించుటకు తగినసంకల్పము (కోరిక) మొదలగునవికలవాఁడగుటచే నుపద్రష్టయు, ననుమంతయు నగుచున్నాఁడు. దేహము ప్రవర్తించుటవలన కలిగినసుఖదుఃఖములకు భోక్త

యును నియామకత్వము మొదలగువానిచే, దేహము ఇంద్రియములు మనస్సు వీనికి మహేశ్వరుఁడు నగుచున్నాఁడు. ఆత్మశబ్దము దేహమనస్సులు అర్థమగుటచేత నీతండు పరమాత్మయగుచున్నాఁడు. పరుఁడయిన అనఁగా స్వభావమునుబట్టి పరిచ్ఛిన్నములుగాని జ్ఞానశక్తులుగల యీపురుషుఁడు, అనాదియగుయీగుణసంబంధమువలన ఈదేహమునకుమాత్రమే మహేశ్వరుఁడును, పరమాత్మయు నగుచున్నాఁడు.

మధ్వ. అనుమంతయనఁగా ననుసరించి విశేషముగా నిరూపించువాఁడు.

శ్లో. య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి న సభూయోఽభిజాయతే. 24

టీ. యః=ఎవ్వఁడు, ఏవం = ఈప్రకారముగా, పురుషం= క్షేత్రజ్ఞుని, గుణైస్సహ=వికారములతోఁగూడ, ప్రకృతించ= ప్రకృతిని, వేత్తి=ఎఱుంగుచున్నాఁడో, సః=వాఁడు, సర్వథా= సర్వప్రకారములచేత, వర్తమానోపి=ఉన్నవాఁడైనను, భూయః =తిరిగి, నాభిజాయతే=పుట్టఁడు.

శం. ఎవఁడు క్షేత్రజ్ఞుఁడైనపురుషుని తన్నుగాను క్షేత్రమను ప్రకృతిని అవిద్యను పైఁజెప్పిన ప్రకారము తెలిసికొనునో అట్టివాఁడు స్వభావముతో వర్తించినను వానికిఁబునర్జన్మము లేదు. ఈజన్మమున జ్ఞానముకలుగుటకుపూర్వము చేసినవియు, జ్ఞానము కలిగిన తర్వాత చేసినవియు, గడచిన యనేకజన్మములలోఁ జేసిపెట్టినవియునగు కర్మములన్నియును ఈజ్ఞానముచేతనే నశిం

చును. ఈజన్మమును కలుగఁజేసెడి కర్మములుమాత్రము తత్త్వజ్ఞానముకలిగిన పిమ్మటగూడ శరీరమును నిలువఁబెట్టును.

రామా. దేవమనుష్యాదిశరీరములతో మిక్కిలి దుఃఖపడుచున్నను వెండియు ప్రకృతితో సంబంధింపఁడు. అపరిమితమైన జ్ఞానముకలవాఁడును, పాపసంపర్కము లేనివాఁడునగు ఆత్మను ఈశరీరము పోయినతోడనె పొందుచున్నాఁడు.

మధ్వ. (అ 13-20 శ్లో)పురుషస్సుఖఃదుఖానామ్ అనుచోట జీవుఁడుమాత్రము చెప్పంబడెను. "పురుషంప్రకృతిం" అనునిచ్చట జీవేశ్వరులు చెప్పంబడుచున్నారు. జీవునకు విష్ణుప్రతిబింబమగుటవలన వచ్చినఐక్యముకలదు. నేను భగవంతునివాఁడనని యుపాసన చేయుట అహంగ్రహోపాసన మనఁబడును. నేను భగవంతునకు భృత్యుఁడను (దాసుఁడను), ప్రతిబింబమగుటచేత అతండే నేనని యుపాసనచేయునది. అతనితోడిసామ్యమే ప్రతిబింబ మనుట.

శ్లో. ధ్యానే నాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. 25

టీ. కేచిత్=కొందఱు, ధ్యానేన=ధ్యానముచేత,ఆత్మని=బుద్ధియందు, ఆత్మనా= మనస్సుచేత, ఆత్మానం = పరమాత్మను, పశ్యంతి = చూచుచున్నారు. అన్యే = మఱికొందఱు, సాంఖ్యేనయోగేన = జ్ఞానయోగముచేతను, అపరే = మఱికొందఱు, కర్మయోగేన = నిష్కామకర్మయోగముచేతను, ఆత్మానం=పరమాత్మను, పశ్యంతి=చూచుచున్నారు.

శం. కొందఱు ధ్యాననిష్ఠులైనమనస్సుచేఁ దమలో నంతర్గతమైనపరమాత్మను జూచుచున్నారు. కొందఱు జ్ఞానయోగముచేతను, మఱికొందఱు నిష్కామమైన కర్మయోగముచేతను బరమాత్మను జూచుచున్నారు.

మధ్వ. సాంఖ్యమనఁగా వేదమున చెప్పఁబడిన భగవంతుని స్వరూపమును గూర్చినజ్ఞానము. కర్మముల నాచరించువారు విని తెలిసికొని ధ్యానముచేసిచూతురు. వినువారు తెలిసికొని ధ్యానముచేసిచూతురు. సాంఖ్యులు ధ్యానముచేసి చూతురు.

శ్లో. అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరం త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. 26

టీ. అన్యేతు=మఱికొందఱు, ఏవం=ఈప్రకారముగా, అజానంతః=పరమాత్మనెఱుఁగనివారలై, అన్యేభ్యః=ఇతరులైనయాచార్యులవలన, శ్రుత్వా=విని, ఉపాసతే=ఉపాసనము చేయుచున్నారు, శ్రుతిపరాయణాః=వేదాంతశ్రవణపరులైన, తేఽపి=వారలును, మృత్యుం=మృత్యువును, అతితరంత్యేవ=అతిక్రమించుచునేయున్నారు.

శం. మఱికొందఱు పరమాత్మను పైఁజెప్పిన త్రోవలచేఁ దెలియనివారై గురువులవలన నుపదేశమునుబొంది ఉపాసన చేయుచున్నారు. వారును భక్తిశ్రద్ధలతో వేదాంతము వినువారు గనుక మరల జన్మములు లేనివారగుదురు.

రామా. ఆత్మావలోకమునకు సాధనములగు కర్మయోగాదులయం దధికారములేనివారు, జ్ఞానము కలవారలవలన విని కర్మయోగాదులచే నాత్మ నుపాసించువారును, ఆత్మదర్శన

ముచే మృత్యువును దాఁటుదురు. వీరుకాక శ్రవణమాత్రమున నిష్ఠకలవారలును పాపములుపోయి క్రమముగా యోగాదుల నాచరించి మృత్యువును దాఁటుదురు.

శ్లో. యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ. 27

టీ. హేభరతర్షభ= ఓయి అర్జునా! స్థావరజంగమం=స్థావరజంగమాత్మకమైన, కించిత్=స్వల్పమైన, సత్త్వం=వస్తువు, యావత్=ఎంతయైన, సంజాయతే=పుట్టుచున్నదో, తత్=ఆవస్తువు, క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ = ప్రకృతిపురుషసంసర్గమువలన కలిగినదని, విద్ధి= తెలియుము.

శం. ఓయర్జునా! లోకమున చరాచరవస్తువు లెన్నిసార్లు పుట్టుచున్నవో అంతమువఱకు క్షేత్రక్షేత్రజ్ఞులయిన ప్రకృతిపురుషులకు రజ్జుసర్పభ్రాంతివలె సంసర్గము గలిగియున్నదని యెఱుఁగుము.

రామా. క్షేత్రక్షేత్రజ్ఞులు రెండునుచేరియే పుట్టుచుంట గాని ఒక్కదానితో నొక్కటి విడియుండి పుట్టుట లేదనుట.

శ్లో. సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్,
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. 28

టీ. యః=ఎవ్వఁడు, సర్వేషు భూతేషు = సమస్త ప్రాణులయందు, సమం=సమముగా, తిష్ఠంతం= ఉన్నటువంటి, పరమేశ్వరం=పరమేశ్వరుని, తేషు=ఆప్రాణులు, వినశ్యత్సు=నశింపుచుండఁగా, అవినశ్యంతం=నశించకయున్నవానిగాను, పశ్యతి= చూచుచున్నాఁడో, సః=వాఁడు, పశ్యతి=చూచుచున్నాఁడు.

శం. మాయా రూపకమై నశించఁగల ప్రపంచ స్వరూప ములయందుఁ జేరినవాఁడై సమముగా నడచుకొను పరమేశ్వరుని శాశ్వతుఁడని యెవ్వ రెఱుఁగుచున్నారో యట్టివారే తెలిసిన వారని చెప్పఁబడుదురు. ఒకఁడైన యాత్మను ఎవ్వఁడు చూచుచున్నాఁడో వాఁడె తెలిసినవాఁడు. ఆత్మలనేకు లని చూచువారు చూచువారేకారు. అనఁగా తెలియనివారే యనుట.

రామా. దేవతలు మొదలుగ ఆకారభేదములులేక ఆ యా దేహేంద్రియ మనస్సులకు ఈశ్వరుఁడుగా నున్నవాఁడు పరమేశ్వరుఁడని ఆత్మను యథార్థముగాఁ దెలిసికొనువాఁడు సంసారవిముక్తుఁడగును. భేదబుద్ధి దలపెట్టెనేని అనఁగా దేవాద్యాకారములు ఆత్మకు కలవనియు ఆత్మకు పుట్టుకయు నాశంబును కలవనియు తెలిసికొనువాఁడు ఎల్లప్పుడు సంసారములోనే మునుఁగుచుం దేలుచుండునని భావము.

శ్లో. సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్,
నహి నస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్.

టీ. హి=ఏకారణమువలన, సర్వత్ర=సమస్తప్రాణులయందు, సమం=సమముగా, సమవస్థితం=ఉన్నట్టి, ఈశ్వరం=పరమేశ్వరుని, పశ్యన్=చూచుచున్నవాఁడు, ఆత్మనా=తనచేత, ఆత్మానం=పరమాత్మను, నహినస్తి=హింసజేసినవాఁడు కాఁడో, తతః=అందువలన, పరాం=ఉత్కృష్టమైన, గతిం=మోక్షమును, యాతి=పొందుచున్నాఁడు.

శం. అట్టివా రెల్లప్రాణులయందు నంతర్గతమయిన పరమాత్మయొకటియే యని యెఱిఁగినవారు గనుకఁ దమలో నంతర్గతమైన పరమాత్మను చింతిల్లఁజేయరు. అందువల్ల వారు ఉత్కృష్టమయిన మోక్షమును జెందుచున్నారు.

శం. అజ్ఞుఁడగువాఁడు ఆత్మకాని దైనశరీరమును ఆత్మగా గ్రహించి పుణ్యపాపములను చేసి దానిని చెడఁగొట్టి మరియొకక్రొత్త దానిని పరిగ్రహించి, దానినికూడ చెడఁగొట్టి మఱియొక్కదానిని గ్రహించును. ఇట్లు తన ఆత్మకానిదానిని పుణ్యపాపములచే నశింపఁజేయుచున్నాఁడుగాన ఆత్మనుచంపువాఁడు అగుచున్నాఁడు - పరమార్థమైన ఆత్మగూడ వీని యజ్ఞానముచేత చంపఁబడినట్లె యనుట.

రామా. దేవాది శరీరములయందు శేషిగాను, ఆధారముగాను, నియంతగాను నుండుటచేత ఈశ్వరుఁడు సమముగా తెలిసికొనువాఁ డగుటయనెడి యొక్కవిధమైన ఆకారము గలవానిగాను మనస్సుచేతరక్షించి అనఁగా నాత్మను సంసారమున నుండి విడిపించి, అంతట నొకవిధమైన ఆకారముఁగలవానిగా తెలిసికొని పొందదగినవాఁడగు స్వరూపముతోనున్న ఆత్మను, దేవాద్యాకారములు గలవానిగా తెలిసికొనువాఁడు, ఆత్మను చంపువాఁడే అనఁగా సంసారసముద్రమునఁ బడవేయుచున్నాఁడు.

శ్లో. ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి. 30

టీ. యః=ఎవ్వఁడు, కర్మాణి=కర్మములను, ప్రకృత్యైవ=మాయచేతనే, సర్వశః=సర్వప్రకారములుగా, క్రియమాణాని = చేయఁబడుచున్నవానినిగా, యదా=ఎప్పుడు, పశ్యతి = చూచుచున్నాఁడో, తదా=అప్పుడు, సః=వాఁడు, ఆత్మానం=క్షేత్రజ్ఞుని, అకర్తారం = ఉపాధిరహితునిగా, పశ్యతి=చూచుచున్నాఁడు.

శం. ఎల్లకర్మలు ప్రకృతిసంబంధమైన గుణములచేఁ జేయఁబడినవిగా నెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడు తనలోనంతర్గతమైన క్షేత్రజ్ఞుని నుపాధిరహితునిగా నెఱుఁగుచున్నాఁడు.

రామా. ప్రకృతిచేత చేయఁబడుచున్నవానిగా, జ్ఞానస్వరూపియగు ఆత్మనుకర్తకానివానిగాను, అతనికి ప్రకృతిసంబంధము దానితో చేరియుండుటయును, దానివలన వచ్చిన సుఖదుఃఖానుభవంబును కర్మరూపమైన జ్ఞానమువలన వచ్చినదేయని ఎవ్వఁ డెఱుంగునో వాఁడు ఆత్మను లెస్సగా నెఱుంగుచున్నాఁడు.

శ్లో. యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా. 31

టీ. యదా=ఎప్పుడు, భూతపృథగ్భావం=భూతభిన్నభావమును, ఏకస్థం=ఒకదానియందున్నదానినిగా, అనుపశ్యతి=చూచుచున్నాఁడో, యదా=ఎప్పుడు, తతఏవచ=ఆయాత్మవలననే, విస్తారం=ఉత్పత్తిని, అనుపశ్యతి=చూచుచున్నాఁడో, తదా=అప్పుడు, బ్రహ్మ=బ్రహ్మము, సంపద్యతే=అవుచున్నాఁడు.

శం. పృథగ్రూపములుగ నుండు నెల్లభూతములు నాత్మ యందున్నవిగాను ఆ యొక్కయాత్మవలననే యీయెల్లప్రపంచములు పుట్టినవిగాను నెవఁడు తెలిసికొనుచున్నాఁడో, యతఁడు పరబ్రహ్మస్వరూపుఁ డగుచున్నాఁడు.

రామా. ప్రకృతియును పురుషుఁడును చేరుటచే కలిగిన దేవమనుష్యాదులు, వారలయొక్క కురుచలును దీర్ఘములను అగుపృథగ్భావమును ఒక్కదానియందు అనఁగా ప్రకృతియందున్నదానిగా నెవఁడు తెలిసికొనుచున్నాఁడో, ఈదేవత్వాదులు ఆత్మయందున్నవి కావని యెవ్వఁ డెఱుంగుచున్నాఁడో, అతఁడు అపరిచ్ఛిన్నజ్ఞానైక స్వరూపమైన ఆత్మను పొందుచున్నాఁడు లేక బ్రహ్మమునే పొందుచున్నాఁ డనుట.

శ్లో. అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే. 32

టీ. హే కౌంతేయ=ఓయి అర్జునా! అనాదిత్వాత్=మొదలు లేకపోవుటవలనను, నిర్గుణత్వాత్=గుణములేకపోవుటవలనను, అవ్యయః=నాశరహితుండైన, అయం పరమాత్మా=ఈ పరమాత్మ, శరీరస్థోఽపి=శరీరమందున్నప్పటికిని, నకరోతి=(కర్మమును) చేయఁడు, నలిప్యతే=కర్మఫలములయందు నంటఁడు.

శం. ఓ యర్జునా! పరమాత్మ ఆదిలేనివాఁడై నాశరహితుఁడై గుణరహితుఁడైనవాఁడుగాన నట్టి పరమాత్మ దేహాంతర్గతమయ్యును, కర్మలుజేయువాఁడు కాఁడు. కర్మఫలము లనుభవించువాఁడును కాఁడు. కావుననే జ్ఞాననిష్ఠకలపరమహంసలకు

కర్మములయం దధికారమే లేదని పలుమాఱు చెప్పఁబడిన దనుట.

రామా. దేహమునకంటె వేఱుగానిశ్చయింపఁ బడినయాత్మయే పరమాత్మ, శరీరముననున్నవాఁడైనను క్షేత్రగాఁ గలుగువాఁడు కాకుండుట చేత వ్యయము (వికారము) లేనివాఁడు సత్త్వరజస్తమోగుణములు లేకపోవుటచేత కర్మములంజేయుటయును, దేహస్వభావము లీతని యంటుటయును లేదు.

శ్లో. యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే. 33

టీ. యథా=ఏప్రకారముగా, ఆకాశం=ఆకాశము, సర్వగతం=సర్వవ్యాపియైనప్పటికిని, సౌక్ష్మ్యాత్=సూక్ష్మమవుటవలన, నోపలిప్యతే=సంబంధించదో, తథా = ఆప్రకారముగా, ఆత్మా=క్షేత్రజ్ఞుఁడు, దేహే=శరీరమందు, సర్వత్ర=అంతటను, అవస్థితః=ఉన్నదైనప్పటికిని, నోపలిప్యతే=అంటఁబడదు.

శం. ఆకాశము సూక్ష్మరూపమగుటవలన నంతటవ్యాపించి నదయ్యు వస్తువుల నేలాగంటదో యావిధముగ క్షేత్రజ్ఞుఁడైన పురుషుఁడు క్షేత్రములైన దేహములయందున్నను గర్మలకు సంబంధపడినవాఁడు కాఁడు.

రామా. దేవమనుష్యాదిదేహములయం దంతటనున్నను, ఆయా దేహస్వభావములలో నంటఁడు.

శ్లో. యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. 34

టీ. హేభారత=ఓయి అర్జునా! యథా = ఏప్రకారము, ఏకః=ఒకఁడైన, రవిః=సూర్యుఁడు, కృత్స్నం=సమస్తమైన, ఇమంలోకం=ఈజగత్తును, ప్రకాశయతి=ప్రకాశింపఁజేయుచున్నాఁడో, తథా=ఆలాగుననే, క్షేత్రీ=క్షేత్రజ్ఞుఁడు, కృత్స్నం=సమస్తమైన, క్షేత్రం=శరీరమును, ప్రకాశయతి=ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

శం. ఓ యర్జునా! ఒకసూర్యుఁడు ఎల్లజగత్తులను నేవిధముగఁ బ్రకాశింపఁ జేయుచున్నాఁడో ఆవిధముగ క్షేత్రజ్ఞుఁడను పురుషుఁ డెల్లక్షేత్రములను దేహములను బ్రకాశింపఁజేయుచున్నాఁడు.

రామా. క్షేత్రజ్ఞుఁడు, ఇది తనక్షేత్రమనియు, ఇది ఇట్టిదనియు క్షేత్రమునంతను (శరీరమునంతను) వెలుపలను, లోపలనుగూడ తనజ్ఞానముచే ప్రకాశింపఁజేయును. ప్రకాశింపఁబడెడి లోకమునకంటె ప్రకాశింపఁజేసెడి సూర్యుఁడు ఎట్లు వేఱో, అట్లె తెలిసికొనువాఁడుగాన తెలియఁబడెడి క్షేత్రమునకంటె నాత్మ వేఱు అని భావము.

శ్లో. క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాంతి తే పరమ్. 35

టీ. ఏవం=ఈప్రకారము, క్షేత్రక్షేత్రజ్ఞయోః=ప్రకృతిపురుషులయొక్క, అంతరం=విలక్షణత్వమును, భూతప్రకృతిమోక్షం చ-భూత=భూతములయొక్కయు, ప్రకృతి = మాయయొక్కయు, మోక్షంచ=అభావగమనమును, జ్ఞానచక్షుషా=జ్ఞానదృ

ష్టిచేత, యే=ఎవరు, విదుః=ఎఱుంగుచున్నారో, తే=వారలు, పరం=పరబ్రహ్మమును, యాంతి=పొందుచున్నారు.

శం. ఎవరైతే పైఁజెప్పినరీతిగ క్షేత్రక్షేత్రజ్ఞుల భేదమును భూతముల ప్రకృతిని వృత్త్యపాయమును జ్ఞానదృష్టిచే నెఱుఁగుచున్నారో వారలు పరబ్రహ్మమును జెందుచున్నారు.

రామా. ఎవరైతే పైఁజెప్పినరీతిగా క్షేత్రజ్ఞుల భేదమును, భూతములకు కారణమైన అవ్యక్తమనెడి అవిద్యను, అదిలేక పోవుటను, ఎఱుంగుచున్నారో వారలు పరమార్థతత్త్వమైన బ్రహ్మమును పొందుదురు. అనఁగా తిరిగి దేహమును స్వీకరింపరు.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ
యోగోనామ త్రయోదశోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునులసంవాదాత్మకంబు
నైన శ్రీభగవద్గీతలయందు క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ
యోగమనెడి త్రయోదశాధ్యాయము.



శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## గుణత్రయవిభాగయోగః.



శ్రీభగవా నువాచ.—

శ్లో. పరంభూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్,
యజ్ఞ్జాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః.

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. జ్ఞానానాం=జ్ఞానములలోపల, ఉత్తమం=శ్రేష్ఠమయిన, పరం=ఉత్కృష్టమైన, జ్ఞానం = జ్ఞానమును, భూయః= మరల, ప్రవక్ష్యామి=చెప్పఁగలను, యత్ =ఏజ్ఞానము, జ్ఞాత్వా=ఎఱిం గి, సర్వేమునయః = సమస్తఋషులును, అతః = ఇంతకంటె, పరాం=ఉత్కృష్టమైన, సిద్ధిం=గతిని, గతాః=పొందిరో.

శం. జ్ఞానములలో మిక్కిలియుత్కృష్టమైన జ్ఞానమును మరల నీకుగాను చెప్పుచున్నాను. అట్టిజ్ఞానమువల్లనేకదా అనేక ఋషులు శ్రేష్ఠమయిన మోక్షమును పొందిరి.

శ్లో. ఇదంజ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః,
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ.

టీ. ఇదంజ్ఞానం=ఈజ్ఞానసాధనమును, ఉపాశ్రిత్య=పొంది, మమ = నాయొక్క, సాధర్మ్యం=స్వరూపమును, ఆగతాః = పొందినవారలై, సర్గేఽపి=సృష్టికాలమందును, నోపజాయంతే=పుట్టరు, ప్రళయే=ప్రళయకాలమందును, నవ్యథంతిచ= వ్యథను బొందరు.

శం. ఈ జ్ఞానమునుజెంది నాస్వరూపమును పొందినవారై బ్రహ్మసృష్టి కాలములలోఁగూడ జన్మములుపొందరు. బ్రహ్మ ప్రళయకాలము లోనును దుఃఖమును జెందరు.

రామా. ఈజ్ఞానమునుజెంది నాసామ్యమును జెందినవారు సృష్టికాలములో జన్మములు పొందరు. ప్రళయకాలములో నశింపరు.

శ్లో. మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మి న్గర్భం దధా మ్యహమ్,
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత. 3

టీ. హే భారత=ఓ యర్జునుఁడా! మహత్ = అధికమైన, మమ=నాయొక్క, బ్రహ్మ=ప్రకృతి, యోనిః=భూతసృష్టికారణము, తస్మిన్=ఆప్రకృతియందు, అహం=నేను, గర్భం=గర్భమును, దధామి=ఉంచుచున్నాను. తతః=దానివలన, సర్వభూతానాం=సమస్తప్రాణులయొక్క, సంభవః=ఉత్పత్తి, భవతి= అగుచున్నది.

శం. ఓ యర్జునా! పరబ్రహ్మమైన నాకు మాయ యనెడి త్రిగుణాత్మకమైన ప్రకృతి యనునది భూతసృష్టికారణముగా నున్నది. అట్టి ప్రకృతియందు నాయంశము లుంచినవెనుక నెల్ల భూతప్రపంచములు పుట్టుచున్నవి. క్షేత్రక్షేత్రజ్ఞులనెడి

రెండు ప్రకృతులును శక్తులుగాఁ గల ఈశ్వరుఁడనగు నేను అవిద్య (అజ్ఞానము) కామము కర్మము అనెడి యుపాధుల ననుసరించెడి క్షేత్రజ్ఞుని క్షేత్రముతోఁ గలుపుచున్నాను. సర్వభూతోత్పత్తి హిరణ్యగర్భునిద్వారమున కలుగునది. అన్ని భూతములపుట్టుక ఆబీజమునుంచుట వలన కలుగుచున్నది.

రామా. ఓయర్జునా! జగత్తున కంతటికి కారణమైన నాయచేతన ప్రకృతి మహత్తు, అహంకారము మొదలగు వికారములకు కారణమగుటచే మహద్బ్రహ్మమని చెప్పఁబడుచున్నది. చేతన ప్రకృతియైన జీవసముదాయమె గర్భము. నాసంకల్పము వలన కలిగిన ఆరెండు ప్రకృతుల సంయోగముననె బ్రహ్మాదిస్తంభపర్యంతమైన భూతములన్నియు పుట్టుచున్నవి.

మధ్వ. మహద్బ్రహ్మమనఁగా ప్రకృతి. అది శ్రీ, భూ, దుర్గలనెడి భేదముకలది. పార్వతి సరస్వతి మొదలగువారు దాని అంశముకల జీవులు.

శ్లో. సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సంభవంతి యాః,
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా. 4

టీ. హే కౌంతేయ = ఓ యర్జునుఁడా ! సర్వయోనిషు = సమస్తయోనులయందును, యామూర్తయః=ఏదేహసంస్థానలక్షణములు, సంభవంతి=పుట్టుచున్నవో, తాసాం= ఆదేహములకు, మహత్=అధికమైన, బ్రహ్మ=ప్రకృతి, యోనిః = తల్లి, అహం=నేను, బీజప్రదః= గర్భాధానకర్తయైన, పితా=తండ్రిని.

శం. అర్జునా! ప్రపంచమునబుట్టు నెల్ల చరాచరసమూహములకుఁ బ్రకృతి తల్లివంటిది. పరబ్రహ్మస్వరూపియైన నేను బీజము.

రామా. ఈశ్వరుఁడనైన నను,ప్రపంచమున బుట్టునెల్ల దేవాది శరీరములకు చేతనులను గూర్చుటకు ప్రకృతిని కారణముచేయుచున్నాను. వారివారికర్మానుసారముగా చేతనులను చేర్చువాఁడను నేనే.

శ్లో. సత్త్వం రజ స్తమఇతి గుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్. 5

టీ. హేమహాబాహో = ఓ యర్జునుఁడా! ప్రకృతిసంభవాః=భగవన్మాయవలన నుత్పత్తిగలిగిన, సత్త్వం=సత్త్వమును,రజః=రజస్సును, తమఇతి=తమము ననియెడి, గుణాః=గుణములు, అవ్యయం = నాశరహితుఁడైన, దేహినం=క్షేత్రజ్ఞుని, దేహే=దేహమందు, నిబధ్నంతి = అరిగట్టుచున్నవానివలె నున్నవి (స్వభావమువలన నాత్మను నాస్పదముగాఁ జేసికొని పొందుచున్నవి గనుక నరిగట్టుచున్నవని చెప్పఁబడెను).

శం. అర్జునా! ప్రకృతివల్లనే సత్త్వరజస్తమములనెడి గుణములు పుట్టినవి. ఆగుణములు ప్రకృతిసంబంధమైన దేహమందు చేరనివాఁడుగాను నశించినవాఁడుగానునుండెడి దేహిని బద్ధుని జేయువానివలె నున్నవి.

రామా. సత్త్వాదులు ప్రకృతియొక్క స్వరూపము నను సరించియుండెడి స్వభావ విశేషములు అవి ప్రకాశము మొదలగు కార్యములచే నిరూపింప శక్యములైనవి. అవి ప్రకృతి

యందుఁ దెలియబడక దాని వికారములయందు స్ఫుటముగాఁ దెలియఁబడును. స్వయముగా నాగుణసంబంధికాఁదగనివాఁడైన దేహిని దేహమునందుంచుచున్న వనుట.

మధ్వ. సాధనాచరణార్థై క్షేత్రజ్ఞుని బంధించెడి ప్రకారము చూపఁబడుచున్న దనుట.

శ్లో. తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ. 6

టీ. హే అనఘ = ఓయి పాపరహితుఁడవైన యర్జునా! తత్ర = ఆ సత్త్వరజస్తమోగుణములలోపల, నిర్మలత్వాత్ = స్వచ్ఛమౌటవలన, ప్రకాశకం = స్ఫటికమణివలె ప్రకాశింపఁ జేయునట్టి, అనామయం=ఉపద్రవరహితమైన, సత్త్వం=సత్త్వ గుణము, సుఖసంగేన=సుఖసంగముతోడను, జ్ఞానసంగేన= అంతఃకరణధర్మముతోడను, బధ్నాతి= దేహినికూర్చుదానివలె నున్నది.

శం. ఓ యర్జునా! ఆమూడుగుణములలో సత్త్వగుణము స్వచ్ఛమైనది, నిర్మలముగఁ బ్రకాశించునది,ఉపద్రవరహితమైనది. ఆగుణము క్షేత్రజ్ఞుని సుఖముతోను జ్ఞానముతోను జేర్చుచున్నది.

రామా. ఈసత్త్వము పురుషునకు జ్ఞానసంగమును, సుఖసంగమును కలుగఁజేయును. వానియందు సంగము కలిగినతోడనే వానిసాధనములగు లౌకిక వైదికకర్మలయందు ప్రవర్తించును. అటుపైని ఆకర్మఫలముల ననుభవింపఁదగిన యో

నులయందు పుట్టుచుండును. ఇదియె సత్త్వము బంధము కలుగఁజేయు విధము.

శ్లో. రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్,
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్. 7

టీ. హేకౌంతేయ=ఓయిఅర్జునా! తృష్ణాసంగసముద్భవం-తృష్ణా = రానివస్తువును గోరుటవలనను, సంగ = ప్రాప్తములైనవిషయములయందు, మనః=ప్రీతిగలిగియుండుటవలనను, సముద్భవం=ఈరెంటివలనఁబుట్టిన, రజః=రజోగుణమును, రాగాత్మకం=అనురంజనస్వరూపమైనదానినిగా, విద్ధి=తెలియుము, తత్=ఆరజోగుణము, దేహినం=దేహిని, కర్మసంగేన=కర్మాసక్తిచేత, నిబధ్నాతి=కట్టుచున్నది.

శం. ఓకౌంతేయ! రజోగుణము కోరికల స్వరూపమై ప్రాప్తమైన విషయములయం దభిమానము పుట్టించుచున్నది. అది దేహిని కర్మాసక్తితో బద్ధుని జేయుచున్నది.

రామా. ఓకౌంతేయ! రజోగుణము స్త్రీపురుషుల కన్యోన్య ముండెడి ప్రీతికిహేతువై, శబ్దాదివిషయము లన్నింటి యందు స్పృహఁగల్పించి, పుత్త్రుఁడు, మిత్త్రుఁడు మొదలగు సంబంధులతో కలియగోరుటను కలిగించు చున్నది. ఈరజోగుణము కర్మాసక్తతఁ గలిగించును - కర్మములనాచరింపఁజేసి వానిఫలముల ననుభవించుటకై జన్మముల నెత్తించును.

శ్లో. తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. 8

టీ. హేభారత = ఓయర్జునా ! సర్వదేహినాం=సమస్తప్రాణులకును, మోహనం=మోహకరమైన, తమస్తు=తమోగుణము నైతే, అజ్ఞానజం=అజ్ఞానమువలనఁ బుట్టినదానినిగా, విద్ధి=తెలియుము, తత్=ఆతమోగుణము, ప్రమాదాలస్యనిద్రాభిః=ప్రమాదాలస్యనిద్రలచేత, నిబధ్నాతి=కట్టుచున్నది.

శం. ఓయర్జునా ! తమోగుణము అజ్ఞానమువలన బుట్టినది. అదియెల్లప్రాణులను మోహింపఁజేయుచున్నది. ఆగుణము దేహిని ఆలస్యముతోను నిద్రతోను అజాగ్రత్తతోను బద్ధుని జేయుచున్నది.

రామా. తమస్సు విపరీతజ్ఞానమువల్ల బుట్టినది. విపరీతజ్ఞానమునకు కారణము మోహనము. తమోగుణము మూడుగుణములచేత కట్టుబడుచున్నది. అందు 1. ప్రమాదము. అనఁగా పురుషుని తానుచేయంబూనిన పనిని తప్పించి మఱియొక్క పనియందు ప్రవర్తించునట్లు చేసెడి అనవధానము (గుఱిలేకపోవుట) 2. ఆలస్యము అనఁగా స్తబ్ధత్వము-పనులు చేయలేకపోవుట-3. నిద్ర - పురుషుఁడు ఇంద్రియములను ప్రవర్తింప చేయుటచేత అలయిక కలిగి అన్నియింద్రియముల పనులుడుగుట.

శ్లో. సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత,
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత. 9

టీ. హే భారత=ఓయియర్జునా! సత్త్వం=సత్త్వగుణము, సుఖే=సుఖమందు, సంజయతి=కూర్చుచున్నది, రజః=రజోగుణము, కర్మణి=కర్మమందు, సంజయతి=కూర్చుచున్నది, తమః=తమోగుణము, జ్ఞానం=జ్ఞానమును, ఆవృత్య=కప్పి, ప్రమాదే=

మరచియుండుటయందు, సంజయతి=కూర్చుచున్నది, ఉత=ఆశ్చర్యము.

శం. ఓ యర్జునా! సాత్త్వికము సుఖమందు వర్తింపఁజేయునది. రజోగుణము కర్మయందు వర్తింపఁజేయునది. తమోగుణము జ్ఞానమును దాచి ప్రమాదకార్యములయందు వర్తింపఁజేయునది. ఇచ్చటశంకరులు జ్ఞానమనఁగా సత్త్వగుణమువలనఁ గలిగెడి వివేకము.

రామా. జ్ఞానమనఁగా వస్తువుయొక్క యథార్థస్థితిని తెలిసికొనుట.

శ్లో. రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత,
రజ స్సత్త్వం తమ శ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా. 10

టీ. హేభారత=ఓయర్జునా! రజశ్చ=రజస్సును, తమశ్చ=తమస్సును, అభిభూయ=తిరస్కరించి, సత్త్వం=సత్త్వగుణము, భవతి=కలుగుచున్నది, రజః=రజస్సును, సత్త్వం= సత్త్వమును, అభిభూయ=తిరస్కరించి, తమశ్చ=తమోగుణము, భవతి=కలుగుచున్నది, తథా=ఆలాగుననే, తమః=తమస్సును, సత్త్వం=సత్త్వమును, అభిభూయ = తిరస్కరించి, రజః=రజోగుణము, భవతి=కలుగుచున్నది.

శం. ఓ యర్జునా! సత్త్వగుణమైనది రజస్తమోగుణములను దిరస్కరించిన నది కదలనిదిగానుండును, రజోగుణమైనది యితరమైన రెంటిని దిరస్కరించిన నది నిలుచును, తమోగుణమితరమైనవానిని దిరస్కరించిన నది గట్టిగానిలుచును.

రామా. సత్త్వాదిగుణములు మూఁడును ప్రకృతితోఁగలసి యున్న యాత్మస్వరూపము ననుసరించియున్నను, ప్రాచీన కర్మ వశమునను, ఆహారభేదముంబట్టియు నొక్కొక్కప్పుడు ఒక్కొక్క గుణము ద్రేకించి మిగిలిన గుణముల నణఁగఁదొ్రక్కు చుండును.

శ్లో. సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమి త్యుత. 11

టీ. హేకౌంతేయ=ఓయర్జునా! అస్మిన్=ఈభోగస్థానమైన, దేహే=శరీరమందు, సర్వద్వారేషు=శ్రోత్రాదిసకలద్వారములయందు, యదా=ఎప్పుడు, జ్ఞానం=జ్ఞానస్వరూపమైన, ప్రకాశః=తెలివి, ఉపజాయతే=పుట్టుచున్నదో=, తదా=అప్పుడు, సుఖాదిచిహ్నములవలన, సత్త్వం=సత్త్వగుణము, వివృద్ధమితి=వృద్ధిఁబొందినదని, విద్యాత్=తెలియవలయును.

శం. ఎపుడు శరీరమందు శరీరద్వారములైన జ్ఞానేంద్రియములమూలముగా జ్ఞానస్వరూపమైన తెలివి పుట్టుచున్నదో అపుడు సత్త్వగుణము హెచ్చినదని యెఱుఁగుము.

రామా. ఎప్పుడు వస్తువు యథార్థస్థితిని ప్రకాశింపఁజేయునట్టి విషయమైన జ్ఞానము, చక్షుస్సు మొదలగు నన్నిజ్ఞానద్వారములయందును పుట్టుచున్నదో అప్పుడు సత్త్వగుణము హెచ్చినదని యెఱుంగుము.

శ్లో. లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమ స్స్పృహా,
రజ స్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ. 12

టీ. హే భరతర్షభ=ఓయి అర్జునా! రజసి=రజోగుణము, వివృద్ధేసతి=వృద్ధిఁబొందుచుండఁగా, [1]లోభః = పరద్రవ్యాది కాంక్షయు, [2]ప్రవృత్తిః=సామాన్యచేష్టయు, [3]కర్మణాం=కర్మములయొక్క, ఆరంభః=ఆరంభమును, [4]అశమః=శమము లేకపోవుటయు, [5]స్పృహా=ఇచ్ఛయు, ఏతాని = ఈచిహ్నములు, జాయంతే=పుట్టుచున్నవి.

శం. ఓ యర్జునా! ఎప్పు డీశరీరమందు ధనాపేక్షయు, సామాన్యచేష్టయు, కర్మాసక్తియు, ఇంద్రియనిగ్రహము లేకపోవుటయు, కోరికయు పుట్టుచున్నవో, అపుడు రజోగుణము హెచ్చెనదని యెఱుఁగుము.

శ్లో. అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ,
తమ స్యేతాని జాయంతే వివృద్ధే కురునందన. 13

టీ. హే కురునందన=ఓ యర్జునా! అప్రకాశః=వివేకము లేకపోవుటయు, అప్రవృత్తిశ్చ = పనిపాటులందుఁ బ్రవర్తింపమియు, ప్రమాదః=జాడ్యమును, మోహః = మోహమును,

---

1 లోభము = { శం. ఇతరుల సొమ్మును పొందఁగోరుట.
రామా. తనసొమ్మును విడువలేక పోవుట. }

2 ప్రవృత్తిః = { శం. సామాన్యచేష్ట.
రామా. ప్రయోజనము నుద్దేశింపకయే ప్రవర్తించుట. }

3 కర్మలు = రామా. ఫలముల నిచ్చునట్టి కర్మలు.

4 అశమః = { శం. శమము లేకపోవుట.
రామా. ఇంద్రియములు రమింపకపోవుట. }

5 స్పృహా = { శం. ఇచ్ఛ.
రామా. విషయములను గోరుట. }

ఏతాని=ఈలక్షణములు, తమసి=తమోగుణము, వివృద్ధే సతి=వృద్ధిఁబొందఁగా, జాయంతే=పుట్టుచున్నవి.

శం. ఓ యర్జునా! ఎపుడీశరీరమందజ్ఞానము, జబ్బుతనము వ్యవధిలేకపోవుట, మోహము, ఇవి పుట్టుచున్నవో, అపుడు తమోగుణము హెచ్చైనదని తెలియుము.

రామా. మోహము ఒకవస్తువు మఱియొకవస్తువుగా తలచుట.

శ్లో. యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. 14

టీ. దేహభృత్=శరీరి, సత్త్వే=సత్త్వగుణము, ప్రవృద్ధే తు=వృద్ధిఁబొందుచుండఁగా, యదా=ఎప్పుడు, ప్రళయం=మరణమును, యాతి= పొందుచున్నాఁడో, తదా=అప్పుడు, అమలాన్=స్వచ్ఛములైన, ఉత్తమవిదాం=బ్రహ్మవేత్తలయొక్క, లోకాన్=లోకములను, ప్రతిపద్యతే=పొందుచున్నాఁడు.

శం. దేహికి సాత్త్వికము హెచ్చైనదశలో మరణముకలిగెనేని యపుడు స్వచ్ఛమైన బ్రహ్మాదిలోకములను జెందుచున్నాఁడు.

రామా. దేహికిసాత్త్వికము హెచ్చైనదశలో మరణము కలిగెనేని అపుడు ఆత్మజ్ఞులవంశమునఁ బుట్టి ఆత్మజ్ఞానమును కలుగఁజేయు పుణ్యకర్మములఁ జేయును.

శ్లో. రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 15

టీ. రజసి=రజోగుణము, ప్రవృద్ధేసతి = వృద్ధిఁబొందుచుండఁగా, ప్రళయం=మరణమును, గత్వా=పొంది, కర్మసంగిషు=మనుష్యులయందు, జాయతే=పుట్టుచున్నాఁడు, తథా=ఆలాగే, తమసి=తమోగుణము, (ప్రవృద్ధేసతి = వృద్ధిఁబొందుచుండఁగా), ప్రలీనః=మృతుఁడైనవాఁడు, మూఢయోనిషు=శ్వసూకరాదియోనులయందు, జాయతే=పుట్టుచున్నాఁడు.

శం. రజోగుణము హెచ్చైనస్థితిలోఁ జావు సంప్రాప్తమాయెనేని కర్మాసక్తిగల మర్త్యలోకమందుఁ బుట్టుచున్నాఁడు. తమోగుణము హెచ్చైనస్థితిలో మృత్యువు సంభవించెనేని శునకవరాహాది నికృష్టజన్మముల నెత్తుచున్నాఁడు.

రామా. రజోగుణము హెచ్చైనస్థితిలోఁ జావుసంభవించెనేని ఫలములనుకోరి కర్మములను చేయువారలలోఁబుట్టి స్వర్గాదులకొఱకు కర్మముల నాచరించును. తమోగుణము హెచ్చైన స్థితిలో చచ్చెనా శునకవరాహాది నికృష్టజన్మముల నెత్తి ఏపురుషార్థమైనను సంపాదించుకొనుటకు తగనివాఁడగును.

శ్లో. కర్మణ స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్,
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్.   16

టీ. శిష్టాః=పెద్దలు, సుకృతస్య=సత్త్వగుణమువలనఁబుట్టిన, కర్మణః=కర్మమునకు, సాత్త్వికం=సత్త్వప్రధానమైన, నిర్మలం=ప్రకాశబహుళమైన, ఫలం=ఫలమును, ఆహుః=చెప్పుదురు. రజసస్తు=రజోగుణకర్మమునకు, ఫలం=ఫలమును, దుఃఖం=దుఃఖకరమైనదానినిగా, ఆహుః=చెప్పుదురు. తథా=ఆలాగు

న నే, తమసః=తామసకర్మమునకు, ఫలం=ఫలమును, అజ్ఞానం =అజ్ఞానమునుగా, ఆహుః=చెప్పుదురు.

శం. సాత్త్వికముచే జనించినకర్మకుఁ దేజముతోఁగూడిన జ్ఞానము ఫలమనియు రజోగుణముచేఁ బుట్టినకర్మకు దుఃఖప్రాప్తిఫలమనియు తమోగుణముచే జనించినకర్మకు నజ్ఞానముఫలమనియు చెప్పుచున్నారు.

రామా. సాత్త్వికముచే జనించినకర్మ యధికసత్త్వమువలనఁగలిగినదై దుఃఖసంపర్కములేనిదై యుండును. రజోగుణముచేఁ బుట్టినకర్మసాంసారికదుఃఖములు విస్తారముకలదై యుండును. అంత్యకాలమున వృద్ధిపొందిన తమస్సునకు ఫలము అజ్ఞానపరంపరయే.

శ్లో. సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ. 17

టీ. సత్త్వాత్=సత్త్వగుణమువలన, జ్ఞానం=జ్ఞానము, సంజాయతే=పుట్టుచున్నది, రజసః=రజోగుణమువలన, లోభఏవ=లోభమే, సంజాయతే=పుట్టుచున్నది, తమసః=తమోగుణమువలన, ప్రమాదమోహౌ=ప్రమాదమోహములు, భవతః=పుట్టుచున్నవి, అజ్ఞానంచ=అజ్ఞానమును పుట్టుచున్నది.

శం. సాత్త్వికమువలన జ్ఞానమును, రజోగుణముచే లోభమును జనించుచున్నవి. తమోగుణముచే అజాగ్రత్త, అజ్ఞానము కలుగుచున్నవి.

రామా. పరంపరచేఁ గలిగినసత్త్వమువలన ఆత్మస్వరూపాపరోక్షమనెడి జ్ఞానముకలుగుచున్నది. రజస్సువలన స్వర్గా

ఫలములయందు లోభముకలుగును. తమోగుణమువలన చెడ్డ కార్యములయందు ప్రవర్తించుట కలుగును. దానివలన విపరీత జ్ఞానము కలుగును. దానివలన జ్ఞానము లేకపోవుట కలుగును.

శ్లో. ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యేతిష్ఠంతి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః. 18

టీ. సత్త్వస్థాః=సాత్త్వికులు, ఊర్ధ్వం=దేవాదిలోకములను, గచ్ఛంతి=పొందుచున్నారు, రాజసాః = రజోగుణవృత్తి గలవారలు, మధ్యే=మనుష్యలోకమందు, తిష్ఠంతి = ఉంచున్నారు, జఘన్యగుణవృత్తిస్థాః = నికృష్టగుణవృత్తియందున్న, తామసాః=తమోగుణముగలవారలు, అధః=పశ్వాదియోనులయందు, గచ్ఛంతి=జన్మమును బొందుచున్నారు.

శం. సాత్త్వికులు దేవాదిలోకములను జెందుచున్నారు. రజోగుణము గలవారు మానుషలోకమందు మనుజులుగా జన్మించుచున్నారు. నికృష్టవ్యాపారమందున్న తమోగుణస్థులు పశ్వాదిజన్మములను నరకములను జెందుచున్నారు.

రామా. సాత్త్వికులు సంసారబంధమునుండి తప్పిపోవుచున్నారు. రాజసులు ఫలసాధనములగు కర్మములం జేయుచు వానిఫలము ననుభవింపుచు వెండియు పుట్టుచు కర్మములం జేయుచుందురుగాన మధ్యముననుందురు. ఇది పునరావృత్తి రూపమగుటచేత దుఃఖప్రాయమె. తామసులు ఉత్తరోత్తర నికృష్టరూపము లగుచండాల, తిర్యక్, క్రిమికీటక, స్థావర, లతాదిజన్మములనెత్తి, రాయి, కఱ్ఱ, గడ్డి మొదలగునవియగుటకు పొందుదురు.

శ్లో. నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. 19

టీ. యదా=ఎప్పుడు, ద్రష్టా=తెలిసినవాఁడు, గుణేభ్యః=విషయములకంటె, అన్యం=ఇతరమును, కర్తారం=కర్తనుగా, నానుపశ్యతి=చూడఁడో,(ఇదియునుంగాక,)గుణేభ్యః=గుణములకంటె, పరం=వ్యతిరిక్తుఁడైన, (గుణవ్యాపారసాక్షిభూతుని), వేత్తి=తెలియుచున్నాఁడో, అప్పుడు, సః=వాఁడు, మద్భావం=నాస్వరూపమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

శం. ఎవఁడు గుణములే కర్తలనియు, తాను సాక్షికారణమనియు నెఱుఁగుచున్నాఁడో వాఁడు నాస్వరూపమును జెందుచున్నాఁడు.

రామా. స్వయముగా పరిశుద్ధమైన యాత్మకు అనేకవిధములగుకర్మములంగూర్చిన కర్తృత్వము పరంపరకర్మముల మూలముగావచ్చిన గుణసంపర్కము నిమిత్తముగాఁ గలదియనియు ఆత్మస్వయముగాఁ గర్తకాఁడనియు, పరిచ్ఛిన్నముకాని జ్ఞానమె స్వరూపముగాఁ గలవాఁడనియు, ఈరీతిగా నాత్మ నెప్పుడు చూచునో అప్పుడు నావంటివాఁ డగును.

శ్లో. గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే. 20

టీ. దేహీ=శరీరముగలవాఁడు, దేహసముద్భవాన్=దేహమువలనఁబుట్టిన, త్రీన్=మూఁడైన, ఏతాన్ గుణాన్=ఈగుణ

ములను, అతీత్య=అతిక్రమించి, జన్మమృత్యుజరాదుఃఖైః=జన్మ మృత్యుజరాదుఃఖములచేత, విముక్తస్సన్=విడువఁబడినవాఁడై, అమృతం=మోక్షమును, అశ్నుతే=పొందుచున్నాఁడు.

శం. ఎవఁడు దేహోత్పత్తికారణములైన యీ మూఁడు గుణములను దాఁటిపోవుచున్నాఁడో వాఁడు జన్మమృత్యుజరా దుఃఖములచే విడువఁబడినవాఁడై మోక్షమును జెందుచున్నాఁడు.

రామా. దేహాకారముగాఁ బరిణమించినప్రకృతివలనఁ బుట్టినసత్త్వాదిగుణముల నతిక్రమించి జ్ఞానైకస్వరూపుఁ డగునాత్మను జూచుచున్నవాఁడై జన్మాదులచే విడువఁబడినవాఁడై అమృతుని అనఁగా నాత్మను పొందుచున్నాఁడు - ఇదియె మద్భావము. అనఁగా నావంటివాఁ డగుట యనితాత్పర్యము.

అర్జున ఉవాచ :—

శ్లో. కైర్లింగైస్త్రీన్ గుణా నేతా నతీతో భవతి ప్రభో,
కి మాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతివర్తతే. 21

అర్జునుఁడు పృచ్ఛచేయుచున్నాఁడు.—

టీ. హేప్రభో=ఓస్వామీ! కైర్లింగైః=ఏచిహ్నములచేత, త్రీన్=మూఁడైన, ఏతాన్ గుణాన్= ఈగుణములను, అతీతః= అతిక్రమించినవాఁడు, భవతి = అవుచున్నాఁడు, కిమాచారః= వాఁ డెట్టి యాచారము గలవాఁడు, కథం=ఎట్లు, త్రీనేతాన్ గుణాన్ = ఈ మూఁడుగుణములను, అతివర్తతే=అతిక్రమించుచున్నాఁడు.

శం. ఓకృష్ణా ! ఈత్రిగుణములను నతిక్రమించినవానికి నే మిగులుతు లుండును? వానియాచార మెట్టిది? అతిక్రమించు టకు మార్గమెట్టిది?

శ్రీభగవానువాచ:—

శ్లో. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాండవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి. 22

శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.—

టీ. హేపాండవ = ఓయి అర్జునా ! (త్రిగుణాతీతుఁ డైన వాఁడు) సంప్రవృత్తాని = సంప్రాప్తములైన, ప్రకాశంచ=సత్త్వ గుణకార్యమును, ప్రవృత్తించ=రజోగుణకార్యమును, మోహ మేవచ=తమోగుణకార్యమును, న ద్వేష్టి= ద్వేషింపఁడు, నివృ త్తానిచ=పోయినసత్త్వాదికార్యములను, న కాంక్షతి=కోరఁడు.

శం. ఓయర్జునా ! త్రిగుణాతీతుఁడు ప్రకృతివల్ల జనించిన సత్త్వగుణ సంప్రాప్తమైన జ్ఞాననిష్ఠ గలిగినప్పటికిని రజోగుణ సంప్రాప్తమైన లోభకార్యము కలిగినను తమోగుణసంప్రాప్త మైన యజ్ఞానకార్యము జరిగినను ద్వేషింపఁడు. అయావను లాయాగుణములయం దణఁగి నివృత్తియైనపుడు వాని నిచ్ఛ యింపఁడు.

రామా. ఆత్మకంటె నితరము లగు ననిష్టవస్తువుల యందు సత్త్వాది కార్యములగు ప్రకాశాదులు ప్రవర్తించినను త్రిగుణా తీతుఁడు ద్వేషింపఁడు; వ్యతిరిక్తములగు నిష్టవస్తువుల యందు ఆత్మ ప్రవర్తింపక పోయినను కోరఁడు.

శ్లో. ఉదాసీనవ దాసీనో గుణైర్యో న విచాల్యతే,
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. 23

టీ. ఉదాసీనవత్ = పక్షపాతము లేనివానివలె, ఆసీనః= ఉన్న, యః=ఎవ్వఁడు, గుణైః=గుణములచేత, నవిచాల్యతే= చలింపఁ బడఁడో, గుణాః=గుణములు, వర్తంతఇత్యేవ=వర్తింపుచున్నవని, యః = ఎవ్వఁడు, అవతిష్ఠతి=ఉన్నాఁడో, నేంగతే=చలించఁడో-వాఁడని యుత్తర శ్లోకముతో సంబంధము.

శం. త్రిగుణాతీతుఁడు గుణములయందును గుణకార్యముల యందును లక్ష్యము లేనివాఁడై యుదాసీనుఁడుగా నుండును. జరిగెడి యెల్లపనులు గుణవ్యాపారములని యెఱిఁగి చలించక యుండును.

రామా. త్రిగుణాతీతుఁడు గుణములనుకాక ఆత్మను చూచుటయందె తృప్తిని పొందియుండుటచేత మిగిలిన వానియందుదాసీనుఁడై యుండును. గుణములచేత ద్వేషమును కోరికయును కలుగునని తెలిసి వానిచేత చలింపఁబడఁడు. గుణములు వానికార్యము లగు ప్రకాశాదులయందు ప్రవర్తించుచున్నవి అని యుండి, వానికార్యములయందు ప్రవర్తింపక యుండునని భావము.

శ్లో. సమదుఃఖసుఖః స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః,
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః. 24

టీ. సమదుఃఖసుఖః = సుఖదుఃఖములయందు సముఁడును, స్వస్థః = ఆత్మావలోకనపరుఁడును, సమలోష్టాశ్మకాంచనః =

రాతిని మట్టిగడ్డను బంగారును సమముగాఁ జూచువాఁడును, తుల్యప్రియాప్రియః = ప్రియాప్రియములయందు సముఁడును, ధీరః = ధైర్యము గలవాఁడును.

శం. అతఁడు సుఖదుఃఖములను సమానముగఁ జూచుచు నాత్మావలోకనము చేయుచు మృత్పిండమును పాషాణమును బంగారమును సరిగాఁజూచుచు నిష్టులయందును ననిష్టులయందును సమదృష్టి యుంచును, ధైర్యముగలవాఁడగును నిందాస్తుతులయందు సమానుఁడుగా నుండును.

రామా. త్రిగుణాతీతుఁడు దుఃఖమునందును, సుఖమునందును సమమైనచిత్తముకలవాఁడు. తనయందుండి తనయాత్మమాత్రమె యిష్టుఁడుగాఁ గలవాఁడై పుత్త్రాదులు పుట్టినను చచ్చినను ఖేదమోద రహితుఁడై, ప్రకృతిని యాత్మను ఏర్పఱచుటలో నేర్పరియై నిందాస్తుతుల యందు సమానుఁడై యుండును.

శ్లో. మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే. 25

టీ. మానావమానయోః = మానావమానములయందు, తుల్యః=సముఁడును, మిత్రారిపక్షయోః= శత్రుమిత్రపక్షములయందు, తుల్యః=సముఁడును,సర్వారంభపరిత్యాగీ=సమస్తకార్యారంభములను విడిచినవాఁడును,యః=ఎవ్వఁడో,సః=వాఁడు, గుణాతీతః=గుణాతీతుఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

శం. మానావమానములయందు సమదృష్టిగలవాఁడును, శత్రుమిత్రులయందు సమమైన మనస్సు గలవాఁడును, అన్ని పనులను పరిత్యజించినవాఁడును త్రిగుణాతీతుఁడని చెప్పఁబడును.

రామా. తనకు (ఆత్మకు) మనుష్యత్వాదులతో సంబంధము లేదని తలంచుటచే ఆమనుష్యత్వాదులను పట్టినవేయైన నిందాస్తుతి, మానావమాన శత్రుమిత్రపక్షముల యందు సమమైన చిత్తముఁ గలవాఁడై దేహియగుటచేత వచ్చినయారంభముల నన్నిటిని విడుచువాఁ డెవఁడో వాఁడు గుణాతీతుఁ డనఁబడును.

శ్లో. మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

టీ. యః=ఎవఁడు, మాం=నన్ను, అవ్యభిచారేణ=నిశ్చలమైన, భక్తియోగేన=భక్తియోగముచేత, సేవతే=సేవించుచున్నాఁడో, సః=వాఁడు, ఏతాన్‌గుణాన్ = ఈగుణములను, సమతీత్య=అతిక్రమించి, బ్రహ్మభూయాయ=బ్రహ్మభావముకొఱకు, కల్పతే=సమర్థుఁడగుచున్నాఁడు.

శం. ఎవఁడు చలింపనిభక్తియోగముచే నన్నుఁగొలుచుచున్నాఁడో వాఁడు త్రిగుణాతీతుఁడై బ్రహ్మభావముకొఱకు సమర్థుఁ డగుచున్నాఁడు.

రామా. స్వయముగా నతిక్రమించుటకు శక్యముకాని గుణములన్నిటిని నతిక్రమించి, నన్ను భజించువాఁడె బ్రహ్మభావ

మునకుఁ దగినవాఁడు. అనఁగా స్వస్వరూపముననున్న ఆత్మను పొందువాఁడగుచున్నాఁడు.

శ్లో. బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాంతికస్య చ. 27

టీ. అహం=నేను, అమృతస్య=నాశరహితుఁడును, అవ్యయస్య=నిర్వికారుఁడునగు, బ్రహ్మణః=పరమాత్మకును, శాశ్వతస్య=నిత్యమైన, ధర్మస్యచ = ధర్మజ్ఞానమునకును, ఐకాన్తికస్య=అవ్యభిచారియగు, సుఖస్య = ఆనందమునకును, ప్రతిష్ఠాహి=ఆధారమైనవాఁడనుకదా.

శం. నేను నాశము లేనిదియు,వికారరహితమైన పరబ్రహ్మకును, నిత్యమైన ధర్మమునకును, చలనములేని మోక్షమునకును ఆశ్రయమైన వాఁడనుకదా. బ్రహ్మమనఁగా పరమాత్మ. నేను అనుటచేత ప్రత్యగాత్మద్యోతనము. ఈప్రత్యగాత్మ దేనియందుండునో అది ప్రతిష్ఠ. ప్రత్యగాత్మయె మంచిజ్ఞానముచేత పరమాత్మగా నిశ్చయింపఁబడును గాన పరమాత్మకు ప్రతిష్ఠ అనఁగా ఆశ్రయమైనది. ఏ యీశ్వరశక్తిచేత భక్తానుగ్రహము మొదలగువాని కొఱకు బ్రహ్మము ప్రవర్తింపుచున్నదో అశక్తినైననేను బ్రహ్మమే యనుట.

రామా. బ్రహ్మమనఁగా ప్రత్యగాత్మస్వరూపము. నేను అమృతుఁడును అవ్యయుఁడునైన ప్రత్యగాత్మస్వరూపమునకు ఆశ్రయుఁడను మిక్కిలి యతిశయము గలిగిన నిత్యమైన యైశ్వర్యమునకును, జ్ఞాని పొందవలసిన యానందమునకును ఆశ్రయమైనవాఁడును, అనఁగా భగవంతునింగూర్చిన ప్రపత్తివలన

భక్తుఁడు త్రిగుణాతీతుఁడై బ్రహ్మభావమును పొందును అనఁగా భగవంతునివంటివాఁ డగుననుట.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే
గుణత్రయవిభాగయోగోనామ
చతుర్దశోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునుల సంవాదాత్మకంబు నైన
శ్రీభగవద్గీతలయందు గుణత్రయవిభాగయోగ
మనెడి చతుర్దశాధ్యాయము.

—

శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## పురుషో త్తమప్రా ప్తియోగః.



శ్రీ భగవా నువాచ: —

శ్లో. ఊర్ధ్వమూలమధ శ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్. 1

శ్రీ కృష్ణమూ ర్తి చెప్పుచున్నాఁడు. —

టీ. ఊర్ధ్వమూలం-ఊర్ధ్వ=బ్రహ్మము, మూలం=మూలముగాఁ గలిగినట్టియు, అధశ్శాఖం - అధః=మహదహంకారములు, శాఖం=శాఖలుగాఁ గలిగినట్టియు, అశ్వత్థం-'నశ్వోపి స్థాస్యతీత్యశ్వత్థః' అనఁగా క్షణప్రధ్వంసియనుట (ఇట్టిసంసారవృక్షమును), అవ్యయం=(మాయ యనాదికాలప్రవృత్త మాటవలన అట్టిమాయామయమైన సంసారమును)నాశరహితమైనదానిగాను, ప్రాహుః=చెప్పుదురు. యస్య=ఏ యీ యశ్వత్థమునకు, ఛందాంసి=వేదములు, పర్ణాని=ఆకులవంటివో, తం=ఆవృక్షమును, యః=ఎవ్వఁడు, వేద=ఎఱుఁగుచున్నాఁడో, సః=వాఁడు, వేదవిత్=వేదార్థమును తెలిసినవాఁడు.

శం. శ్రేష్ఠమైన మాయాంశజనితబ్రహ్మమే మూలముగా నికృష్టమైన మహదహంకారములు కొమ్మలుగాఁగల యశ్వత్థ

మనెడి సంసారవృక్ష మనాది యని పెద్దలు చెప్పుదురు. అట్టివృక్షమునకు వేదములు ఆకులు, అట్టి వృక్షరూపము నెవఁ డెఱుఁగునో వాఁడు వేదార్థముల నెఱిఁగినవాఁడగును.

రామా. ఏడులోకములకును మీఁద నుండెడి చతుర్ముఖుండు మొదలుగాఁ గలుగుటచేత, సంసారమనెడి యశ్వత్థమును ఊర్ధ్వమూలముగాను, భూమిమీఁదనుండెడి మనుష్యులు, పశువులు మొదలయినవియు, చెట్లు మొదలయిన స్థావరములంతయుగా గలుగుటచేత యీసంసారమనెడి యశ్వత్థము అధశ్శాఖమనియు మంచిజ్ఞానము కలుగువఱకును ప్రవాహరూపముగా నుండుటచే తెంపులేనిదై యుండును గాన నవ్యయమనియు, వేదములలోఁ జెప్పఁబడిన కామ్యకర్మములచేత నీసంసారము వృద్ధిపొందునుగాన దీనికి వేదములు ఆకులనియు, సంసారవృక్షమును తెగఁగొట్టు నుపాయమును వేదములు తెలియఁ జేయుననియు, కాఁబట్టి ఈవృక్షము నెవఁడెఱుంగునో వాఁడు వేదార్థముల నెఱింగినవాఁ డనుట.

మధ్వ. ఈ సంసారవృక్షమునకు మూలము విష్ణువనియు, నికృష్టమైన భూతములు శాఖలనియు, క్షణప్రధ్వంసియగుటచేత నశ్వత్థవృక్షమనియు, పూర్వపు బ్రహ్మకాలమున నెట్లుండెనో అట్లె యెల్లప్పు డగుటచేత నవ్యయమనియు, వృక్షమునకు ఆకులుపుట్టక ఫలోత్పత్తికాఁజాలదు. సంసారవృక్షమునకు ఫలోత్పత్తి కలుగఁజేయునవి ఆకులైన ఛందస్సుల నెవ్వఁ డెఱుంగునో వాఁడె సంసారవృక్షమును చక్కఁగా నెఱింగినవాఁ డనుట.

శ్లో. అధ శ్చోర్ధ్వం చ ప్రసృతా స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః,

అధ శ్చ మూలా న్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే. 2

టీ. తస్య=ఆసంసారవృక్షమునకు, శాఖాః=కొమ్మలవలెనున్న యవ్యక్తాదులు, గుణప్రవృద్ధాః = గుణములచేత స్థూలములుగాఁ జేయఁబడినవై, విషయప్రవాళాస్తస్య=శబ్దాదివిషయములు చిగుళ్లుగాఁగలవై, అధశ్చ=దిగువను, ఊర్ధ్వంచ=మీఁదను, ప్రసృతాః=విస్తృతంబులైనవి, తస్య=ఆవృక్షముయొక్క, మూలాని=రాగద్వేషాదులైన మొదళ్లు, మనుష్యలోకే=మానవలోకమందు, కర్మానుబంధీనిసంతి=ధర్మాధర్మలక్షణమైన కర్మఫలమును సంబంధించినవై,అధశ్చ=క్రింను,ఊర్ధ్వంచ=మీఁదను, అనుసంతతాని=ప్రవేశించినవి.

శం. అట్టి సంసారవృక్షమునకు సజ్ఞానమను కొమ్మలు త్రిగుణములచే సంరక్షింపఁబడి యూర్ధ్వాధోముఖములుగా వ్యాపించియున్నవి. ఆకొమ్మలకు మర్త్యలోకమందుఁ గర్మఫలములచే జనించిన రాగద్వేషాదులు మూలములుగాను, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు చిగుళ్లుగాను నున్నవి.

రామా. మనుష్యాదులు శాఖలుగాఁగల యీ వృక్షమునకు ఆయాకర్మములచేఁ గలిగినను మఱికొన్ని శాఖలు వెండియు మనుష్యపశ్వాది రూపమున క్రిందికి ప్రసరింపుచున్నవి. మీఁదికి గంధర్వయక్ష దేవాది రూపమున ప్రసరింపుచున్నవి.

మధ్వ. శరీరము మొదలగువాని యందుండు భూతములు అవ్యక్తమున(ప్రకృతియందు)ఁగూడసూక్ష్మరూపముననుండును గాన క్రిందికిని మీఁదికిని ప్రసరించినవి. దానికొమ్మలు సత్త్వాది

గుణములచేత వృద్ధిఁబొందునవి యనియు ప్రతీతిమాత్ర సుఖంబును దాని చిగుళ్లుగాను జెప్పఁబడియున్నవి. దానిమూలములను భగవద్రూపములుగాను, భగవంతుఁడుకూడ కర్మానుబంధమున ఫలము నిచ్చుచున్నాఁడనుట.

శ్లో. న రూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాది ర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3

టీ. ఇహ=ఈవృక్షమందున్న ప్రాణులచేత, అస్య=ఈ సంసారవృక్షముయొక్క, రూపం=స్వరూపము, నోపలభ్యతే=తెలియఁబడదు. తథా=అలాగుననే, అంతః=తుదయును, ఆదిశ్చ=మొదలును, సంప్రతిష్ఠా=స్థితియును, నోపలభ్యతే=తెలియఁబడదు. సువిరూఢమూలం=దృఢమయినవ్రేళ్లుగలిగిన, ఏనం=ఈ, అశ్వత్థం=సంసారవృక్షమును, దృఢేన=దృఢమయిన, అసంగశస్త్రేణ=విరక్తియనెడునాయుధముచేత, ఛిత్త్వా=ఛేదించి.

శం. ఈసంసారవృక్షముయొక్క స్వరూప మెఱుఁగుట కశక్యము. దానియాద్యంతములుగాని స్థితిగాని తెలియ నశక్యము. బహుదృఢమైన మూలములు గల యీవృక్షమును విరక్తి యనెడి యాయుధముచే నఱుకవలయును.

రామా. గుణమయములగు భోగములయందు సంగములేనిచో నీ వృక్షాంతమును పొందుటయును, దీనికి గుణసంగమె ఆదియగుటయును, ఆత్మకానిదానిని ఆత్మయగుటయనెడి అజ్ఞానము దీనికి మూలముగా నిలుచుటకాధార ప్రదేశమనియును

తెలియదు కాఁబట్టి యిట్టి తెలియమికి ఆధారమైన సంసారవృ క్షమును విరక్తియనెడి యాయుధముచే నఱుకవలయుననుట.

మధ్వ. ఏవిధమునను అగోచరమగు నీ సంసారవృక్షస్వరూపమును సంగములేకపోవుటతోఁ గూడిన జ్ఞానముచేత విమర్శించిన మూలముననున్న బ్రహ్మము తెలియఁబడును.

శ్లో. తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తంతి భూయః,
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. 4

టీ. తతః=ఆతర్వాత, యస్మిన్=ఏపదమందు, గతాః=ప్రవేశించినవారలు, భూయః=మరల, ననివర్తంతి = మళ్లరో, యతః=ఎవనివలన, పురాణీ=అనాదియైన, ప్రవృత్తిః=సంసారవృక్షప్రవృత్తి, ప్రసృతా=ప్రవర్తింపఁబడెనో, ఆద్యం=మూలకారణమైన, తంపురుషం=ఆపరమాత్మను,ప్రపద్యే=శరణుబొందుచున్నానని, తత్పదం=ఆమోక్షస్థానము,పరిమార్గితవ్యం=వెదకఁదగినది.

శం. ఆలాగు ఛేదించిన వెనుక నేపరమాత్మవల్లననాదియైన సంసారప్రవృత్తికలిగెనో, ఏపరమాత్మను బొందినవారికి మరల జన్మములు లేవో, అట్టి పరమాత్మనే శరణుపొందుచున్నానని ప్రయత్నము చేయవలయును.

రామా. 'ప్రపద్యేద్యతః' అనుపాఠము ననుసరించి, ఎవని వలన పురాతనమైన ఈగుణమయభోగసంగప్రవృత్తి ప్రసరించినదో ఆమొదటి పురుషునే శరణము పొందవలయును. లేక

'ప్రపద్యేయతః' అను పాఠానుసారముగాఁ జేయవలసిన పదచ్ఛేదము 'ప్రపద్య+ఇయతః' అనిచేసికొని 'తమ్, ఆద్యం, పురుషమేవ, ప్రపద్య, ఇయతః, పురాణీ, ప్రవృత్తిః, ప్రసృతా' యని యన్వయించుకొని, ఆమొదటిపురుషునినె శరణుజొచ్చి అజ్ఞాననివృత్తి మొదలగుదాని కంతటికిని సాధనమై పురాతనమైన ప్రవృత్తి ప్రసరించినది. ప్రాచీనులగు ముముక్షువు లెవరిని శరణముగాఁ బొంది బంధమును వదలించుకొనిరో అట్టి నన్నేశరణు పొందుము అని తాత్పర్యము చేసికొనవలయును.

శ్లో. నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛం త్యమూఢాః పద మవ్యయం తత్. 5

టీ. నిర్మానమోహాః=మానమోహములు లేనివారును, జితసంగదోషాః=జయింపఁబడిన సంగదోషములు కలిగినవారును, అధ్యాత్మనిత్యాః = జ్ఞానవిద్యాసక్తులైనవారును, వినివృత్తకామాః = పోయినఇచ్ఛలుకలిగినవారు, సుఖదుఃఖసంజ్ఞైః = శీతోష్ణాదిసుఖదుఃఖములనెడి సంజ్ఞలుగల, ద్వంద్వైః=ద్వంద్వములచేత, విముక్తాః=విడువఁబడినవారును(అగు),అమూఢాః=జ్ఞానులు, అవ్యయం=నాశరహితమైన, తత్పదం=ఆస్థానమును, గచ్ఛంతి=పొందుచున్నారు.

శం. జ్ఞానులు మానమోహములు త్యజించి దారాపుత్రాదుల సహవాసమును విడచి జ్ఞానవిద్యాసక్తులై కామక్రోధా

దులు మాని శీతోష్ణాదిరూపములైన ద్వంద్వములయందు స మానులై నాశరహితమైన మోక్షమును జెందుచున్నారు.

రామా. ఆత్మ కానిదానిని యాత్మయను మోహమును త్యజించి, సత్త్వరజస్తమోగుణమయములగు భోగములయందాసక్తి యనెడి దోషవర్జితులై, ఆత్మజ్ఞానముతప్ప మిగిలినవాని యన్నిటియందును కోరికలేనివారై, ఆత్మస్వభావములను, ఆత్మకానివానిస్వభావములను యెఱింగినవారై, అపరిచ్ఛిన్నమైనజ్ఞానమె ఆకారముగాఁగల ఆత్మనుపొందుచున్నారు. అనఁగా నన్ను శరణుజొచ్చినవారల కీప్రవృత్తులన్నియును నాప్రసాదంబుననె సిద్ధించును.

శ్లో. న త ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః,
యద్గత్వా న నివర్తంతే త ద్ధామ పరమం మమ. 6

టీ. తత్=ఆపరమపదమును, సూర్యః=సూర్యుఁడును, శశాంకశ్చ=చంద్రుఁడును, పావకశ్చ= అగ్నిహోత్రుఁడును, నభాసయతే=ప్రకాశింపఁజేయఁజాలరు, యత్=ఏస్థానమును, గత్వా= పొంది, ననివర్తంతే=తిరుగరో, పరమం=ఉత్కృష్టమైన, తత్= అది, మమ=నాయొక్క, ధామ=స్థానము.

శం. అలాటి యవ్యయపదమును సూర్యుఁడుగాని చంద్రుఁడుగాని యగ్నిహోత్రుఁడుగాని ప్రకాశింపఁ జేయఁజాలరు. ఏ పదమును జెందినవెనుకఁ బునర్జన్మములు లేవో యట్టిపరమోత్కృష్టమైన పదమే నాస్థానమని తెలియుము.

రామా. జ్ఞానమే అన్నిటిని ప్రకాశింపఁజేయునది. వెలుపలి జ్యోతిస్సులగు సూర్యచంద్రదీపాదులు, విషయములకును, ఇం

ంద్రియములకును సంబంధమును కలుగనీని చీకటిని నిరసించుట యను ద్వారమున నుపకరించునవి. అజ్ఞానమును ప్రకాశింపఁజేయునది మోహము. దానికి విరోధి యనాదియగుకర్మము. దానిని నివర్తింపఁజేయునది భగవత్ప్రీప్తిమూలకంబగు అసంగము.

శ్లో. మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః,
మనష్షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

టీ. సనాతనః=అనాదియైన, మమ=నాయొక్క, అంశఏవ=అంశమే, జీవలోకే=సంసారమందు, జీవభూతః=జీవస్వరూపమైనదై, ప్రకృతిస్థాని = మాయయందున్న, మనష్షష్ఠాని = మనస్సే యారవదిగాఁగలిగిన (అనఁగా మనస్సుతోఁగూడిన), ఇంద్రియాణి=ఇంద్రియములను, కర్షతి=ఆకర్షించుచున్నది.

శం. మఱియు సనాదియైన నాయంశమే ప్రపంచమునందు జీవరూపమైయున్నది. ప్రకృతిసంబంధమై మనస్సుతోఁజేరిన జ్ఞానేంద్రియము లాజీవుని విషయములయందు లాగుచున్నవి.

రామా. సనాతనమగు నాయంశమె ఒకానొకటి అనాది కర్మమనెడి యవిద్యచేతనావరింపఁబడినదై, జీవుఁడై జీవలోకమున ప్రకృతిపరిణామవిశేషములగు దేవమనుష్యాది శరీరములలో నుండెడి ఇంద్రియములను ఇటుఅటు లాగుచుండును. ఎవఁడో యొకఁడు వెనుకఁజెప్పఁబడిన మార్గమున ఈయవిద్యనుండి ముక్తినిపొందినవాఁడై తనస్వరూపముతో నుండును.

శ్లో. శరీరం య దవాప్నోతి యచ్చాప్యుత్క్రామ తీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయు ర్గంధా నివాశయాత్.

టీ. ఈశ్వరః=జీవుఁడు, యచ్ఛరీరం=ఏశరీరమును, అవాప్నోతి=పొందుచున్నాఁడో, యచ్చ=ఏ శరీరమును, ఉత్క్రామతి=విడుచుచున్నాఁడో, తదా=అప్పుడు, వాయుః=వాయువు, ఆశయాత్=(పుష్పాది) స్థానమునుండి, గంధానివ=గంధములనువలెనే, ఏతాని=ఈయింద్రియములను, గృహీత్వా=గ్రహించుకొని, సంయాతి=పోవుచున్నాఁడు.

శం. జీవుఁడు శరీరములయందు దూరునపుడును శరీరములను వదలునపుడు గాలి పుష్పవాసనల తీసికొనిపోవు విధమున నింద్రియములను వానితోఁగూడిన మనస్సును దీసికొని పోవుచున్నాఁడు.

**రామా.** వాయువుమాలికలు, చందనము, కస్తూరి మొదలగు వానినుండి వానిసూక్ష్మావయవములతోఁగూడ గంధములను స్వీకరించిపోవునట్లు, ఇంద్రియముల కీశ్వరుఁడైన, జీవుఁడే శరీరమునుపొందుచున్నాఁడో, యేశరీరమునుండి ఉత్క్రమించుచున్నాఁడో ఆశరీరముననుండెడి సూక్ష్మభూతములతోఁగూడ నీయింద్రియములను పట్టియుండియె పోవుచున్నాఁడు.

మధ్వ. జీవుఁడు శరీరమును పొందునప్పుడును, ఉత్క్రమించునపుడును ఈశ్వరుఁడు సూక్ష్మేంద్రియములను స్వీకరించియే పోవుచుండును.

శ్లో. శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ,
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే. 9

టీ. అయం=ఈజీవుఁడు, శ్రోత్రంచక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణం=పంచేంద్రియములును, మనశ్చ=మనస్సును, అధిష్ఠా

య=అధిష్ఠించి, విషయాన్=శబ్దాదులను, ఉపసేవతే=అనుభ వించుచున్నాఁడు.

శం. ఈజీవుఁడు జ్ఞానేంద్రియములయిన త్వక్ చక్షు శ్శ్రోత్ర రస నాఘ్రాణేంద్రియములను మనస్సును దగిలి ఇంద్రియ విషయములయిన శబ్ద స్పర్శరూపరసగంధముల ననుభవించు చున్నాఁడు.

మధ్వ. ఈశ్వరునకుఁగూడ భోగము పూర్వము సాధింపఁ బడినది. ఇంద్రియద్వారమున యీశ్వరుఁడుగూడ ననుభవిం చును. గుణము కలదానిని మాత్రమే అనుభవించును. దుష్ట మైన దానిని అనుభవింపఁడనుట.

శ్లో. ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్,
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. 10

టీ. విమూఢాః=అవివేకులు, (జీవుని,) ఉత్క్రామంతం= దేహమును విడుచుచున్నవానినిగాను, స్థితమపివా=ఉన్నవాని నిగాను, భుంజానంవా=అనుభవింపుచున్నవానినిగాను, గుణాన్వి తం=గుణయుక్తునిగాను, నానుపశ్యంతి=కనుఁగొనలేరు, జ్ఞాన చక్షుషస్తు=జ్ఞానదృష్టికలవారలు, పశ్యంతి=చూచుచున్నారు.

శం. తెలివిలేనివారీజీవుని శరీరము వదలిపోవునప్పుడేమి, శరీరమందుండునప్పుడేమి, యింద్రియవిషయము లనుభవించున పుడేమి, గుణయుక్తుఁడుగానున్నపుడేమి యెఱుఁగఁజాలరు. జ్ఞాన దృష్టిగలవారు వీనినంతయుఁ జక్కఁగాఁ జూచుచున్నారు.

రామా. ఉత్క్రమణము మొదలగు అన్నియవస్థలయం దును మనుష్యాది శరీరములకంటె విలక్షణుఁడై జ్ఞానైకస్వరూ

పుఁడగు నాత్మను, శరీరములే యాత్మలనుకొను మూఢులు తెలిసికొనరు. శరీరంబును ఆత్మయును వేఱుఅనెడి వివేకజ్ఞానముకల జ్ఞానచక్షుస్సులు పరమాత్ముని సత్త్వాదిగుణమయమగు ప్రకృతి యొక్క పరిణామములగు మనుష్యాది శరీరములతోఁగూడియున్నవానిగా తెలియుదురు.

శ్లో. యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితమ్,
యతంతో ప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః. 11

టీ. యోగినః=యోగులు, యతంతః=యత్నముచేయుచున్నవారలై, ఏనం=ఈయాత్మను, ఆత్మని=తనయందు, అవస్థితం=ఉన్నదానినిగా, పశ్యంతి = చూచుచున్నారు, అకృతాత్మానః=ఆత్మజ్ఞానములేని, అచేతసః=అవివేకులు, యతంతోపి=యత్నముజేయుచున్నవారలైనను, ఏనం=ఈఆత్మను, నపశ్యంతి=చూడరు.

శం. యోగులు తగినయత్నములు జేయువారై దేహములో నంతర్గతమైన యాత్మస్వరూపుఁడగు జీవుని నెఱుఁగుచున్నారు. ఆత్మజ్ఞానము లేనిమూఢులు యత్నములు జేసియు నాత్మను కనఁజాలరు.

రామా. యోగులు సన్న్యాశరణుజొచ్చి, కర్మయోగాదుల నాచరించుచున్నవారై, నిర్మలమైన మనస్సుగలవారై, శరీరమునందు జీవునినెఱుఁగుచున్నారు. సంస్కరింపఁబడని మనస్సు కలవారై, ఆత్మస్వరూపమును చూచుటకు తగిన మనస్సులు లేనివారై యత్నములుచేసియు నాత్మను కనఁజాలరు.

శ్లో. య దాదిత్యగతం తేజో జగ ద్భాసయ తేఽఖిలం,
య చ్చంద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్.

టీ. ఆదిత్యగతం=సూర్యగతమైన, యత్తేజః=ఏ తేజస్సు, అఖిలం=సమస్తమైన, జగత్=లోకమును, భాసయతే=ప్రకాశింపఁజేయుచున్నదో, చంద్రమసి=చంద్రునియందలి, అగ్నౌ=అగ్నియందలి, యత్=ఏ తేజస్సుగలదో, తత్=ఆ తేజస్సును, మామకం=నాసంబంధమైనదానినిగా, విద్ధి=తెలియుము.

శం. సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని వీరలలో నేప్రకాశ మంతర్గతమై యెల్లప్రపంచములను బ్రకాశింపఁ జేయుచున్నదో, అట్టి ప్రకాశము నాసంబంధమగు బ్రకాశమని యెఱుఁగుము.

రామా. సూర్యాదుల తేజస్సు నాయది అనఁగా వారు వారు నన్నారాధింపఁగా నాచేత నీఁబడినది.

శ్లో. గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా,
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః.

టీ. అహం=నేను, గాం=భూమిని, ఆవిశ్య=ప్రవేశించి, ఓజసా=బలముచేత, భూతాని=ప్రాణులను, ధారయామి=ధరించుచున్నాను, రసాత్మకః=రసస్వరూపుఁడైన, సోమః=చంద్రుఁడను, భూత్వా=అయి, సర్వాః=సమస్తములైన, ఓషధీః=వ్రీహియవాదులను, పుష్ణామి=పోషించుచున్నాను.

శం. నేను భూమియందుఁ జొచ్చి నాబలముచే జీవకోట్ల నన్నిటిని మోయుచున్నాను. నేనేరసస్వరూపుఁడైన చంద్రుఁడనై యెల్ల యోషధులను గాపాడుచున్నాను.

రామా. నేను భూమియందుఁజొచ్చి, అడ్డులేని నాసామర్థ్యముచేత జీవకోట్ల నన్నిటిని మోయుచున్నాను. నేనేయమృతరస స్వరూపుఁడనై, చంద్రుఁడనై యెల్లయోషధులను గాపాడుచున్నాను.

శ్లో. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్. 14

టీ. అహం నేను, వైశ్వానరః=జఠరాగ్నిని, భూత్వా=అయి, ప్రాణినాం=దేహధారులయొక్క, దేహం=శరీరమును, ఆశ్రితః=ఆశ్రయించినవాఁడనై, చతుర్విధం=*భక్ష్యభోజ్యచోష్యలేహ్యములను నాలుగువిధములు గలిగిన, అన్నం=అన్నమును, పచామి=పచనము చేయుచున్నాను.

శం. దేహము ధరించినవారి దేహములయందు జఠరాగ్నిరూపుఁడనై ప్రాణాపానవాయువులతోఁ జేరి వారలు తిను నాల్గువిధములయిన భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య పదార్థములను జీర్ణము చేయుచున్నాను.

శ్లో. సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ,

---

* శంకరులు—చతుర్విధాహారము లెవనగా:— భక్ష్యము = పిండివంట, భోజ్యము=అన్నము కూరలు, చోష్యము = జుఱ్ఱఁదగినది, లేహ్యము=నాకఁదగినది.

* రామానుజులు—చతుర్విధాహారము లెవనఁగా :—ఖాద్యము = నమలఁదగినది, చోష్యము=పాయసాదులు, లేహ్యము=పచ్చడి, పేయము=త్రాగఁదగినది.

వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాంతకృ ద్వేదవి దేవ చాహమ్. 15

టీ. సర్వస్య=సమస్తప్రాణిజాతముయొక్క, హృది=హృదయమందు,అహం=నేను, సన్నివిష్టః=ప్రవేశించియున్నాను(కావున), మత్తః=నావలన,స్మృతిః=తెలివియు,జ్ఞానం=జ్ఞానమును, అపోహనం=స్మృతిజ్ఞానాపగమనమును, భవతి = అవుచున్నది. సర్వైర్వేదైః=సమస్తవేదములచేత, వేద్యః=తెలియఁదగినవాఁడను, వేదాంతకృత్=వేదాంతములఁజేసినవాఁడను,వేదవిచ్చ=వేదమును దెలిసినవాఁడను, అహమేవ=నేనే?

శం. సర్వప్రాణుల మనస్సులయందు నేనే వసించుచున్నాను. నాచేతనే వారలకు స్మృతి, జ్ఞానము, మాంద్యము, పుట్టుచున్నవి. అనేక వేదములచే నెఱుఁగఁదగినవాఁడను, వానినిచేసినవాఁడను తెలిసినవాఁడను నేనే.

రామా. సమస్తమైన భూతములకు, ప్రవృత్తినివృత్తులన్నిటికిని, మూలంబగు జ్ఞానముపుట్టెడి ప్రదేశమైన హృదయమునందు, సమస్తమైన దానిని సంకల్పముచేత నియమించుచున్నవాఁడనై యాత్మఁగానున్నాను. నాచేతనే వారలకు స్మృతి, (తెలిసికొనిన దానిని తలంచుట,) జ్ఞానము (ఇంద్రియము,గుఱుతులు, శాస్త్రము, యోగసిద్ధి వీనిచేతఁగలిగెడి నిశ్చయము), అపోహనము (జ్ఞానములేమి, ఊహాయనియుం గూడ) పుట్టుచున్నవి. వేదములలోఁ జెప్పఁబడినఫలము నిచ్చువాఁడను నేనే, ఇట్లునన్నుజెప్పెడి వేదమును నేనెఱుంగుదును. అగ్నిసూర్యాదులకుఁగూడ నేనంతర్యామిని కాఁబట్టి వారలను ప్రతి

పాదించెడి వేదభాగములచేఁగూడ నేనే తెలియఁ బడుదును. వేదములను చేసెడివాఁడను నేనేయనుట.

మధ్వ. వేదాంతకృత్ అనుశబ్దముచే వేదనిర్ణయము స్వరూపముగాఁగలమీామాంసకర్త నేనే యనుట.

శ్లో. ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ,
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. 16

టీ. లోకే=లోకమందు, క్షరశ్చ=క్షరుఁడని, అక్షరశ్చ=అక్షరుఁడని, ద్వావిమౌ=వీరిద్దఱును, పురుషౌ=పురుషులు, (వీరిలోపల,) క్షరః=క్షరపురుషుఁడు, సర్వాణి=సమస్తభూతములనియు, అక్షరః=అక్షరపురుషుఁడు, కూటస్థః=జీవుఁడనియు, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

శం. ఎల్లలోకములయందు క్షరుఁడని యక్షరుఁడని యిరువురుగలరు. అందు క్షరుఁ డెల్లశరీరములే స్వరూపముగాఁగలవాఁడనియు నక్షరుఁడు కూటస్థుఁడనియుఁ బెద్దలుచెప్పుదురు.

రామా. క్షరుఁడనఁగా సంసారి అక్షరుఁడనఁగా ముక్తుఁడు, సంసారసంపర్కము, సంసారవియోగమనెడిరెండు ఉపాధులను బట్టి ఏకవచనములుగాఁ జెప్పఁబడినది. కాలము అనాదికాఁ బట్టి ముక్తులుగూడ ననేకులు కలిగియున్నారు - అచేతనపరిణామములగు బ్రహ్మాదిశరీరములకు అసాధారణుఁడుకాఁడు కాఁబట్టి కూటస్థుఁడనఁబడుచున్నాఁడు.

శ్లో. ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః.

టీ. అన్యః = ఈయిద్దఱికంటె విలక్షణుఁడైన, ఉత్తమః=ఉత్కృష్టుఁడైన, పురుషః=పురుషుఁడు, పరమాత్మేతి=పరమాత్మయని, ఉదాహృతః=చెప్పఁబడెను, యః=ఏపరమాత్మ, లోకత్రయం=మూఁడులోకములను, ఆవిశ్య=ప్రవేశించి,బిభర్తి=భరించుచున్నాఁడో, సఏవ=ఆపరమాత్మయే, అవ్యయః=నాశరహితమయిన, ఈశ్వరః=శ్రీమన్నారాయణుఁడని చెప్పఁబడెను.

శం. ఈయిద్దఱికన్న విలక్షణుఁడు మఱొకఁడున్నాఁడు. అతఁడే పరమాత్మ. అతఁడే స్వర్గమర్త్యపాతాళలోకములలోఁ బ్రవేశించి వానిని భరించుచున్నాఁడు. అతఁడే నాశరహితుఁడైన యీశ్వరుఁడు.

రామా. అన్యుఁడనఁగా బద్ధముక్తులకంటె వేఱైనవాఁడు. అచేతనంబును, దానితోఁ చేరియున్న జీవుఁడును, ముక్తుఁడును యీమూఁడింటికాత్మయై లోపలప్రవేశించి భరించుచున్నాఁడు.

శ్లో. యస్మాత్ క్షరమతీతోఽహ మక్షరా దపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. 18

టీ. యస్మాత్=ఏకారణమువలన, అహం=నేను, క్షరం=క్షరపురుషుని, అతీతః=అతిక్రమించినవాఁడనో, అక్షరాదపి = అక్షరునికంటెఁగూడ, ఉత్తమః = ఉత్తముఁడను నయితినో, అతః=ఈకారణమువలన, లోకేచ=లోకమందును, వేదేచ=వేదమందును, ప్రథితః=ప్రసిద్ధుఁడనై, పురుషోత్తమః=పురుషోత్తముఁడను,అస్మి=అగుచున్నాను.

శం. నేను క్షరపురుషుని మీఱినవాఁడనై యక్షరునికన్న ను ఉత్తముఁడను గనుకఁ బ్రపంచములయందును వేదములయం

డును బరమాత్మస్వరూపుఁడైన పురుషోత్తముఁడని ప్రసిద్ధి జెందియున్నాను.

శ్లో. యోమా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత. 19

టీ. హేభారత = ఓ యర్జునుఁడా! యః = ఎవ్వఁడు, అసమ్మూఢస్సన్ = మోహవర్జితుఁడై, ఏవం = ఈప్రకారముగా, పురుషోత్తమం = పురుషోత్తముఁడనైన, మాం = నన్ను, జానాతి = తెలియుచున్నాఁడో, సః = వాఁడు, సర్వవిత్సన్ = సర్వజ్ఞుఁడైనవాఁడై, సర్వభావేన = సమస్తవిధములచేత, మాం = నన్ను, భజతి = పొందుచున్నాఁడు.

శం. అర్జునా! ఎవఁడు మోహమును విడిచినవాఁడై పైఁజెప్పినరీతిగఁ బురుషోత్తముఁడైన నన్ను నెఱుఁగుచున్నాఁడో అట్టివాఁడు సర్వజ్ఞుఁడై యెల్లవిధములచేత నన్నుఁ జెందుచున్నాఁడు.

రామా. ఎవఁడుమోహవర్జితుఁడై, ఎన్నివిధములగు భజనప్రకారములు చెప్పఁబడినవో, వాటియన్నిటిచేతను ఎవఁడు నన్ను భజించుచున్నాఁడో నన్నుగూర్చినజ్ఞానములన్నింటిచేతను భజనములన్నింటిచేతను, నాకుకలిగెడి ప్రీతి ఇట్లు తెలిసికొనుటచేత కలుగును.

శ్లో. ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ,
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత. 20

టీ. అనఘ = పాపరహితుఁడవైన, హేభారత = ఓయర్జునా! గుహ్యతమం = మిక్కిలిరహస్యమైన, ఇదంశాస్త్రం = ఈశాస్త్రము,

మయా=నాచేత, ఉక్తం=చెప్పఁబడెను. ఇతి=ఈప్రకారము, ఏతత్=ఈశాస్త్రమును, బుద్ధ్వా=తెలిసికొని, బుద్ధిమాన్=బుద్ధిగలవాఁడును, కృతకృత్యశ్చ=కృతకృత్యుఁడును, స్యాత్=అవును.

శం. అర్జునా! అతిరహస్యమైన యీశాస్త్రమును నీకుగాను విస్తరముగఁ జెప్పితిని. దీనిని నేను వివరించినవిధమున నెఱిఁగినబుద్ధిమంతులు జ్ఞానవంతులై తాము చేయఁదగిన కర్మలను జేయుదురు.

రామా. అర్జునా! అతిరహస్యమగు నీశాస్త్రమును నీకుగాను విస్తరముగఁ జెప్పితిని. దీనిని దెలిసికొనినవాఁడు నన్నుఁ బొందుటకు కావలసిన జ్ఞానమంతయు కలవాఁడగును. వాఁడు చేయవలసినదంతయు చేసినవాఁడగును. ఇందుఁజెప్పఁబడినపురుషోత్తమజ్ఞానమె దీనినంతయును జేయును. ప్రత్యక్షరూపమైన జ్ఞానముకాదు.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమప్రాప్తియోగోనామ పంచదశోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును, యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జునులసంవాదాత్మకంబునైన శ్రీభగవద్గీతలయందు పురుషోత్తమప్రాప్తియోగమనెడి పంచదశాధ్యాయము.



శ్రీ ర స్తు.

# శ్రీభగవద్గీతా,

## దైవాసురసంపద్విభాగయోగః.



శ్రీభగవా నువాచ.—

శ్లో. అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,

దానం దమ శ్చ యజ్ఞ శ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 1

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. అభయం = భయములేకుండుటయు, సత్త్వసంశుద్ధిః= సత్త్వభావవ్యవహారమును, జ్ఞానయోగవ్యవస్థితిః=జ్ఞానయోగ మందుండుటయు, దానం=ఇచ్చుటయు, దమశ్చ=బాహ్యేంద్రియనిగ్రహమును, యజ్ఞశ్చ=యజ్ఞమును, స్వాధ్యాయః=వేదాధ్యయనమును, తపః=తపస్సును, ఆర్జవం=ఋజుత్వమును.

శం. వెఱపులేకయుండుట, మనశ్శుద్ధి, జ్ఞానయోగమునం దుండుట, దానములుచేయుట, బాహ్యేంద్రియనిగ్రహము, యజ్ఞములు, వేదాధ్యయనము చేయుట, తపోనిష్ఠుఁ డగుట, అధర్మమందు ప్రవేశించక యుండుట.

రామా. ఇష్టమైనది ప్రాప్తించక పోవుటయు, అనిష్టమైనది సంప్రాప్తమై అందువల్ల దుఃఖము సంభవింపకయుండుట, అంతఃకరణపరిశుద్ధి, ప్రకృతిసంపర్కములేని యాత్మస్వరూపము

నేర్పఱచుట-న్యాయార్జిత ద్రవ్యమును తగినవానికిచ్చుట, మనస్సును విషయములవైపు తిరుగకుండఁ జేయుట, ఫలమును గోరక భగవదారాధనరూపముగా పంచమహాయజ్ఞాదుల నాచరించుట, విభూతి విశిష్టుఁడగు భగవంతుని అతని యారాధన ప్రకారము ప్రతిపాదించునదియె వేదమంతయు నని తలంచుచు వేదాభ్యాసముచేయుట, కృఛ్రచాంద్రాయణము ద్వాదశ్యుపవాసము మొదలగువానిని భగవత్ప్రీతి కలుగుటకై చేయుట, ఇతరుల విషయమున మనోవాక్కాయకర్మము లొక్కటిగానుండుట.

శ్లో. అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్,
దయా భూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్. 2

టీ. అహింసా= హింసారాహిత్యము, సత్యం = యథార్థవాక్యము, అక్రోధః=క్రోధములేకయుండుట, త్యాగః=వితరణము, శాంతిః = చిత్తోపశమము, అపైశునం=పిశునత్వరాహిత్యము, భూతేషు=సర్వప్రాణులయందు, దయా=కృపయు, అలోలత్వం=విషయసన్నిధి నింద్రియవికారము లేకయుండుట, మార్దవం=మృదుత్వము, హ్రీః = సిగ్గు, అచాపలం=చాపల్యము లేక యుండుట.

శం. ఇతరపీడావర్జనము, సత్యము,క్రోధము లేక యుండుట, సర్వసంగపరిత్యాగము, చిత్తోపశమము, ఇతరులయందు దోషములు చెప్పకుండుట, ఎల్లప్రాణులయందుఁ గనికరము, విషయములు ప్రాప్తమైనపుడు వికారము లేకయుండుట, మృదుత్వము, లజ్జ, చాపల్యము లేకయుండుట.

రామా. ఇతరపీడావర్జనము, హితమైన యథార్థస్థితిని చెప్పుట, పరులను బాధించెడి చిత్తవికారములు లేకపోవుట, తనకు హితములుకాని వానిని విడుచుట, ఇంద్రియములు విషయాసక్తములు కాకయుండుటకై యభ్యసించుట, పరులకు అనర్థమును తెలియఁజేసెడి వాక్యమును చెప్పకయుండుట, అన్ని భూతములయందును దుఃఖమును సహింపని స్వభావము, విషయసన్నిధి నింద్రియవికారరాహిత్యము, కాఠిన్యము వహించకయుండుట, చేయరాని పనిని చేయుటయందు సిగ్గు, కోరఁదగిన విషయము దగ్గఱనున్నను కదలకపోవుట.

శ్లో. తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత. 3

టీ. హేభారత=ఓయియర్జునా! తేజః=ప్రతిభతోఁ గూడియుండుట, క్షమా = ఓర్పు, ధృతిః = ధైర్యము, శౌచం=బాహ్యాభ్యంతర పారిశుద్ధ్యము, అద్రోహః= పరులకు ద్రోహము చేయకయుండుట, నాతిమానితా = గర్వము లేకయుండుట, (ఇత్యేతాని=ఈచెప్పఁబడిన యభయాదులు,) దైవీం=దేవతా సంబంధమైన, సంపదం=సంపదనుబట్టి, అభిజాతస్య = పుట్టినవానికి, భవంతి=కలుగుచున్నది.

శం. సాహసముతో నుండుట, ఓర్పు, ధైర్యము, శుద్ధి, ఇతరులను వచింపక యుండుట, కావరము లేకయుండుట మొదలగు నీగుణములు దేవాంశమున బుట్టినవారికి నుండును.

రామా. దుర్జనులచేఁ దిరస్కరింపఁబడక యుండుట, ఒకనినొకఁడు బాధించినను బాధించినవానియెడ చిత్తవికారము

లేక యుండుట, గొప్పయాపద కలిగినను చేయవలసిన దానిని చేయుచునేయుండుట, బాహ్యాభ్యంతర పారిశుద్ధ్యము, ఇతరులు యథేష్టముగా సంచరించుట కడ్డుకలుగకచేయుట, ప్రసక్తి లేనిదే గర్వపడకయుండుట, యీపైఁజెప్పిన గుణము లన్నియు భగవదాజ్ఞానువర్తులకును, ఆయాజ్ఞను జరుపుటకై జన్మించినవారికిని కలుగు ననుట.

శ్లో. దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్. 4

టీ. హేపార్థ=ఓయి యర్జునా! ఆసురీం = అసురసంబంధమైన, సంపదం=ఐశ్వర్యమునుబట్టి, అభిజాతస్య=పుట్టినవానికి, దంభః = ధర్మధ్వజిత్వము, దర్పః=గర్వము, అభిమానం=అభిమానము, క్రోధః=క్రోధము, పారుష్యం = పరుషత్వము, అజ్ఞానం=అవివేకమును, భవంతి = కలుగుచున్నవి.

శం. అర్జునా! డంబము, గర్వము, అభిమానము, క్రోధము, కఠినపుమాటలు, అవివేకము యీగుణము లన్నియు రాక్షసాంశమునఁ బుట్టినవారల కుండును.

రామా. అర్జునా! ధార్మికుండనుటకై ధర్మము నాచరించుటయు, విషయాదుల ననుభవించుటచే కృత్యాకృత్యములను పర్పఱుపచాలనంత సంతోషము, తనకు కలిగిన విద్యావంశములకు తగని యభిమానము, పరబాధకైన చిత్తవికారము, సత్పురుషులకు ఏవగింపు కలుగఁజేసెడి చిత్తవికారము, పరాపరతత్త్వములను కృత్యాకృత్యములను నెఱుఁగక పోవుట, ఇట్టి గుణము లన్ని భగవదాజ్ఞను మీరువారలకు కలుగును.

శ్లో. దైవీ సంప ద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా,
మాశుచ స్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ. 5

టీ. దైవీ=దేవతాసంబంధమైన, సంపత్=సంపద, విమోక్షాయ=సంసారవిమోచనముకొఱకు, మతా=సమ్మతమైనది, ఆసురీ=అసురసంబంధమైన, సంపత్=సంపద, నిబంధాయ=సంసారముకొఱకు, మతా=సమ్మతమైనది, హేపాండవ=ఓయి అర్జునా! త్వం=నీవు, దైవీం=దేవతాసంబంధమైన, సంపదం=సంపదనుబట్టి, అభిజాతః=పుట్టినవాఁడవు, అసి=అయితివి, మాశుచః=దుఃఖించకుము.

శం. ధనంజయా! దేవాంశమునఁ బుట్టుట మోక్షసాధకముగా నున్నది. రాక్షసాంశమునఁబుట్టుటప్రకృతిసంబంధమైన జనన మరణములకుఁ గారణముగా నున్నది. నీవు దేవాంశమునఁ బుట్టినవాఁడవు గానఁ జింతిల్ల నవసరము లేదు.

రామా. నాయాజ్ఞను అనువర్తించుట యనెడి దైవసంపద క్రమముగానన్ను చెందుట కగును; నాయాజ్ఞ నతిక్రమించుట యనెడి యాసురసంపద యధోగతిని చెందుటకగును; నీవు దేవాంశ జనితుఁడగుటంబట్టి చింతిల్లంబనిలే దనుట.

శ్లో. ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు. 6

టీ. హేపార్థ=ఓయి యర్జునా! అస్మిన్‌లోకే=ఈలోకమందు, దైవశ్చ=దేవతాసంబంధమనియు, ఆసురశ్చ=అసుర సంబంధమని, భూతసర్గౌ=ప్రాణిసృష్టులు, ద్వౌ=రెండు

విధములు గలవి, (ఆ రెంటియందు,) దైవః = దేవతాసంబంధమైన భూతసృష్టి, విస్తరశః = విస్తారముగా, ప్రోక్తః=చెప్పఁబడెను, ఆసురం = అసురసంబంధమైన భూతసృష్టిని, మే=నాయొక్క (వాక్కువలన), శృణు = వినుము.

శం. పార్థా! ప్రపంచమునఁ బ్రాణులకు దేవాంశము, అసురాంశము నని రెండువిధములయిన జన్మములున్నవి. దేవాంశజన్మగుణములు సవిస్తారముగఁ జెప్పఁబడెను. అసురాంశ జన్మగుణముల నింకను సవిస్తారముగఁ జెప్పెద వినుము.

రామా. ఈ కర్మలోకమున, భూతముల పుట్టుకలు పురాతన పుణ్యపాపముల ననుసరించి, భగవదాజ్ఞానుసారులుగా కొందఱును, మీఱి దాటుటకు కొందఱును, అని యిట్లు పుట్టునప్పుడే ఏర్పాటుగాఁ బుట్టుదురు. నాయాజ్ఞ ననువర్తించు వారి పుట్టుక ఎట్టి యాచారముకొఱకో ఆయాచారము కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగ రూపమైనది. అది యీవఱకు విస్తారముగాఁ జెప్పఁబడినది. ఇంక ననురసంపద యాచారమును వినుము.

శ్లో. ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 7

టీ. అసురాః=అసురస్వభావముకలిగిన, జనాః=జనులు, ప్రవృత్తిం=ధర్మప్రవృత్తిని, నివృత్తించ=ధర్మనివృత్తిని, నవిదుః=తెలియఁజాలరు, తేషు=వారియందు, శౌచం=శుచిత్వమును, ఆచారోపి= ఆచారమును, సత్యంచ=యథార్థభావమును, నవిద్యతే=ఉండదు.

శం. రాక్షసాంశమునఁ బుట్టినవారికి (శ్రౌతస్మార్త కర్మప్ర) వృత్తి యిదియనియుఁ, గర్మనివృత్తి యిదియనియుఁ దెలియదు. వారికి నంతర్బహిశ్శుద్ధి సదాచారము సత్యము ఉండదు.

రామా. రాక్షసాంశమునఁ బుట్టినవారికి స్వర్గాదులను కలుగఁజేయు వైదికధర్మము లేదు. మోక్షసాధన చిత్తమే లేదు. వైదికకర్మముల నాచరించుటకు శాస్త్రమున చెప్పిన చొప్పున వారు తగియుండరు. వారికి బాహ్యాభ్యంతర శౌచమే లేదు; ఈశౌచము కలుగుటకైన సంధ్యావందనాదులే లేవు. సదాచారము సత్యము అసలే యుండదనుట.

శ్లో. అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్,
అపరస్పరసంభూతం కి మన్య త్కామహైతుకమ్. 8

టీ. తే=ఆయసురజనులు, జగత్ = జగత్తును, అసత్యం= లేనిదానినిగాను, అప్రతిష్ఠం=ప్రతిష్ఠారహితమైన దానినిగాను, అనీశ్వరం = నియామకుఁడు లేనిదానిగాను, ఆహుః = చెప్పుదురు, (ఇదియునుం గాక), అపరస్పర సంభూతం = (స్త్రీపురుషుల) పరస్పర సంబంధమువలనఁ బుట్టనిది, అన్యత్కిం=వేఱే యేమి యున్నది? (సకలజగత్తును), కామహైతుకం=కామమే హేతువుగాఁ గలిగినది (అని యీలాగున జెప్పుదురు).

శం. రాక్షసాంశజులు, ఎల్లప్రపంచమును సత్యరూపమనిస్థాపించు వేదములను నమ్మరు. వానిలో ధర్మాధర్మప్రతిష్ఠ లేదని వాదింతురు. లోకములన్నియు స్త్రీపురుషులచేఁ గలిగినవనియుఁ గామహేతుకములనియు మఱేమికాదనియు చెప్పుదురు.

రామా. సత్యశబ్దముచే చెప్పఁబడినబ్రహ్మము ఆత్మగాఁగలది కాదందురు. బ్రహ్మమునందు (ప్రతిష్ఠితం) ఉన్నది అనియును చెప్పరు. బ్రహ్మమగు అనంతునిచే గదా యీభూమియంతయు ధరింపఁబడి యున్నదనివారెఱుఁగరు. సత్యసంకల్పుఁడను, పరమేశ్వరుఁడను, పరబ్రహ్మమగునాచే నీలోకములన్నియు నియమింపఁబడినదనియుం జెప్పరు. లోకములన్నియు స్త్రీపురుషులచేఁగలిగి కామహేతుకములనియు మఱేమికాదందురు.

మధ్వ. జగత్తునకు, సత్యంబును, సృష్ట్యాదికారణంబును, ప్రతిష్ఠయు ఇవన్నియు ఈశ్వరుఁడును విష్ణువే యనుదానికి విరుద్ధముగాఁ జెప్పుదు రనుట.

శ్లో. ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో౽ల్పబుద్ధయః,
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతో౽హితాః.　　9

టీ. ఏతాందృష్టిం=ఈజ్ఞానమును, అవష్టభ్య=అవలంబించి, నష్టాత్మానః=నష్టాత్ములై, అల్పబుద్ధయః=స్వల్పబుద్ధిగలవారలై, ఉగ్రకర్మాణః=హింసాది క్రూరకర్మలు గలవారలై, అహితాః=శత్రువులై, జగతః=లోకముయొక్క, క్షయాయ=నాశముకొఱకు, ప్రభవంతి=పుట్టుచున్నారు.

శం. ఇట్లభిప్రాయముగలవారై నష్టాత్ములై యల్పబుద్ధిగలవారై హింసాదిక్రూరకర్మలు చేయుచు లోకమునకు పగవారై లోకనాశమునకు యత్నించుచుందురు.

రామా. ఘటాదులవలె తెలియఁబడెడి వస్తువైన శరీరమున తెలిసికొనువారు ఆత్మ దేహముకంటె వేఱుగా నున్నాఁడని తెలిసికొనలేరు గాన స్వల్పబుద్ధి కలవా రగుచున్నారు.

శ్లో. కామ మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః.

టీ. దుష్పూరం=నిండింప నశక్యమైన, కామం=కోరికను, ఆశ్రిత్య=ఆశ్రయించి, మోహాత్ = అజ్ఞానమువలన, అసద్గ్రాహాన్=అన్యాయపుఁబరిగ్రహములను, గృహీత్వా=గ్రహించి, అశుచివ్రతాః=అశాస్త్రీయనియమము గలవారలై, దంభమానమదాన్వితాః = దంభమానమదములతోఁ గూడినవారలై ప్రవర్తంతే=ప్రవర్తించుచున్నారు.

శం. అట్టివారు మెండుకోరికలతో దంభమానమదములతోఁ గూడినవారై నిక్షేపాదుల నిచ్ఛించుచు క్షుద్రదేవతలనుఁ గొలుచువారై యశాస్త్రనియమములో వర్తించుచుందురు.

రామా. అట్టివారు పొందరాని విషయముగల కామము నాశ్రయించి, దంభమాన మదాన్వితులయి, అన్యాయముచేత గ్రహింపఁబడిన పరిగ్రహములుగలిగి అజ్ఞానులై, శాస్త్రమున విధింపఁబడిన వ్రతములే లేనివారై, వర్తింతురు.

శ్లో. చింతా మపరిమేయాంచ ప్రళయాంతా ముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః. 11

టీ. ప్రళయాంతాం=మరణమే తుదగాఁగలిగిన, అపరిమేయాం=అపరిమితమైన, చింతాం=చింతను, ఉపాశ్రితాః=ఆశ్రయించినవారలై, కామోపభోగపరమాః=కోరికల ననుభవించుటయే యుత్కృష్టముగాఁగలవారలై, ఏతావ దితి=ఇంతే యని, నిశ్చితాః=నిశ్చయించినవారలై.

తం. మఱియుఁ జావువఱకు హెచ్చుచింతతోఁ గామభోగ ములే పరమార్థములని నిశ్చయముగానమ్మి ప్రవర్తించుచుందురు.

రామా. ఈదినమో రేపో చావనున్నవారై ప్రాకృతప్రళయమువఱకును సాధింపవలసిన విషయముగల చింత నాశ్రయించి ప్రవర్తింతురు.

శ్లో. ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థమన్యాయే నార్థసంచయాన్. 12

టీ. ఆశాపాశశతైః = నూరువిధములైన యాశాపాశముల చేత, బద్ధాః=కట్టఁబడినవారలై, కామక్రోధపరాయణాః= కామక్రోధపరాయణులై, కామభోగార్థం=కామభోగములకొఱకు, అన్యాయేన=అన్యాయముచేత, అర్థసంచయాన్ = పదార్థసముదాయములను, ఈహంతే=కోరుచున్నారు.

తం. పలుతెఱంగుల యాశాపాశములచేఁ గట్టఁబడ్డవారై కామక్రోధములతో నిండినవారై కామభోగార్థమై అన్యాయ వర్తనములచే ద్రవ్యము నార్జింపఁగోరుచున్నారు.

శ్లో. ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇద మస్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్. 13

టీ. అద్య=ఇప్పుడు, మయా=నాచేతను, ఇదం=ఈధనము, లబ్ధం = పొందఁబడెను, ఇమంమనోరథం = ఈసంకల్పమును, ప్రాప్స్యే= పొందఁగలను, ఇదంధనం=ఈధనము, మే=నాకు, అస్తి=కలదు, ఇదమపి=ఈధనమును, మే=నాకు, పునః=తిరిగి, భవిష్యతి=లభింపఁగలదు.

శం. మఱియు నట్టివారింతద్రవ్య మిప్పుడు సంపాదించితిని. ఇఁకమీఁద నింత సంపాదించఁబోవుచున్నాను. ఇంతద్రవ్యము కలదు. ఇంక నీధనముగూడఁ బెంపఁగలను.

రామా. ఈక్షేత్రపుత్రాదిక మంతయు నాసామర్థ్యముచే తనే పొందఁబడినదిగాని అదృష్టాదికముచేతకాదు. ఈమనోరథమును నేనే పొందెదను అదృష్టాదిసహాయ మక్కఱలేదు. అని యాసురసంపదగలవారిమనోభావములు.

శ్లో. అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరా నపి,
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవా న్సుఖీ.

టీ. అసౌశత్రుః=ఈశత్రువు, మయా=నాచేత, హతః=చంపఁబడెను,అపరానపి=ఇతరశత్రువులను,హనిష్యే=సంహరించఁగలను, అహం=నేను, ఈశ్వరః=అధిపుఁడను, అహం=నేను, భోగీ= భోగవంతుఁడను, అహం=నేను,సిద్ధః=సంపన్నుఁడను, అహం=నేను, బలవాన్=బలవంతుఁడను, అహం=నేను, సుఖీ =సుఖవంతుఁడను,

శం. మఱియు నిప్పుడు నేనీశత్రువులను సంహారముచేసితిని, ఇఁకను నితరశత్రువులను జంపఁగలను, నేను నియామకుఁడను, భోగిని, సంపత్కారుఁడను,బలాఢ్యుఁడను, సుఖవంతుఁడను అని యెంచుచున్నారు.

రామా. శూరుండును, వీరుండును అగునేను శత్రువులను జంపెదను బలవంతుఁడనగునాచే వారు చచ్చెదరు. మందబుద్ధులమున దుర్బలులగువారిచేఁ గల్పింపఁబడిన 'అదృష్ట' మనెడి పరికరము (సాధనము) తోపనియేమి? నేనే యీశ్వరుఁడను, నాకు

నేనే యధీనుఁడను, ఇతరులను నియమించువాఁడను నేనే, అదృష్టాదులచేతఁగాక స్వయముగానే, నేను భోగిని. అటులనె సిద్ధుఁడను, బలవంతుఁడను, సుఖిని, అని యాసురసంపదకల వాఁ డనుకొనును.

శ్లో. ఆఢ్యోఽభిజనవా న స్మి కోఽన్యోఽ స్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇ త్యజ్ఞానవిమోహితాః.15

టీ. ఆఢ్యః=ధనముగలవాఁడను,అభిజనవాౝ=సత్కులము కలవాఁడను, అ స్మి=అయితిని, మయా=నాతోఁడ, సదృశః= సమానుఁడు, అన్యః = మఱియొకఁడు, కః=ఎవఁడు, అ స్తి = కలఁడు? యక్ష్యే=యజ్ఞముచేసెదను, దాస్యామి=ఇవ్వఁగలను, మోదిష్యే=సంతోషించఁగలను, ఇతి=ఈప్రకారముగా,అజ్ఞానవిమోహితాః=అవివేకముచేత మోహపెట్టఁబడినవారలై.

శం. ఇదియునుంగాక నేను ధనవంతుఁడను, నేను గొప్ప కులము గలవాఁడను, నాతో సమాను లెవ్వరును లేరు, నేను క్రతువులను జేయువాఁడను, దానధర్మముల నిచ్చువాఁడను, సంతోషించు వాఁడను అని యిన్నివిధములుగా నవివేకపు మాటలు తలంచుచున్నారు.

రామా. ఉత్తరార్ధతాత్పర్యము:—ఈశ్వరానుగ్రహ మక్కఱలేక తామె యాగదానాదులను చేయఁజాలుదుమని అజ్ఞానమోహితులై తలంచెదరనుట.

శ్లో. అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ.     16

టీ. అనేకచిత్తవిభ్రాంతాః=నానావిధచిత్తవైకల్యము కల వారలై, మోహజాల సమావృతాః= మోహపాశములచేతఁ జుట్టఁబడిన వారలై, కామభోగేషు=కామానుభవముల యందు, ప్రసక్తాః = ఆసక్తులైనవారలై, అశుచౌ = అశుచియైన, నరకే=నరకమందు, పతంతి=పడుచున్నారు.

శం. అట్టి దురాచారపు మానవు లనేక విషయములయందాసక్తి యుంచుటవలన చిత్తవిభ్రాంతిఁ బొంది యాశాపాశము లనెడువలలచేతఁ జుట్టుకోఁబడినవార లై కామానుభవములయందు మునింగినవార లై ఘోరమైన నరకమును బొందుచున్నారు.

రామా. అదృష్టము, ఈశ్వరుఁడు మొదలగు వాని సహాయ మక్కఱలేకయే, తనంతనె యంతయును చేయఁదగుదునని తలంచి ఇట్లు చేయుదును, ఇదియు చేయుదును, మఱియొక్కటియు చేయుదును, అని యిట్లు అనేకచిత్తవిభ్రాంతులు, కామభోగములయందు మిక్కిలిగాఁ దగులు కొన్నవారై నడుమనె చచ్చి నరకమునఁ బడుదు రనుట.

శ్లో. ఆత్మసంభావితా స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామ యజ్ఞైస్తే దంభే నావిధిపూర్వకమ్. 17

టీ. ఆత్మసంభావితాః=తమచేతఁ దామేస్తోత్రముచేసికొనఁబడుచున్నవారలై, స్తబ్ధాః=పెద్దలనిరాకరించువారలై, ధనమానమదాన్వితాః=ధనమానమదములతోఁగూడినవారలై, తే=ఆయవివేకులు, నామయజ్ఞైః=నామమాత్రయజ్ఞములచేతను, దం

భేన=దంభముచేతను, అవిధిపూర్వకం = శాస్త్రోక్తవ్యతిరిక్తముగా, యజంతే=యజ్ఞముజేయుచున్నారు.

శం. మఱియు నట్టి యజ్ఞానులు తమ్ము తామే పొగడుకొని పెద్దల నిరాకరించి ధనమానమదములతోఁగూడుకొని డంబము కొఱకై శాస్త్రసమ్మతముగాని యజ్ఞములను జేయుచుందురు.

రామా. మఱియు నట్టియజ్ఞానులు, తమ్ముతామే పొగడికొని, తాము పరిపూర్ణులని తలంచుచు, ఏమియుం జేయనివారై ధనమానమదాన్వితులై యజ్ఞములుచేయువా రనెడి పేరు కలుగుటకుమాత్రము చేయుచుండువారై యుందురు.

శ్లో. అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మా మాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః.

టీ. అహంకారం= అహంకారమును, బలం=బలమును, దర్పం=దర్పమును, కామం=కామమును, క్రోధం=క్రోధమును, సంశ్రితాః=ఆశ్రయించిన వారలయి, ఆత్మపరదేహేషు=స్వేతరదేహములయందలి, మాం=నన్ను, ప్రద్విషంతః=ద్వేషించుచున్నవారలై, అభ్యసూయకాః = పరశ్రేయస్సును సహించనివారలై, యే=ఎవరు, వర్తంతే=ఉన్నారో.

శం. మఱియు నహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము గలవారై, సర్వాంతర్యామి యైననన్ను ద్వేషించి యితరుల సద్గుణములను సహింపక వారలయందు లేనితప్పులను చెప్పుదురో.

రామా. రెండవదాని యపేక్షలేక యన్నిటిని నేనచేసెదనను అహంకారమును, నావంటివాఁడు లేఁడను దర్పమును,

బలమును, నేనుకోరఁగా నన్నియు సమకూరును సను కామము
ను, నాకనిష్టము చేసెడివారల చంపుదునను క్రోధమును, అన్ని
శరీరములయందుండి అన్నిటికిని ప్రేరకుండై పురుషోత్తముఁ
డగు నన్నుఁజూచి అసూయపడుచున్నవారై, యుక్తులచే నేను
(దైవము) లేనని వాదించి ప్రకటించుచున్నవారై, నన్ను స
హింపనివారలగుచు, అహంకారము మొదలగు వానిని యా
శ్రయించినవారై యోగాది కర్మాచరణంబు చేయుచున్నారు.

శ్లో. తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు. 19

టీ. అహం=నేను, ద్విషతః=ద్వేషులయిన, క్రూరాన్=క్రూ
రులయిన, అశుభాన్=శుభరహితులయిన, తాన్నరాధమాన్=
ఆమనుష్యాధములను, అజస్రం=నిరంతరమును, సంసారేషు=
సంసారములయందును, ఆసురీషు=అసుర సంబంధములయిన,
యోనిష్వేవ=యోనులయందే, క్షిపామి= ఉంచుచున్నాను.

శం. నాకు శత్రువులయి చెడుమనస్సు గలయట్టి నీచుల
నెల్లప్పుడు రాక్షసాంశమైన నికృష్టజన్మముల నెత్తునట్లుగాఁ
జేయుచున్నాను.

రామా. ఇట్లు నన్ను ద్వేషించెడి క్రూరులగు నరాధములఁ
ను, పుట్టుక, ముదిమి, చావు మొదలగు రూపముల తిరుగుచు
న్న సంతానములయందు నాకనుకూలముకాని జన్మములుగల
వారినిగా నొనర్చి, ఆజన్మములను పొందుటకు తగినట్లు ప్రవర్తిం
చుటకు హేతువులగు క్రూరబుద్ధులయందు నేనె చేర్చెదను.

శ్లో. ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మనిజన్మని,
మామప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాంగతిమ్.

టీ. హేకౌంతేయ=ఓయర్జునా! మూఢాః = అవివేకులు, జన్మనిజన్మని=ప్రతిజన్మమందును, ఆసురీంయోనిం= అసురయోనిని, ఆపన్నాః=పొందినవారలయి, మాం=నన్ను, అప్రాప్యైవ=పొందకయే, తతః=ఆతర్వాత, అధమాంగతిం=నికృష్టగతిని, యాంతి=పొందుచున్నారు.

శం. అర్జునా! అట్టినికృష్టజన్మముల నొందెడు నవివేకులు నికృష్టజన్మముల నెత్తుచు జన్మజన్మమునకు నధోగతిని బొందుచు నుందురేగాని నన్నెప్పటికిని జెందఁజాలరు.

రామా. నా కనుకూలముగా నుండని జన్మమును పొందినవారై, నాయెడను విరుద్ధమైన జ్ఞానముకలవారై, సర్వేశ్వరుఁడు కలఁడను జ్ఞానమును పొందక యుందురనుట.

శ్లో. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్.

టీ. కామః=కోరికయనియు, క్రోధః = క్రోధమనియు, తథా=అలాగే, లోభః=లోభమనియు, త్రివిధం=మూడువిధములుగలిగిన, ఇదం=ఇది, నరకస్య=నరకమునకు, ద్వారం = వాకిలి, ఆత్మనః=తనకు, నాశంచ=నాశకరమైనది, తస్మాత్ = అందులవలన, ఏతత్త్రయం=యీమూటిని, త్యజేత్ = విడువవలయును.

శం. కామము, క్రోధము, లోభము ఈమూడును ఆత్మను నాశముచేయునట్టివి. అవి నరకప్రాప్తికి హేతువులగును గనుక నీగుణములను విడిచిపెట్టవలయును.

రామా. కామము, క్రోధము, లోభము యీమూఁడును ఆసురస్వభావమనెడి నరకమునకు హేతువులు. అతి ఘోరమగు నరకమునకు హేతువు లగుటచే నీమూఁటిని పూర్ణముగా విడిచిపెట్టవలయును.

శ్లో. ఏతై ర్విముక్తః కౌంతేయ! తమోద్వారై స్త్రిభి ర్నరః,
ఆచర త్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్. 22

టీ. హేకౌంతేయ=ఓయి యర్జునా! త్రిభిః=మూఁడైన, ఏతైః=ఈ, తమోద్వారైః=నరకద్వారములచేత, విముక్తః=విడువఁబడిన, నరః=నరుఁడు, ఆత్మనః=తనకు, శ్రేయః=శ్రేయస్సును, ఆచరతి = ఆచరించుచున్నాఁడు, తతః = అనంతరమం, పరాంగతిం=మోక్షగతిని, యాతి=పొందుచున్నాఁడు.

శం. అర్జునా! పైఁజెప్పిన కామ క్రోధ లోభములను వదలినవాఁడు తనయాత్మకు శ్రేయస్కరమై శాస్త్రసమ్మతమైన తపోయోగాదికర్మలనాచరించి మోక్షమును బొందుచున్నాఁడు.

రామా. నన్ను గూర్చిన విపరీతజ్ఞానమునకు హేతువులైన యీకామ, క్రోధ, లోభములచేత ఏ నరుఁడు విడువఁబడుచున్నాఁడో, వాఁడు నన్ను తెలిసికొని నా యనుకూల ప్రకారము ప్రవర్తించి, గొప్పగతి యనఁగా మోక్షమును పొందుననుట.

శ్లో. యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. 23

టీ. యః=ఎవ్వఁడు, శాస్త్రవిధిం=శాస్త్రవిధిని, ఉత్సృజ్య=విడిచి, కామకారతః=యథేచ్ఛముగా, వర్తతే=వర్తించు

చున్నాఁడో, సః=వాఁడు, సిద్ధిం=సిద్ధిని, నావాప్నోతి=పొందఁడు, సుఖంచ=సుఖమును, నావాప్నోతి=పొందఁడు, పరాంగతిం=మోక్షగతిని, నావాప్నోతి=పొందఁడు.

శం. ఎవఁడు శాస్త్రనియమమునను సరించక యిచ్ఛామార్గముగా వర్తించుచున్నాఁడో యట్టివానికి సిద్ధిలేదు, సుఖములేదు, పరలోకప్రాప్తిలేదు.

రామా. ఎవఁడు వేదములనెడి నాయాజ్ఞను అనుసరించక తన చిత్తమునకు వచ్చినమార్గము ననుసరించువాఁడై వర్తించుచున్నాఁడో వాఁడు కామముయొక్క పరలోకములోని సిద్ధినిపొందఁడు. సుఖమునుగూడ పొందఁడు, గొప్పగతిని దేనివలన పొందుననుట.

శ్లో. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి. 24

టీ. తస్మాత్=అందువలన, కార్యాకార్యవ్యవస్థితౌ=కర్తవ్యాకర్తవ్యనిర్ణయమందు, తే=నీకు, శాస్త్రం = శాస్త్రము, ప్రమాణం=జ్ఞానసాధనము, (అందువలన), శాస్త్రవిధానోక్తం =శాస్త్రవిధిచేతఁ జెప్పఁబడిన, కర్మ=కర్మమును, జ్ఞాత్వా= తెలిసికొని, ఇహ=ఇయ్యెడ, కర్తుం=చేయుటకొఱకు, అర్హసి =తగుదువు.

శం. కావున, శాస్త్రములను ప్రమాణములని నమ్మి శాస్త్రసమ్మతములైన కర్మలను, శాస్త్రబాహ్యములైన కర్మలను నెఱింగి శాస్త్రోక్తములైన కర్మలనే నీ వాచరించుచుండుము.

రామా. స్వీకరింపవలసిన దానిని, విడువవలసినదానిని ఏర్పఱచుటయందు, ధర్మశాస్త్రములు, ఇతిహాసములు, పురాణములు మొదలగువానిని సహాయముగాఁగల వేదములు పురుషోత్తముఁడను పరతత్త్వమును తెలియఁ జేయుచున్నవి. ఆ శాస్త్రమునఁ జెప్పఁబడిన తత్త్వములను కర్మమును హెచ్చు తగ్గు లేకుండునట్లు తెలిసికొని దానినె స్వీకరింపఁ దగుదువు.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే
దైవాసురసంపద్విభాగయోగో నామ
షోడశోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జున సంవాదాత్మకంబు నైన
శ్రీభగవద్గీతలయందు దైవాసురసంపద్విభాగయోగ
మనెడి షోడశాధ్యాయము.



శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## శ్ర ద్ధా త్ర య వి. భా గ యో గః.

అర్జున ఉవాచ.—

శ్లో. యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాఽన్వితాః,
తేషాం నిష్ఠా తు కా కృష్ణ!సత్త్వమాహో రజస్తమః. 1

అర్జునుఁ డడుగుచున్నాఁడు.—

టీ. హేకృష్ణ=ఓయి శ్రీకృష్ణస్వామీ! యే=ఎవరు, శాస్త్రవిధిం=శాస్త్రాచారమును, ఉత్సృజ్య=విడిచి, శ్రద్ధయా=(వృద్ధాచారసంప్రదాయానుసారముగా) ఆస్తిక్యబుద్ధితో, అన్వితాః=కూడినవారై, యజంతే=పూజించుచున్నారో, తేషాం=వారలయొక్క, నిష్ఠా=నిలుకడ, కా=ఎట్టిది, సత్త్వమాహో=సాత్త్వికమా (లేక)? రజః=రాజసమా? తమః=తామసమా?

శం. అచ్యుతా! ఎవఁడు శాస్త్రమందలి యాచారమును వదలి వృద్ధాచార సంప్రదాయమయిన పూజలు మొదలగునవి శ్రద్ధతోఁ జేయుచున్నాఁడో వానిగతి యేమగుచున్నది? అటువంటియాచారము సత్త్వరజస్తమములలో నెయ్యది?

రామా. ఎవఁడు శాస్త్రమందలి యాచారమును వదలి ఆస్తికబుద్ధితో పూజలు మొదలగునవి చేయుచున్నాఁడో

వాఁడు సత్త్వమందుండునా? రజస్సునందుండునా? తమస్సునందుండునా?

మధ్వ. శాస్త్రవిధిని విడిచి వేదవిధినెఱుంగక, ద్విజుఁడైన వాఁడు రహస్యములతోఁగూడ వేదమునంతయు తెలిసికొనునది అనువిధివారిచేత విడువఁబడినది కదా? వేదమును విడుచుటయె తాత్పర్యమైన వారిని తామసులనియె చెప్పవలసియుండును. ఆసందర్భమున సాత్త్వికరాజసతామసులని త్రివిధవిభజన చెప్పఁగూడకపోవుననుట.

శ్రీ భగవానువాచ.—

శ్లో. త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2

శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు:—

టీ. దేహినాం=దేహధారులకు, స్వభావజా=సంస్కారమువలనఁబుట్టిన, సా(శ్రద్ధా=ఆవిశ్వాసము, సాత్త్వికీ=సాత్త్వికవిషయమనియు, రాజసీ=రాజసవిషయమనియు, తామసీ=తామసవిషయమనియు, త్రివిధా=మూఁడువిధములుగలిగినది, భవతి=అగుచున్నది, తాం=ఆశ్రద్ధను, శృణు=వినుము.

శం. శరీరము గలిగియుండువారలకుండు శ్రద్ధ, పూర్వజన్మవాసన ననుసరించి, సాత్త్వికము, రాజసము, తామసము అని మూఁడువిధములుగా నున్నది. వాని వివరించెద వినుము.

రామా. శ్రద్ధయనఁగా నిది మనయిష్టము నీడేర్చునను సాధనములోని త్వర. వాసన, రుచి, శ్రద్ధ యివి ఆత్మయొక్క ధర్మ

ములు. అవి గుణసంపర్కమువలన కలుగునవి. ఈధర్మములను కలుగఁ జేయునవి, దేహము, ఇంద్రియములు. అంతఃకరణము - విషయములు వీనియందుండెడి సత్త్వాదులు - కాఁబట్టి యీ శ్రద్ధ సాత్త్వికి యనియు రాజసియనియు తామసియనియు త్రివిధములు. ఈశ్రద్ధ ఎటువంటిస్వభావము కలదో అస్వభావమును వినుము.

శ్లో. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్సఏవ సః.

టీ. భారత=అర్జునా! సర్వస్య=సమస్తప్రాణులకును, సత్త్వానురూపా=విశిష్టసంస్కారయుక్తాంతఃకరణమునకు ననురూపమయి, శ్రద్ధా=విశ్వాసము, భవతి=అవుచున్నది. (ఆ కారణమువలన), అయంపురుషః=ఈజీవుఁడు, శ్రద్ధామయః=అస్తిక్యబుద్ధిగలవాఁడు, యః=ఏపురుషుఁడు, యచ్ఛ్రద్ధః=ఏయాస్తిక్యబుద్ధిగలవాఁడో, సః=ఆపురుషుఁడు,సఏవ=ఆశ్రద్ధయే ప్రధానముగాఁగలవాఁడు.

శం. భారతా! ఎల్ల ప్రాణులకు వారివారిపూర్వజన్మంబులయందుఁ జేసిన కర్మఫలంబుల ననుసరించి శ్రద్ధ గలుగుచున్నది. ఆహేతువువలన జీవులకు పైఁజెప్పఁబడిన మూడుగుణములలో నేగుణ మలవడుచున్నదో యాగుణము ననుసరించినశ్రద్ధగలుగుచున్నది.

రామా. అంతఃకరణము ఎట్టిగుణము కలదో అట్టి దానియందు శ్రద్ధపుట్టును, ఎవఁడెట్టి శ్రద్ధకలవాఁడై యుండునో వాఁడు ఆశ్రద్ధయొక్క పరిణామమె పుణ్యకర్మమున శ్రద్ధకలవాఁ

డయ్యేనేని పుణ్యకర్మములతోఁ గూడిన వాఁడగును. కాఁబట్టి ఫలముకలుగుటకు శ్రద్ధయె ప్రధానము.

మధ్వ. సమస్తప్రాణులకు చిత్తమునకు తగిన శ్రద్ధ కలుగుచున్నది. ఎవ్వఁడు ఎట్టిశ్రద్ధకలవాఁడో వాఁడట్టివాఁడే. సాత్త్వికశ్రద్ధకలవాఁడు సాత్త్వికుఁడేయగును.

శ్లో. యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః.

టీ. సాత్త్వికాః=సత్త్వగుణనిష్ఠులు, దేవాన్=దేవతలును, యజన్తే=పూజించుచున్నారు, రాజసాః=రజోగుణనిష్ఠులు, యక్షరక్షాంసి=యక్షరాక్షసులను, యజన్తే = పూజించుచున్నారు, తామసాః=తమోగుణనిష్ఠులైన, అన్యే=మఱికొందఱు, జనాః=జనులు, ప్రేతాన్=ప్రేతలను, భూతగణాంశ్చ=మాతృకాదులను, యజన్తే=పూజించుచున్నారు.

శం. సత్త్వగుణ మలవడినవారలు దేవతలను,రజోగుణనిష్ఠులగువారలు యక్షరాక్షసులను, తమోగుణ మలవడినవారలు ప్రేతభూతగణంబులను శ్రద్ధతోఁబూజింతురు.

రామా. దుఃఖసంపర్కము లేని గొప్పసుఖమును కలుగఁజేసెడి దేవయాగములం గూర్చిన శ్రద్ధ సాత్త్వికి - దుఃఖముతోఁగూడిన సుఖమును కలుగఁ జేయునది రాజసి - దుఃఖవిస్తారము గలిగిన స్వల్పసుఖమును కలుగఁ జేసెడి శ్రద్ధ తామసి.

శ్లో. అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపోజనాః,
దమ్భాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. 5

కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః,
మాం చైవాంత శ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్.6

టీ. దంభాహంకారసంయుక్తాః= దంభాహంకారములతోఁ గూడినవారై, కామరాగబలాన్వితాః=కోరిక అనురాగము బలము వీనితోఁ గూడుకొనినవారై, యేజనాః = ఏజనులు, అశాస్త్రవిహితం = శాస్త్రోక్తముగానట్టి, ఘోరం=పీడాకర మైనట్టి, తపః=తపస్సును, తప్యంతే=తపించుచున్నారో, యే అచేతసః = ఏయవివేకులు, శరీరస్థం=శరీరమందున్న, భూత గ్రామం = ఇంద్రియసమూహమును, అంతశ్శరీరస్థం=తత్కర్మ సాక్షిభూతమైయున్న, మాంచ=నన్ను, కర్శయంతః=కృశింపఁ జేయుచున్నారో, తాన్=వారలను, ఆసురనిశ్చయాన్=రాక్షస సంబంధమైన నిశ్చయము గలవారలనుగా, విద్ధి= తెలియుము.

శం. డంబము అహంకారము గలిగి కామరాగబలముల తోఁ గూడి యేమనుష్యులు శాస్త్రవిహితము గాని ఘోర తపమును జేయుచున్నారో అట్టి యవివేకులు తమశరీరముల యందున్న ఇంద్రియసమూహమును ఆకర్మసాక్షి యగు నన్ను కృశింపఁజేయుచున్నారో అట్టివారిని ఆసురప్రకృతిసంభూతులు గా దెలియుము.

రామా. దంభాహంకారసంయుక్తులై, కామరాగబలాన్వితు లై, యేమనుష్యులు అశాస్త్రీయములగు యాగాదులను గూడ చేయుచున్నారో, అట్టియవివేకులు తమశరీరమునందుండెడి పంచభూతములను, నాయంశమైన జీవుని కృశింపఁజేయుచు న్నారు. అట్టివారిని నాయాజ్ఞకువిరుద్ధముగా నాచరించువారని

తెలియును. అందువలననె వారికి సుఖ మావంతయైనం గలుగదు. అనర్థమున వారు బడుదురనుట.

మధ్వ. భగవంతుని కృశింపఁజేయుట యనఁగా నల్పుఁడని తలంచువారు. వారు అసురసంబంధియగునిశ్చయముకలవారు.

శ్లో. ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు.

టీ. సర్వస్య=సమస్తప్రాణులకును, త్రివిధః=మూడువిధములుగలిగిన, ఆహారః=ఆహారము, ప్రియః=ఇష్టమైనది, భవతి=అవుచున్నది, తథా=అలాగుననే, యజ్ఞః=యజ్ఞమును, తపః=తపస్సును, దానం=దానము, ప్రియః=ప్రియమైనది, తేషాం=వానియొక్క, ఇమంభేదం=ఈభేదమును, శృణు=వినుము.

శం. ఎల్ల ప్రాణులకు ఆహారపదార్థములుగూడఁ బైఁజెప్పిన సత్త్వరజస్తమోగుణముల ననుసరించి యిష్టముగా నుండునవి. ఆవిధముననే యజ్ఞము, తపస్సు, దానమున్ను త్రిగుణాత్మకములుగా నున్నవి. వానితారతమ్యంబుల వివరించెద వినుము.

రామా. సత్త్వాది సంబంధములఁ బట్టి మూఁడువిధములై ఇష్టమగుచున్నది.

శ్లో. ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యా స్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః.

టీ. రస్యాః=రసయుక్తములైనవియు, స్నిగ్ధాః=చమురుతోఁగూడినవియు, స్థిరాః=చిరకాలస్థాయులైనవియు, హృద్యాః=ప్రియములైనవియు, ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః=ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివృద్ధికరములైనవియునైన, ఆ

హారాః=భోజనములు, సాత్త్వికప్రియాః=సత్త్వగుణములు గల వారలకు నిష్టములైనవి.

శం. సత్త్వగుణవంతులు రసయుక్తములైనట్టియు, నేతితోఁ గూడియున్నట్టియు, చిరకాలస్థాయులైనట్టియు, ప్రియములైనట్టియు, ఆయుస్సు, సత్త్వము, బలము, ఆరోగ్యము, ప్రీతి వీని వృద్ధి చెందించునట్టి భోజనపదార్థములను నిష్టముతో నంగీకరింతురు.

రామా. అంతఃకరణ శుద్ధిఁగల జ్ఞానులు, సాత్త్వికాహారమును ఇష్టపడుటచేత వారిమన మభివృద్ధియై, అవి వారియందు పక్వమగునప్పుడు వారికి స్వయముగా సుఖమును వృద్ధిఁబొందించును. ప్రీతిని కలుగఁజేసెడి పనులను చేయించును. అవి మధురరసముగల యాహారములు; స్థిరమైన పరిణామముఁగలవి; ఇంపైనవియనుట.

మధ్వ. ప్రీతితరువాతఁ గలుగునవి, చూచినతోడనె హృద్యత్వముకలిగించునవి, స్థిరములుగా నుండునవి అప్పుడె పక్వములైపోవు నెయ్యి మొదలగునవి యట్టిసాత్త్వికాహారములు గదా?

శ్లో. కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 9

టీ. దుఃఖశోకామయప్రదాః=దుఃఖశోకరోగప్రదములైన, కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహితః- కటు=మిక్కిలి చేఁదును, ఆమ్ల=మిక్కిలి పులుసును గలవియు, లవణ=మిక్కిలి యుప్పును గలవియు, అత్యుష్ణ = మిక్కిలి వేఁడిచేయునవియు, తీక్ష్ణ=మిక్కిలి కారముగలవియు, రూక్ష=కఠినమైనవియు(కోద్రవాదులును), విదాహినః=అతిదాహము కలిగించునవియు నగు

(ఆవాలు మొదలైనవి), ఆహారాః=ఈఆహారములు, రాజసస్య=రజోగుణముగలవానికి, ఇష్టాః=ప్రియములు.

శం. దుఃఖము, శోకము, రోగము గలుగఁజేయునట్టియు మిక్కిలి చేఁదు, ఉప్పు, పులుసు గలిసి కారమైన వేడిపదార్థంబుల రజోగుణప్రధాను లిష్టముతో నంగీకరింతురు.

శ్లో. యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. 10

టీ. యాతయామం=జాము వెళ్లి చల్లనైనది, గతరసం=రసవర్జితమైనదియు, పూతి=దుర్గంధముగలిగినదియు, పర్యుషితం=పక్వమై రాత్ర్యంతరితమైనదియు, ఉచ్ఛిష్టం=భుక్తావశిష్టమైనదియు, అమేధ్యం=అపవిత్రమైనదియు, భోజనం=ఆహారము, యత్=ఏదో, తత్=ఆయాహారము, తామసప్రియం=తమోగుణములు గలవాని కిష్టమైనది.

శం. వంటచేసినపిదప జాముకాలమై చల్లారినదియు, సారములేనిదియు, దుర్గంధమైనదియు, సద్దియైనదియు, భుజింపఁగా మిగిలినదియు, అపవిత్రమయినదియునగు పదార్థములను తమోగుణవంతులు వాంఛింతురు.

రామా. చాలకాలముండి నదియు, స్వభావసిద్ధమైన రుచి పోయినదియు, కాలాంతరమున మఱియొకరుచి పొందినదియు, దుర్గంధమైనదియు, (పూతి) గురువు మొదలగు వారుకాక మిగిలిన వారిఎంగిలి, యజ్ఞమునకు తగనిది అనఁగా యజ్ఞము చేయఁగా మిగిలినది, కానిదియునగు పదార్థములు తమస్సును వృద్ధిఁబొందించును. కాఁబట్టి హితమునుకోరువారు సత్త్వమును

వృద్ధిఁ బొందించుటకై సాత్త్వికాహారమునె పుచ్చుకొనునది యనుట.

శ్లో. అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మే వేతి మనస్సమాధాయ స సాత్త్వికః. 11

టీ. విధిదృష్టః=శాస్త్రోక్తవిధిచేతఁ జూడఁబడిన, యో య జ్ఞః=ఏయజ్ఞము, అఫలాకాంక్షిభిః=ఫలాకాంక్షారహితులచేత, యష్టవ్యమేవేతి = యజ్ఞముచేయఁదగినదే యని, మనః = మనస్సును, సమాధాయ=నిశ్చయముచేసికొని, ఇజ్యతే=చేయఁబడుచున్నదో, సః = ఆయజ్ఞము, సాత్త్వికః = సత్త్వగుణప్రధానమైనది.

శం. శాస్త్రవిధిచేత నియమితమైన యజ్ఞములను ఫలకాంక్షలేక చేయుట మంచిదని మనసున నిశ్చయించి యేయజ్ఞములు చేయఁబడుచున్నవో అవి సత్త్వగుణప్రధానములైన వని తెలియుము.

రామా. శాస్త్రోక్త మంత్రాదులచే నియమితమైన యజ్ఞములను ఫలవర్జితులై భగవదారాధనయె ప్రయోజనముఁ గలిగి చేయునట్టివి సాత్త్వికయాగము లనఁబడును.

శ్లో. అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12

టీ. హే భరతశ్రేష్ఠ = ఓ యర్జునా! యత్=ఏయజ్ఞము, ఫలం=ఫలమును, అభిసంధాయ=ఉద్దేశించి, దంభార్థమపి=మహత్త్వప్రకటనముకొఱకును, ఇజ్యతే = యాగముచేయఁబడు

చున్నదో, తం యజ్ఞం=ఆయజ్ఞమును, రాజసం=రజోగుణప్ర ధానమైనదానిగా, విద్ధి=తెలియుము.

శం. భారతా! ఫలము నుద్దేశించిగాని ప్రతిష్ఠకొఱకుఁగాని చేయఁబడు యజ్ఞములు రజోగుణప్రధాన మైనవిగాఁ దెలి యుము.

రామా. దంభముతోఁగూడినదై కీర్తియె ఫలముగాఁ గల యజ్ఞమురజోగుణ ప్రధానమైనదిగా నోయర్జునా! తెలియుము.

శ్లో. విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 13

టీ. విధిహీనం=శాస్త్రవిహితముకానట్టియు,అసృష్టాన్నం= అన్నదానరహితమైనట్టియు, మంత్రహీనం=మంత్రరహితమైన ట్టియు,అదక్షిణం=దక్షిణలేనట్టియు, శ్రద్ధావిరహితం=విశ్వాస ములేనట్టియు, యజ్ఞం=యజ్ఞమును, తామసం = తమోగుణ ప్రధాన మైనదానినిగా, పరిచక్షతే=చెప్పుదురు.

శం. శాస్త్రసమ్మతము కానిదియు, అన్నదానము లేనిది యు, మంత్రలోప మైనదియు, శాస్త్రోక్తదక్షిణలేనిదియు, శ్రద్ధ లేక చేయఁబడినదియు నగు యజ్ఞము తమోగుణప్రధానమని తెలియుము.

రామా. మంచియాచారములులేనివారును అపండితులును అబ్రాహ్మణు లగువారిని యొద్ద యుంచుకొనిచేయు యాగ ములు, శాస్త్రమున చెప్పఁబడనిద్రవ్యయుక్తమైనదియు గలవి తమోగుణప్రధానమని తెలియుము.

శ్లో. దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్,
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. 14

టీ. దేవద్విజగురుప్రాజ్ఞపూజనం = దేవబ్రాహ్మణగురుప్రాజ్ఞులఁబూజించుటయును, శౌచం=శుచిత్వమును, ఆర్జవం=ఋజుత్వమును, బ్రహ్మచర్యం=స్త్రీసక్తుఁడు కాకయుండుటయు, అహింసా చ=హింసారాహిత్యమును, శారీరం=శరీరప్రధానమైన, తపః=తపస్సని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

శం. దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పెద్దలను బూజించుటయు, శుచి, కిల్బిషములేమి, నిషిద్ధస్త్రీగమనవర్జనము, ఇతరప్రాణులకు హానిచేయక యుండుట ఇవి యన్నియు శరీరప్రధానమైన తపస్సు లని చెప్పఁబడుచున్నవి.

రామా. దేవబ్రాహ్మణగుర్వార్య పూజల సల్పుట, తీర్థాది సేవలఁ జేయుట, మనస్సును శరీరము నేకవిధముగాఁ బ్రవర్తింపఁజేయుట, స్త్రీలయందు భోగ్యతాబుద్ధితో చూచుటలేమి, ప్రాణులను పీడింపమి ఇవియన్నియు శరీరప్రధానమైన తపస్సులని తెలియుము.

శ్లో. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

టీ. అనుద్వేగకరం=దుఃఖకరముగాని, సత్యం=యథార్థమైన, ప్రియహితం=ప్రియహితములైన, వాక్యం=వచనమును, స్వాధ్యాయాభ్యసనం=వేదాభ్యసనమును, యత్=ఏదో, తత్=అది, వాఙ్మయం=వాగ్రూపమైన, తపః=తపస్సని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

శం. ఇతరప్రాణులకు మనస్సు నొప్పింపనిదియు, ప్రీతిః శ్వాసంబులతోఁ గూడినదియునగు యథార్థభాషణమును, వేద మభ్యసించుటయును, వాగ్రూపమైన తపంబులని పేర్కొనం బడు.

శ్లో. మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రి త్యేత త్తపో మానస ముచ్యతే. 16

టీ. మనఃప్రసాదః=చిత్తనైర్మల్యమును, సౌమ్యత్వం =మంచివృత్తియు, మౌనం=వాఙ్నియమమును, ఆత్మవినిగ్రహః=మనోనిగ్రహమును, భావసంశుద్ధిః=కపటములేమియు, ఇత్యేతత్=అనునిది, మానసం=మనస్సంబంధమైన, తపః = తపస్సని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

శం. మనోనైర్మల్యమును, సద్వృత్తియు, మితముగా మాటలాడుటయును, మనోనిగ్రహమును, కపటములేమియు,మనస్సునకు సంబంధములైన తపస్సులని చెప్పంబడును.

రామా. కోపాదులులేమి, మనస్సు ఇతరులకు మేలు కలుగుటయందు ఆసక్తికలదై యుండుట, మనస్సుచేత వాక్కును ప్రవర్తింప నీయకచేయుట, మనస్సును ధ్యానాసక్తముచేయుట ఆత్మ తప్ప మిగిలిన విషయములయందు తలంపులేకపోవుట యివన్నియు మనస్సంబంధము లైనతపస్సులు.

రామా. యుక్తులు అనఁగా పరమపురుషారాధనము అనెడి తలంపుతోఁ గూడినవారు.

శ్లో. శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే. 17

టీ. అఫలాకాంక్షిభిః=ఫలకాంక్షారహితులైన, యుక్తైః=యోగులైన, నరైః=నరులచేత, పరయా=ఉత్కృష్టమైన, శ్రద్ధయా=ఆస్తిక్యబుద్ధిచేత, తప్తం=తపింపఁబడిన, త్రివిధం=మూఁడువిధములుగలిగిన, తత్తపః=ఆతపస్సును, సాత్త్వికం=సత్త్వగుణముచేతనైనదానినిగా, పరిచక్షతే=(పెద్దలు) చెప్పుచున్నారు.

శం. ఫలకాంక్ష లేక, మిక్కిలి పరిశుద్ధమైన శ్రద్ధతో, యోగులొనర్చునట్టి పైవిరించిన త్రివిధమైన శరీరవాఙ్మనస్తపంబులు సత్త్వగుణప్రధానంబులని పెద్దలు చెప్పుదురు.

శ్లో. సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్. 18

టీ. సత్కారమానపూజార్థం=సత్కారముకొఱకును బహుమానముకొఱకును పూజకొఱకును, దంభేన=దంభముచేత, యత్తపః=ఏతపస్సు, క్రియతే=చేయఁబడుచున్నదో, ఇహ=ఈలోకమందు, చలం=చలమైన, అధ్రువం=నశించునట్టి, తత్తపః=ఆతపస్సు, రాజసం=రజోగుణసంబంధమైనదని, ప్రోక్తం=చెప్పఁబడెను.

శం. ఇతరులచేతఁ బూజింపఁబడుటకును, గౌరవార్థముగను, డంబముకొఱకును జేయునట్టి తపంబు, రజోగుణసంబంధమనియు, నాశమొందఁదగినదనియు, చంచలమైనదనియు నార్యులు పలికిరి.

రామా. మనస్సుచేత నాదరించుట, నోటప్రశంసించుట, ఫలపుకోరికతోడను సత్కారాదులకొఱకు చేయునట్టితపంబును స్వర్గముమొదలగు నస్థిరములైనఫలముల నిచ్చుదానికై

కోరుట, స్వర్గమునుండి పడిపోదుమనిభయమును పుట్టించునది, క్షయించునది యనునీగుణములు రాజసములని ఆర్యులుపలికిరి.

శ్లో. మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్. 19

టీ. మూఢగ్రాహేణ = అవివేకనిశ్చయముచేత, ఆత్మనః = దేహముయొక్క, పీడయాచ = పీడచేతను, పరస్య = పరునియొక్క, ఉత్సాదనార్థం వా = వినాశముకొఱకైనను, యత్తపః = ఏతపస్సు, క్రియతే = చేయఁబడుచున్నదో, తత్ = ఆతపస్సు, తామసం = తామస మని, ఉదాహృతం = చెప్పఁబడెను.

శం. తనకు దుఃఖమును గలుగఁజేయునదియై, ఇతరప్రాణుల నొప్పించునదియునై, చెడ్డయాగ్రహముచేతఁ జేయఁబడిన తపంబు తమోగుణసంబంధమైనది యని పెద్దలు నక్కాణించెదరు.

శ్లో. దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్.

టీ. దాతవ్యమితి = ఇయ్యవలయునని, యద్దానం = ఏదానము, దేశే = ఉత్తమక్షేత్రమందును, కాలేచ = పుణ్యకాలమందును, పాత్రేచ = యోగ్యునియందును, అనుపకారిణే = ప్రత్యుపకారము లేనివానికొఱకు, దీయతే = ఇయ్యఁబడుచున్నదో, తద్దానం = ఆ దానము, సాత్త్వికం = సాత్త్వికమని, స్మృతం = స్మరింపఁబడెను.

శం. దానమొనర్చుట యావశ్యకంబని యెంచి, దేశకాల పాత్రంబుల నెఱిఁగి, ప్రత్యుపకార మొనర్పఁగ లేనిపురుషుల కిచ్చుదానము సత్త్వగుణప్రధానమైన దని చెపఁబడుచున్నది

రామా. దాతవ్యం=ఈయవలసిన దేయని తలంచి ఫలమును కోరకయని.

శ్లో. య త్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం తద్రాజస ముదాహృతమ్. 21

టీ. యత్తు=ఏదానము, ఫలముద్దిశ్యవా=ఫలము నుద్దేశించి నైనను, పునః=తిరిగి, ప్రత్యుపకారార్థం = ప్రత్యుపకారము కొఱకైనను, పరిక్లిష్టం = మనఃక్లేశమగునట్లుగా, దీయతే=ఇయ్యఁబడుచున్నదో, తత్=ఆదానము, రాజసం=రాజసమని, ఉదాహృతమ్=చెప్పఁబడెను.

శం. ఫలము నుద్దేశించియు, ప్రత్యుపకారము నుద్దేశించియు, మనస్సు నొచ్చుకొనుచు నిచ్చిన దానము రాజసమైనదని చెప్పఁబడుచున్నది.

రామా. పరిక్లిష్టం=అమంగళద్రవ్యము గలదియనుట.

శ్లో. అదేశకాలే య ద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్. 22

టీ. యద్దానం=ఏదానము, అదేశకాలే=నికృష్టదేశకాలములయందు, అపాత్రేభ్యః=మూర్ఖతస్కరాదులకొఱకు, దీయతే=ఇయ్యఁబడుచున్నదో, అసత్కృతం=సత్కారరహితమైన, అవజ్ఞాతం = అవమానయుక్తమైన, తత్=ఆదానము, తామసం=తామసమని, ఉదాహృతం=చెప్పఁబడెను.

శం. నికృష్టదేశకాలపాత్రములయందుఁ దిరస్కారావమానములతోఁగూడి యియ్యఁబడిన దానము తమోగుణప్రధానమని చెప్పఁబడును.

రామా. అసత్కృతం=పాదములను కడుగుట మొదలగు గౌరవము లేనిది; అవజ్ఞాతం=ఉపచారములు లేనిది.

శ్లో. ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః,
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞా శ్చ విహితాః పురా.23

టీ. ఓం తత్సదితి=ఓం, తత్, సత్ అని, త్రివిధః=మూడు ప్రకారములుగలిగిన, బ్రహ్మణః=పరమాత్మయొక్క, నిర్దేశః=నామోచ్చారణము, స్మృతః=చెప్పఁబడెను, తేన=దానిచేత, బ్రాహ్మణాశ్చ=బ్రాహ్మణులును, వేదాశ్చ=వేదములును, యజ్ఞాశ్చ=యజ్ఞములును, పురా=పూర్వకాలమందు, విహితాః=నిర్మింపఁబడినవి.

తం. పరబ్రహ్మనామము ఓం, తత్, సత్ అనుమూడు విధములుగా నుచ్చరింపఁబడును. అట్టిపరబ్రహ్మముచేఁ బూర్వకాలమందు బ్రాహ్మణులు వేదము యజ్ఞములు నిర్మింపఁబడినవి.

రామా. పరబ్రహ్మశబ్దము అగు ఓంతత్ సత్ అనునది పూజింపఁబడుదానిని చెప్పుటచేత వైదిక కర్మారంభమందు 'ఓమ్' అనుదానిని కర్మలయందు తత్, సత్ అనుదానిని చెప్పవలయును. బ్రాహ్మణు లనఁగా వేదసంబంధము గలమూడువర్ణముల వారును పూర్వము, ఈమూడు శబ్దములతోఁ గూడినవారై మున్ను నాచే సృజింపఁబడిరి. వేదములును యజ్ఞములును గూడ ఈమూడుశబ్దములతోఁగూడినవిగా నాచే నిర్మింపఁబడినవి.

మధ్వ. ఓంతత్ సత్ అనునవి వేదనామములు. ఆబ్రహ్మముచేత తన పూజకొఱకు వేదవిధి యీమూఁడు మాటలచే బయలు పఱుపఁబడినది.

శ్లో. తస్మా దో మి త్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః,
పవ్ర ర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్. 24

టీ. తస్మాత్=ఆకారణమువలన, విధానోక్తాః=శాస్త్రోక్తములైన, బ్రహ్మవాదినాం=వేదవాదశీలురయొక్క, యజ్ఞదానతపఃక్రియాః=యజ్ఞదానతపస్సు లనెడిక్రియలు, సతతం=ఎల్లప్పుడును, ఓ మితి=ఓం అని, ఉదాహృత్య=ఉచ్చరించి, ప్రవర్తంతే=ఆరంభింపఁబడుచున్నవి.

శం. ఆ హేతువువలన శాస్త్రోక్తములైన యజ్ఞదాన తపస్సులను క్రియలను బ్రహ్మవాదులు ప్రారంభించునపుడు ఓంకారమును ప్రథమమునఁ బలుకుచున్నారు.

రామా. 'ఓమ్' అనుశబ్దముతో నన్వయించియుండు వేదములను ధరించుటవల్లను, యజ్ఞాదులను చేయుటవల్లను, మూఁడువర్ణములవారలకును 'ఓమ్' అనుశబ్దముతో సంబంధము కలుగుచున్నది.

శ్లో. త ది త్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః,
దానక్రియా శ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. 25

టీ. మోక్షకాంక్షిభిః=ముముక్షువులచేత, తదితి = తత్ అనెడిబ్రహ్మాభిధానము నుచ్చరించి, ఫలం=ఫలమును, అనభిసంధాయ=కోరక, యజ్ఞతపఃక్రియాః-యజ్ఞ=క్రతువులును, తపః=తపస్సులును, క్రియాశ్చ=దానక్రియలును, క్రియంతే = చేయఁబడుచున్నవి.

శం. మోక్షేచ్ఛగలవారిచే 'తత్' అను పరమాత్మస్వరూపనిర్దేశమైన శబ్ద ముచ్చరింపఁబడి యజ్ఞదాన తపఃక్రియలు ఫలకాంక్షలేకయే ప్రారంభింపఁబడుచున్నవి.

రామా. మోక్షమునుగోరెడి ముముక్షువుల వారిచేతను చేయఁబడెడు వేదాధ్యయనము, యజ్ఞము, తపస్సు, దానము అనెడిక్రియలు బ్రహ్మమును చేరుటకు సాధనములుగాన బ్రహ్మమును చెప్పెడి 'తత్' అనుశబ్దముచేత నిర్దేశింపఁబడినది. ఇట్లు వేదాధ్యయనాదులకు 'తత్' అనుశబ్దముతో నన్వయము చెప్పఁబడినది. వీని నాచరించుటచేత ముముక్షువులవారును 'తత్' శబ్దార్థముచేత నిర్దేశింపఁబడుచున్నారు.

శ్లో. సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే. 26

టీ. హే పార్థ=ఓయి అర్జునా! సద్భావే=కల్గుటయందును, సాధుభావేచ=శ్రేష్ఠమనుటయందును, సదితి=సత్ అనెడి, ఏతత్=ఈపదము, ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది. తథా=ఆలాగుననే, ప్రశస్తే=ప్రశస్తమైన, కర్మణి=కర్మమందును, సచ్ఛబ్దః=సచ్ఛబ్దము, యుజ్యతే=ప్రయోగింపఁబడుచున్నది.

శం. అర్జునా! 'సత్' అనుశబ్దము శ్లాఘనీయమైనవానిని శ్రేష్ఠమైనవానిని తెలియఁజేయుసంజ్ఞగా నున్నది. ఆ హేతువువలనఁ బ్రశస్తమైన కర్మలయందు 'సత్' శబ్దము ప్రయోగింపఁబడుచున్నది.

శ్లో. యజ్ఞే తపసి దానేచ స్థితి స్సదితి చోచ్యతే,
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే. 27

టీ. యజ్ఞేచ=యజ్ఞమందును, తపసి=తపస్సునందును, దానేచ=దానమునందును, స్థితిః = నిష్ఠ, యా = ఏదో? సా=అది, సదితి = సత్ అనియు, ఉచ్యతే = పలుకఁబడుచున్నది. తదర్థీ

యం = ఆభగవదర్థీయమైన, కర్మ = కర్మమును, సదితి = సత్ అని, అభిధీయతే=పలుకఁబడుచున్నది.

శం. యజ్ఞదాన తపస్సులందుగల నిష్ఠ 'సత్' అని చెప్పఁబడును. భగవత్ప్రీతిగాఁ జేయఁబడినకర్మలన్నియు 'సత్' అని చెప్పఁబడును.

రామా. మూఁడువర్ణములవారల యజ్ఞాదులయందలి ఉనికి మంచిదిగాన సత్తని చెప్పఁబడుచున్నది. ఆమూఁడువర్ణములవారికొఱకైన (తదర్థీయం) యజ్ఞాదికర్మంబును సత్తనఁబడును. కాఁబట్టి వేదములును, వేదకర్మంబులును, బ్రాహ్మణులని చెప్పఁబడిన మూఁడువర్ణములవారునుగూడ 'ఓం తత్ సత్' అను శబ్దముల సంబంధమనెడి గుఱుతులచేత వేదములుకాని వానికంటెను, అవైదికులకంటెను విలక్షణులని తెలియఁబడఁదగినవారు.

శ్లో. అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్,
అస దిత్యుచ్యతే పార్థ! నచ తత్ప్రేత్య నో ఇహ. 28

టీ. హే పార్థ=ఓయి అర్జున! అశ్రద్ధయా=అవిశ్వాసముచేత, యత్=ఏ, హుతం=హోమము, కృతం=చేయఁబడినదో? యత్=ఏది, దత్తం=ఇయ్యఁబడినదో?తపః=తపస్సు, తప్తం=చేయఁబడినదో? తత్=ఆసమస్తమును, అసదితి=అసత్తని,ఉచ్యతే=పలుకఁబడుచున్నది. (కావున అది) ఇహ=ఈలోకమందును, నచ=ఫలింపదు. ప్రేత్యచ=లోకాంతరమందును, నో=ఫలింపదు.

శం. అర్జునా! శ్రద్ధలేని హోమములు, దానములు, తపస్సులు 'అసత్' అని చెప్పఁబడును. అవి యిహమందును పరమందును సుఖకరములు గావు.

రాము. ఓ అర్జునా! శాస్త్రీయమైనను అశ్రద్ధతోఁ జేయఁబడిన హోమము మొదలగునది అసత్తనఁబడును. అది మోక్షమునకును, సంసారములోని ఫలమునకునుగూడ పనికిరాకపోవుటయే అట్లు చెప్పఁబడుటకు హేతువు.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
శ్రద్ధాత్రయవిభాగయోగోనామ
సప్తదశోఽధ్యాయః.

ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును, యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జున సంవాదాత్మకంబునైన
శ్రీభగవద్గీతలయందు శ్రద్ధాత్రయవిభాగయోగ
మనెడి సప్తదశాధ్యాయము.



శ్రీ ర స్తు.

# శ్రీ భ గ వ ద్గీ తా,

## మోక్షసన్న్యాసయోగః.



అర్జున ఉవాచ:—

శ్లో. సన్న్యాసస్య మహాబాహో! త త్త్వ మిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ! పృథ క్కేశినిషూదన. 1

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు.

టీ. హేమహాబాహో!=ఓ బలముగల భుజములుగలిగిన వాఁడా! హృషీకేశ! = ఇంద్రియనియామకుఁడవైనవాఁడా! హే కేశినిషూదన!=ఓశ్రీకృష్ణస్వామీ! సన్న్యాసస్య=సన్న్యాసముయొక్కయు, త్యాగస్య=త్యాగముయొక్కయు, తత్త్వం= యాథాత్మ్యమును, పృథక్=వేర్వేఱ, వేదితుం=తెలియుటకొఱకు, ఇచ్ఛామి=ఇచ్ఛయించుచున్నాను.

శం. కృష్ణా! సన్న్యాస త్యాగములయొక్క తత్త్వములను ప్రత్యేకముగాఁ దెలిసికొనఁ గోరుచున్నాను. దయచేసి సెలవిమ్ము.

శ్రీ భగవానువాచ:—

శ్లో. కామ్యానాం కర్మణాం న్యాసం
సన్న్యాసం కవయో విదుః,

సర్వకర్మఫలత్యాగం
ప్రాహుః త్యాగం విచక్షణాః. 2

శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.—

టీ. కవయః=పండితులు, కామ్యానాం కర్మణాం=కామ్య కర్మములయొక్క, న్యాసం=పరిత్యాగమును, సన్న్యాసం= సన్న్యాసముగాను, విదుః=తెలియుదురు. విచక్షణాః=విద్వాంసులు, సర్వకర్మఫలత్యాగం = సమస్తకర్మ ఫలత్యాగమును, త్యాగం=త్యాగముగా, ప్రాహుః=చెప్పుదురు.

శం. జ్యోతిష్టోమాది కామ్యకర్మములను వదలుట సన్న్యాసమనియు, వేదోక్తమైన యెల్ల కర్మలను నాచరించి కర్మఫలముల నీశ్వరార్పణము సేయుట త్యాగమనియుఁ బెద్దలు చెప్పుదురు.

రామా. మఱి కొందఱు పండితులు నిత్యనైమిత్తిక కామ్యముల నెడి యన్నికర్మములయు ఫలత్యాగము నే త్యాగమును గాఁ జెప్పుదురు. సన్న్యాసత్యాగ శబ్దములు పర్యాయపదములు.

మధ్వ. ఫలమును కోరక పోవుటచేతఁగానీ చేయకపోవుట చేతఁగానీ కామ్యకర్మములను విడుచుట సన్న్యాసము. త్యాగ మనఁగా ఫలమును విడుచుటయే.

శ్లో. త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః,
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్య మితి చాపరే. 3

టీ. ఏకే=కొందఱు, మనీషిణః=పండితులు, కర్మ = కర్మమును, దోషవత్=దోషముగలదిగావున, త్యాజ్యమితి = త్యజించఁదగినదని, ప్రాహుః=చెప్పుదురు. అపరే=మఱికొందఱు,

యజ్ఞదానతపఃకర్మ = యజ్ఞదానతపస్స్వరూపమైన కర్మము, నత్యాజ్యమితి=విడువఁదగనిదని, ప్రాహుః=చెప్పుదురు.

శం. కొందఱు పెద్దలు ఎల్లకర్మలనుదోషముగలవానిఁగాఁ దలఁచి సన్న్యసించవలయునని చెప్పుదురు. మఱికొందఱు పెద్దలు వేదోక్తమైన యజ్ఞదానతపస్సులను కర్మలను విడువఁగూడదని చెప్పుదురు.

రామా. కాపిల సిద్ధాంతమువారును, తదనుసారులగు వైదికులును రాగాదిదోషము లుండుటచేతఁ గర్మమునంతయు విడువవలయు నందురు. మిగిలినవారు విడువఁగూడదందురు.

మధ్వ. కొందఱు పెద్దలు చెప్పుదురనుటచే నాపక్షమును గూడస్వీకరింపవలసినదే.ఆపక్షమున ఫలమును విడుచుటచేతనే త్యాగము. కావున నిదియంతయు నొక్కపక్షమే యనుట.

శ్లో. నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ!
త్యాగో హి పురుషవ్యాఘ్ర! త్రివిధ స్సంప్రకీర్తితః. 4

టీ. హే భరతసత్తమ=ఓఅర్జునా! తత్రత్యాగే=ఆత్యాగమందు, మే=నాయొక్క, నిశ్చయం=నిర్ణయమును, శృణు=వినుము. హే పురుషవ్యాఘ్ర=ఓయి అర్జునా! త్యాగః=త్యాగము, త్రివిధః=మూడుప్రకారములు గలదిగా, సంప్రకీర్తితో హి=చెప్పఁబడినదిగదా!

శం. ఓఅర్జునా!ఆత్యాగమందుగల నానిశ్చయమును జెప్పెద వినుము. కర్మత్యాగము, కర్మఫలత్యాగము, కర్తృత్వత్యాగమని మూడువిధములుగఁ జెప్పఁబడెను.

రామా. కర్మఫలములను విడుచుటయు, ఇది నా కర్మమనెడి మమకారమును విడుచుటయు, సర్వేశ్వరుఁడు కర్త యని

తలంచుటచేత, తనకర్తృత్వమును విడుచుటయు త్యాగము త్రివిధములుగా చెప్పఁబడినదిగదా? ఓఅర్జునా!

శ్లో. యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్య మేవ తత్,
యజ్ఞో దానం తప శ్చైవ పావనాని మనీషిణామ్. 5

టీ. తత్=ఆ, యజ్ఞదానతపఃకర్మ=యజ్ఞదానతపోరూపమైన కర్మము, కార్యమేవ=చేయఁదగినదే; నత్యాజ్యం=విడువఁదగినదికాదు. యజ్ఞః=యజ్ఞమును, దానం = దానమును, తపశ్చ=తపస్సును, మనీషిణాం = పండితులకు, పావనాని = పవిత్రమైనవి.

శం. యజ్ఞ దాన తపోరూపక మైన కర్మ మవశ్యము కర్తవ్యము. దానిని విడువరాదు. ఎందువల్లననఁగా యజ్ఞదానతపః కర్మలు పండితులకుఁ బవిత్రము లయినవి.

రామా. యజ్ఞదానతపస్సులు మొదలయిన వర్ణాశ్రమ ధర్మములు ఉపాసనచేయువారికి అవశ్యము కర్తవ్యములు. వారిఉపాసనము సిద్ధించుటకు ప్రాచీనకర్మమును నశింపఁజేయుననుట.

మధ్వ. సన్న్యాసులుగూడ జ్ఞానయజ్ఞము, విద్యాదానము, అభయదానము, బ్రహ్మచర్యము మొదలగు తపస్సు కలవార లేకదా? కాఁబట్టి మఱియొక్కవిధమైన వాక్యమేదైననున్న చో అధికారి భేదమునుబట్టి దాని ననుసరింపవలయును.

శ్లో. ఏతా న్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యా నీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమమ్. 6

టీ. హే పార్థ=ఓయి అర్జున! ఏతాని = ఈపూర్వోక్తములైన,కర్మాణి=కర్మములు,సంగం=మమకారమును,ఫలానిచ=

ఫలములను, త్యక్త్వా=విడిచి, కర్తవ్యాని=చేయఁదగినవి. ఇతి=ఇట్లని, నిశ్చితం=నిశ్చయింపఁబడిన, ఉత్తమం=ఉత్కృష్టమైన, మే=నాయొక్క, మతం=సమ్మతము.

శం. అర్జునా! పైఁ జెప్పిన మూఁడువిధము లైన యజ్ఞదానతపఃకర్మలను మమకార ఫలకాంక్షలు వదలి చేయవలెను. ఇది నానిశ్చయమైన యుత్తమాభిప్రాయము.

రామా. సంగమనఁగా కర్మమునందు మమకారము. ఉపాసనమువలె నివియును యావజ్జీవమును చేయవలసినవియే యనుట.

శ్లో. నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. 7

టీ. నియతస్య=నిత్యమైన, కర్మణః=కర్మముయొక్క, సన్న్యాసః=పరిత్యాగము, నోపపద్యతే=తగదు. మోహాత్=అజ్ఞానమువల్లనైన, తస్య=అనిత్యకర్మముయొక్క, పరిత్యాగః=పరిత్యాగము, తామసః=తామసమని, పరికీర్తితః=చెప్పఁబడెను.

శం. వేదోక్తమైన నిత్య నైమిత్తిక కర్మలను వదలరాదు. అలాగు అజ్ఞానముచే వదలుట తామసత్యాగమని తెలియుము.

రామా. నిత్యనైమిత్తికరూపమును వేదోక్తమునైన కర్మలనువదలరాదు. జ్ఞానముకలుగఁజేసెడి కర్మమును బంధమును కలుగఁజేయు ననుకొనుట మోహము. ఇట్టినిత్యకర్మపరిత్యాగము తామసత్యాగమనుట.

శ్లో. దుఃఖ మిత్యేవ య త్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. 8

టీ. యః=ఎవ్వఁడు, కాయక్లేశభయాత్=శరీరకష్టభీతివలన, యత్కర్మ=ఏకర్మమును, దుఃఖమిత్యేవ=దుఃఖకరమైనదని, త్యజేత్=పరిత్యజించునో? సః=వాఁడు, రాజసం=రజోగుణసంబంధమైన, త్యాగం=త్యాగమును, కృత్వా=చేసి, త్యాగఫలం=కర్మత్యాగఫలమును, నైవలభేత్=పొందఁడు.

శం. దేహమునకు నష్టమగునని భయపడి కష్టమిచ్చెడికర్మల నెవఁడు వదలుచున్నాఁడో! అట్టివాఁడు రాజసత్యాగము చేసినవాఁడగును; గనుక కర్మఫలత్యాగమువల్లఁ గలిగెడి మోక్షము వానికి సిద్ధింపదు.

రామా. శరీరాయాసమునకు భయపడి, ఆశ్రమకర్మముల నెవఁడు వదలుచున్నాఁడో? అట్టివాఁడు రాజసత్యాగము చేసినవాఁడగును. కాఁబట్టి వానికి భగవత్ప్రసాదద్వారమున మనస్సున తేటకలుగదు. మోక్షసిద్ధి లేదనుట.

శ్లో. కార్య మి త్యేవ య త్కర్మ నియతం క్రియ తేఽర్జున,
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః.

టీ. హేఅర్జునా=ఓయి అర్జునుఁడా! సంగం=ఆసక్తిని, ఫలంచ=ఫలమును, త్యక్త్వా=విడిచి, యత్=ఏ, నియతంకర్మ=నిత్యకర్మము, కార్యమిత్యేవ=చేయఁదగినదేయని, క్రియతే=చేయఁబడుచున్నదో, సత్యాగః=ఆత్యాగము, సాత్త్వికఇతి=సత్త్వగుణమువలనఁ బుట్టినదని, మతః=అభిమతము.

శం. అర్జునా! ఆసక్తిని ఫలమును వదలి వేదోక్తమైననిత్యనైమిత్తిక కర్మలావశ్యకం బని యెవఁడు చేయుచున్నాఁడో? అట్టివాని త్యాగము సాత్త్వికత్యాగ మని యెఱుఁగుము.

రామా. నిత్యనైమిత్తిక రూపములగు వర్ణాశ్రమ కర్మములను నాయారాధనముగా వేఱుప్రయోజన మక్కఱలేకయే చేయవలసిన దని తలంచి దానియందు మమకారమును, దాని ఫలమును విడిచి వర్తించువాని త్యాగమునకు సాత్త్వికత్యాగ మని పేరు.

శ్లో. న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. 10

టీ. సత్త్వసమావిష్టః=సత్త్వగుణముచేత వ్యాపింపఁబడినవాఁడును, మేధావీ=ఆత్మజ్ఞానము గలిగినవాఁడును, ఛిన్నసంశయః=ఛేదింపఁబడిన సందేహముగలిగినవాఁడును నగు, త్యాగీ=ఫలత్యాగియైనపురుషుఁడు, అకుశలం=అశుభకరమైన, కర్మ=కామ్యకర్మనుగూర్చి, న ద్వేష్టి=ద్వేషింపఁడు; కుశలే=శుభకరమైన కర్మమందు, నానుషజ్జతే=ఆసక్తుఁడుగాఁడు.

శం. సాత్త్విక త్యాగముగల యాత్మజ్ఞాని సంశయము మాని సుఖదుఃఖకరములైన నిత్యనైమిత్తిక కర్మలయందు స్నేహద్వేషము లుంచఁడు.

రామా. తత్త్వజ్ఞానము కలవాఁడై, దానివలననే సంశయములన్నియు పోయినవాఁడై అన్నికర్మలయందును మమకారములేక పోవుటచేతను, బ్రహ్మముతప్ప మిగిలినఫలములను విడుచుటచేతను, ఈరెండుకర్మములు చేయునప్పుడు ప్రీతిద్వేషములను కలిగించుకొనక కర్మముల ఫలసంగకర్తృత్వములను విడుచుటయే శాస్త్రీయత్యాగమని యెంచిన సాత్త్వికత్యాగి ఆత్మజ్ఞాని యనఁబడును.

శ్లో. న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ సత్యాగీ త్యభిధీయతే. 11

టీ. దేహభృతా = దేహధారిచేత, అశేషతః = సంపూర్ణముగా, కర్మాణి=కర్మములను, త్యక్తుం=విడుచుటకొఱకు, నశక్యంహి=శక్యముగాదుగదా. యస్తు=ఎవఁడు, కర్మఫలత్యాగీ =కర్మఫలమును త్యజింపుచున్నాఁడో, సః=వాఁడు, త్యాగీ = త్యాగముగలవాఁడని, అభిధీయతే=చెప్పఁబడుచున్నాఁడు.

శం. శరీరధారి కర్మలను విడిచి నిర్వహింపలేఁడుగావున నెవఁడు వేదోక్తములయిన కర్మలనాచరించి కర్మఫలములను త్యజించుచున్నాఁడో? వాఁడే కర్మత్యాగి యని చెప్పఁబడును.

రామా. శరీరమును ధరించియున్నవాఁడు, శరీరము నిలుచుటకుఁ గావలసినది తినుట, త్రాగుట మొదలగునవి కొన్ని తప్పనివికాన, కర్మములన్నియు విడువ శక్యములుకావు. వానికై పంచమహాయజ్ఞాదులను తప్పకచేయవలయును. ఇట్టి కర్మములఫలములను విడుచువాఁడే త్యాగియని చెప్పఁబడును. ఫలము అని చెప్పుటచేత కర్తృత్వమును కర్మసంగమునుగూడ చెప్పుచున్నది.

శ్లో. అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్,
భవ త్యత్యాగినాం ప్రేత్య నతు సన్న్యాసినాం క్వచిత్.

టీ. అనిష్టం=ఇష్టముకానిదనియు,ఇష్టం=ఇష్టమైనదనియు, మిశ్రం=ఇష్టానిష్టమిశ్రమైనదనియు, త్రివిధం = మూఁడువిధములుగలిగిన, కర్మణః=కర్మముయొక్క, ఫలం= ఫలము, అత్యాగినాం=త్యజించనివారలకు, ప్రేత్య=జన్మాంతరమును పొంది, భవ

తి=అగుచున్నది. సన్న్యాసినాంతు=కర్మఫలత్యాగులకయితే, క్వచిదపి=ఒకప్పుడును, నభవతి=కాదు.

శం. కర్మఫలములు ప్రియములయినవి, అప్రియములయిన వి, ప్రియాప్రియములైనవి అని మూఁడువిధములు. కర్మఫలత్యాగముచేయనివారలను జన్మాంతరములయం దాఫలములు బొందుచున్నవి. కర్మఫలత్యాగముచేసినవారలను ఆఫలములు జన్మాంతరములయందును అంటవు.

రామా. అనిష్టము నరకాదికము. ఇష్టము స్వర్గము మొదలగునది. మిశ్రమనఁగా ననిష్టముతోఁగూడిన పుత్త్రులు, పశువులు, అన్నము మొదలగునది. కర్తృత్వమును, మమకారమును, ఫలమును విడువనివారు అత్యాగులు. త్యాగులకు మోక్షవిరోధియగు ఫలమెప్పుడును కలుగదు. ఇట్లు కర్మములనుచేయుచునే వాని కర్తృత్వాదులను విడుచుట శాస్త్రసిద్ధమైన సన్న్యాసము. అదియే త్యాగమని చెప్పఁబడినది.

శ్లో. పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. 13

టీ. హే మహాబాహో=ఓయి అర్జునా! సర్వకర్మణాం=సమస్తకర్మములయొక్క, సిద్ధయే=సిద్ధికొఱకు, కృతాంతే=సిద్ధాంతమందును, సాంఖ్యే=సాంఖ్యశాస్త్రమందును, ప్రోక్తాని=చెప్పఁబడిన, ఏతాని=ఈ, పంచ=ఐదయిన, కారణాని=హేతువులను, మే=నాయొక్క (వాక్కువలన), నిబోధ=తెలియుము.

శం. అర్జునా! వేదాంతమునం దెల్లకర్మల సిద్ధికొఱకుఁ జెప్పియుండు నయిదుహేతువులను నీకుఁ జెప్పెద వినుము.

శ్లో. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధా చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. 14

టీ. అధిష్ఠానం=దేహమును, తథా=అలాగుననే, కర్తా=అహంకారమును, పృథగ్విధం=నానాప్రకారమైన, కరణం=శ్రోత్రాదిసాధనమును, వివిధాచ=నానావిధమైన, పృథక్చేష్టా=వేత్వేఱైన ప్రాణాపానాదివ్యాపారమును, అత్ర=ఇందు, పంచమం=అయిదవది, దైవంచ=సూర్యాద్యధిదైవమును.

తా. శరీరము, అహంకారము, ఇంద్రియములు పంచప్రాణముల వ్యాపారము, వీని అభిమానిదేవతల ప్రేరేపణ అని యీవిధముగ నైదుకారణము లున్నవి.

రా. వైదికబుద్ధితోఁ జేరియున్న నిర్ణయమున, శరీరజీవాత్మ ఇంద్రియప్రాణములు ఉపకరణములుగాఁగల పరమాత్మనే కర్తగానిశ్చయింపుచున్నది. ఇట్లు జీవుని కర్తృత్వము పరమాత్మకు అధీనమైనచో విధి, నిషేధ శాస్త్రములన్నియు నిరర్థకము లగును. అట్లుకాదు. జీవాత్మ, పరమాత్మచేతనేఁబడి, అతఁడే యాధారముగాఁ గలదియును, అతనిచేఁ గలుగఁజేయఁబడిన శక్తులు గలవియు నగు కరణకళేబరములతోఁ గూడినవాఁడై, తానును అతఁడే యాధారముగాఁ గలవాఁడై, పనులు జరుగుటకు తన యిచ్ఛచేతనే కరణాదుల నధిష్ఠించియుంచుట యనెడి ప్రయత్నమును ఆరంభించును. ఆలోపలనుండు పరమాత్మయును తన యనుమతినిచ్చుటచేత ఆతనిని ప్రవర్తింపఁజేయుచున్నాఁడు. కాఁబట్టి జీవునికి స్వబుద్ధిచేతనే ప్రవర్తించుట కలదు.

మధ్వ. సన్న్యాసమును వివరించుటకు కర్మకారణములు చెప్పఁబడుచున్నవి. 13-వ శ్లోకములోని 'సాంఖ్యేకృతాంతే' యనఁగా జ్ఞానసిద్ధాంతమున అధిష్ఠానమనఁగా దేహము మొదలగునది. కర్తయనఁగా విష్ణువు. జీవుఁడు కర్తగాఁడు. కరణమనఁగా నింద్రియములు మొదలగునవి. చేష్టలనఁగా క్రియలు. హోమము మొదలగుకర్మలు చేతులు మొదలగువాని వ్యాపారములచేతఁగదా కలుగుచున్నవి. ధ్యానము మొదలగు వానికిఁ గూడ మనస్సుయొక్క చేష్టసాధనము పూర్వజన్మమునందలి చేష్టయును సంస్కారమునకు కారణమగుటచేత వానిని అదృష్టమనుచున్నారు.

శ్లో. శరీరవాఙ్మనోభి ర్య త్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. 15

టీ. నరః=మనుష్యుఁడు, శరీరవాఙ్మనోభిః=మనోవాక్కాయములచేత, న్యాయ్యంవా = మంచిదైనను, విపరీతంవా=అన్యాయమైనదైనను, యత్కర్మ=ఏకర్మమును, ప్రారభతే=ఉపక్రమించుచున్నాఁడో; తస్య=ఆకర్మమునకు, ఏతేపంచ=ఈయధిష్ఠానాదులైదును, హేతవః=కారణములు.

శం. త్రికరణములైన మనస్సు వాక్కాయములతో మంచిదిగాని, చెడుదిగాని కర్మమును మనుష్యుఁడు ప్రారంభించునపు డాత్మకుఁ జైఁజెప్పిన యైదును గాఁగణములని తెలియుము.

రామా. తెప్పపాటు, శరీరము కదల్చుట మొదలగునవికూడ పూర్వజన్మపు ధర్మాధర్మపు కార్యములే కాఁబట్టి న్యాయ్య విపరీతములలోనే జేరుచున్నవి.

శ్లో. తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః,
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః. 16

టీ. తత్ర=ఆకర్మమందు (కారణము),ఏవంసతి=ఇట్లుండఁగా, యః=ఎవఁడు, ఆత్మానం కేవలంతు=తననొకనినే, కర్తారం=కర్తనుగాను, పశ్యతి=చూచుచున్నాఁడో, సః=అట్టి, దుర్మతిః=విపరీతబుద్ధిగలవాఁడు, అకృతబుద్ధిత్వాత్= శాస్త్రసంస్కృతమగు బుద్ధిగలవాఁడు గాకుండుటవలన, నపశ్యతి=కర్తను యథావస్థితముగా తెలియఁజాలఁడు.

శం. ప్రతికర్మకుఁ గారణములు పైఁజెప్పినవిధముగా నైదుండఁగా నెవఁడు కర్మకుఁ దానే కర్తనని తలఁచుచున్నాఁడో వాఁడు తెలివిగలవాఁడు కాఁజాలఁడు. అట్టి యజ్ఞాని యాత్మతత్త్వము నెఱుఁగఁజాలఁడు.

రామా. జీవుని కర్తృత్వము పరమాత్మయొక్క యనుమతినిఁబట్టిన దగుచుండఁగా ఆకర్మమునందు వస్తుస్థితిని తెలిసికొనెడి బుద్ధికలుగనివాఁడు యాత్మతత్త్వము నెఱుఁగఁజాలఁడు. తెలివిగలవాఁడు కాఁజాలఁడు.

శ్లో. యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే,
హత్వాపి స ఇమాం ల్లోకా న్న హంతి న నిబధ్యతే. 17

టీ. యస్య=ఏపురుషునికి,అహంకృతః=నేననెడి,భావః=భావము, న=లేదో? యస్య=ఎవనియొక్క, బుద్ధిః=బుద్ధి, నలిప్యతే=లిప్తముగాదో?సః=వాఁడు,ఇమాం ల్లోకాన్=ఈజనులను, హత్వాపి=చంపియు, నహంతి=చంపినవాఁడుకాఁడు, ననిబధ్యతే=బద్ధుఁడునుకాఁడు.

శం. ఎవఁడు తాను నహంకారముఁ జెందక కర్మఫలమం దాసక్తి లేకయున్నాఁడో అట్టివాఁ డీజనులనందఱిని సంహరించిన వాఁడైనను జంపినవాఁడు కాఁజాలఁడు. వానికి నాకర్మఫలమును అంటదు.

రామా. నేను చేయుచున్నాననెడి జ్ఞానము ఎవ్వనికి లేకుండునో, బుద్ధి లేపము నెవ్వఁడు పొందకయుండునో, అనఁగా నీకర్మమున నాకు కర్తృత్వము లేకపోవుటవలన ఈఫలము నాతో సంబంధింపదు; ఈకర్మంబును నాదికాదు; అని ఎవ్వనికి బుద్ధి కలుగునో, వాఁడు యుద్ధమున ఈజనులను చంపియు చంపకున్నవాఁడే. ఆయుద్ధమనెడి కర్మచేత బంధింపఁబడఁడు. దాని ఫలము ననుభవింపఁ డనుట.

శ్లో. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. 18

టీ. కర్మచోదనా=కర్మోపదేశము, జ్ఞానమితి=జ్ఞానమనియు, జ్ఞేయమితి=తెలియఁదగినదనియు, పరిజ్ఞాతా=తెలియువాఁడనియు, త్రివిధా=మూఁడువిధములుగలది; కర్మసంగ్రహః=కర్మసంగ్రహము, కరణం=కరణమనియు, కర్మ=కర్మమనియు, కర్తేతి=కర్తయనియు, త్రివిధః=మూఁడువిధములుగలది.

శం. కర్మోపదేశము మూఁడురూపములు గలిగి యున్నది. అవి యేవి యన జ్ఞానము, జ్ఞానమువల్లఁ దెలియఁదగినవిషయము, జ్ఞానము గలవాఁడు. కర్మయును మూఁడురూపములుగలదియే, అవి (కర్మకు వలయుపదార్థములను సంపాదించుట) కరణమనియు,

(చేయుట) కర్మయనియు, (చేయువాఁడు) కర్తయనియు మూఁడు రూపములుగ నున్నది.

రామా. చేయఁదగినకర్మము జ్ఞేయము. దానిని తెలిసికొనుట జ్ఞానమనఁబడును. తెలిసికొనువాఁడు పరిజ్ఞాత, జ్ఞేయంబగు నాకర్మము మూఁడువిధములుగా సంగ్రహింపఁబడుచున్నది. ద్రవ్యము మొదలగుసాధనము కరణము. కర్మము యాగము మొదలగునది. ఆచరించువాఁడు కర్త.

మధ్వ. కర్తృత్వము లేకపోయినను విధిద్వారమున ఈశ్వర ప్రసాదమున ఇచ్ఛకలుగుటచేత, కర్మద్వారముగుండా పురుషార్థము కలుగుచున్నది. ఈశ్వరాధీనుఁడైనను విధిద్వారమున ఆతనిచేతనే నియమింపఁబడినవాఁడు. ఇచ్ఛాదులుపుట్టినచో ఈశ్వరునిచేతనే చేయఁబడినది యగును. ఫలముతప్పదు వస్తుతత్త్వమునుబట్టి కర్తకాకపోయినను అభిమానికమగు కర్తృత్వము వానికెయగును. జడములనపేక్షించి స్వాతంత్ర్యముగూడ కలదు కాన వానింగూర్చి విధులు వ్యర్థములగుట లేదనుట.

శ్లో. జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తా న్యపి.

టీ. గుణసంఖ్యానే=కపిలాది శాస్త్రమందు, జ్ఞానంచ=జ్ఞానమును, కర్మచ=క్రియయు, కర్తాచ=కర్తయు, గుణభేదతః=సత్త్వరజస్తమోగుణభేదమువలన, త్రిధైవ=మూఁడుప్రకారములుగా, ప్రోచ్యతే=చెప్పఁబడుచున్నది, తాన్యపి=అజ్ఞానాదులను, యథావత్=యథాశాస్త్రముగా, శృణు=వినుము.

శం. శాస్త్రములలో జ్ఞానమును, కర్మమును, కర్తయును, సత్త్వరజస్తమోగుణభేదములచే నొకటొకటి మూఁడుమూఁడు రూపములు గలదిగా చెప్పఁబడియున్నది, వానిని సాంఖ్యశాస్త్ర రీతిగ వినుము.

రామా. గుణసంఖ్యానమనఁగా గుణములకార్యములను చెప్పాటలో ననుట.

మధ్వ. గుణసంఖ్యానమనఁగా గుణములను లెక్కపెట్టెడి ప్రకరణము అనుట.

శ్లో. సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్ష్యతే,
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్.	20

టీ. యేన=ఏజ్ఞానముచేత, విభక్తేషు = భిన్నములైన, సర్వభూతేషు=సర్వభూతములయందును, అవిభక్తం=అఖండమైనదియును, అవ్యయం=నాశరహితమైనదియును, ఏకం=ఒకటైనదియునైన, భావం=పరమాత్మస్వరూపమును, ఈక్ష్యతే=చూచుచున్నాఁడో, తద్జ్ఞానం=ఆజ్ఞానమును, సాత్త్వికం=సత్త్వగుణమువలనఁ బుట్టినదానినిగా, విద్ధి=తెలియుము.

శం. ప్రత్యేకరూపములైన బ్రహ్మాదిపిపీలికాంతజంతువులయందును, స్థావరములయందును,నఖండమైనట్టియు, నాశరహితమైనట్టియు నొకటైన బ్రహ్మభావమును జ్ఞానముచేత నెవఁడు చూచుచున్నాఁడో వానిజ్ఞానము సాత్త్వికజ్ఞానమని యెఱుఁగుము.

రామా. భావమనఁగా నాత్మవస్తువు-బ్రాహ్మణాది భేదములచే విభజింపఁబడిన అన్నిభూతములయందును ఆత్మలు, భేద

ములులేనివారై, జ్ఞానైకాకారులై, ఫలాదిసంగములకు తగని వారైయుందురని కర్మాదుల నాచరించు నప్పుడు తెలిసికొనెడి జ్ఞానము సాత్త్వికము.

మధ్వ:—భావమనఁగా విష్ణువు.

శ్లో. పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావా౯ పృథగ్విధా౯,
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. 21

టీ. యద్జ్ఞానం=ఏజ్ఞానము(చేతననుట); సర్వేషుభూతేషు=సమస్తభూతములయందును, పృథక్త్వేన=భేదభావముచేత, పృథగ్విధా౯= భిన్నప్రకారము లైనవానినిగా, నానావిధా౯= నానాస్వరూపము లైనవానినిగా, వేత్తి=తెలియుచున్నాఁడో, తద్జ్ఞానం=ఆజ్ఞానమును, రాజసం=రజోగుణసంబంధమైన దానినిగా, విద్ధి=తెలియుము.

శం. ఎల్లభూతములయందు భేదభావముచేత భిన్నప్రకారము లయినదిగాను పరబ్రహ్మాను భేదజ్ఞానముచేత నెవఁడు తెలిసికొనుచున్నాఁడో, వానిజ్ఞానము రాజసజ్ఞానమని తెలియుము.

రామా. కర్మల నాచరించునపుడు ఆత్మలుగూడ బ్రాహ్మణాద్యాకారములు గలవారై యుందు రనుకొనుట రాజసజ్ఞానము.

శ్లో. యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్,
అతత్త్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్. 22

టీ. యద్జ్ఞానం=ఏజ్ఞానము,ఏకస్మి౯=ఒకటైన, కార్యే=ప్రతిమాదిరూపమందు,సక్తంసత్=కూడినదై,కృత్స్నవత్=సర్వ

విషయమయినదానివలెనున్నదో, అహైతుకం = కారణములేని, అల్పంచ=తుచ్ఛఫలప్రదమైన, అతత్త్వార్థవత్=యథార్థముగానట్టి, తత్ జ్ఞానం=ఆజ్ఞానము, తామసం=తమోజనితమైనదని, ఉదాహృతం=చెప్పఁబడెను.

శం. జీవుని దేహపరిమాణముగలవానిగాను, ఈశ్వరునిదారుపాషాణమాత్ర పరిమాణము గలవానిగాను ఎఱుఁగుట యుక్తిహీనమైనట్టియు యథార్థముగానట్టియు నల్పవిషయఫలముగలిగినట్టియు నది తామసజ్ఞానమని చెప్పఁబడును.

రామా. ఆత్మయైనను, ఈశ్వరుఁడైనను, ఈ దేహమే, ఈ ప్రతిమ (బొమ్మ)యే అను జ్ఞానము తామసజ్ఞానము. యుక్తులు కలది గానిది, ఫలంబును విషయంబును స్వల్పముగా కలజ్ఞానమేదో అది తామసజ్ఞానము.

శ్లో. నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్,
అఫలప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే. 23

టీ. యత్కర్మ=ఏకర్మము, నియతం=నిత్యమయినదై, సంగరహితం=ఆసక్తిరహితమయినదై, అఫలప్రేప్సునా=ఫలాపేక్షలేనివానిచేత, అరాగద్వేషతః=రాగద్వేషరాహిత్యంబువలన, కృతం=చేయఁబడునో, తత్=ఆకర్మము, సాత్త్వికం=సత్త్వగుణసంబంధమైనదని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా. ఏకర్మ శాస్త్రసమ్మతమైనదై నిత్యమైనదై సంగరహితమైనదై ఫలాపేక్షలేనివానిచే రాగద్వేషములులేక చేయఁబడుచున్నదో అట్టికర్మను సత్త్వగుణప్రధానమని చెప్పుదురు.

రామా. ఏకర్మము వర్ణాశ్రమములకుఁ దగినదై, కర్తృత్వాది సంగములేనిదై, శత్రియందు రాగము, అశత్రియందు ద్వేషమును లేనిదై చేయఁబడుచున్నదో అట్టికర్మను సత్త్వగుణప్రధానమని చెప్పుదురు.

శ్లో. యత్తుకామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః,
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్. 24

టీ. కామేప్సునా=కోరికను బొంద నిచ్ఛయించినట్టియో, సాహంకారేణవా=అహంకారముతోఁగూడినట్టియొక కర్తచేత, బహులాయాసం=అధికమైనక్లేశముగలిగిన, యత్కర్మతు=ఏకర్మము, క్రియతే=చేయఁబడుచున్నదో, తత్పునః=ఆకర్మము, రాజసమితి=రజోగుణము వలనఁ బుట్టినదని, ఉదాహృతం=చెప్పఁబడెను.

తం. ఎవఁడు కోరికలుగలిగి యహంకారముతోఁగూడుకొని మిగుల కష్టమునిచ్చుకర్మలను జేయుచున్నాఁడో వాఁడు చేసెడి కర్మ రాజసమని జెప్పఁబడును.

రామా. ఫలమును గోరువాఁడును, కర్తృత్వాభిమానము కలవాఁడును, మిగుల కష్టముల నిచ్చుకర్మలను చేయువాఁడును చేసెడికర్మ రాజసమని చెప్పఁబడును.

శ్లో. అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్,
మోహా దారభ్యతే కర్మ త త్తామస ముదాహృతమ్. 25

టీ. అనుబంధం=ముందుగలిగెడి కార్యమును, క్షయం=నాశమును, హింసాం=పీడను, పౌరుషం=సామర్థ్యమును, అన

పేక్ష్య చ=విచారించక, మోహాత్=అజ్ఞానమువలన, యత్కర్మ=ఏకర్మము, ఆరభ్యతే=ఆరంభింపఁబడుచున్నదో, తత్=ఆ కర్మము, తామసం=తామసమని, ఉదాహృతం=చెప్పఁబడెను.

తం. అహంకారముతోఁ గూడుకొని యందునఁ గలిగెడి శుభాశుభములను, నాశమును, ఇతరులకుఁ గలుగు హింసను నెఱవేర్చుటకుఁ దనకుఁగల శక్తిని యోచించక యవివేకమున జేయఁబడ్డ కర్మ తామసప్రధానమైన కర్మయనిచెప్పఁబడును.

రామా. కర్మమును చేసిన తర్వాతఁగలిగెడి దుఃఖము అనుబంధము. ఆయనుబంధముతోఁ గూడుకొని, అందుల కలిగెడి శుభాశుభములను, నాశమును, ఇతరులకుఁ గలిగెడి హింసను నెఱవేర్చుటకుఁ దనకుఁగల శక్తిని యోచించక, పరమపురుషుఁడు కర్తయనుటను తెలిసికొనక చేయఁబడ్డకర్మ తామసప్రధానమైన కర్మయని చెప్పఁబడును.

శ్లో. ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే.   26

టీ. ముక్తసంగః = విడువఁబడిన యాసక్తిగలిగినవాఁడును, అనహంవాదీ=అహంవాదికానట్టివాఁడును, ధృత్యుత్సాహసమన్వితః = ధైర్యోత్సాహములతోఁ గూడినవాఁడును, సిద్ధ్యసిద్ధ్యోః = ప్రాప్త్యప్రాప్తులయందు, నిర్వికారః = వికారములేనివాఁడునైన, కర్తా=కర్త, సాత్త్వికః=సాత్త్వికుఁడని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

శం. దారాపత్యాదులైన విషయములయందుఁ బ్రీతి లేక, అహంకారరహితుఁడై ధైర్యోత్సాహములతోఁ గూడి సిద్ధి, అసిద్ధులయందు లక్ష్యము లేకయుండుకర్త సాత్త్వికుఁ డనఁబడును.

రామా. ఫలమునందు సంగము లేనివాఁడు, కర్తృత్వాభిమానము లేనివాఁడు, ఆరంభించినపని కడతేరు వఱకును తప్పని దుఃఖములు ఎన్ని తటస్థించినను ఓర్చువాఁడు, ఎల్లప్పుడు ద్యోగముతోనుండు మనస్సుగలవాఁడు, సిద్ధ అసిద్ధులయందు లక్ష్యములేక యుండువాఁడు సాత్త్వికుఁ డనఁబడును.

శ్లో. రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

టీ. రాగీ=అనురాగముగలిగినవాఁడును,కర్మఫలప్రేప్సుః = కర్మఫలమును బొంద నిచ్ఛయించినవాఁడును,లుబ్ధః=ద్రవ్యాభిలాషియైనవాఁడును, హింసాత్మకః=పరులనకుఁబీడఁ జేయుస్వభావము గలిగినవాఁడును, అశుచిః=ఆచారవర్జితుఁడైనవాఁడును, హర్షశోకాన్వితః = సంతోషదుఃఖములతోఁ గూడినవాఁడును నైన, కర్తా =కర్త, రాజసః=రాజసుఁడని, పరికీర్తితః=చెప్పఁబడెను.

శం. ప్రీతితోఁ గర్మఫలమునుబొంద నిచ్ఛయించిద్రవ్యాకాంక్ష గలిగి యితరులను హింసచేయు ప్రకృతితోఁ గూడుకొని యాచారములేనివాఁడై దుఃఖసంతోషములకు లోఁబడినకర్త రాజసుఁడని చెప్పఁబడును.

రామా. కీర్తిని గోరువాఁడు, కర్మఫలమునుబొంద నిచ్ఛ యించినవాఁడై దానికి కావలసిన ద్రవ్యమును వ్యయముచేయ లేనివాఁడు, పరులను బాధించి పనిచేయించువాఁడు, కర్మ స ఫలమైనప్పుడు హర్షము, విఫలమైనప్పుడు శోకము వీనితోఁ గూడుకొన్నవాఁడు, ఆచారము లేనివాఁడు, ఇట్టివాఁడు రాజసుఁ డని చెప్పుదురు.

శ్లో. అయుక్తః ప్రాకృత స్తబ్ధ శ్శఠో నైకృతికోఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. 28

టీ. అయుక్తః=మనోనిగ్రహము లేనట్టియు, ప్రాకృతః=బుద్ధిహీనుఁడైనట్టియు, స్తబ్ధః=స్తబ్ధుఁడైనట్టియు, శఠః=మాయావియైనట్టియు, నైకృతికః=పరులనవమానించునట్టియు, అలసః=మందుఁడైనట్టియు, విషాదీ=దుఃఖశీలుఁడైనట్టియు, దీర్ఘసూత్రీ చ=ఆలస్యముగాఁబనులుచేయునట్టియు, కర్తా=కర్త, తామసః=తామసుఁడని, ఉచ్యతే=పలుకఁబడుచున్నాఁడు.

శం. మనస్స్థైర్యములేక యవివేకుఁడై, స్తబ్ధుఁడై, మాయావియై, యితరుల నవమానము చేసెడి ప్రకృతిగలిగి మందుఁడై, దుఃఖశీలుఁడై యాలస్యముతోఁ గర్మనుజేయువాఁడు తామసుఁ డనఁబడును.

రామా. శాస్త్రములోని కర్మలకుఁ దగనివాఁడును, చదువులేనివాఁడును, పనుల నారంభింపక పోవుటయే స్వభావముగాఁ గలవాఁడును, అభిచారము మొదలగువానియందు రుచిగల వాఁడును, వంచనచేయువాఁడును, ఆరంభించిన కర్మలను మెల్ల

గాఁ జేయువాఁడును, అభిచారాదుల చేయుచు ఇతరులకు చాల కాలముండు అనర్థములను ఆలోచించువాఁడును తామసుఁ డనఁబడును.

శ్లో. బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ! 29

టీ. హే ధనంజయ=ఓయి యర్జునా! అశేషేణ=నిశ్శేషము గా, పృథక్త్వేన=వేఱుపఱచుటచేత, ప్రోచ్యమానం=చెప్పఁబడుచున్నదియు, గుణతః=సత్త్వాదిగుణములవలన, త్రివిధం=మూడుప్రకారములు గలిగినట్టి, బుద్ధేశ్చ = బుద్ధియొక్కయు, ధృతేశ్చ=ధైర్యముయొక్కయు, భేదం = భేదమును, శృణు= వినుము.

శం. అర్జునా ? తెలివియు ధైర్యమును గుణభేదములచేఁ ద్రివిధములయియున్నవి. వానిని నిస్సందేహముగా వేఱుపఱచి చెప్పెదను వినుము.

రామా. ఓ అర్జునా! వివేక పూర్వకమగు నిశ్చయజ్ఞానమును, ఆరంభించిన పనిని విఘ్నములు వచ్చినను విడువకపోవుటయను ధైర్యమును యివిరెండును గుణభేదములచేఁ ద్రివిధములై యున్నవి. వానిని లెస్సగా వేఱుపఱచి చెప్పెదను వినుము.

శ్లో. ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే,
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ.

టీ. హే పార్థ=ఓయి అర్జునా! యా బుద్ధిః=ఏబుద్ధి, ప్రవృత్తిం చ=కర్మమార్గంబును, నివృత్తిం చ=మోక్షమార్గమును,

కార్యాకార్యే=కర్తవ్యాకర్తవ్యములను, భయాభయే=భయాభయములను, బంధం=బంధమును, మోక్షంచ=మోక్షమును, వేత్తి=ఎఱుఁగుచున్నదో, సా=ఆబుద్ధి, సాత్త్వికీ=సత్త్వగుణమువలనఁ గలిగినది.

శం. అర్జునా! కర్మమార్గమును మోక్షమార్గమును గర్తవ్యాకర్తవ్యములను భయాభయములను బంధమోక్షములను నేజ్ఞాన మెఱుఁగుచున్నదో యాజ్ఞానము సత్త్వగుణముచేఁ బుట్టినదని యెఱుఁగుము.

రామా. ఓ అర్జునా! ప్రవృత్తినివృత్తులలో దేని నవలంబించినవారైనను దేశకాలావస్థలను బట్టి చేయఁదగినది కార్యము చేయరానిది అకార్యము అని యెఱుంగుటయు, శాస్త్రముననతిక్రమించుట భయస్థానమనియు, దాని ననువర్తించుట అభయస్థానమనియెఱుంగుటయు, బంధమోక్షములనుయెఱుంగుటయు అనునవి ఏదికలదో యాజ్ఞానము సత్త్వగుణముచేఁ బుట్టినదని ఎఱుంగుము.

శ్లో. యయా ధర్మ మధర్మంచ కార్యం చాకార్య మేవచ,
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ. 31

టీ. హే పార్థ=ఓయి అర్జునా! యయా=ఏబుద్ధిచేత, ధర్మంచ=ధర్మమును, అధర్మంచ=అధర్మమును, కార్యంచ=చేయఁదగినదానిని, అకార్యమేవచ=చేయరానిదానిని, అయథావత్=యథార్థముగానట్లుగా, ప్రజానాతి=తెలియుచున్నాఁడో, సాబుద్ధిః=ఆబుద్ధి, రాజసీ=రాజసమైనది.

శం. పార్థా ! ధర్మాధర్మచర్చయొక్కయు, కార్యాకార్యములయొక్కయు, నిశ్చయమును తెలియఁజాలని తెలివి రజోగుణముచేఁ గలిగినదని యెఱుఁగుము.

రామా. శాస్త్రమున విధింపఁబడినది ధర్మము, నిషేధింపఁబడినది అధర్మము, వీటి చర్చయొక్కయు, ఉన్నది ఉన్నట్లె తెలియక విపరీతముగాఁ గూడ తెలియుటయు రాజసగుణంబుల వలనఁ బుట్టినదని ఎఱుంగుము.

శ్లో. అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసా వృతా,
సర్వార్థాన్ విపరీతాం శ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ. 32

టీ. హేపార్థ = ఓయర్జునా! యాబుద్ధిః=ఏబుద్ధి, తమసా=తమస్సుచేత, ఆవృతా=కప్పఁబడినదై, అధర్మం=నిషిద్ధధర్మమును, ధర్మం=యుక్తధర్మముగా, సర్వార్థాన్=సమస్తపదార్థములను, విపరీతాన్ = ప్రతికూలములనుగాను, మన్యతే=తలంచుచున్నదో, సా=ఆబుద్ధి, తామసీ=తామసమైనది.

శం. అర్జునా! అవివేకముచేత మూయఁబడి నిషిద్ధధర్మములను శాస్త్రీయములైనవి యనిన్ని ఎల్లపదార్థములను వ్యత్యస్తములుగాను తలఁచెడిబుద్ధి తమోగుణముచేఁ గలిగినది.

శ్లో. ధృత్యా యయాధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః,
యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ. 33

టీ. హేపార్థ = ఓయిఅర్జునా! యోగేన= యోగముచేత, అవ్యభిచారిణ్యా=వ్యభిచారిగానట్టి, యయాధృత్యా=ఏధైర్యముచేత, మనఃప్రాణేంద్రియక్రియాః=మనఃప్రాణేంద్రియములక్రియ

లను, ధారయతే=నియమించుచున్నాఁడో, సాధృతిః=ఆధైర్యము, సాత్త్వికీ=సాత్త్వికమైనది.

శం. అర్జునా! ఎవఁడైతే మనస్సు, ప్రాణములు, ఇంద్రియములు వీట్లయొక్క వ్యాపారములను నిశ్చలమైన యోగము చేత నియమింపుచున్నాఁడో వాని ధైర్యము సాత్త్వికధైర్యము.

రామా. యోగమనఁగా మోక్షసాధనమగు భగవదుపాసన; దానికొఱకు ప్రవర్తించినదానికై సాధనములైన మనస్సు మొదలగువాని వ్యాపారములను ఏధృతిచేత నియమించుచున్నాఁడో దానికిసాత్త్వికధృతి యని పేరు.

శ్లో. యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ! రాజసీ. 34.

టీ. హేపార్థ!=ఓయిఅర్జునుఁడా! ఫలాకాంక్షీ=ఫలమును గోరుచున్నపురుషుఁడు, ప్రసంగేన = ఆసక్తిచేత, ధర్మకామార్థాన్=ధర్మార్థకామములను, యయాధృత్యా=ఏధైర్యముచేత, ధారయతే=ధరించుచున్నాఁడో, సాధృతిః=ఆధైర్యము, రాజసీ =రాజసమైనది.

శం. పార్థా! ఎవఁడైతే ఫలాపేక్షతో శ్రద్ధతో ధర్మార్థకామమోక్షములను సర్వదా కోరుచున్నాఁడో వానిధైర్యము రాజసధైర్యము.

రామా. ధర్మార్థకామము లనెడిఫలములను కోరెడి పురుషుఁడు, మిక్కిలిసంగముతో, ధర్మకామార్థములకు సాధనము

లగు మనఃప్రాణేంద్రియక్రియలను ఏధృతిచే ధరింపుచున్నాఁడో దానికి రాజసధృతి యని పేరు.

శ్లో. యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ,
నవిముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ. 35

టీ. హే పార్థ=ఓయర్జునా! దుర్మేధాః=కుత్సితబుద్ధిగలపురుషుఁడు, యయా = ఏధైర్యముచేత, స్వప్నం = నిద్రయును, భయం=భీతియును, శోకం=దుఃఖమును, విషాదం=దిగులును, మద మేవచ=మదంబును, నవిముంచతి=విడువఁడో, సాధృతిః= ఆధైర్యము, తామసీ=తామసమైనది.

శం. అర్జునా! కుత్సితబుద్ధిగల మనుష్యుఁడు ఏధైర్యము వల్ల నిద్రను, భయమును, దుఃఖమును, చింతను, కావరమును వదలఁడో అట్టిధైర్యము తామసధైర్యము.

రామా. ఓఅర్జునా! కుత్సితుఁడైనమనుష్యుఁడు ఏధైర్యము వల్ల, స్వప్నమదములంగూర్చినమనస్సు మొదలగువానికార్యములను, ఆస్వప్నమదములవలన కలిగెడిభయశోక విషాదములను వదలక, వానికిసాధనములగు మనస్సుమొదలగువాని క్రియలనే ధృతిచేతధరింపుచున్నాఁడో దానికి తామసధృతియని పేరు.

శ్లో. సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. 36
య త్త దగ్రే విష మివ పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్. 37

టీ. హే భరతర్షభ !=ఓయి అర్జునా! త్రివిధం=మూడువిధములుగలిగిన, సుఖం=సుఖమును,ఇదానీం=ఇప్పుడు, మే=నాయొక్క (నాకుక్కవలన), శృణు=వినుము.యత్ర=ఏసుఖానుభవమందు, అభ్యాసాత్ =అభ్యాసమువలన, రమతే=క్రీడించుచున్నాఁడో, దుఃఖాంతంచ=దుఃఖనాశనమును, నిగచ్ఛతి=పొందుచున్నాఁడో, యత్తత్ =ఏయాసుఖమును,అగ్రే=తొలుత, విషమివ=విషమువలెను, పరిణామే=అంతమందు, అమృతోపమం=అమృతతుల్యమును, భవతి=అవుచున్నదో, ఆత్మబుద్ధిప్రసాదజం=స్వబుద్ధినైర్మల్యమువలనఁబుట్టిన, తత్సుఖం = ఆసుఖము, సాత్త్వికం=సాత్త్వికమని, ప్రోక్తం=చెప్పఁబడెను.

శం. పార్థా! సుఖమున్ను గుణసంబంధము గలిగి త్రివిధముగా నున్నయది, వానిని తెలియ జెప్పుచున్నాను వినుము. ఏసుఖానుభవమునందు అభ్యాసమువలన క్రీడించుచున్నాఁడో, ఏసుఖము దుఃఖమును పోఁగొట్టునో, ఏసుఖము మొదట విషమువలెనుండి తుదిలో అమృతముతో సమానముగా నుండునో అట్టి తనబుద్ధినైర్మల్యముచే కలిగిన సుఖము సాత్త్విక సుఖము.

రామా. దేనివలన నిరతిశయమైన ప్రీతినిపొందుచున్నాఁడో దేనివలన సాంసారిక దుఃఖముయొక్క అంతమును గూడ పొందుచున్నాఁడో ఆసుఖము గుణసంబంధియై త్రివిధములుగా నున్నయది. దానిని తెలియ చెప్పెదను, ఓఅర్జునా! వినుము. జ్ఞానవైరాగ్యధ్యానసమాధుల నారంభించునపుడు అనఁగా యోగారంభకాలమున ఏసుఖము విషమువలెనుండి తుదకు

అమృతమువలె నుండునో అట్టి ఆత్మస్వరూపానుభవసుఖము సాత్త్వికసుఖము.

శ్లో. విషయేంద్రియసంయోగా ద్య త్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్. 38

టీ. విషయేంద్రియసంయోగాత్ = విషయేంద్రియముల సంబంధమువలన, యత్తత్ = ఏ ఆసుఖము, అగ్రే = మొదటను, అమృతోపమం = అమృతతుల్యమును, పరిణామే = అంతమందు, విషమివ = విషమువలెను, భవతి = అవుచున్నదో, తత్సుఖం = ఆసుఖము, రాజసం = రాజసమయినదని, స్మృతం = చెప్పఁబడెను.

శం. విషయేంద్రియసంబంధము గలిగి మొదట అమృతముగాను కడపట విషముగాను ఉండు సుఖము రాజససుఖము.

రామా. విషయేంద్రియ సంబంధము కలిగి, మొదటను అనఁగా ననుభవించునపుడు అమృతముగాను, విషయములు సుఖకరములగుటకు కారణములగు ఆఁకలి మొదలయినవి అణఁగినతోడనే విషముగాను ఉండు సుఖము రాజస సుఖము.

శ్లో. యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః,
నిద్రాలస్యప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్. 39

టీ. యత్ = ఏసుఖము, అగ్రే = అనుభవకాలమందును, అనుబంధేచ = విపాకమందును, ఆత్మనః = తనకు, మోహనం = మోహకరమయినదో, నిద్రాలస్యప్రమాదోత్థం = నిద్రాలస్యప్రమాదములవలనఁబుట్టిన, తత్ = ఆసుఖము, తామసం = తామసమని, ఉదాహృతం = చెప్పఁబడెను.

శం. నిద్రచే ఆలస్యముచే హెచ్చరిక లేమిచే పుట్టుసుఖము మొదటను తుదను ఆత్మకు భ్రాంతిపుట్టించును. అట్టిసుఖము తామససుఖమని చెప్పుదురు.

రామా. ఆలస్యమనఁగా నింద్రియవ్యాపారములు మందగించుట-నిద్ర, ఆలస్యము, హెచ్చరికలేమి, వీటిచే పుట్టు సుఖము మోహకరమై భ్రాంతిని కలుగఁ జేయుచున్నది. అట్టిసుఖము తామససుఖము. (మోక్షమును కోరువాఁడు రాజస తామస సుఖములను త్రోసి వేసి, సాత్త్విక సుఖమునె స్వీకరించునని ఫలితార్థము.)

శ్లో. న తద స్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం య దేభి స్స్యా త్త్రిభిర్గుణైః.

టీ. యత్సత్త్వం=ఏప్రాణిజాతము, ప్రకృతిజైః=మాయవలనఁబుట్టిన, ఏభిస్త్రిభిర్గుణైః=ఈమూఁడుగుణములచేత, ముక్తం=విడువఁబడినవి, స్యాత్=అవునో, తత్=ఆప్రాణిజాతము, పృథివ్యాంవా=భూమియందలి (మనుష్యులయందైనను), దివి= స్వర్గమందు, దేవేషువా=దేవతలయందైనను, నాస్తి=లేదు.

శం. ప్రకృతిచే జనించిన ఈసత్త్వాది గుణములకు లోఁబడని ప్రాణి మానుషలోకమందుగాని దేవలోకమందుగాని పాతాళలోకమందుగాని లేఁడు.

శ్లో. బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః. 41

టీ. హేపరంతప!=ఓయర్జునా! బ్రాహ్మణక్షత్రియవిశాం= బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకును, శూద్రాణాంచ=శూద్రు

లకును, కర్మాణి=క్రియలు, స్వభావప్రభవైః = ప్రకృతివలనఁ బుట్టిన, గుణైః=సత్త్వాదిగుణములచేత, ప్రవిభక్తాని=విభజింపఁ బడినవి.

శం. అర్జునా! బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రజాతులకు శాస్త్రనియమితకర్మలు వారివారి ప్రకృతివలనఁ బుట్టిన సత్త్వాదిగుణముల ననుసరించి ఏర్పఱచఁబడియున్నవి.

రామా. బ్రాహ్మణాది వర్ణముల జన్మములను గలిగించిన పూర్వకర్మము స్వభావమనఁబడును. అందు బ్రాహ్మణునకు స్వభావప్రభవమగు గుణము రజస్తమస్సుల నణఁగద్రొక్కి బయలుదేరిన సాత్త్విక గుణము, క్షత్రియునకు సాత్త్విక తమస్సుల నణఁగద్రొక్కి బయలుదేరిన రాజసగుణము, వైశ్యునకు సత్త్వరజస్సుల నణఁగద్రొక్కిన తామసగుణము, శూద్రునకు లెస్సగా నుద్రేకించిన తమస్సు, ఇట్లు స్వభావ ప్రభవములగు గుణములతోఁగూడ ఆయావర్ణముల కర్మములు శాస్త్రములచే నేర్పాటుగాఁ జెప్పఁబడినవి.

శ్లో. శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్. 42

టీ. శమః=అంతరింద్రియనిగ్రహమును, దమః=బహిరింద్రియనిగ్రహమును, తపః = తపస్సును, శౌచం = శుచిత్వమును, క్షాంతిః=ఓర్పును, ఆర్జవం=ఋజుత్వమును, జ్ఞానం=జ్ఞానమును, విజ్ఞానం = అనుభవజన్యజ్ఞానమును, ఆస్తిక్యం=కలదనినమ్ముటయు

ను, బ్రాహ్మం=బ్రహ్మసంబంధమైన, స్వభావజం=స్వభావమువలనఁబుట్టిన, కర్మ=కర్మము.

శం. లోపలి ఇంద్రియముల నిగ్రహము, బహిరింద్రియనిగ్రహము, తపస్సు, శుద్ధి, ఓర్పు, నిర్వక్రత్వము, శాస్త్రీయ జ్ఞానము, అనుభవజ్ఞానము, ఈశ్వరుఁడు కద్దను నమ్మిక, ఇవి యన్నియు బ్రాహ్మణులకు స్వభావముచేఁ బుట్టినకర్మలు.

రామా. వెలుపలి ఇంద్రియములను నియమించుట, మనస్సును నియమించుట, విషయానుభవములను నియమించుట యనెడిశాస్త్రసిద్ధమైన శరీరక్లేశము, శాస్త్రీయ కర్మములకు తగియుండుట, తనమనస్సును బాహ్యవ్యాపారంబులు నొక్కవిధంబుగా నుండుట, పరతత్త్వమును అపరతత్త్వమును యథార్థముగాఁ దెలిసికొను జ్ఞానము, పరతత్త్వము నందలి విశేషముల నెఱుంగుట, వేదమునఁ జెప్పఁబడిన విషయ మంతయును సత్యమె అనెడి గట్టినమ్మకము ఇవన్నియు బ్రాహ్మణునకుస్వభావముచే ననఁగా పూర్వజన్మకర్మమువలనఁ బుట్టినవనుట.

శ్లో. శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్,
దాన మీశ్వరభావ శ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. 43

టీ. శౌర్యం=శూరత్వమును, తేజః=ప్రాగల్భ్యమును, ధృతిః=ధైర్యమును, దాక్ష్యం=సామర్థ్యమును, యుద్ధే=యుద్ధమందు, అపలాయనంచ=పారిపోకయుండుటయు, దానం=ఇచ్చుటయు, ఈశ్వరభావశ్చ=సకలజనులనేలుటయు, ఏతత్=ఇది, క్షాత్రత=క్షత్రసంబంధమైన, స్వభావజం=స్వభావమువలనఁ బుట్టిన, కర్మ=కర్మము.

శం. శౌర్యము, తేజస్సు, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమునందు పరుగెత్తకుండుట, దానము, దొరతనము, ఇవి క్షత్రియులకు స్వాభావికకర్మలు.

రామా. యుద్ధమున నిర్భయముగాఁ బ్రవేశించుట, ఇతరులచేఁ దిరస్కరింపఁబడక పోవుట, ఆరంభించిన కర్మములను విఘ్నములు కలిగినను కొనసాగించుట, అన్నిపనులను సాగించెడి సామర్థ్యము, యుద్ధమున తానుచచ్చుట నిశ్చితమైనను వెనుకఁ దీయకపోవుట, ఇతరుల నందఱనియమించెడి సామర్థ్యము, ఇచ్చుట, యివిక్షత్రియునకు పూర్వజన్మ కర్మమువలనఁ బుట్టినవనుట.

శ్లో. కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44

టీ. కృషిగౌరక్ష్యవాణిజ్యం-కృషి=దున్నుటయు, గౌరక్ష్య=గోసంరక్షణజేయుటయు, వాణిజ్యం=వ్యాపారముఁచేయుటయు, వైశ్యం = వైశ్యసంబంధమైన, స్వభావజం = స్వభావమువలనఁబుట్టిన, కర్మ=కర్మము. పరిచర్యాత్మకం= సేవారూపమైన, కర్మ=కర్మము, శూద్రస్య=శూద్రునికి, స్వభావజం=స్వభావజన్యమైనది.

శం. దున్నుట, గోసంరక్షణము, వ్యాపారము, ఇవివైశ్యులకు స్వాభావికకర్మలు. సేవ శూద్రులకు స్వాభావికకర్మ.

శ్లో. స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి త చ్ఛృణు. 45

టీ. నరః=మానవుఁడు, స్వేస్వేకర్మణి=తనతన కర్మమందు, అభిరతస్సన్=ఆసక్తుఁడైనవాఁడై, సంసిద్ధిం=సిద్ధిని,లభతే=పొందుచున్నాఁడు. స్వకర్మనిరతః=స్వకీయకర్మమందాసక్తుఁడైనవాఁడు, యథా=ఏప్రకారముగా, సిద్ధిం=సిద్ధిని,విందతి=పొందుచున్నాఁడో, తత్=ఆకర్మవిధానమును, శృణు=వినుము.

శం. మానవులు తమతమజాతిధర్మములయిన కర్మలయందాసక్తిగలిగి యేవిధముగ సిద్ధినిజెందుచున్నారో ఆక్రమమును తెలియఁజెప్పుచున్నానువినుము.

రామా. సంసిద్ధియనఁగా పరమపదమును పొందుట.

శ్లో. యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్,
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. 46

టీ. యతః=ఏయీశ్వరునివలన, భూతానాం=ప్రాణులయొక్క,ప్రవృత్తిః=ఉత్పత్తి, భవతి=అగుచున్నదో, యేన=ఏయీశ్వరునిచేత,ఇదంసర్వం=ఈసమస్తమైనజగత్తును,తతం=వ్యాపించఁబడెనో,మానవః=మనుష్యుఁడు, స్వకర్మణా=స్వకీయకర్మముచేత,తం=ఆయీశ్వరుని,అభ్యర్చ్య=పూజించి, సిద్ధిం=యోగ్యతను, విందతి=పొందుచున్నాఁడు.

శం. ఏయీశ్వరునివలన నెల్ల ప్రపంచము జనించుచున్నదో, ఎవనిచే నీవెల్లప్రపంచములు వ్యాపింపఁబడియున్నవో, అట్టిఈశ్వరుని మనుష్యులు వారివారిస్వకీయకర్మానుష్ఠానములచే కొలిచి సిద్ధిని జెందుచున్నారు.

రామా. ఇంద్రుఁడు మొదలగు వారల కంతరాత్మయగు నట్టి నన్నీశ్వరునిగ వారివారిస్వకీయ కర్మానుష్ఠానములచేఁ గొలిచి నాపదవిని బొందుచున్నారనుట.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 47

టీ. విగుణః=కించిద్గుణముగలిగినదైనను, స్వధర్మః=స్వధర్మము, స్వనుష్ఠితాత్=లెస్సగా నాచరింపఁబడిన, పరధర్మాత్ = ఇతరధర్మమునకంటె, శ్రేయాన్ = శ్రేష్ఠమైనది, స్వభావనియతం = స్వభావముచేత నియతమైన, కర్మ = కర్మమును, కుర్వన్=చేయుచున్నజనుఁడు, కిల్బిషం=పాపమును, నాప్నోతి=పొందఁడు.

శం. తమకులధర్మములు కించిద్గుణములు గలవైనను విశేషగుణముగలిగి, చక్కఁగానను ష్ఠింపఁబడిన పరధర్మములకంటె శ్రేష్ఠములైనవని తెలియుము. తమతమకులధర్మముల నాచరించుజనులను పాపములు చెందవు.

రామా. ప్రకృతితోఁగూడియున్న శరీరముగలజీవుఁడు ఆచరింపవలసినకర్మయోగము, పరధర్మమనఁగా నింద్రియజయము చేయఁజాలువానికైధర్మమైన జ్ఞానయోగమునకంటె ప్రమాదములేనిది. కర్మము ఇంద్రియవ్యాపారమగుట స్వభావముననె నియతమైనది. జ్ఞానయోగమున ప్రమాదముకలదు గాన కిల్బిషంబు కలుగవచ్చును, ఎట్లైనను తమతమకులధర్మంబుల నాచరించు జనులు పాపమును పొందరు.

శ్లో. సహజం కర్మ కౌంతేయ! సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరి వావృతాః. 48

టీ. హేకౌంతేయ = ఓయర్జునా! సదోషమపి = దోషయుక్తమైనదైనను, సహజం = స్వభావజన్యమైన, కర్మ=కర్మమును, నత్యజేత్ = విడువఁగూడదు, హి=ఏకారణమువలన, సర్వారంభాః = సమస్తకర్మములు, ధూమేన=పొగచేత, అగ్నిరివ=అగ్నివలెనే, దోషేణ = దోషముచేత, ఆవృతాః=కప్పఁబడినవో?

శం. కౌంతేయా! దోషయుక్తమైనను స్వభావజన్యమైన కులధర్మములను విడువకూడదు. ఎందువల్లననగా అగ్నినిపొగ కప్పినరీతి నెల్లకర్మలను దోషము చుట్టుకొనియున్నది.

రామా. ఓకౌంతేయా ! దుఃఖముతోఁగూడినదైనను స్వభావజన్యమైన కులధర్మములను విడువఁగూడదు. జ్ఞానయోగమునకుఁదగినవాఁడైనను కర్మయోగమునేచేయునది. ఎందువల్లననఁగా అగ్నినిపొగకప్పినరీతి నెల్లకర్మలును దుఃఖముచేత చుట్టుకొనఁబడియున్నవి.కర్మయోగము సులభముగాఁ జేయఁదగినదియును ప్రమాదములేనిది యనుట. జ్ఞానయోగము అట్టిదికాదు.

శ్లో. అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి. 49

టీ. సర్వత్ర=సమస్తమందును, అసక్తబుద్ధిః = సంగరహితబుద్ధిగలిగిన, జితాత్మా = జయింపఁబడిన మనస్సుగలిగిన, విగతస్పృహః = ఉడిగినయాశలు గలిగినట్టివాఁడు, సన్న్యాసేన=

కర్మఫలత్యాగముచేత, పరమాం = ఉత్కృష్టమైన, నైష్కర్మ్యసిద్ధిం = నిష్క్రియత్వసంసిద్ధిని, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

శం. ఎవఁ డెల్లప్రపంచమును దాశవిడిచి మనస్సు స్వాధీనము చేసికొని అన్నియాశలు వదలి కర్మఫలత్యాగము చేయుచున్నాఁడో, అతఁ డుత్కృష్టమైన నైష్కర్మ్యసిద్ధిని పొందుచున్నాఁడు.

రామా. పరమపురుషుఁడు కర్తయనితలంచుటచేత తాను కర్తయనుటయందు స్పృహలేనిమనుష్యుఁడు జ్ఞానసిద్ధిని, దానికి ఫలమైన ధ్యానయోగనిష్ఠను, త్యాగముతో కర్మమును జేయువాఁడై పొందుచున్నాఁ డనుట.

శ్లో. సిద్ధింప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే,
సమాసే నైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

టీ. హే కౌంతేయ=ఓయర్జునా! సిద్ధిం=యోగ్యతను, ప్రాప్తః=పొందినవాఁడు, బ్రహ్మ=పరమాత్మను, యథా=ఏప్రకారముగా, ఆప్నోతి=పొందుచున్నాఁడో,(దానిని), పరా=ఉత్కృష్టమైన, జ్ఞానస్య=జ్ఞానముయొక్క, నిష్ఠా=నిష్ఠ, యా=ఏదికలదో, తథా=దానిని, సమాసేన=సంక్షేపముచేత, మే(సకాశాత్)=నావలన, నిబోధ=తెలిసికొనుము.

శం. అర్జునా! నైష్కర్మ్యసిద్ధిని బొందినపిదప పరబ్రహ్మను పొందుటకు త్రోవయైన మిక్కిలి శ్రేష్ఠమైనజ్ఞాననిష్ఠను నీకు సూక్ష్మముగాఁ జెప్పెదవినుము.

రామా. కర్మయోగముచేఁ గలుగవలసిన ధ్యానసిద్ధినిపొందినవాఁడు ఎట్లుప్రవర్తింపుచున్నవాఁడై బ్రహ్మమునుపొందునో, వబ్రహ్మజ్ఞానమనెడిధ్యానము (పరానిష్ఠా) పరమప్రాప్యమో దానిని నీకు సూక్ష్మముగాఁ జెప్పెదవినుము.

మధ్వ. ఏయుపాయముచేత సిద్ధిని పొందినవాఁడై బ్రహ్మమును పొందుచున్నాఁడో, ఏసిద్ధి జ్ఞానముయొక్క గొప్పనిష్ఠయో, ఓకౌంతేయా! దానిని నీకుసూక్ష్మముగాఁ జెప్పెదవినుము.

శ్లో. బుద్ధ్యావిశుద్ధయా యుక్తో
ధృత్యాఽఽత్మానం నియమ్య చ,
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా
రాగ ద్వేషౌ వ్యుదస్య చ. 51

టీ. విశుద్ధయా=మాయారహితమైన, బుద్ధ్యా=బుద్ధితోడ, యుక్తః=కూడినవాఁడై, ధృత్యా=ధైర్యముచేత, ఆత్మానం=ఆత్మను, నియమ్యచ=వశీకరణముచేసుకొని, శబ్దాదీన్=శబ్దము మొదలుగాఁగల, విషయాన్=విషయములను, త్యక్త్వా=విడిచి, రాగద్వేషౌ=రాగద్వేషములను, వ్యుదస్యచ=విడిచియు.

శం. మాయారహితమైన బుద్ధిసిపట్టి ధైర్యముతో మనస్సును నిలిపి శబ్దస్పర్శరూపరసగంధవిషయములను పారద్రోచి రాగద్వేషములను వదలవలెను.

రామా. ఆత్మతత్త్వమునెఱుంగుటకై, మనస్సును విషయములనుండి మఱలించుటచేత యోగమునకుఁ దగినదానినిగాఁ జేసి, శబ్దాదివిషయములను దగ్గఱకు రానీయక, వానివలనఁ గలిగెడి రాగద్వేషములను విడువవలయును.

శ్లో. వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52
అహంకారం బలం దర్పం కామంక్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే.

టీ. వివిక్తసేవీ=రహస్యస్థలమందున్నవాఁడై, లఘ్వాశీ=లఘుభోజనశీలుఁడై, యతవాక్కాయమానసః = నియమింపఁబడిన మనోవాక్కాయములుకలవాఁడై, నిత్యం=ఎల్లప్పుడును, ధ్యానయోగపరః = ధ్యానయోగాసక్తుఁడై, వైరాగ్యం=వైరాగ్యమును, సముపాశ్రితః=ఆశ్రయించినవాఁడై, అహంకారం=నేను విరక్తుఁడనెడు నహంకారమును, బలం = సామర్థ్యమును, దర్పం = (యోగబలముచేత ఉన్మార్గ ప్రవృత్తి లక్షణమైన) దర్పమును, కామం = కోరికను, క్రోధం = కోపమును, పరిగ్రహం = బాహ్యవస్తు పరిగ్రహమును, విముచ్య=విడిచి, నిర్మమః=మమకారరహితుఁడై, శాంతః=పోఁగొట్టఁబడిన హర్షాదులుగలవాఁడై (ఈరీతిగానుండెడి జ్ఞాననిష్ఠుఁడు), బ్రహ్మభూయాయ = బ్రహ్మభావముకొఱకు, కల్పతే = సమర్థుఁడగుచున్నాఁడు.

శం. రహస్యప్రదేశములలో నుండువాఁడై మితాహారముఁ చేయుచు వాక్కును, మనస్సును, శరీరమును నియమముతో నిలిపి సదా ధ్యానయోగమునం దాసక్తుఁడై వైరాగ్యమును జెంది, కావరమును, సామర్థ్యమును, దర్పమును, కామమును, క్రోధమును, గృహదారాదులయం దాసక్తిని, మమకారమును,

దురాగ్రహమును విడిచియుండు జ్ఞాననిష్ఠుఁడు పరబ్రహ్మమును పొందుటకు సమర్థుఁ డగుచున్నాఁడు.

రామా. ధ్యానవిరోధులు లేని రహస్యప్రదేశములలో నుండువాఁడై, విస్తారము తినుటగాని, బొత్తిగా తినకపోవుటగాని లేనివాఁడై, ధ్యానాభిముఖములుగాఁ జేయఁబడిన వైరాగ్యమును దేహపాతము వఱకును వృద్ధి పొందించుకొనవలయును. తానుధ్యానము చేయవలసినది తప్పమిగిలినవాని యందలి దోషములను విమర్శించుటచేత వానియందలి యనురాగము లేక పోవుటను, వృద్ధిపొందించుకొనుచు, కావరమును, దేహమె ఆత్మయని తోఁచెడివాసనా బలమును, తనవి కానివానిని తనవి యని తలఁచెడి తలంపును, ఆత్మానుభవ మొక్కటియె కలవాఁడును, దర్పమును, కామమును, క్రోధమును విడిచియుండు జ్ఞాననిష్ఠుఁడు సమస్తబంధములును పోయినవాఁడై స్వస్వరూపముననున్న ఆత్మ ననుభవించును.

మధ్వ. బ్రహ్మభూయమనఁగా నెల్లప్పుడును మనసు బ్రహ్మమునందె కలిగియుండుట.

శ్లో. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి,
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54

టీ. బ్రహ్మభూతః=బ్రహ్మనిష్ఠుఁడయినవాఁడు, ప్రసన్నాత్మా=నిర్మలమైనమనస్సుగలవాఁడయి, నశోచతి=నష్టమయినవస్తువును గూర్చి దుఃఖించఁడు. నకాంక్షతి=రానివస్తువునుకోరఁడు. సర్వేషు=సమస్తములైన, భూతేషు=ప్రాణులయందు, సమస్సన్=

సముఁడైనవాఁడై, పరాం=శ్రేష్ఠమైన, మద్భక్తిం-యత్ = నాయందు, భక్తిం=భక్తిని, లభతే=పొందుచున్నాఁడు.

శం. బ్రహ్మనిష్ఠుఁడైనవాఁడు నిర్మలమైన మనసుగలవాఁడై శిథిలమైనవస్తువులకు శోకింపక, రానివస్తువులను కోరక, యెల్ల ప్రాణులయందు సమదృష్టిగలిగి పరమోత్కృష్టుఁడైన నన్ను పూజచేయుచుండును.

రామా. అపరిచ్ఛిన్నజ్ఞానమే యాకారముగాఁ గల్గి భగవంతునకు శేషభూతుఁడగుటయే స్వభావముగాఁగల ఆత్మస్వరూపముబయలుపడినవాఁడు దుఃఖము కర్మము మొదలగువానిచే కలుషము చెందనిస్వరూపము గలవాఁడై నేను తప్ప మిగిలినయన్నిభూతములయందును సమముగా నాదరముగలవాఁడై, అన్ని భూతములను తృణసమానములుగా చూచుచు, సర్వేశ్వరుఁడగు నాయందు మిక్కిలి ప్రీతితో ననుభవించుట యనెడి పరమభక్తిని పొందుచున్నాఁడు.

శ్లో. భక్త్యా మామభిజానాతి
యావాన్ యశ్చాఽస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా
విశతే తదనంతరమ్. 55

టీ. అహం=నేను, యావాన్=ఎంతవాఁడనో, యశ్చ=ఏలాటివాఁడను, అస్మి=అవుచున్నానో, మాం=అట్టినన్ను, భక్త్యా=భక్తిచేత, తత్త్వతః=యథార్థముగా, అభిజానాతి=ఎఱుంగుచున్నాఁడు. తతః=అతర్వాత, మాం=నన్ను, తత్త్వతః=యథా

ర్థముగా, జ్ఞాత్వా=ఎఱింగి, తదనంతరం=ఆపిమ్మట, విశతే = నన్నే ప్రవేశించుచున్నాఁడు.

శం. సర్వవ్యాపిగానున్ను, సచ్చిదానంద రూపుడుగానున్ను, ఉండే నన్ను మిగుల భక్తిచే తెలిసికొనినవాఁడు అట్టి జ్ఞాన పరిసమాప్తిదినములయందు నాయందే ప్రవేశించుచున్నాఁడు.

రామా. స్వరూప స్వభావములంబట్టి యెవ్వఁడనో, గుణములంబట్టి విభూతినిబట్టి యెవ్వఁడనో, దానిని తెలిసికొని బ్రహ్మనిష్ఠుఁడు, భక్తిచేత నన్ను బొందుచున్నాఁడు. ఆభక్తివలన జ్ఞానపరిసమాప్తిదినములయందు నాస్వరూపమును గలవాఁడగుచున్నాఁడు.

శ్లో. సర్వకర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. 56

టీ. మద్వ్యపాశ్రయః = నేనేప్రాప్యస్థానముగాఁగలిగినవాఁడు, సదా=ఎల్లప్పుడును, సర్వకర్మాణి=సమస్తకర్మములను, కుర్వాణః=చేయుచున్నవాఁడయి, మత్ప్రసాదాత్=నాయనుగ్రహమువలన, అవ్యయం=నాశరహితమయిన, శాశ్వతం = స్థిరమైన,పదం=పరమపదమును, అవాప్నోతి=పొందుచున్నాఁడు.

శం. నన్నే ప్రాప్యస్థానముగా తలఁచి వేదోక్తమైన ఎల్లనిత్యనైమిత్తికకర్మలను చేయువాఁడు నాయనుగ్రహమువలన నాశరహితమైన మోక్షమునుఁ బొందుచున్నాఁడు.

రామా. ఆబ్రహ్మనిష్ఠుఁడు నన్నే పొందఁదగినవాఁడుగా నెంచి, నిత్యనైమిత్తికములనేకాక, కామ్యములను గూడ నాయందె యునుపఁబడిన కర్తృత్వమును కలవాఁడై, సంపూర్ణమైన, పొందఁబడు వాఁడనగునన్ను పొందుచున్నాఁడు.

శ్లో. చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ. 57

టీ. (కావున నీవు), చేతసా=వివేకజ్ఞానముచేత, సర్వకర్మాణి=సమస్తకర్మములను, మయి=నాయందు, సన్న్యస్య=ఉంచి, మత్పరస్సన్=నేనే యుత్కృష్టముగాఁగలవాఁడవై, బుద్ధియోగం=బుద్ధియోగమును, ఉపాశ్రిత్య=ఆశ్రయించి, సతతం=ఎల్లప్పుడు,మచ్చిత్తః=నాయందుమనస్సుగలవాఁడవు, భవ=కమ్ము.

శం. కావున నీవు జ్ఞానయోగముచే నెల్లకర్మఫలములను నాకు వదలి నన్నే యుత్కృష్టగతి యని నమ్మి జ్ఞానయోగము చేత నెల్లకాలములయందును నాయందే మనస్సుగలవాఁడవై యుండుము.

రామా. తాను నావాఁడు, అనఁగా నాకు నియామ్యుఁడు అనెడు బుద్ధిచేత నేనేఫలముగా పొందఁదగినవాఁడని తలంచుచు బుద్ధినే యాశ్రయించి యెల్లకాలములయందు నాయందే మనస్సు గలవాఁడవై యుండుమనుట.

శ్లో. మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథ చే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. 58

టీ. మచ్చిత్తః=నాయందే మనస్సుగలిగిన, త్వం=నీవు, మత్ప్రసాదాత్ = నాయనుగ్రహమువలన, సర్వదుర్గాణి=సమస్తదుర్గములను, తరిష్యసి=అతిక్రమించఁగలవు, అథ=ఆతర్వాత, త్వం=నీవు, అహంకారాత్ =గర్వమువలన, నశ్రోష్యసిచేత్ = వినకపోతివాయెనేని, వినఙ్క్ష్యసి=చెడిపోఁగలవు.

శం. నాయందు నీమనస్సులయించినట్లైతే నాయనుగ్రహమువలన నెల్లదుఃఖములు నీకుఁదొలఁగిపోవును, లేక నహంకారమునుపొంది నాపలుకులను వినకపోతివేని నీవు నశించిపోదువు.

రామా. ఇట్లు నాయందు చిత్తముకలవాఁడవై అన్నికర్మములంజేయుచు, సంసారములోని దుర్గములను (నన్నుపొందుటకడ్డమువైన ప్రకృతి సంబంధములగు నావరణములను) అతిక్రమించగలవు. అట్లుగాక, సమస్తమును నే నెఱుంగుదును అని యహంకరింతువేని నీవు నశించిపోదువు అనుట.

శ్లో. యద్యహంకార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. 59

టీ. అహంకారం=అభిమానమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, నయోత్స్యఇతి=యుద్ధము జేయనని, మన్యసేయది=తలంచితివేని, ఏషః=ఈ, తే = నీయొక్క, వ్యయసాయః=నిశ్చయము, మిథ్యా=అబద్ధమగుచున్నది, (ఎందువలననినన,) ప్రకృతిః=నీస్వభావము, త్వాం=నిన్ను, నియోక్ష్యతి=నియమింపఁగలదు.

శం. నీవు గర్వమునొంది యుద్ధము నెంతమాత్రము చేయనని పలికితివేని అట్టి నీపలుకులు వ్యర్థమైపోవును నీ ప్రకృతిసంభవగుణములు నీచే యుద్ధముచేయించును.

శ్లో. స్వభావజేన కౌంతేయ ! నిబద్ధ స్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్. 60

టీ. హేకౌంతేయ=ఓ యర్జునా ! స్వభావజేన=స్వభావము వలనఁబుట్టిన, స్వేనకర్మణా=స్వకీయకర్మముచేత, నిబద్ధః=కట్టఁబడినవాఁడవై, యత్=ఏకర్మమును, కర్తుం=చేయుటకొఱకు, నేచ్ఛసి=ఇచ్ఛయించవో, తత్=ఆకర్మమును, మోహాత్=అవివేకమువలన, అవశోపి=పరవశుఁడవయ్యును, కరిష్యసి=చేయఁగలవు.

శం. భారతా! స్వభావజస్వగుణములకు లోఁబడిన నీవు ఎట్టికర్మ చేయఁగూడదని అవివేకముచేత నిశ్చయించెదవో, అట్టికర్మ నీకు తెలియకనే నీస్వభావగుణము నిన్ను మరపుజేసి నీచేఁ జేయించును.

రామా. నీశౌర్యగుణములకు లోఁబడిననీవు ఓ యర్జునా!పరుల తిరస్కారమును సహింపనివాఁడవై ఎట్టికర్మ చేయఁగూడదని అవివేకముచేత నిశ్చయించెదవో, అట్టికర్మ నీకు తెలియకనే నీచేఁజేయించును.

శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.

టీ. హే అర్జున=ఓ యర్జునుఁడా! ఈశ్వరః=జగన్నియామకుఁడు, సర్వభూతానాం=సమస్తప్రాణులయొక్క, హృద్దేశే= హృదయప్రదేశమందు, యంత్రారూఢాని = దేహముల నధిష్ఠించియున్న, సర్వభూతాని=సమస్తజీవులను, మాయ

యా=నిజశక్తిచేత, భ్రామయన్=భ్రమింపఁజేయుచున్నవాఁడై, తిష్ఠతి=ఉన్నాఁడు.

శం. అర్జునా! ఎల్లభూతములకు నియామకుఁడైన ఈశ్వరుఁడు ఎల్లప్రాణులహృదయములయం దున్నవాఁడై యంత్రగాఁడు బొమ్మల నాడించురీతిగా మాయచేత ప్రాణులను భ్రమింపఁజేయుచున్నాఁడు.

రామా. అర్జునా! ఎల్లభూతములకు నియామకుఁడైన ఈశ్వరుఁడు అన్నిజంతువులకును జ్ఞానోత్పత్తియగు స్థానమైన హృదయమునందుండి దేహేంద్రియరూపమగు ప్రకృతిని నిజశక్తిచేత భ్రమింపఁజేయుచున్నాఁడు.

శ్లో. తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసిశాశ్వతమ్.

టీ. హే భారత=ఓయిఅర్జునా! సర్వభావేన=సర్వాత్మభావముచేత, తమేవ = ఆయీశ్వరునే, శరణం=రక్షకునిగా, గచ్ఛ=పొందుము, తత్ప్రసాదాత్ =ఆఈశ్వరునియనుగ్రహమువలన, పరాం = ఉత్కృష్టమైన, శాంతిం = చిత్తనైర్మల్యమును, శాశ్వతం=నిత్యమగు, స్థానం=మోక్షరూపస్థానమును, ప్రాప్స్యసి=పొందఁగలవు.

శం. అర్జునా! పైచెప్పిన శివునినే సర్వవిషయములయం దుశరణుపొందుము. ఆశివునియనుగ్రహంబున ఉత్కృష్టమైన చిత్తశాంతికలిగి నిత్యమైనమోక్షమును బొందఁగలవు.

రామా. ఓఅర్జునా! నీవట్లుసర్వభావములచేతను ఆయీశ్వరునే రక్షకునిగా పొందుము. ఆతని యనుగ్రహామువలన కర్మబంధములుడిగి వైకుంఠమును జెందఁగలవు.

శ్లో. ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యాతరం మయా,
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. 63

టీ. ఇతి=ఈప్రకారముగా, తే=నీకొఱకు, మయా=నాచేత, గుహ్యాత్=గోప్యమునకంటె, గుహ్యాతరం=మిక్కిలిగోప్యమైన, జ్ఞానం=జ్ఞానము, ఆఖ్యాతం=చెప్పఁబడెను, ఏతత్=ఈజ్ఞానశాస్త్రమును, అశేషేణ=సాకల్యముగా, విమృశ్య=విచారించి, యథా=ఏప్రకారముగా, ఇచ్ఛసి=ఇచ్ఛయించుచున్నావో, తథా=ఆప్రకారముగా, కురు=చేయుము.

తం. ఈ ప్రకారము నీకొఱకు రహాస్యములలో పరమరహాస్యమైనజ్ఞానమును తెలియఁజెప్పితిని దానిని వివరముగా యోచించి నీయిష్టప్రకారము చేయుము.

రామా. మోక్షములు గోరువారు తెలిసికొనవలసిన, కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగములను నీకు విస్తరించితిని, యధికారమునకు తగినట్లు విమర్శించి కర్మయోగాదులలో దేనినైనను నీయిష్టమువచ్చినదాని నాచరింపుము.

శ్లో. సర్వగుహ్యాతమం భూయః శృణు! మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్. 64

టీ. భూయః=తిరిగి, సర్వగుహ్యతమం=సమస్తములయం దుమిక్కిలిగోప్యమైన, పరం=ఉత్కృష్టమైన, మే=నాయొక్క, వచః=వాక్యమును, శృణు=వినుము, త్వం=నీవు, మే=నాకు, దృఢం=నిశ్చయముగా, ఇష్టః=ప్రియుఁడవు, అసీతియత్ = అయితివనునది యేదికలదో, తతః=ఆకారణమువలన, తే = నీకొఱకు, హితం=హితమును, వక్ష్యామి=చెప్పెదను.

తం. నీవు నాకు ప్రియుఁడవు కావున నీక్షేమముకొఱకు మఱొకరహస్యమైనమాట జెప్పెద వినుము.

రామా. సర్వగుహ్యతమము భక్తియోగమని (౯. శ్లో.౧) యిదివరలోఁ జెప్పఁబడినది. అయినను నీవు నాకు ప్రియుఁడవు నీక్షేమముకొఱకు మఱొకరహస్యముఁ జెప్పెదవినుము అనుట.

శ్లో. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మా మే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.

టీ. (అదియెట్లనిన), మన్మనాః=నాయందు మనస్సుగలవాఁడవును, మద్భక్తః = నాయందు భక్తిగలవాఁ డవును, మద్యాజీ=నన్నేపూజించువాఁడవును, భవ=కమ్ము, మాం=నన్ను, నమస్కురు = నమస్కరించుము, (అట్లుచేసితివేని), మామేవ=నన్నే, ఏష్యసి=పొందఁగలవు, మే=నాకు, ప్రియః=ప్రియుఁడవు, అసి=అయితివి, తే=నీకొఱకు, సత్యం=యథార్థముగా, ప్రతిజానే=ప్రతిజ్ఞఁ జేయుచున్నాను.

శం. నాపై నీ మనస్సు నిలిపి భక్తి సలుపుము. నన్ను పూజించుము. నాకు నమస్కారములు చేయుము. అట్లు చేసితివేని నీవు మోక్షము చెందఁగలవు. నీవు నాకు ప్రియుఁడవు. నీకు సత్యము జెప్పితినని ప్రతిజ్ఞఁ జేయుచున్నాను.

రామా. నన్ను ఉపాసించువాఁడవును, నేనే నీకుమిక్కిలి ఇష్టుఁడుగాఁ గలవాఁడవుగను, ప్రీతిపూర్వకముగా నన్ను పూజించువాఁడవుగను, అగుము-ఎవ్వనికి నాయందు మిక్కిలి ప్రీతి యుండునో వానియందు నాకు మిక్కిలి ప్రీతికలుగుటచేత వానిని విడువలేక వానిని నాసన్నిధియందే ఉంచికొనియెద ననుట.

శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ.

టీ. సర్వధర్మాన్ = సమస్తధర్మములను, పరిత్యజ్య = విడిచి, ఏకం = ముఖ్యుఁడైనైన, మాం=నన్ను, శరణం = రక్షకునిగా, వ్రజ=పొందుము, అహం=నేను, త్వా=నిన్ను, సర్వపాపేభ్యః= సమస్తపాపములవలనను, మోక్షయిష్యామి=విడిపించఁగలను, మాశుచ=దుఃఖపడకుము.

శం. నీ వెల్లకర్మలను నాకు నర్పణముచేసి యన్యదేవతాపూజమాని నన్నొకనినే శరణుపొందుము. నిన్నెల్లపాపముల లోనుండి విముక్తుని జేసెదను నీవు శోకింపకుము.

రామా. కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగములనెడి ధర్మముల నన్నిటిని చేయుచునె వానిఫలము కర్తృత్వము

మొదలగువానిని విడిచి నేనే కర్తయనియు, ఆరాధింపఁబడు వాఁడ ననియు, పొందఁబడు వాఁడనియు, ఉపాయ మనియు, తలంపుము. నన్ను పొందుటకు విరోధులయిన పాపము లన్నిటి నుండి నిన్ను తప్పించెదను. ఈభావముగాక, మఱియొక భావ మును శ్రీరామానుజులు సూచించి యున్నారు భగవద్భక్తికి అడ్డములగు పాపములకు భయపడుచున్న అర్జునునకు భగవం తుఁడు చెప్పుచున్నాఁడు. భక్తియోగము నారంభించుటకు ప్రతి బంధకములైన పాపములను పోఁగొట్టుకొనుటకు చేయవలసిన ప్రాయశ్చిత్త రూపములయిన ధర్మముల నన్నిటిని విడిచి భక్తి యోగము కలుగుటకై నన్నె శరణుపొందుము నేనే ఆపాప ముల నుండి నిన్ను విడిపించెదను అనుట.

శ్లో. ఇదం తే నాతపస్కాయ
నాభక్తాయ కదాచన,
న చాశుశ్రూషవే వాచ్యం
న చ మాం యోఽభ్యసూయతి.     67

టీ. తే=నీకు (జ్ఞానమార్గము తెలియుటకొఱకు), ఆఖ్యా తం=చెప్పఁబడిన, ఇదం=ఈగీతాశాస్త్రము, అతపస్కాయ= తపస్సులేనివానికొఱకు, అభక్తాయ=భక్తిలేనివానికొఱకును, అశుశ్రూషవే= విననివానికొఱకును, మాం=నన్నుఁ గూర్చి, యః = ఎవఁడు, అభ్యసూయతి = అసూయపడుచున్నాఁడో వానికొఱకును, కదాచన=ఒకప్పుడును, నవాచ్యం = ఉపదే శింపఁదగినదికాదు.

శం. నీకు జ్ఞానము గలుగుటకై నే జెప్పిన ఈగీతాశాస్త్రమును తపస్సుచేయనివానికిని భక్తిలేనివానికిని శ్రద్ధలేనివానికిని నాయందు అసూయాపరునకును ఉపదేశింపఁదగినది కాదు.

రామా. నీయందును నాయందును భక్తిలేనివానికిని, నాస్వరూపమునందును, నేను ఈశ్వరుఁడనగుటయందును, నాగుణములయందు ఎవ్వఁడు దోషములను జూపునో వానికొఱకును, తపస్సు చేయనివానికిని నీకు జ్ఞానము కలుగుటకై నేఁజెప్పిన ఈగీతాశాస్త్రము ఉపదేశింపఁదగినదికాదు.

శ్లో. య ఇదం పరమం గుహ్యం
మద్భక్తే ష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా
మా మే వైష్య త్యసంశయః. 68

టీ. యః=ఎవ్వఁడు, పరమం=ఉత్కృష్టమైన, గుహ్యం=గోప్యమైన, ఇదం=ఈగీతాశాస్త్రమును, మద్భక్తేషు=నాభక్తుల విషయమై, అభిధాస్యతి=చెప్పఁగలఁడో, సః=వాఁడు, మయి=నాయందు, పరాం=ఉత్కృష్టమైన, భక్తిం=భక్తిని, కృత్వా=చేసి, మామేవ=నన్నే, ఏష్యసి=పొందఁగలఁడు.

శం. ఎవఁడు పరమోత్కృష్టమై పరమరహస్యమైన ఈ గీతాశాస్త్రమును నాశిష్యుల కుపదేశము చేయుచున్నాఁడో వాఁడు నాపై పరమభక్తిని జేసి నాస్థానమైన మోక్షము చెందఁగలఁడు.

శ్లో. న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మేప్రియకృత్తమః,
భవితా నచ మే తస్మా దన్యః ప్రియతరో భువి. 69

టీ. తస్మాత్ = వానికంటె, మనుష్యేషు = మనుష్యులయందు, మే = నాకు, ప్రియకృత్తమః = మిక్కిలిప్రియమును జేయువాఁడు, కశ్చిత్ = ఒకఁడును, న = లేఁడు, (భవిష్యత్కాలమందును), తస్మాత్ = వానికంటె, అన్యః = ఇతరుఁడు, మే = నాకు, భువి = భూమియందు, ప్రియతరః = ఇష్టుఁడుగా, నభవితా = కాఁగలవాఁడు కాఁడు.

శం. అట్లుపదేశముచేయువానికంటె మనుష్యులలో నాకు పరమప్రియముచేయువాఁడు వేఱొకఁడు లేఁడు. భవిష్యత్కాలమునను నాకు వానికంటె ప్రియుఁడు భూలోకమందు ఇప్పుడున్నవారిలో లేఁడు. ఇఁక కలుగఁబోఁడు.

రామా. ఇప్పటికి కలిగియుండలేదు. ఇంక కలుగఁబోఁడు.

శ్లో. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్టః స్యా మితి మే మతిః. 70

టీ. యః = ఎవ్వఁడు, ధర్మ్యం = ధర్మముతోఁగూడిన, ఆవయోః = మనయిద్దఱియొక్క, ఇమంసంవాదం = ఈసంవాదరూపమైన గ్రంథమును, అధ్యేష్యతే = పఠించఁగలఁడో, తేన = ఆపురుషునిచేత, జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞముచేత, అహం = నేను, ఇష్టః = పూజింపఁబడినవాఁడను, స్యామితి = అవుదునని, మే = నాయొక్క, మతిః = నిశ్చయము.

శం. మనసంవాదరూపమైన యీ మహాత్తైన గీతాశాస్త్రి మును ఎవరైతే ప్రతదినమందు పారాయణముచేసెదరో, అట్టి వారు జ్ఞానయోగముచేత నన్నుపూజించినవారని నాయభిప్రాయము.

శ్లో. శ్రద్ధావా ననసూయ శ్చ
శృణుయా దపి యో నరః,
సోఽపి ముక్త శ్శుభాఀ లోకాఀ
ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్. 71

టీ. యోనరః=ఏమనుష్యుఁడు, శ్రద్ధావాఀ=విశ్వాసముగల వాఁడై, అనసూయశ్చ=అసూయలేనివాఁడై, ఇదం=ఈగ్రంథ మును, శృణుయాదపి=వినునో, సోఽపి=వాఁడును, ముక్తః= ముక్తుఁడై, శుభాఀ=ప్రశస్తములైన, పుణ్యకర్మణాం=పుణ్యకర్మ ములుచేసినవారలయొక్క, లోకాఀ=లోకములను, ప్రాప్ను యాత్=పొందును.

శం. ఎవఁడైతే అసూయలేక భక్తిశ్రద్ధలతో నీగీతాశాస్త్రి మును వినుచున్నాఁడో అట్టి పురుషుఁడున్నుపాపములు నశింపఁ జేసుకొనినవాఁడై పుణ్యకర్మలుగల పురుషులయొక్క మహాత్తై నలోకములు పొందుచున్నాఁడు.

రామా. ఎవఁడైతే అసూయలేక భక్తిశ్రద్ధలతో నీగీతా శాస్త్రిమును వినుచున్నాఁడో అట్టిపురుషుఁడు భక్తివిరోధముల గు పాపములచే విడువఁబడినవాఁడై పుణ్యకర్మలుగల పురుషుల యొక్క మహాత్తైనలోకములు పొందుచున్నాఁడు.

శ్లో. కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ! త్వ యైకాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ. 72

టీ. హేపార్థ=ఓయి అర్జునా! త్వయా=నీచేత, ఏకాగ్రేణ=ఏకాగ్రమైన, చేతసా=మనస్సుచేత, ఏతత్=ఈగీతాశాస్త్రము, శ్రుతంకచ్చిత్=వినఁబడెనాయేమి, హేధనంజయ=ఓయిఅర్జునా, తే=నీయొక్క, అజ్ఞానసమ్మోహః=అజ్ఞాననిమిత్తమైన యవివేకము, ప్రణష్టఃకచ్చిత్=పోయెనాయేమి.

శం. ఓధనంజయా! నాచేఁ జెప్పఁబడిన పరమగోప్యమగు నీ గీతాశాస్త్రమును ఏకాగ్రచిత్తుఁడవై చక్కఁగా నీవు వింటివాయేమి? నీయజ్ఞానజనితమైన యవివేకము తొలఁగిపోయిన దాయేమి? నాకుఁ జెప్పుము.

రామా. ఓఅర్జునా! నాచేఁజెప్పఁబడిన పరమరహస్యమైన నీగీతాశాస్త్రమును ఏకాగ్రచిత్తుఁడవై నీవు వింటివాఏమి? ఏ అజ్ఞానముచేత నీవు యుద్ధముచేయనని చెప్పితివో యాయవివేకము తొలగిపోయినదా ఏమి? నాకుఁ జెప్పుమనుట.

అర్జున ఉవాచ:—

శ్లో. నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ. 73

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు —

టీ. హే అచ్యుత=ఓ శ్రీకృష్ణస్వామీ! మోహః=అవివేకము, నష్టః=పోయెను, త్వత్ప్రసాదాత్=మీయనుగ్రహమువలన, మయా=నాచేత, స్మృతిః=ఎఱుక, లబ్ధా పొందఁబడెను,

అహం=నేను,గతసందేహః=పోయినసందేహము కలవాఁడనై, స్థితః=ఉన్నవాఁడను,అస్మి=అయితిని,తవ=నీయొక్క,వచనం= వాక్యమును, కరిష్యే=చేయఁగలను.

శం. అచ్యుతా! నీయనుగ్రహమువలన నాయవివేకము తొలఁగిపోయె. జ్ఞానము లబ్ధమాయె. సందేహము నివర్తించె. నీయాజ్ఞను శిరసావహించుటకు సిద్ధముగానున్నాను.

రామా. నీయనుగ్రహమువలన నావిపరీతజ్ఞానము (ఒక్కదానిని మఱియొక్కటిగాఁ దెలిసికొనుట) తొలఁగిపోయినది. ఉన్నది యున్నట్లు తెలిసికొన్నాను. ఆత్మకాని ప్రకృతియాత్మయను మోహమును, పరమపురుషునకు శరీర మగుటచేత పరమ పురుషాత్మకములగు చేతనా చేతనములన్నియు పరమ పురుషాత్మకములు కావను మోహమును, పరమ పురుషుని పొందుటకు సాధనములగుటచేత అందుకు సాధనములెయగు నిత్యనైమిత్తిక కర్మములు బంధమును కలుగఁ జేయునవి యనుకొనుటయనను మోహమును - పోయినది. ఆత్మప్రకృతి కంటె విలక్షణుఁడు, ప్రకృతియొక్క స్వభావము లేనివాఁడు, తెలిసికొనువాఁడగుటయె స్వభావముగాఁ గలవాఁడు, పరమ పురుషునకు శేషభూతుఁ డగుటయు, నియామ్యుఁ డగుటయే స్వరూపముగాఁగలవాఁడు అనుజ్ఞానంబును,సమస్తజగత్సృష్టి, స్థితి, సంహారము, లీలగాఁగల వాఁడును, దోషములకు విరోధియైన కల్యాణగుణములకు ముఖ్యస్థానమైనవాఁడును స్వాభావసిద్ధంబులును మేరలేనివియునగు జ్ఞానాదిగుణములు గల వాఁడును, పరబ్రహ్మమని చెప్పఁబడువాఁడును, పరమపురుషుఁడనెడి

జ్ఞానంబును, ఇట్టి తత్త్వజ్ఞానంబుచేతను, కర్మములను ప్రతిదినంబును చేయుట చేతను, శమదమాదుల చేతను, కలిగెడి భక్తిరూపమైన యుపాసన చేతనే భగవంతుఁడు పొందఁదగినవాఁడనెడు జ్ఞానమును లభించినవి. నీవు చెప్పినట్లు యుద్ధము మొదలగు వానిని చేసెదను.

సంజయ ఉవాచ.—

శ్లో. ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః,
　　సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణం. 74

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.—

టీ. ఇతి=ఈప్రకారముగా, వాసుదేవస్య=శ్రీకృష్ణస్వామియొక్కయు, మహాత్మనః=మహానుభావుఁడయిన, పార్థస్యచ=అర్జుననియొక్కయు, అద్భుతం=ఆశ్చర్యకరమైన, రోమహర్షణం=పులకాంకురకరమైన, ఇమంసంవాదం=ఈసంవాదమును, అహం=నేను, అశ్రౌషం=వింటిని.

శం. ఓధృతరాష్ట్రా! అద్భుతమైనట్టియు పులకాంకురము గలుగఁ జేయునట్టియు కృష్ణార్జునుల సంవాదరూపమైన గీతాశాస్త్రమును నేను వింటిని.

రామా. మహాత్మనః = గొప్పబుద్ధి కలవాఁడైన అర్జుననియొక్క.

శ్లో. వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా
　　నేత ద్గుహ్యతమం పరమ్,

యోగం యోగేశ్వరాత్ కృష్ణా
త్సాక్షాత్ కథయతః స్వయమ్. 75

టీ. వ్యాసప్రసాదాత్=వ్యాసానుగ్రహమువలన, (అనఁగా దివ్యచక్షుర్లాభమువలన,) యోగం=యోగమను పేరుగలిగిన, పరం=ఉత్కృష్టమైన, ఏతత్=ఈ, గుహ్యం=రహస్యమును, స్వయం=తానే, సాక్షాత్=ప్రత్యక్షముగా, కథయతః=చెప్పుచున్న, యోగేశ్వరాత్=యోగమునకుఁ బ్రభువైన, కృష్ణాత్=శ్రీకృష్ణస్వామివలన, అహం = నేను, శ్రుతవాన్=విన్నవాఁడనైతిని.

శం. యోగయోగీశ్వరుండగు శ్రీభగవంతుఁడు స్వయముగాఁ జెప్పిన పరమోత్కృష్టమైన ఈగోప్యయోగశాస్త్రమును శ్రీవేదవ్యాసులయనుగ్రహంబున నేను స్వయముగా వింటిని.

రామా. యోగేశ్వరాత్=జ్ఞానాది గుణముల నిధియైనవానివలన.

శ్లో. రాజన్ సంస్మృత్య సంస్మృత్య
సంవాద మిమ మద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం
హృష్యామి చ ముహుర్ముహుః. 76

టీ. హే రాజన్=ఓ ధృతరాష్ట్రుఁడా! అద్భుతం=ఆశ్చర్యకరమైన, పుణ్యం=పవిత్రమైన, కేశవార్జునయోః=కృష్ణార్జునుల యొక్క, ఇమంసంవాదం=ఈసంవాదమును, సంస్మృత్యసంస్మృ

త్య=తలఁచితలఁచి, ముహుర్ముహుః=మాటిమాటికి, హృష్యా మి=సంతోషింపుచున్నాను.

శం. ఓధృతరాష్ట్రా! ఆశ్చర్యకరమైనదియు పవిత్రమైనది యు శ్రీకృష్ణార్జునుల యీసంవాదమును తలఁచితలఁచి మఱల మఱల సంతోషించుచున్నాను.

రామా. పుణ్యం అనుటచే విన్నను గూడ పాపమును పోఁ గొట్టునదియు నగు యీసంవాదమును తలఁచితలఁచి సంత సించెదను.

శ్లో. తచ్చ సంస్మృత్య సంస్మృత్య
రూప మత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్ !
హృష్యామి చ పునఃపునః. 77

టీ. హేరాజన్=ఓయిధృతరాష్ట్రా! అత్యద్భుతం=మిక్కిలి ఆశ్చర్యకరమైన, హరేః=శ్రీకృష్ణస్వామియొక్క, తద్రూపంచ =ఆవిశ్వరూపమును, సంస్మృత్యసంస్మృత్య=లెస్సగా ధ్యానము చేసి ధ్యానముచేసి, మే=నాకు, మహాన్ = అధికమైన, విస్మ యః = ఆశ్చర్యము, భవతి = అగుచున్నది, పునఃపునః=మా టిమాటికిని, హృష్యామిచ=పులకాంకురము గలవాఁడ నగు చున్నాఁడను.

శం. ఓధృతరాష్ట్రా! శ్రీభగవంతునియొక్క యత్యద్భుత మైన విశ్వరూపమును లెస్సగా ధ్యానము చేయ చేయ.నాకు

నాశ్చర్యము మఱిమఱి హెచ్చగుచు శరీరమున గగుర్పాట్లు పుట్టుచున్నవి.

శ్లో. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతిర్మమ. 78

టీ. యత్ర=ఏపక్షమందు, యోగేశ్వరః=సర్వయోగప్రవర్తకుఁడైన, కృష్ణః=శ్రీకృష్ణుఁడును, యత్ర=ఎచట, ధనుర్ధరః=విలుకాఁడగు, పార్థః=అర్జునుఁడును (ఉందురో), తత్ర=ఆపక్షమున, శ్రీః=సంపదయు, విజయః = జయమును, ధ్రువా = చలనములేని, భూతిః = ఐశ్వర్యమున్ను, నీతిః=నీతియున్ను, (ఉండును.) ఇతి=ఈలాగని, మే = నాయొక్క, మతిః=అభిప్రాయము.

శం. ఏచోటనైతే యోగేశ్వరుండగు శ్రీకృష్ణస్వామియు ధనుర్ధరుఁడైన అర్జునుఁడు ఉంచున్నారో, ఆచోట సంపద జయము ఐశ్వర్యము స్థిరమైన నీతియు నున్నవని నామతము.

రామా. చేతనాచేతనముల స్వభావయోగములకు ఈశ్వరుఁడును, అన్నివస్తువుల ఉనికి, ప్రవర్తించుట మొదలగునవి తన సంకల్పమునకు అధీనములుగా నుండువాఁడైన శ్రీకృష్ణమూర్తియు, ధనుర్ధరుఁడును భక్తుఁడగుపార్థుఁడును ఎచ్చోటనున్నారో, అచ్చోట సంపద, జయము ఐశ్వర్యము కలిగినదియైన నీతియు నున్నవని నామతమని సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం
వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున
సంవాదే మోక్షసన్న్యాసయోగో నామ
అష్టాదశోఽధ్యాయః.

ఓం తత్సదితి శ్రీ పరమహంసపరివ్రాజకాచార్య బ్రహ్మానందసరస్వతీ
శిష్య రామచంద్రానందసరస్వతీవిరచితాయాం భగవద్గీతా
వ్యాఖ్యాయాం పదయోజనీసమాఖ్యాయాం
మోక్షసన్న్యాసయోగో నామ
అష్టాదశోఽధ్యాయః.

ఇట్లు లక్షగ్రంథమగు శ్రీ మహాభారతములో భీష్మపర్వమందు
ఉపనిషదర్థప్రతిపాదకంబును, బ్రహ్మవిద్యా
ప్రతిపాదకంబును, యోగశాస్త్రంబును,
శ్రీకృష్ణార్జునుల సంవాదాత్మకంబు నైన
శ్రీభగనద్గీతలయందు మోక్షసన్న్యాసయోగ మనెడి
అష్టాదశాధ్యాయము.

ఓం తత్సత్.

శ్రీకృష్ణార్పణ మస్తు.

---

—

# శ్రీభగవద్గీతా.

## శ్లోకానుక్రమణిక.

ఓం తత్ సత్.

* శ్రీభగవద్గీతా శ్లోకానుక్రమణిక సంపూర్ణము.

---

* ఈ యనుక్రమణిక ప్రతి శ్లోకములోను నాలుగు పాదంబులయందుఁగూ గల యాద్యక్షరముల నారంభించి రచియింపఁబడి యున్నందున నీయనుక్రమణికను జూచువా రేశ్లోకములో నేపాదంబునైనను జూడవచ్చును.

# సంస్కృతగ్రంథములు.

| | ప్రతి 1-కి | రు. | అ. |
|---|---|---|---|
| బాలరామాయణము, సటీక | ... | 0 | 2 |
| అధ్యాత్మరామాయణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| డిటో మూలము, చిన్నసైజు | ... | 0 | 12 |
| సుందరకాండము, మూలము, చిన్నసైజు | ... | 0 | 12 |
| సుందరకాండము, ఆంధ్రతాత్పర్యసహితము, నూతనముద్రితము | | 1 | 4 |
| శ్రీమద్రామాయణము, మూలము, చక్కనికూర్పు | ... | 1 | 12 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| యజుర్వేదసంధ్యావందనము, పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము. చిన్నసైజు, మంచికాగితములు. | | 0 | 4 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము | ... | 0 | 2 |
| యజుర్వేద ఆబ్దికమంత్రములు, మూలము, చిన్నసైజు | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము, అనేకవిషయములఁ జేర్చి యథాగ్రమహాజనసంప్రదాయానురూపముగఁ బరిష్కరించి ముద్రించియున్నాము. సాధారణప్రతి | ... | 1 | 4 |
| డిటో మంచిప్రతి | ... | 2 | 0 |
| వ్రతచూడామణి 360 వ్రతములు, మంచికాగితములపై చక్కగ ముద్రితము | | 1 | 4 |
| మహాన్యాసము, చిన్నసైజు, శుద్ధప్రతి | ... | 0 | 5 |
| రుద్రము, పురుషసూక్తము వగైరాలు, చిన్నసైజు | ... | 0 | 2 |
| మంత్రపుష్పము, సటీక, ,, | ... | 0 | 1 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము ,, | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక, ,, | ... | 0 | 2 |

# సంస్కృతగ్రంథములు.

ప్రతి 1-కి రు. .

వ్రతరత్నాకరము, ప్రథమభాగము.—వ్రతసంకల్పము మొదలు పూజముగియు నంతవరకు చేయవలసినవిధులు తెల్పి ప్రాణప్రతిష్ఠ, కలశపూజ, గణాధిపతిపూజ, షోడశోపచారశ్లోకములు మొదలగువానిని తాత్పర్యముతో ముద్రించినారము. ఇందు వినాయకవ్రతము, వరలక్ష్మీవ్రతము, సావిత్రీవ్రతము, [illegible]వ్రతము, కేదారేశ్వరవ్రతము, [illegible]వ్రతము అను 6 వ్రతములు గలవు. 0 6

వ్రతరత్నాకరము, ద్వితీయభాగము.—ఇందు ఋషిపంచమీ, మధుంద్వాదశీ, అమావాస్యాసోమవతీ, కృష్ణాష్టమీ, [illegible] నవమీ, అముక్తాభరణసప్తమీ, [illegible], [illegible], [illegible], త్రిరాత్రి, చిత్రగుప్త, [illegible], [illegible], సంపద్గౌరి, సత్యనారాయణ, [illegible]సప్తమీ, [illegible], ఏకాదశీసుగుణాగము, [illegible]ద్వాదశీ, [illegible], [illegible] హనుమజ్జయంతీ అను 21 వ్రతములు గలవు. ... 0 1[illegible]

ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము, చిన్నసైజు ... 0

శ్రీవైష్ణవ ఆహ్నికము, చిన్నసైజు ... 0

శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ,, ... 0

సూర్యనమస్కారము, ,, ... 0

దేవతార్చన, చిన్నసైజు ... 0

సంధ్యావందనభాష్యము, చక్కనిప్రతి ... 0

మంత్రప్రశ్నములు, మూలము ... 0

కాలామృతము, సటీక, చక్కనికూర్పు ... 0

శ్రీపతి, సాంధ్రతాత్పర్యము ... 1

బృహజ్జాతకము, సటీక, చక్కనిప్రతి, నూతనముద్రితము ... 1

ముహూర్తదర్పణము, సటీక, చక్కనికూర్పు ... 0

షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్నగ్రంథమునకు తెనుఁగు ... 0 2

---

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. ఈ.

